# శ్రీ శ్రీ శ్రీ సనారి విశ్వనాధ విజ్ఞానం - మహిమలు

## నిత్యపారాయణ గ్రంధం


**శ్రీ శ్రీ శ్రీ సనారి పీఠమ్,**
స్థాపితం : 2001
శ్రీ సాయి జ్ఞాననిలయం,
డోర్ నెం. 23-11-1-6/బి,
ఓగిరాలవారి వీధి,
సత్యన్నారాయణపురం,
విజయవాడ - 11.



సేకరణ - రచన
**బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ**
సెల్ : 92905 82110, 90322 53205, 8099203873


విషయ సూచిక

❀ ❀ ❀





## మహదానందము

ఈ విశ్వసృష్టిలో పిపీలికాది బ్రహ్మపర్యంతం సమస్త ప్రాణికోటిదేనినుండి జన్మించుచున్నవో, జన్మించిన వన్నియూ దేనితో జీవించుచున్నావో, అంత్యకాలమున దేనిని గూర్చి ప్రయాణించుచుచ్నువో దేనిలో తదాత్మ్యమునందుచున్నవో దానిని గూర్చితెలుసుకొనుటయే బ్రహ్మపదార్థమని "తైత్తిరీయ సంహిత భృగువల్లమునందు పుత్రుడగు భృగువునకు వరుణుడు చెప్పినట్లుగా.

హైందవ ధర్మోద్ధరణకొఱకు అవతరించిన మహనీయులలో ముఖ్యులు జగద్గురు శ్రీమద్విరాట్ పోతూలూరి వీర బ్రహ్మేంద్ర స్వాములవారు వారికాలజ్ఞాన వాక్యానుసారంగా అవతరించిన మహనీయులు సాక్షాత్ పరమశివావతారులగు జగద్గురుశ్రీ సనారీ విశ్వనాథ అవధూత స్వాములు వారు వీరు శ్రీకాకుళం జిల్లా పాలకొండ యందు జన్మించి, దక్షిణభారతదేశ మంతయూ సంచరించి, మానవుడే మాధవుడుకాగల యోగవిద్యారహస్యంబు లెరింగించుచూ, అధ్వైత్వబోధనలు, రసవాద ప్రక్రియ లెరింగించుచూ, సృష్టిరహస్యములైన అనేక విషయములు గూర్చి ప్రభోధిస్తూ, ఆయాసందర్భాలలో మహా మహిమలను ప్రదర్శించిన అవతార మూర్తులు. శ్రీవిశ్వనాథావదూత స్వాములవారు రచియించిన "సనారీ విశ్వేశ్వర సంవాద" మందలి ఎన్నో వేదాంత విజ్ఞాన విషయాలను సామాన్యులందరికీ అందించాలని ఉదాత్తమైన ఆశయంతో సంకలనం చేయబడినదే **ఈ సనారీ విశ్వనాథ విజ్ఞానము & మహిమలు** నిత్య పారాయణగ్రంథం" అను ఈ మహాకావ్యము విశ్వశ్రేయోకావ్య మన్నట్లు ప్రపంచానికి మేలుచేకూర్చే రచనయే కావ్యమంటారు. అది రమణీయార్థ ప్రతిపాదకమైనచో సువర్ణమునకు సుగంధమైన పరిమళ మొచ్చినట్లే అట్టి రచనపండిత పామర జనరంజకంగా ఉంటుంది. ఈ ప్రపంచంలో మేధావులకంటే సామాన్యుజనులే అత్యధికసంఖ్యలోనున్నందున సామాన్య జనులకు సులభముగా అవగాహనయగునట్లు శ్రీవారి సంవాదమందలి ముఖ్య పద్యరత్నములనుచేర్చి సందర్భోచితమహిమలు ఉపయోగిస్తూ జనరంజకముగా నుండునట్లు ఆబాలగోపాలమునకు ఈ గ్రంథము ఆనందసంధాయియగునట్లు చేసియున్నారు శ్రీ గ్రంధకర్తలు

## నాకు తెలిసిన ఈగ్రంథకర్త

పర్న బ్రహ్మర్షి గోత్రోద్భవులు బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామీజీ గారు వీరు బాల్యమున ప్రాథమిక విద్యతో బాటు కుల వృత్తియైన స్వర్ణకారవృత్తి నేర్చి విజయవాడ పట్టణమున తండ్రికి చేదోడుగా యుంటూ, తోడబుట్టినవారికి అన్ని

కార్యక్రమములందూ పాలు పంచుకొంటూ, పెద్దలయాజ్ఞచే గృహస్థులైన పిదప వాస్తు జ్యోతిషవిద్యలందు మక్కువతో పరిశోధనలు చేసికొన్నేండ్లు కళామతల్లికి సేవచేసి చతుష్షష్టికళాకోవిదులుగా అన్ని కళలయందు ఆసక్తికలిగి తమ సంతతికి జీవనవిద్య నేర్పి గృహస్తులను జేసి, 1995 సం॥లో రాజాయోగియగుబ్రహ్మశ్రీ తణుకు సాంబశివానందగారి వద్ద శ్రీ సనారీ వారి పాదంపట్టి బోధగురువులకు అన్ని కార్యములందు తోడై, స్వగృహమున 2001 లో శ్రీ సనారీ వారి పీఠాన్ని స్థాపించి స్వ సంఘీయుల సహాయ సహకారములతో, శ్రీ సనారీ వారు తెల్పిన పూజా విధులతో శ్రీ దేవిశరన్నవరాత్రి మహోత్సవములు శ్రీసనారీ వారి జయంతి కార్యక్రమములు చేయుచూ, వాన ప్రస్థాశ్రమును స్వీకరించగోరి ఉత్తర వాహినిగాగల పవిత్ర కృష్ణానదీ తీరమున శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్ర లింగసహిత విశ్వనాధాలయమును స్థాపిస్తూ, అనేక వ్యయ ప్రయాసలకోర్చి దేవాలయ నిర్మాణము చేస్తూ, సనారీవారి భక్తులు ఎక్కడ ఉన్నారని తెలిస్తే ఆ పూరు వెళ్ళి సనారీ వారి విషయాలు సేకరిస్తూ వారి యిళ్ళయందు సనారీ వారి పూజలు నిర్వహిస్తూ "సంధ్యావందనం సనారీ వారి నిత్య పూజ, కేదారేశ్వరవ్రతము మొ॥గ్రంధము 1997లో ప్రచురించి 1998 లో సనారీ వారి దీక్షా విధానమును విశేషముగా రచించి మాలాధారులై పాలకొండలో దీక్ష విరమించి 2010లో " శ్రీసనారీ విశ్వనాధ విజ్ఞానం –మహిమలు" అనునిత్య పారాయణ గ్రంధమురచించి –అందుప్రతీ సందర్భములో జాతి ఔన్నత్యము తెల్పుచూ సనారీ వారి జీవితవిశేషములు – మహిమలు శ్రీవారి భక్తుల చరిత్రలతో, తమకుగల స్వానుభవములను కూర్చి రచియించిన యిది అత్యంత అరుదైన శ్రీ సనారీ గ్రంధము.

సుగంధంవారి యింట జన్మించి సుగంధ పరిమళములు వెదజల్లునట్లు గా జీవించిన వీరికి ఆ సనారీ విశ్వనాధవధూత స్వామి వారు అష్టైశ్వర్య భోగభాగ్యములను ప్రసాదించాలని వానప్రస్తాశ్రమమున ఆధ్యాత్మిక సంపన్నులై ఆదర్శవంతులుకాగలరని, శ్రీ విరాట్ విశ్వకర్మ పరమేశ్వరుని ప్రార్ధిస్తూ ..........శెలవ్

మీ ఆదరాభిమాని

**ఇడమకంటి జనార్ధనశివాచార్య**

స్మార్తాగమవాస్తు జ్యోతిషపండిట్, తెనాలి. 27-12-2010





## అభిప్రాయము

ఈ సువిశాల ప్రపంచంలో అనేకజాతులవారు, అనేక మతములవారు, అనేకానేక భిన్న సంస్కృతులవారు జీవనం సాగిస్తున్నారు. అందరిసుఖాలు, దుఃఖాలు ఒకటేనని, జాతి, మతం, కులం, ఆచారాలు సాంప్రదాయాలు మాత్రమే భిన్నమైనవి. అయితే వైవిధ్యభరితమైన ఈ ప్రపంచాన్ని అర్ధం చేసుకొని భిన్నత్వంలో ఏకత్వమైన మైత్రిని కనుగొని దానిని ఆశ్వాదించెందుకు, అనుభూతి చెందేందుకు శ్రీ సనారీ వారి చరిత్ర ఎంతగానో దోహదపడుతుందని గ్రంధరచయిత శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు శ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాంతిగారు ఈ గ్రంధములో విశిధీకరించిన అంశములు చాలా బాగున్నాయి.

శ్రీ సనారీ వారి సుప్రభాతమ్, మాలాధారణ, శ్రీ వీరభద్రఖడ్గము, శ్రీకామాక్షీదేవి అభయములతోపాటు విశ్వనాధుని జననము, అన్నపూర్ణమాత జననము, శ్రీ విరాట్ విశ్వకర్మ భగవానుని హస్తమస్తక సంయోగము, బాల విశ్వం వేదాంతబోధ, విశ్వనాధ వివాహము, విశ్వనాధుని నిత్యాన్నదానం, విశ్వనాధుని జలస్థంభన, అన్నపూర్ణ జీవ సమాధి, పక్షులకు ప్రాణభిక్ష, నవరత్నాలవుంగర నిర్మాణం, సన్యాసాశ్రమస్వీకారం, స్వామివారు రాతికి నమస్కరించుట, సింహాద్రి అప్పన్న గుడిచరిత్ర, మదరాసు రాష్ట్ర మొదలియార్‌కు స్వామి గ్రంధముద్రణా బాధ్యతలు అప్పగించుట, స్వామివారి సుగుణబోధ, శృంగేరి పీఠాధిపతులతో వివాదం, స్వామివారు తెల్పిన కాలజ్ఞానం, శ్రీ కూర్మన్నగారిచరిత్ర, శ్రీ సనారీవారిమహిమ, శ్రీ అమ్మవారిమహిమ, బోధగురువు బ్రహ్మశ్రీ తణుకు సాంబ శివానందరాజయోగిగారి చరిత్ర, శ్రీ సనారీ వారి ద్వాదశ సూక్తులు, శ్రీ సనారీచాలీసా, అన్నపూర్ణాంబాష్టకమ్, అన్నదాత బెండపూడి సాధువుగారి చరిత్ర, పాలకొండక్షేత్ర విషయాలు, మొదలగు విషయాలను గ్రంధ సంకలనకర్త తెలియజేసిన విధము స్త్రీలు, పురుషులు, విద్యార్ధులు, వృద్ధులందరికి ఉపకరించే సాటిలేని విషయసామాగ్రి వుంది. దైనందిన జీవితాన్ని ఎలా గడపగలిగితే యౌవనకాంతి స్థిరంగా వుంటుందో, జీవితం దివ్యంగా మారుతుందో వాటి వివరణ కూడా యిందులో తెలుపబడింది.

శ్రీ సనారీ వారి జీవితాన్ని ఆధ్యాత్మిక శాస్త్రీయ రసవిద్యావిషయాలను ఉత్తమ మైనదిగా మలచిన గ్రంధ సంకలనకర్త నన్ను ఇంతటి మహత్తమైన గ్రంధమునకు అభిప్రాయము వ్రాయమని అడుగగా యిట్టి మహిమాన్విత గ్రంధానికి అభిప్రాయము వ్రాయడము నా పూర్వ జన్మ సుకృతము గా భావించి ఈ కావ్యమును శ్రద్ధగా చదివి అభిప్రాయము వ్రాసినందుకు నాకునూ సత్ఫలితముదక్కగలదు.

నాకీ శుభావకాశమిచ్చిన గ్రంధ సంకలనకర్త బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ గార్కి శిరస్సువంచి నమస్కరిస్తూ వారికి శ్రీ సనారీ వారు ఆయురారోగ్యములు ప్రసాదించి శ్రీ స్వామి వారి సేవ చేయుటకు అవకాశము కల్గిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

స్వర్ణప్రభాత్ : **అండలూరి ఏకాంబరరావు**, విజయవాడ

**సనారీ విశ్వేశ్వర దేవం। విశ్వనాథం మహేశ్వరం।**
**సాక్షాత్పార్వతీనాథం । పరంజ్యోతీంనమామ్యహం॥**

మన దేశంలో ఆధ్యాత్మిక శిరోరత్నాలు అనేకమున్నాయి. అసలు మన దేశమే ఆధ్యాత్మిక దేశం.అటువంటి ఈ పవిత్ర భారత దేశంలో ఆంధ్రదేశం అక్షరక్రమంలో ప్రపధమంగా నిలబడి కీర్తిచంద్రికలు ప్రసారం చేస్తూ ఆదర్శంగా నిలబడియుంది.

ఆధ్యాత్మిక రంగంలో అఖండ ప్రజ్ఞాధురీణులయిన శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారి మనుమరాలు మహాయోగిని ఈశ్వరదేవి, ఆధ్యాత్మిక మహాసామ్రాజ్యానికి అధిపతులు తరువాత తరంలో జన్మించి ఆధ్యాత్మిక శంఖారావాన్ని వినిపించి ప్రజలలో నున్న అజ్ఞాన చీకట్లను పారద్రోలిన మహానుభావులు, శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధావదూత ఈ మహానీయుని చరిత్రలెన్నివున్నాయో సమాజానికి తెలియదు. శ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ గారు ఎంతో శ్రమించి పలువురు వ్రాసిన గ్రంధాలను సేకరించి అందరి అమూల్య విషయాలను స్వీకరించి పాఠకులకానందము కలుగునట్లు ఈ గ్రంధమును తీర్చిదిద్దినారు ఇది చాలా హర్షించ వలసిన ఆనందించవలసిన విషయము

మహాత్ముల మహిమాన్వితుల, యోగులసిద్ధుల, అవధూతల చరిత్రలు వ్రాయాలంటే మానవసంకల్పానికి తోడు, ఆ పరమాత్మ అనుజ్ఞ కూడా వుండాలి. అది లేకపోతే కేవలం మానవ ప్రయత్నంతో ఆ పని నెరవేరదు. ఇదినా అనుభవం, నేనెరిగిన సత్యం ఇప్పుడు ఈ సనారీ వారి చరిత్రను సాయిబాబా గారు వ్రాయగలిగారంటే దీనికి ఆ సనారీశ్వరుల సంకల్పము, ఆశీర్వచనములు వీరికి లభించాయన్నమాట. అందువలననే వారు ఈ కార్యక్రమాన్ని సాధించగలిగారు. ఈ గ్రంధాన్ని సనారీ భక్తకోటికి అందించడమే కాకుండా వారికొక కరదీపికగా ఉపయోగపడుతుందని ఆశించడంలో తప్పులేదు.

ఈ గ్రంధాన్ని పరిశీలించిన మీదట వీరబ్రహ్మగురు సార్వభౌములకు సనారీ విశ్వేశ్వరస్వాములకు కొన్నిటియందు సామీప్యము కనబడుచున్నది. 37వ పుటలో చచ్చినవానిని బ్రతికించుట, అటులే చనిపోయిన బాలునివలే నటించి ప్రాయశ్చిత్తమను భవించిన పిమ్మట సజీవుని చేయుట, 40వ పుటలో అన్నపూర్ణమ్మ పరమేష్టియే తన భర్తయని చెప్పు సంఘటనలు – వీర గురుని చరిత్రలో గోవిందమాంబయు అటులనే తల్లిదండ్రులకు వివరించుట.... మొదలగు ఘట్టాలు వీరబ్రహ్మగురుడొనరంచిన మహాత్మ్యములను బోలియున్నవి. 50వ పుటలో కులపెద్దలవాదనలు గూడ





వీరబ్రహ్మగురు జీవితమందలి. గోవిందమాంబ వివాహ సందర్భముగ, సంఘపెద్దలు బ్రహ్మముగారితో వాదనకు దిగిన సంఘటనలు గుర్తుచేయుచున్నవి. ఆ పుటలోనే ఎఱుకల చరిత్ర వివరించుటబాగున్నది. అందుననే నవరత్నాల ఉంగరంనిర్మాణమునెంత శ్రద్ధతో, భక్తితో, మంత్రయుక్తముగా చేయవలెనంటే, ఇటీవల కాలంలో అనేకమంది నవరత్నాల ఉంగరాలు ధరిస్తున్నారు. అవన్నీయూ యిందలి సిద్ధాంతములతో నిర్మించబడినవా? ఈ విధానం ఎందరికి తెలుసునని ప్రశ్నించుకుంటే జవాబు శూన్యం. యిందలి విధానములతో, అంగులీయనిర్మాణంచేయుట, చేయించుకొనుట ఎందరికి సాధ్యమని ఆలోచిస్తే అంతుతేలని విషయమే.

60వ పుటలో వర్ణించబడిన బండరాయికి మ్రొక్కగా అది బ్రద్ధలగుట, వీరబ్రహ్మగురు చరిత్రలో సిద్ధయ్య నవాబు సమక్షంలో బండరాతికి మ్రొక్కగా అది బ్రద్ధలగు సంఘటనను పోలియున్నది.

శాంభవీముద్రను గూర్చి తెలిపిన వివరణ చాలా బాగున్నది. అయితే యివన్నీ సామాన్యునకు కష్టతరమైనవే కానీ గురు కృపతో తప్పక విజయంలభిస్తుంది.

65వ పుటలో సింహాద్రి అప్పన్న గుడి చరిత్రలో శిల్పాచార్యులగు సింహాద్రి నరసన్నయొక్క అవిరళకృషి ప్రశంశనీయము. ఇటువంటి శిల్పాచార్యుల చరిత్రలు ప్రచురించిప్రచారంచేయవలసిన అవసరమెంతైనాయున్నది. స్వకులస్తులకీర్తి ప్రతిష్టలను వెలుగులోకి తేవలసిని బాధ్యత రచయితతో బాటు కులాభిమానులందరికీ యున్నదని గ్రహించగలరు. 88వ పుటలో అన్నాభిషేకం గురించి వ్రాశారు. ఇటువంటి అభిషేకాలు యింతకుముందు ఎక్కడా జరిగినట్లు లేదు. (శివలింగానికి తప్ప)

శ్రీ సాయిబాబా గారు యిందులో స్వామివారు ప్రదర్శించిన ఎన్నో మహిమలను వర్ణించారు. వాటన్నిటినీ ఉదహరిస్తూపోతే అభిప్రాయమే చాలా పేజీలకు విస్తరిస్తుంది. ఆయా మహిమలు వాటి సామరస్యం చదువరులు చదివి ఆనందపడుటే కర్తవ్యం సనారీ వారు కాలజ్ఞానం సంక్షిప్తంగా వ్రాసారు. దాన్ని గురించి

**ఈ కాలజ్ఞానంబును, సాకల్యంబుగాను జూచి చదివిన నరులున్ ।**
**శ్రీకంఠుని కరుణయుగల, లోకమహేశ్వరపదవులొందుట నిజమౌ॥**

మానసపూజనుగూర్చి యింకా వివరంగా చెబితే బావుండేది. ఎందుకంటే దీనికి ఎలాంటి ఖర్చులేకుండా ఎక్కడైనా, ఏ సమయంలోనైనా ఆచరించవచ్చును.

## సనారీ ఉవాచ.

**కం ॥ ఈ పూజగలుగు జ్ఞానులు - యే పూజలు చేయబోరు యేకమువెలుగే।**
**ప్రాపను విశ్వబ్రహ్మము - లోపలబైలందునిండులో లోకములన్॥**

ఈ పూజ చేసే వారికి సనారీ వారే మ్రొక్కుచూ, ఏలోకంలో ఉన్నా ఆ పుణ్యాత్ములను రక్షించి కాపాడుతానని గురుదేవులు అభయమిచ్చారు. అంతేకాక ఈ మానసపూజచే సులువుగా బ్రహ్మన్ని దర్శించవచ్చునంటారు. దీనికి ఏ మంత్రాలతో పనిలేదని స్పష్టంగా చెప్పారు.

**శ్లో॥ ఆత్మపూజా సమానాస్తి - పూజా రఘుకులోద్భవ ।**
**మత్సాయుజ్యమవాప్నోతి- చండాలోహ్యాత్మపూజయా॥ (శివగీత)**

ఆత్మపూజకు సమానమైన పూజ మఱియొకటిలేదు. చండాలురైనను ఆత్మపూజచే బ్రహ్మసాయుజ్యము పొందగలరని శివగీత తెలియజేస్తున్నది. అందువలననే శివాంశసంభూతులగు , సనారీ వారు గూడ మానసపూజను ప్రశంచించారు. ప్రభోదించారు.

శ్రీ సాయి బాబాగార్ని ప్రత్యేకించి అభినందించక తప్పదు. వారు కేవలం గ్రంధాలపైననే ఆధారపడకుండా స్వయంగా ఎంతోమంది దగ్గరకు వెళ్ళి వారితో సంప్రతింపులు జరిపి వారు చెప్పిన విషయాలున్నింటినీ క్రోడీకరించి సమగ్రమైన శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ చరిత్ర మనకందించారు. వారు ధన్యుజీవులు వారి జననీ,జనకులు సుగంధం పాపాయమ్మ వెంకటేశ్వరావు చిరస్మరణీయులైరి.

బ్ర॥ సువర్ణ సూర్యాకాంతంగారి చరిత్ర, బ్ర॥ కొమ్మోజు కూర్మన్నగారి చరిత్ర, సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారి అనుభవాలు. పాలకొండ లోని గృహిణి స్వానుభవము యిలా ఎన్నో సంఘటనలు స్వామీజీవారు సేకరించి వారు మనకందించారు.

**శ్రీశ్రీశ్రీ సనారీశ్వర స్వాములవారు వారికి మనందరికి**
**ఐశ్వర్య ఆయురారోగ్యములు నిచ్చి రక్షించి కాపాడుగాక**

**బహుభారత బ్రహ్మ : ఫణిదపుప్రభాకరశర్మ** (విభావసు)
ఒంగోలు, సెల్: 9848835644





## ఓమ్ నమో శ్రీ వీరబ్రహ్మణే

## దృఢ సంకల్పమే - కార్య సాఫల్యము

"పూర్వ జన్మవాసనే నన్నా- ఈ జన్మకెంతో ముక్తి మార్గము చూపునోయన్నా" అనే జగద్గురు శ్రీశ్రీశ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి వాక్యాని కనుగుణంగా–

బ్రహ్మశ్రీ సుగంధం సాయి బాబాచార్యస్వామీజీ(విశ్వకర్మ) గారు రచియించిన శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధవిజ్ఞానం-మహిమలు అనే గ్రంధం ఒక్క విశ్వబ్రాహ్మణులకే గాక సర్వమానవాళి కి ఉపయుక్తమైనది.

ఇందు రచయిత కర్మసిద్ధాంతానికెంతో ప్రాధాన్యతనిచ్చియున్నారు. ఈ సిద్ధాంతానికి శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ అవధూత స్వామిని "సాక్షిగా పెట్టి, బీజం నుండి మొలక, మొలక నుండి మొక్క, మొక్కనుండి చెట్టు, చెట్టునుండి వృక్షం, వృక్షం నుండి ఫలపుష్పాదులు ఫలించినట్లు, కర్మనుండి భక్తి, భక్తి నుండి జ్ఞానం, జ్ఞానం నుండి వైరాగ్యం, వైరాగ్యం నుండి యోగం, యోగం నుండి ముక్తి లభిస్తుందని శ్రీవారితోనే చెప్పించడం రచయిత సాయిబాబాచార్య సిద్ధాన్తి గారి నిష్కామకర్మను బుజువుచేస్తుంది.

ప్రథమాధ్యాయంలో బ్రహ్మశ్రీ సింహాద్రి వీరాచార్యులు గౌరమాంబ దంపతులు పుత్రసంతానాపేక్షతో వారు చేస్తున్న పూజలు, తీర్థయాత్రలు, నదీ స్నానములు వర్ణన చదువరులకు వారి వెంటనున్నట్టి అనుభూతిని కల్గించేదిగా రచనసాగినది.

తరువాత శ్రీవారి జననము, బాల్యచేష్టలు, అన్నప్రాశన విషయుము, భువనపుత్రవిశ్వకర్మ వంశావళిని,సృష్టికి వారికీ గల సంబంధమును, చాల లోతైన విషయాలు ఈ గ్రంధం ద్వారా తెలియజేసారు. శ్రీ స్వామి వారి ఉపనయన విషయంలో గూడా అవతారమూర్తికి అనువైన గురువుచే గాయత్రీ మంత్రోపదేశము చేయించే విషయముకూడ ఎంతో ఉన్నతమైన పద్ధతిని ఈ గ్రంధంలో చూపించారు.

శ్రీ స్వామి వారి బాల్య మహిమలు, వివాహ విషయములు అన్నపూర్ణాదేవి అవతరణ, మరలయోగ సమాధి ప్రవేశానంతరం బెంగుళూరులో జన్మించి, తగు సమయములో సాక్షాత్ పరమశివుని చెంత బాలగా మదరాసులో ప్రత్యక్షమగుట, దుష్టుల గర్వమణచడం

మొదలగు సర్వ విషయములూ విడ్డూరము గాని రీతిలో, పండిత పామరుల కర్ధమగునట్లు వీరి రచనసాగింది.

ఈ గ్రంథమును ప్రతివారు చదివి అందుగల రసవాదభావము నెరింగి అది మహాత్ములకే సాధ్యమనిగ్రహించి, దురాశను దూరముచేసి అవతారపురుషుల ఆవిర్భావమును, విజ్ఞాన దృష్టితో అవగతంచేసుకొని, మన జన్మలను తరింపజేసు కొనుట, ప్రతీ మానవుని కర్తవ్యమైయున్నది. అందునా విశ్వబ్రాహ్మణులు మరచిని వారి పూర్వస్థితిని గుర్తుకు తెచ్చుకొనుటకూ, శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి వారు ప్రసాదించిన కాలజ్ఞానాన్ని అర్ధచేసుకొనుటకు, ఈ గ్రంథమెంతో ఉపకరిస్తుంది.

అంతేగాక శ్రీసనారీ వారి ఆగమనాన్ని కూడా గుర్తుకుతెచ్చుకుని వారి ఆదేశానుసారముగా నిత్యపూజాదివిధులను ఆచరిస్తూ తరించగల అవకాశమును శ్రీ సాయిబాబాచార్యులు గారు ఎంతో కృషి చేసి ఈ గ్రంథములో పొందుపరచిరి.

అదియును గాక "విశ్వకర్మలపూర్వ వైభవాన్ని " ఎంతో శ్రమతో పూర్వగ్రంథ సేకరణచేసి కళ్ళుకు కట్టినట్లు, చెవులకు ఇంపుగా, మనస్సుకు ఆనందాన్ని కల్గించేలా వేదప్రమాణముగా ఈ తరం విశ్వబ్రాహ్మణులకు తెలియజెప్పిన శ్రీ సాయిబాబా చార్యులుగారికి భావితరపు విశ్వబ్రాహ్మణజాతి ఎంతో ఋణపడిఉంటుంది.

అందుకు శ్రీ సాయి బాబాచార్యులు గారికి శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్ర విజ్ఞాన సేవాశ్రమము తరపున ప్రత్యేక ఆశీస్సులు శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాథవిజ్ఞానము మహిమలు గ్రంధరచనతో వీరిజన్మధన్యత గాంచినది. ఈ దంపతులకు ఎల్లవేళలా ఆయురారోగ్య, భక్తి జ్ఞాన వైరాగ్య, భోగభాగ్య, ఆత్మ జ్ఞాన ప్రాప్తిని కలుగజేయమని శ్రీ వీరబ్రహ్మ భగవానుని కోరుచూ బ్రహ్మదాసు


**శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్ర విజ్ఞాన సేవాశ్రమము**

బ్రహ్మపురము, వేల్పూరు, పిన్‌కోడ్ - 522 646

శావల్యపురం మండలం, గుంటూరుజిల్లా .






## నహీం - అహోం - ఓం
## ఓం శ్రా - సద్గురుభ్యోనమః
## ఓం ప్రశాంతిః

### శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాథ విజ్ఞానము - మహిమలు నిత్య పారాయణ గ్రంథం

శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు శ్రీ సాయిబాబాస్వామీజీ గారు(విజయవాడ) ఈ గ్రంధ రచయిత వారు **బహుముఖ ప్రజ్ఞాశాలి.**

విశ్వంబులోవిశ్వనాథావదూతయను - విశ్వబ్రాహ్మణుడొకడు పుట్టేనుమా।
విశ్వంబులో తాను శాశ్వతంబుగనుండు - విశ్వనాధుడననిపల్కేనుమా॥

శ్రీమద్ విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వామి వారు స్వయంగా ప్రవచించిన కాలజ్ఞానం లోని **10 వ గోవింద వాక్యమిది.**

శ్రీ సనారీ వారి పుట్టుకను బ్రహ్మంగారు దాదాపు 300 సంవత్సరాలకు ముందే యోగ దృష్టితో గ్రహించి గోవింద వాక్యములలో పొందుపరచినారు. శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి వారు చెప్పని భవిష్య వాక్యంలేదంటే అతిశయోక్తి కాదేమో! ఎక్కడ ఏవింత జరిగినా "అదిగో బ్రహ్మంగారానాడే చెప్పారు" అంటూ స్వామివారిని స్మరించుకుంటారు భక్తులు. పూజ్య వింద శ్రీశ్రీశ్రీ అచలానంద గురుదేవులునాకు చిన్నప్పుడే శ్రీ విశ్వేశ్వర స్వామివారు చాలా మహిమాన్వితులని చెబుతూ వారికి సంబంధించిన ప్రార్థనను నాకు యిచ్చి ప్రతిరోజూ పారాయణచేయమని చెప్పటం జరిగింది. ఆకారణంచేతనే యిప్పుడు సనారీ విశ్వేశ్వరస్వామి వారిని గురించి నాలుగు మాటలుచెప్పే అవకాశం నాకు లభించిందని భావిస్తున్నాను. అందుకు ఆనందిస్తున్నాను కూడా.

రచయితగారు సనారీ వారిని గురించి అత్యద్భుతంగా వ్రాశారీగ్రంథంలో. గతంలో సనారీ వారిని గురించి కొన్ని గ్రంధాలు వచ్చినవికానీ "స్వామివారినిగురించి వీరి విధానం అత్యంతరమణీయం. గ్రంథం చదువుతున్నంత సేపు సనారీవారి దృశ్యదర్శనం జరుగు తున్నది. వారిని మన కళ్ళముందు నిలిపారు రచయితగారు. ధ్యానం చేయకుండానే సనారీవారి దర్శనం కలుగుతుందీ గ్రంధపారాయణచేసినవారికి. రచయితగారు ఈ మహద్ గ్రంథాన్ని వ్రాయడానికిఎంత తపస్సు చేసి ఉంటారో పాఠకులకు ద్యోకతమవుతుంది. తపస్సుతో చేసేది ఏ దైనా పదుగురికి ప్రయోజనకారిగా వుంటుంది. **ఈ గ్రంధము అంతే** దీనిని పఠించినవారికి సకల అభీష్టములు నెరవేరుతాయి.

### వీరబ్రహ్మేంద్ర ఉవాచ:

"ఏయింట మా కాలజ్ఞానం పూజించి పారాయణ చేయబడుతుందో ఆయింట మేముంటాము" అని అభయమిచ్చారు.

ఈ సనారీ వారి చరిత్రనుకూడా భక్తిగా పారాయణ చేసిన వారికి శ్రీ వారి దివ్యానుగ్రహం లభిస్తుంది. సాక్షాత్ శ్రీ శైలమల్లిఖార్జునుని అంశసంభూతులే ఈ సనారీ విశ్వ నాధావదూత స్వామివారు. ఆ విషయాన్ని గ్రంధకర్తగారు కూడా స్పష్టంగా తెలియజేసారు.

శ్రీ సాయిబాబాస్వామీజీ గారు ఈ గ్రంధాన్ని ఎంతో హృద్యంగా తీర్చిదిద్దారు. యిందలి అంశాలను నేను ఎక్కువగా స్పృశించదలచుకోలేదు. ఎందుచేతనంటే గ్రంధం ఆద్యంతం అత్యంత రమణీయంగా ఉంటే నేను ఏ విషయాన్ని ప్రస్తావించాలి? ఏ విషయాన్ని వదిలి పెట్టాలి? అందుకే మీరే సాయిబాబా స్వామీజీ సనారీ ఆనంద సాగరంలో ఈదులాడండి. ఆ ఆనంద మకరంధానుభూతులను చవిచూడండి.

కాకపోతే నేను సూక్ష్మంగా కొన్ని విషయాలను రచయితగారి కోర్కె మేరకు ప్రస్తావిస్తాను.

శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారు శివ పూజాదురంధులగు బ్రహ్మశ్రీ సింహాద్రి వీరాచార్యులు గౌరమాంబలకు మల్లిఖార్జున తేజస్సుతో జన్మించారు. నాగావళీ తీరమందలి, గంజాం జిల్లాలోని పాలకొండ వారి స్వగ్రామము. శ్రీ వీరాచారిగారికి సంతానము లేనందున మహాత్ముల ఆదేశానుసారం తీర్థయాత్రలకు బయలుదేరారు. అనేక క్షేత్రములు దర్శించి కందిమల్లయ్య పల్లెలోని శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి మఠం చేరి స్వామివారి జీవసమాధిని దర్శించి ఆరాత్రి అచట నిద్రించగా నాటి స్వప్నంలో గోవిందాంబ సమేత వీర బ్రహ్మేంద్రులు సాక్షాత్కరించి “నాయనలారా” మీరు శ్రీ శైలమల్లిఖార్జునస్వామివారిని దర్శించండి। ఆ స్వామి అంశతో మీకు పుత్రుడు జన్మిస్తాడు అని చెప్పారు. అది విన్న వీరాచార్య దంపతులు మఠంనుండి బయలుదేరి శ్రీశైలం వెళ్ళిఅచట శ్రీ భ్రమరాంబా మల్లిఖార్జున స్వామివారలను దర్శించుకొని మార్గమందలి పుణ్యక్షేత్రములను చూచుకుంటూ స్వగ్రామం చేరారు.

ఒక నాటి అర్ధరాత్రి గౌరమాంబ స్వప్నంలో శ్రీ మలిఖార్జున స్వామి జ్యోతిరూపంగా ఆమె గర్భమందు ఐక్యమయినట్లు కనుపించగా నిద్రలేచి ఆ విషయం భర్తతో చెప్పగా వారి ఆనందానికి అవధులు లేవు.

అనగా వీరబ్రహ్మేంద్రస్వామి వరప్రధాత, శ్రీశైలమల్లిఖార్జునుని అంశసంభూతుడన్నమాట శ్రీ సనారీ విశ్వనాధావదూతస్వామివారు.

శ్రీ సాయిబాబాచారిగారు ఆజననం అంశాన్ని కన్నులకు కట్టినట్లుగా వివరించారు. యింకా యిందులో విరాట్ విశ్వకర్మగురించి విశేషంగాప్రస్తావించారు. ముఖ్యులగు ముగ్గురు విశ్వకర్మలగురించి ప్రస్తావిస్తూ అందుకు శాస్త్రాధారాలు పొందు పరచినారు.

శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారు ప్రతినిత్యం విరాట్ విశ్వకర్మ భగవానుని గురించి ధ్యానం చేయడముచే ఒక పవిత్రదినం సృష్టికర్త సాధురూపమున దర్శనమిచ్చి “ బ్రహ్మజ్ఞాన ప్రాప్తిరస్తు” అని దీవించారు. అంతే నాటినుండి విశ్వనాథ స్వామిలో అనూహ్యమైన మార్పులు చోటుచేసుకున్నాయి.





వేదాంత పాఠాలను వల్లెవేయడం పదుగురికి చెప్పడం, యోగసాధన పద్ధతులు వివరించడం దినచర్యగా పెట్టుకున్నారు. మన సనారీ స్వామివారు.

ఈ గ్రంధంలో సాయిబాబాస్వామీజీ గారు ఇష్టదేవతా ప్రార్థనను, శ్రీ సనారీ వారి దండకమును సనారీ దీక్షా విశేషాలను, సనారీమూలమంత్రజప ఫలితములను, సనారీ ద్వాదశాక్షరీ మహామంత్రమును, దాని ఫలితములను పొందుపరిచారు. ఇంకా శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి ధ్యానమును, చూర్ణికను, అందించారు. విశ్వకర్మధ్యానమును, విశర్వకర్మ అష్టకమును, గాయత్రీ మంత్రధ్యానములను మనకు అందించారు.

బ్రహ్మఋషి సుగంధం సాయిబాబాస్వామీజీ గ్రంధ అవతారికను విపులీకరించినారు. విశ్వనాధుని జననం, అన్న ప్రాశన, అక్షరాభ్యాసం, అన్నపూర్ణాదేవి జనన విషయాలను వివరంగా పొందుపరచినారు.

విశ్వనాధుని జలస్థంభన మొదలగు అనేక విషయాలతో ఈ గ్రంధాన్ని అత్యంత సమగ్రంగా తీర్చి దిద్దారు. దీనిని ఆమూలాగ్రం చదివిన వారికి ప్రతి పేజీలో ఒక రమ్యత ఆకర్షణ కనిపిస్తాయి.

శ్రీ సాయిబాబాచారిగారి పట్టుదల ధీశక్తి ప్రశంశనీయం. వారి తపస్సు ప్రతిఫలంగా ఈ గ్రంధాన్ని చెప్పవచ్చు వారి ప్రతిచర్య వేదాంత కదలికలనే స్ఫురింప చేస్తాయి. వారి జీవితం వేదాంతంతో రంగరించిన గంగాజలంగా గోచరిస్తుంది. వారిని గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

భక్తలోకానికి ఒక మహద్గ్రంధాన్ని అందించిన శ్రీ సాయిబాబాచారిగారికి పూజ్య గురుదేవులు వారిదివ్య ఆశీస్సులు సర్వదాసంప్రాప్తించాలనీ, శ్రీగోవిందమాంబ సమేత వీర బ్రహ్మేంద్రులవారి దివ్యానుగ్రహం సమృద్ధిగా చేకూరాలని శ్రీ శైల భ్రమరాంబ సహిత మల్లిఖార్జునుల, సనారీ విశ్వేశ్వరస్వామివారి అనుగ్రహం పుష్కలంగా లభించాలనీ వారిని ప్రార్థిస్తున్నాము.

ఈ గ్రంధానికి అభిప్రాయాన్ని వ్రాసే అవకాశాన్ని కలిగించిన శ్రీ సాయిబాబాస్వామిజీ గారికి శ్రీ గోవిందమాంబా వీరబ్రహ్మేంద్రులదివ్యానుగ్రహము. మరియు ముఖ్య గురుదేవులు శ్రీ గోవిందమాంబావీరబ్రహ్మేంద్రమహాపీఠము-అచలానంద ఆశ్రమ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ యోగి ఆచలానంద స్వామివారి దివ్య ఆశీస్సులు సర్వదా సర్వత్రా సంప్రాప్తించాలనిప్రార్థిస్తూ

భగవత్ సేవకులు : **శ్రీ పరిపూర్ణానందస్వామి**

ఎడిటర్. కాలజ్ఞానసుధ, ఒంగోలు

# శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాధాలయమ్



యింక ఈ ఆలయానికి ప్రహరిని పెంచి, గర్భగుడికి గోపురము, చుట్టూ విగ్రహములు ధ్వజస్తంభానికి యిత్తడితొడుగు, ఆశ్రమము నిర్మించవలసియున్నది. కావున భక్త మహాశయులు కులమత భేదం లేకుండా విరాళములు సమర్పించి, త్వరలో దేవాలయనిర్మాణం పూర్తియగుటకు సహకరించి సాక్షాత్పరమశివావతారులగు శ్రీశ్రీశ్రీ సనారీ వారి కృపకుపాత్రులైతరించవలయునని కోరుతూ ది. 13-3-2011 వ తేదీన జరుగు విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమములుజరిగినవి. ఆలయ నిత్యనైవేద్యముల నిర్వహణకు ఆర్థిక సహాయ మందించి ఆలయాభివృద్ధి జయప్రదం చేయవలసినదిగా ఆలయ నిర్వాహకుల విజ్ఞప్తి.

**దేవాలయం అడ్రస్సు :** మహానాడురోడ్ నెం - 7, తాడేపల్లిపోస్టు& మండలం, గుంటూరుజిల్లా - 522 501, నవ్యాంధ్ర

దేవాలయ నిర్మాణాధ్యక్షులు: సనారీ పీఠాధిపతి **బ్ర॥సుగంధంసాయి బాబా స్వామీజీ**

సెల్ : 9032253205, 9290582110,7793992584, 9177252943

కోశాధికారి **కంటె శివకుమార్** - 9885083676.

ప్రధానకార్యదర్శి: **బ్ర॥ ధనాలకోటశ్రీనివాసరావు(వాసు)** సెల్ : 9246477386

**బ్ర॥ కొండూరు ప్రసాదాచారి,** సంతోష్‌నగర్, హైదరాబాద్, సెల్ : **9032307487**

దేవాలయనిర్మాణ పర్యవేక్షణ : బ్ర॥ **కొండూరు ప్రసాదాచారి,** సెల్ : **9032307487**

**పూర్తి వివరములకు ఈ ఫోను నెంబర్లను సంప్రదించగలరు.**





## గ్రంధకర్త రచనలు

మేము ప్రథమంగా వ్రాసి2007లో ముద్రించిన సంధ్యావందనము, శ్రీసూక్త పురుష సూక్తములతో శ్రీ సనారీ నిత్యపూజా,పంచబ్రహ్మల సాంప్రదాయములతోగల కేదారేశ్వర వ్రతవిధాన పూజాపుష్పాన్ని ఉయ్యూరు వా॥లు బ్ర॥బంగారునాగేశ్వరరావు గారిచే ముద్రింప బడి విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘ మాజీ అధ్యక్షులు విజయవాడ నగర మాజీ స్టాండింగ్ కమిటీ ఛైర్మన్‌గారగు బ్ర॥జవ్వాది రుద్రయగారిచే విజయవాడ 1టౌన్ స్వర్ణకారసంఘ కార్యాలయమునందు, విజయవాడ విశ్వబ్రాహ్మణసంఘ, స్వర్ణకార సంఘ, ప్రముఖులు మరియు "ప్రముఖ జ్యోతిష పండిట్ పి.ఎ. రామన్" గారు కాళహస్తి దేవస్థానం భువనేశ్వరి పీఠం సంస్కృతి టి.వి.ఆస్థాన సిద్ధాంతిగారును "వాఖ్యాత శిరోమణి" ప్రముఖ న్యాయవాది వేములహజరత్తయ్యగుప్తా గారి సమక్షంలో ఆవిష్కరించబడినది. పంపిణీ చేసాము.

చి॥కొండూరు కమలాప్రసాద్ చి॥కంటే శివకుమార్ చి॥పాలతీర్ధపు శ్రీనివాసాచారిగారిచే మాద్వితీయ ముద్రణశ్రీశ్రీశ్రీ సనారీ దీక్షావిధానము2009లో ముద్రించి సనారీ మలాధారులపై సతీశిష్య సమేతముగా పాలకొండ శ్రీశ్రీశ్రీలోకమాత అన్నపూర్ణమ్మ మఠములో మఠాధ్యక్షులు దేవునరసింగరావు (తవుడు) ప్రధాన కార్యదర్శి కొక్కెరగడ్డ బ్రహ్మజీ మఠం ప్రధానార్చకులు దుర్గాప్రసాద్ పాడీ తదితర భక్తుల సమక్షంలో మఠం అధ్యక్షులవారిచే మహాశివరాత్రినాడు ఆవిష్కరణచేయించి పంపిణీచేస్తున్నాము.

మాతృతీయ ముద్రణ శ్రీశ్రీశ్రీసనారీ విజ్ఞానం,మహిమలు 2011లో బ్ర॥జవ్వాదికూర్మాచారి గారిచే ముద్రించబడి శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగసహిత సనారీ విశ్వనాధస్వామివారిదేలయ విగ్రహప్రతిష్ఠాసందర్భములో విజయవాడ విశ్వబ్రహ్మణ సంఘాధ్యక్షులు, దేవాలయ గౌరవా ధ్యక్షులగు బ్ర॥జవ్వాది కూర్మాచార్యులగారిచే ఆంధ్రప్రదేశ్ స్వర్ణకారసంఘాధ్యక్షులు, యమ్.యస్. ప్రకాష్ గారు, విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘం, స్వర్ణకారసంఘ ప్రముఖులు మహానాడు గ్రామ ప్రముఖుల సమక్షంలో దేవాలయ ప్రాంగణంలో ఆవిష్కరించి పంపిణీ చేస్తున్నాము.

చి॥కొండూరు కమలాప్రసాద్ చి॥కంటే శివకుమార్ చి॥పాలతీర్ధపు శ్రీనివాసాచారి గారిచే మాచతుర్ధముద్రణ శ్రీశ్రీశ్రీ సనారీశ్వరప్రతాన్ని 2013 లో ముద్రించి శ్రీశైలంలో అన్నపూర్ణమాత మఠమందు మఠస్థాపకులగు రెడ్డినాయన ధర్మపత్ని వర్ధంతిరోజున మఠాధ్యక్షులు సనారీ భక్తవరేణ్యులగు రెడ్డినాయనగారిచే వారి"160గ్రామాల" శిష్యగణ సమక్షంలో ఆవిష్కరించబడి పంపిణీ జరుగుతున్నది.

మా పంచమ ముద్రణ శ్రీశ్రీశ్రీ సనారీ సంవాదగ్రంధములు 2014 లో గ్రంధ ముద్రణకర్త **మహారాజశ్రీ వేగేశన రాధాకృష్ణ** B.E(Civil) గారిచే ముద్రింపబడినది.

**శ్రీశ్రీశ్రీ వేంకటాచారియర్** (చతుర్వేది) గారి అమృత హస్తములతో 13-12-2014వ తేదిన వారి 42వ జన్మదిన శుభసందర్భములో హైదరాబాద్ లో పల్లవిగార్డెన్స్, కె.యమ్.జి. పారడైజ్ పంక్షన్‌హాలు నందు ఆశ్వీరదించబడి తెలంగాణ స్పీకర్ మాన్యశ్రీ మధుసూధనాచారి గారిచే ఆవిష్కరణ కొనిజేటి ఎన్‌క్లేవ్ నందు జరిగినది.

## నవ్యాంధ్ర దేశమందలి శ్రీ సనారీ పీఠములు

**1) శ్రీ సింహాద్రి విశ్వనాధావధూతస్వామివారి** జన్మస్థలమగు శ్రీకాకుళంజిల్లా పాలకొండలో వారి స్వగృహమందుగల శ్రీశ్రీశ్రీఅన్నపూర్ణాదేవి మఠంలో కార్తీక శుద్ధపంచమీనస్వామివారి జన్మదినోత్సవం

వైశాఖశుద్ధ ఏకాదశినాడు విశ్వనాధాచారి అన్నపూర్ణమ్మల కళ్యాణం, శరన్నవ రాత్రులందు అమ్మవారికిపూజలు, ప్రతీమాసపూర్ణిమకు సనారీవారి విగ్రహానికి పంచామృత అభిషేకం, సాయంత్రం కుంకుమార్చనలు, మహాశివరాత్రినాడు అన్నపూర్ణా మాత ఆరాధనలు ప్రతీసంవత్సరం తెనాలినుండి బ్ర॥తుమపాలసత్యనారాయణ, బ్ర॥గుంటముక్కల రాజేశ్వరరావు గార్ల ఆధ్వర్యంలో 3,4బస్సులతో భక్తులు, మచిలీపట్నం నుండి (ఒక బస్సుతో) బ్రహ్మశ్రీ దేవువెంకటేశ్వరరావుగారి ఆధ్వర్యంలో బస్సు వెళ్ళి పూజాకార్యక్రమాలు నిర్వహించుట తెనాలి వారి ఆధ్వర్యంలో అన్నదాన కార్యక్రమాలు జరుగుతాయి.

**2) బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాస్వామీజీ** గుంటూరుజిల్లా తాడేపల్లిమండలం ఉత్తరావాహినిగాల మహానాడు గ్రామంలో నిర్మించిన శ్రీశ్రీశ్రీశ్రీశ్రీత్రిశక్తి సహస్ర లింగసహిత సనారీ విశ్వనాధస్వామివారి ఆలయమునందు ప్రతీ సంవత్సరము వార్షికముగా జరుగు కార్యక్రమములు

1. కార్తీక శుద్ధ పంచమి సింహాద్రివిశ్వనాధావధూత స్వామివారి జన్మదినోత్సవము
2. వైశాఖ శాద్ధ ఏకాదశినాడు విశ్వనాధాచారి అన్నపూర్ణమ్మల కళ్యాణం.
3. దేవీ శరన్నవరాత్రులందు స్వామివారు రచియించిన పద్ధతితో ఉదయం తర్పణలు, పూజకు వచ్చినవారికి భోజనములు.పూజలు జరుగును. సాయంత్రం సహస్ర నామాలతో కుంకుమపూజలు జరుగును.
4. మహాశివరాత్రికి పార్వతీపరమేశ్వరులకల్యాణము జరుగును.
5. ప్రతీమాసశివరాత్రికీ శివలింగానికి అన్నాభిషేకముచేయించి దాదాపు 100మందికి అన్నసంతర్పణజరుగును. దేవాలయములోని ప్రతీకార్యక్రమానికి అన్నదానం జరుగును.
6. ప్రతీ శనివారం నవగ్రహపూజలు, ప్రతీరోజు ప్రతీ శుక్రవారం అమ్మవారికి కుంకు మార్చననుశివలింగానికి అభిషేకములు.
7. ప్రతీ సోమవారం శివలింగానికి పంచామృత అభిషేకములు.
8. సుబ్రహ్మణ్యషష్టి బాలసుబ్రహ్మణ్యస్వామికి
9. హనుమజ్జయంతి అభయాంజనేయస్వామివారికి
10. మంగళవారంనాగదోషమున్నవారికి సుబ్రహ్మణ్యస్వామిపూజలు
11. నాగుల చవితికి పంచముఖనాగేంద్రునకు జంటనాగులకు ప్రత్యేకపూజలు

**3) తెనాలి మఠంబజారులో** సువర్ణ సూర్యాకాంతంగారి మఠంలోని సనారీ దేవాలయంలో వార్షికంగాజరుగు కార్యక్రమములు. తెనాలి గుంటూరుజిల్లా , న్యూఆంధ్ర.





1. కార్తీకశుద్ధ పంచమి స్వామివారి జయంతి& కల్యాణం.
2. వైశాఖశుద్ధ ఏకాదశినాడు స్వామివారి కల్యాణం.
3. మహాశివరాత్రినాడు పార్వతీపరమేశ్వరుల కల్యాణం.
4. సువర్ణ సూర్యాకాంతాచారిగారి ఆరాధన.
5. సువర్ణలక్ష్మి నరసమ్మగారి ఆరాధన.

**4) శ్రీశైలంలోని రెడ్డినాయన ఆశ్రమంలో** గల అన్నపూర్ణాదేవి మఠమును 1972లో స్థాపించారు. స్వామివారి జయంతి ఫిబ్రవరి 7వతేదీన, కార్తీకమాసంలో అభిషేకములు, మహాశివరాత్రికి అన్నపూర్ణావిశ్వనాధుల కల్యాణం.

మార్గశిరమాసంలో అన్నపూర్ణాదేవి వ్రతం 16రోజుల కార్యక్రమములు చప్పటి భోజనం,తీపి పదార్ధములతో నివేదన జరుగును.

**5) తాండూర్‌లో కార్తీక కృష్ణ** ఏకాదశినాడు సనారీ జయంతి చేస్తారు.(తెలంగాణ)

**6) వాడ్యాలతో సనారీవారి** జయంతి కార్తీకశుద్ధ పంచమి చేస్తారు.

**7) పోలకంపల్లిలో కార్తీక** శుద్ధఏకాదశినాడు సనారీ జయంతి చేస్తారు.

**8) మొహబూబ్‌నగర్‌జిల్లా** జిల్లేళ్లలో సనారీ జయంతి కార్తీకకృష్ణ పంచమిన చేస్తారు.

**9) భీమవరం రెల్లివీధిలోగల** సనారీపీఠాన్ని 1949బ్ర॥తాతోలు వీరరాఘవాచార్యులు గారు స్థాపించి సనారీ వారు ప్రసాదించిన పూజావిధానంతో ప్రతీ సంవత్సరం దేవీ నవరాత్రోత్సవములు నిర్వహించి పూర్ణాహుతి రోజున అన్నదానం చేసెడివారు యిలా 1990వరకూ పీఠాన్ని నిర్వహించి 1991లో శివైక్యముచెందారు. నాటినుండి వారి రెండవ కుమారుడు కాళీవరప్రసాద్ పీఠాన్ని పరిరక్షించుచూ జ్యోతిష శాస్త్రముచే జీవనము సాగించుచున్నారు. ప్రతీసంవత్సరం దేవీ నవరాత్రులు పూజాకార్యక్రమములు జరుపు చున్నారు. భీమవరం, రెల్లివీధి, ప॥గో॥జిల్లా, న్యూఆంధ్ర.

**10)తూ॥గో॥జిల్లా చరిత్రప్రసిద్ధి** కెక్కిన ద్రాక్షారామమందు సనారీఆశ్రమముకలదు.

11) తూ॥గో॥జిల్లా రావులపాలెం మండలంలో గోపాలపురమందు పాకల పాటిగురువులచే నెలకొల్పిన శ్రీశ్రీశ్రీ సనారీ వారి ఆశ్రమముకలదు.

12) తూ॥గో॥జిల్లా రాజరాజనరేంద్రుడు పరిపాలించిన రాజమండ్రి కోటిలింగాల రేవు వద్దనున్న సుబ్రహ్మణ్యశర్మ గారిసమాధిని సనారీవారుగా ఆప్రాంతీయు మరికొందరు కలసి మఠం లాగా నిర్మించి పూజించుచున్నారు.

13) ప॥గో॥జిల్లా పెనుగొండ దగ్గరలో గల ములపర్రుగ్రామములో రామరాజుగారు సనారీ ఉపాసకులై సనారీ దేవాలయములన్నీ వారి గృహప్రాంగణంలోనే నిర్మించారు. అయితే వారు సనారీవార్ని వేరే రూపుతో పూజిస్తారు వారు శ్రీశైలంలో మరణించగా యింటికి దేవాలయానికి మధ్యలో సమాధిని చేసారు.

14. ములపర్రు సరిహద్దున గల యలపర్రులో సనారీపీఠం ఆశ్రమమున్నది. అక్కడ పవన్‌కుమార్ బ్రదర్ ప్రతిరోజు కొబ్బరిపీచుతో హోమం చేస్తూ సనారీవారి అష్టోత్తర శతకేత నామావళి చెబుతూ అన్నాన్ని హోమ ఆహుతి చేస్తూ వచ్చిన వారందరితో ఆహుతి లిప్పిస్తారు.

## మయబ్రహ్మ వర ప్రభావము

ఋగ్వేదాన్ని "కావ్యతీర్థ" శ్రీ నేమాని వెంకట నరసింహ శాస్త్రిగారు 1926-1932 సంవత్సరముల మధ్య"శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత" అనుపేరుతో అసమగ్రంగా ఆంధ్రంలో అనువదించిన వ్రాతప్రతిని వారితదనంతరం రాజమండ్రి "గౌతమీ గ్రంధాలయం"లో భద్రపరచగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు దానిని గ్రహించి "బ్రహ్మర్షి వాఙ్మయమహాధ్యక్ష" కళాప్రపూర్ణ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి పూర్తి చేసేబాధ్యతను అప్పగించగా కళాప్రపూర్ణగారు యిందలి దోషాలను వేద ప్రమాణంగా వివరించుతూ సవరించి,సంపూర్తి చేసినారు. అందలి చతుర్థసంపుటి నవమదశమ మండలములందలి 8వ, 9వ,సూక్తములలోని "కావ్యతీర్థ"వారి భాష్యానికి గోపాల కృష్ణయ్యగారు ఆంధ్రానువాదం చేస్తూ విరాట్ విశ్వకర్మ పశ్చిమ శిరమునుండి ఉద్భవించిన త్వష్టబ్రహ్మకుమారుడగు విశ్వరూపాచార్యులు అను "త్రిశిరస్కుడగు" వానిని దత్తాత్రేయునిగా భాష్యం చెబుతూ ఈ విషయాన్ని పురాణాలలో ఏవోకథలల్లారని విమర్శించారు. యిట్టి రచనలతో వేదాలలోని విషయాలకు వక్ర భాష్యం చెప్పు వారికి గల అనేక జన్మల పుణ్యఫలితాలు నశించి పాపకర్మల పాలౌదురని హెచ్చరించినారు.

ఆదిలో దాయాదులైన బ్రాహ్మణ, "విశ్వబ్రాహ్మణులు" కాలప్రవాహంలో దాయాదద్వేషులైన తరుణంలో బ్రాహ్మణ ఆధిక్యతకై వేదవ్యాసుడు మయ బ్రహ్మవద్ద శిష్యుడై వేదవేదాంగములనభ్యసించి యంత్రమంత్రతంత్రముల రహస్యముల నెరింగి, శుశ్రూష చాలించి, విప్రజాతి ఔన్నత్యమునకై వేదములు పురాణములందు విప్రశబ్దమును చేర్చి మార్పులు చేసి, తానురచించిన గ్రంధములకు, విప్రులకు, వారి పీఠములకు రాజపూజ్యత కొరకు దీక్షబూని గురువునకై ఘోరతపమాచరించగా సంతుష్టుడై న "మయబ్రహ్మ" శిష్యవాత్సల్యంతో ప్రసన్నుడై" వత్సానాకొరకింత కఠోరదీక్ష సల్పిన కారణమేమి? నీయభీష్టము తెలుపుమనగా!

గురుదేవా! నేను రచించిన గ్రంధములకు పీఠములకు విప్రులకు రాజ్యపూజ్యత నొసంగుడని ప్రార్థించెను.......అంతమయ బ్రాహ్మఆశీర్వదిస్తూ

వ్యాసప్రోక్తం మయాదత్తం విప్రోసర్వత్ర పూజితః అనగా! వ్యాసుడు గురుదేవా! ఈప్రభావమెంతవరకుండునని వినమ్రుడై నమస్కరించగా! కలౌ పంచసహస్రాణి-- జాయతేవర్ణసంకరః అంటూ అదృశ్యుడాయెను. మయ బ్రహ్మ వరం ఫలించు విధివిధానంగా విప్రులు యోగసిద్ధిని పొంది ఔన్నత్యముపొందుటకుగాను వారి పీఠములు, మార్పుచేసిన వారి శాస్త్రములు పూజింపబడుట కొరకు ఉపదేశార్హత గల త్వష్టప్రజాపతి కుమారుడగు విశ్వరూపాచార్యులు(దత్తాత్రేయులు)వారిని త్వష్ట వంశీయునకు విప్రబాలవిధవకు శంకరాచారిగా ఆవిర్భవింపజేసి వారితో విప్రసంతతికి ఉపదేశములు





యించి ప్రస్తుతం అష్టాదశపీఠములు స్థాపించి, విప్రులకు,వారి పీఠములకు జపూజ్యతకు కారకులైరి. ఈ విధంగా మయ బ్రహ్మ వరఫలితాన్ని విప్రులు పొందు న్నారు.దీనికి ప్రమాణము శంకర విజయంలో శంకరాచారిగారు వారి జననకారణాన్ని విధంగా తెలిపిరి. ఆచార్య శంకరోనామః-త్వష్టపుత్రోన సంశయః। విప్రకులగురోర్దీక్షా శ్వకర్మంతుబ్రాహ్మణః

### జరుగబోవునది

కలౌపంచసహస్రాణి...జాయతే వర్ణసంకరః కలి ఐదువేల సంవత్సరములు తించిన పిమ్మట విప్రులు మయబ్రహ్మ వర ప్రభావంచే సంకరులై హీనస్థితి పొందుదురు. టుపిమ్మట విశ్వబ్రాహ్మణులు మూడు దైవశాపముల నుండి విముక్తులై పూర్వఔన్నత్యము ందెదరు. ఈ లోకంలో కృతయుగంలోవలె సర్వులు సర్వసౌఖ్యములు పొంది ర్ణాశ్రమధర్మంనాలుగు పాదాల నడుస్తుంది. మయబ్రహ్మవాక్ ఫలితంగా భవిష్యత్తులో శ్వకర్మజాతి ఉన్నతస్థితిని పొందుటకు, సర్వమానవ శ్రేయస్సునకై **"సాక్షాత్ రమశివుడు"** శ్రీకాకుళంజిల్లా పాలకొండ గ్రామంలో 1794వ సంవత్సరంలో సింహాద్రి రాచారి గౌరమాంబ తపఃఫలంగా వారికి తనయుడై విశ్వనాధునిగా అవతరించి ల్యాంనుండి అనేక మహిమలు ప్రదర్శించి మానవుడే మాధవుడుకాగల యోగసాధనా ద్ధతులు, సిద్ధుల జీవనార్థమై రసవాదమును, సర్వమానవుల ఆరోగ్యము కొరకు యుర్వేద ఔషధ తయారీ విధానమును,అనేక సృష్టిరహస్యాలను, భూలోకంలోగలదంతా నవశరీరంలో ఉన్నదని పోలికలతో తెల్పుచూ మంత్ర తంత్ర యంత్ర యుక్తమగు ంధాన్ని రచియించి సమస్త మానవాళికి కరుణతో అందించి శ్రీశైల గుహాంతర్భాగమున హాతపోదీక్షలో ఉండి తన భక్తుల మనోవాంఛితముల నీడేర్చుచూ,ఆచంద్రతారార్కము ందునని తెలిపిరి.అట్టి మహద్గ్రంధమగు **"సనారీ సంవాదము"** పండిత పామరులకు హితము అగమ్య గోచరముగా నుండుటచే గురుకృపచే నాకు తెలియపరచిన గ్రంధవివరాలను ప్రస్తుత వాడుక భాషలో రచయించి ఆస్తికులకు మోక్షాపేక్షకులకు అందించుచున్నాను. ఇందలి విషయములు మూలగ్రంధ వరుసక్రమములో ముద్రించినాము. **సనారీ సంవాదగ్రంధ సహాయముతో** ఇందలి అర్థాలు గ్రహించి క్రమశిక్షణతో త్రికరణసుద్ధిగా ఆచరించి మీమీ కోర్కెలు గురుకృపతో తీర్చుకోగలరు.

శుభంభవతు. సర్వేజనాః శుఖినోభవంతు. గురుబ్రహ్మోర్పణమస్తు.

శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారి విశ్వనాధ దేవాలయ నిర్మాణ్యాధ్యక్షులు
**బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామిజీ (విశ్వకర్మ)**
మహానాడు, తాడేపల్లి పోస్టు&మండలం, గుంటూరు జిల్లా : 522 501, నవ్యాంధ్ర



గ్రంధకర్త మాతాపితరులు

కీ॥శే॥ బ్రహ్మశ్రీ సుగంధ వేంకటేశ్వరరావు, ధర్మపత్ని సుమంగళి పాపాయమ్మ














# శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానము - మహిమలు



| **శ్రీశ్రీశ్రీ సనారీపీఠమ్**<br>**శ్రీ సాయి జ్ఞాననిలయమ్,**<br>ఓగిరాలవారివీధి,<br>డోర్ నెం: 23-11-1-6/బి,<br>సత్యన్నారాయణపురం, విజయవాడ-11<br>**సెల్ : 9290582110, 90322 53205, 8099203873** | శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానం & మహిమలు<br>ద్వితీయ ముద్రణ 2015 మన్మథ<br>ముద్రణ<br>డి.టి.పి. యమ్. సునీత, విజయవాడ<br>ప్రతులు : **1000** |
|---|---|

**చెన్నపట్టణ మహానగరంలో :** శృంగేరి పీఠాధిపతులతో జరిగిన వాగ్వివాదంలో సింహాద్రి విశ్వనాథావధూత స్వామి చూపిన సనారీ సాక్షాత్కారమును ఆనాటి హైకోర్టు చీఫ్ జస్టిస్ రాజమన్నార్ సమక్షంలో 1878లో ఎ.కె.వేలన్ తీసిన ఛాయాచిత్రం।

కవినిగాను వ్యాకరణ కావ్యముల్ చదువనులేదు।
నేను పండితుడనుగాను శుద్ధపామరుండ, విమలభక్తి
భావమున సద్గురు కృపాకటాక్ష వీక్షణములతో,
వ్రాసితి సనారీ విశ్వేశ్వర సంగ్రహ జీవిత చరిత్రన్।।

సేకరణ: రచన; సుగంధం సాయిబాబా చార్య స్వామీజీ (సనారీభక్తరేణువు)

## మనవి

నా బాల్యమునుండి, కవి, గాయక, పండిత, పురోహిత, ఆధ్యాత్మిక, యోగాభ్యాస. సిద్ధాన్తి, సజ్జనులతో,వయోవృద్ధులు, జ్ఞానవృద్ధుల దర్శన, స్పర్శన సంభాషణలతో, విశ్వకర్మకులమందలి మహానీయుల, దైవాంశసంభూతుల, చరిత్ర పురుషుల యొక్క జీవిత చరిత్రలు సంగ్రహించి మనసున, పదిలపరచుకొని ఒక్కొక్క పూవు గ్రుచ్చి మాలను చేసినట్లుగా ఈ గ్రంధరాజమును తయారుజేసితిని దీనికి సహకరించిన గ్రంధములు, వ్యక్తులు

1. విశ్వకర్మోపనిషత్ & వేదములు
2. బ్రహ్మంగారి కాలజ్ఞానం & విశ్వబ్రాహ్మణపూర్వచరిత్రలు
3. సనారీ విశ్వేశ్వరసంవాదము & ధర్మపాల విజయము
4. యోగి వేమనపద్యాలు & కొడాలి లక్ష్మీనారాయణచౌదరి గారి రచనలు
5. నా బాల్యంలో కీ॥శే॥ బ్ర॥ గోరసనారాయణబాబుగారి నుండి విన్నమాటలు
6. ప్రముఖ పౌరాణిక,చారిత్రాత్మకనాటక, ఏకపాత్రల రచయిత
   కీ॥శే॥ బ్ర॥ వంగవోలు వేంకటేశ్వరశాస్త్రిగారు (నాగశ్రీ)
7. కీ॥శే॥బ్ర॥ గొన్నాభక్తుల సోమలింగాచారిగారు (తెనాలి) వీరు సనారీ వారి పూజలు 40 సం॥ నిర్వహించిరి.
8. బ్ర॥ బోను మద్దిరామలింగసిద్ధాన్తి (రాజమండ్రి) వీరు నాకు 1978లో మద్రాసులో రావణబ్రహ్మచే ప్రతిష్టితమైన కపాలేశ్వర ఆలయంలో మంత్రోపదేశం చేసిన మొదటి గురువు (వీరు భారత దేశాధ్యక్షులు జ్ఞాని జైల్‌సింగ్‌గారి గురువు (రాజగురువు) గద్వాల్ ఆస్తానంలో మంత్రశాస్త్రముల యందు (బ్లాక్‌టైగర్) బిరుదు పొందారు.
9. కీ॥శే॥బ్ర॥ చేబ్రోలు బ్రహ్మానంద సిద్ధాన్తి ( విజయవాడ)
10. సోదరతుల్యుడు కీ॥శే॥బ్ర॥ దేవుగిరిరాజు భాగవతార్ (పామర్రు)
11. బ్ర॥ పూడి రామకృష్ణసిద్ధాన్తి (అనకాపల్లి)
12. బ్ర॥ మరడాన సాంబశివరావు భాగవతార్(విజయవాడ)
13. బ్ర॥ టేకి నరసింగరావు (తవుడు) పాలకొండ సనారీ దేవస్థాన అధ్యక్షులు
14. బ్ర॥ కొక్కెరగడ్డ బ్రహ్మాజీ ★ పాలకొండ సనారీ దేవస్థాన ప్రధాన కార్యదర్శి
15. దుర్గాప్రసాద్ పాఢీ ★ పాలకొండ సనారీ దేవస్తాన అర్చకులు
16. బ్ర॥ గురుజేపల్లి వీరనారాయణ భాగవతార్ (విజయవాడ)
17. మాతృశ్రీ చింతాడ లలితాంబ (సత్తెనపల్లి) సనారీ వీరబ్రహ్మేంద్ర ఆశ్రమం, శ్రీ శైల అన్నపూర్ణాంబ ఆశ్రమ వ్యవస్థాపక, నిర్వాహకురాలు
18. బ్ర॥ గూడెపుసూర్యనారాయణ రాజు(జ్ఞానానందస్వామి) శ్రీశైలం అక్కమాంబ బిలతపఃస్సంపన్నులు





ఓం శ్రీసిద్ధి బుద్ధిసమేత మహాగణాధిపతయేనమః
ఓం శ్రీ గాయత్రీ సమేత విరాట్‌విశ్వకర్మపరబ్రహ్మణే నమః
ఓం శ్రీ గోవిందాంబ సమేత జగజ్యోతి పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః
ఓం శ్రీ అన్నపూర్ణా సమేత జగద్గురు సనారీ విశ్వనాథావధూత స్వామినే నమః
ఓం శ్రీ కంచి కామాక్షీ దేవి సమేత ఏకాంబరేశ్వర స్వామినేనమః

## ఈ గ్రంధము చదువ నారంభించినవారు

**విశ్వేశ్వర ఉవాచ**

**క॥ క్షీరాచలమున గౌరీ, వీరన్న ప్రసూతరత్న విజయ వివేకాకారంబు।**
**మోదమందుచు పారాయణ చేయుడంత పావనచరితం॥**

కావునా భక్తమహాశయులు ఏరూపాన్ని, ఏవరి చరిత్రను
నిత్యపారాయణం చేయాలో గ్రహించి ఆచరించుదురు గాక!

పూజా మందిరమున సనారీ వారి ఫోటో నుంచి చిత్తశుద్ధితో పూజగావించి గ్రంధమందలి ఒక్కొక్క అధ్యాయమును ఒక్కొక్కరోజు, చదివి, మహిమలు రెండురోజులలో చదివిన 7 రోజులలో గ్రంధమును పూర్తిగా చదువగలరు. తద్వారా సప్తాహం పూర్తిచేసినట్లవుతుంది ప్రతిరోజు ఆఖరున ధూప దీపనైవేద్యములతో నివేదన గావించిన సనారీ వారి కృపకు పాత్రులై ఆయురారోగ్య భోగభాగ్యములతో జీవించి అంత్యమున ఆ దేవ దేవుని యందు ఐక్యమగుదురు. అట్టి మహిమగల గ్రంధరాజమిది ఆస్తికులు దీన్ని సద్వినియోగ పరచుదురు గాక! (అట్లుగాకున్న మీకు వీలైనట్లైనా చదువవచ్చును.) భక్తియే ప్రదానము

## యిష్ట దేవతా ప్రార్ధనలు

**గణపతి ధ్యానం**

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

**విశ్వకర్మ ధ్యానం:**

ఓం విశ్వకర్మాదిశాంపతిస్సనః పశూన్‌పాతుసోఽస్మాన్‌పాతుతస్మై నమః
జ్యోతిర్మయాకృతి విశాలవివేకరూపా విజ్ఞాన సృష్టిమయకారణవిశ్వకర్మ
అనాదిమూర్తి పరదేవతపంచవక్త్రా పాలాంహ్యికాసృజనకర్తనమోనమస్తే॥

**వీరబ్రహ్మధ్యానం:**

శ్లో॥ వీరంవీరభయాదితత్వచరితం వీరాసనస్థంసదా।
వీరశ్రేష్ఠ మనుక్తవీరవినుతంవీరాధివీరంహరిమ్।
వీరేంద్రఘనవీరవీర శుభదం వీరాధిమార్తాదిశం।
వీరాచార్యమహంభజామిసతతం శ్రీ వీరనారాయణమ్॥

**కామాక్షీ ధ్యానం:**

శ్లో: కామాక్షీసకలదితిసుత। భీమాక్షీణప్రతాపభీరుకసుభక్త।
ప్రేమాక్షీప్తకటాక్షే। రామాక్షీ ముకుందసేవ్యరాజితరూపే॥

**సనారీ ధ్యానం:**

శ్లో: వామాంగేస్తం పరాశక్తిఃవాణీ లక్ష్మీద్విపార్శ్వయోః
వ్యోమాతపత్రదిక్పాలాః సామవేదాగమోవిదిః।
కామార్తిసంయమోద్యుక్తాగానధ్యానమనోహితః
యిమెంమండలమధ్యస్తంవిశ్వనాధాంభజామ్యహమ్ ॥

**గురుస్తుతి:**

శ్లో॥ గురుశూలీ, గురోచక్రి గురుధాత్రుబృహస్పతీ।
గురుశుక్రా, గురుత్వష్టాయిమేదేశికవర్ధకీ॥

| | | | |
|---|---|---|---|
| 1. క్షీరాచలప్రభాసితం | – | వీరాచార్యతనూభవం। | |
| అన్నపూర్ణేశ్వరీప్రియం | – | సనారీశంనమోస్తుతే॥ | 1 |
| 2. సింహాద్రిభవ్యగృహాఖ్యం | – | విశ్వనాధపవిత్రాఖ్యం। | |
| అవధూతమునీశ్వరం | – | సనారీశంనమోస్తుతే॥ | 2 |
| 3. దివ్యతపః ప్రభాసితం | – | శాపానుగ్రహవాగీశం। | |
| కాశీవిశ్వేశ్వరతేజం | – | సనారీశంనమోస్తుతే॥ | 3 |
| 4. అకాలమృత్యుహరణం | – | సర్వదారిద్ర్యహరణం। | |
| శోకభయార్తినివారణం | – | సనారీశంనమోస్తుతే॥ | 4 |
| 5. సర్వప్రపంచధారణం | – | నిత్యకళ్యాణపూరణం। | |
| జన్మసాఫల్యకారణం | – | సనారీశం నమోస్తుతే॥ | 5 |

**అన్నపూర్ణధ్యానం:**

తల్లీ నీ నాధుడు ఘన ముల్లోక వరుడు నీవు ముజ్జగములకున్।
తల్లివి తల్లుల తల్లివి, తల్లీ మాతలపు వినవె తగు నీస్తలమున్॥

**నాగురుపరంపర**

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తంయేనచరాచరం।
తత్పదం దర్శితంయేన తస్మై శ్రీ గురవేనమః॥

**అస్మదాచార్యపర్యంతాం వందేగురుపరంపరామ్**

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో విశ్వనాధేభ్యో - బ్రహ్మావిద్యోపాసన సంప్రదాయకర్తృభ్యో।
పంచానన వంశేభ్యోమహద్భ్యో నమోసద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ మనుసిద్ధాంతపీఠంతం - బ్రహ్మావిద్యాప్రభోధక।
శ్రీ విశ్వనాధందేవమ్ - సద్గురుస్వామినేనమః॥
క్షీరాద్రినివాసాయాం - విశ్వనాధంమద్గురుం।
సనారీవిశ్వనాధావధూత - జగద్గురుభ్యోనమోనమః॥



శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానము-మహిమలు

శ్లో॥ దేవదేవ మహాదేవి - జగన్మాతృస్వరూపిణీం।
విశ్వనాధవామాంకిని అన్నపూర్ణాంబా నమోస్తుతే॥

శ్లో॥ జగద్గురు విశ్వనాధసమారంభాంవీరాచార్య మధ్యమామ్।
సాంబశివఅస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్॥

శ్రీశ్రీశ్రీ సింహాద్రివిశ్వనాధావధూతస్వాములవారు బ్ర॥ చింతాడ వీరాచార్యులుగార్కి స్వయంగా "పరవిద్యాభక్షిణిని" ఉపదేశించారు వారు వారి కుమార్డు పార్వతీశాచార్యులు వారికి ఉపదేశించగా వారు వారి కుమార్డు సూర్యప్రకాశరావు (స్వప్రకాశా నందస్వామి) వారికి ఉపదేశించగా, వారు వారి బావమరిది బ్ర॥ తణుకు (సాంబశివానంద రాజయోగి) సాంబశివరావు గార్కి ఉపదేశించగా, వారి నుండి బ్ర॥ సుగంధం సాయిబాబాచార్య దంపతులమగు మాకు సంక్రమించినది.

(శ్రీవిమలాదేవి సమేత సాయిబాబాచార్య).

బోధగురు : కీ॥శే॥ బ్రహ్మశ్రీ తణుకు సాంబశివానందరాజయోగినేనమః
కర్మయోగి : కీ॥శే॥ బ్రహ్మశ్రీ సుగంధం వేంకటేశ్వర పితాయైనమః
మహాసుగుణఖని : సుమంగళి సుగంధం పాపాయమ్మమాతాయైనమః

**సర్వేభ్యో మహాజనేభ్యోనమః**

**గ్రంధముద్రణకర్త :**

## శ్రీశ్రీశ్రీ సనారీవారి సుప్రభాతమ్:-

శ్లో॥ శ్రీ సంభావితభక్తవత్సలమహాసిద్ధాంతవిశ్వేశ్వరా
నీసమ్మేళనగల్గుసంయమవరుల్నీవైతి వెల్లప్పుడున్
దోసంబించుకవారియందు గలుగన్దోపింప ఓ దేవా, నీ
వీసంబైనను చేటునొందవుగదా విశ్వేశమాం పాహిమామ్॥

1. నమస్తే।నమస్తే। విశ్వనాథావధూత। నమస్తే నమస్తే దయాపూర్ణసింధో।
నమస్తే।నమస్తే।విశ్వకర్మకులోద్ధారకా।నమస్తే।నమస్తే।నమస్తేజగద్గురుదేవా॥

2. మాతాన్నపూర్ణ।సదయాభవభవ్యశీలే। నిత్యాన్నదాత।నిత్యశోభిత,నిరుపమానే।
క్షీరాద్రిమఠనిలయే। శృతిపాత్రజననీ। క్షీరాచలదయతేతవసుప్రభాతమ్॥

3. విశ్వనాథ। విశ్వజనపాలిత। విరాడ్రూపే। విశ్వంభర।విశ్వరక్షక।వీరాచార్యసుతా।
ఫాలాక్ష దుష్ట శిక్షక। శిష్టరక్షక। దురితాపహార।క్షీరాచలదయతే తవసుప్రభాతమ్॥

4. యోగేంద్రా యోగరాజా రాజయోగి।సింహాద్రి వంశపావనా బ్రహ్మజ్ఞానప్రధాతా
కరుణాసాగర। కఠారిధారి। హనుమధ్వజాప్త।క్షీరాచలదయతే తవసుప్రభాతమ్॥

5. కల్యాణ రూపా కామితప్రధాత।కైవల్యమూర్తే।ఆశ్రితభక్తరక్షక।ఆనందరూపా।
అభయప్రధాత।దుర్భిక్షదూర దుర్భ్రమ నివార।క్షీరాచలదయతే తవ సుప్రభాతమ్॥

6. అన్నపూర్ణహృదయేశ్వర। ఆరోగ్యప్రధాత।అష్టాదివర్ణసంసేవిత।ఆత్మబంధూ।
ఆనందయోగమనుపమ।శ్రీకరాత్మా।క్షీరాచలదయతేతవ సుప్రభాతమ్॥

7. శ్రీ గంధకుంకుమధారా। నిరీహిత। నిర్వికార।నిర్మాయ।నిశ్చల।నిరర్గణ।దోషభేదిన్।
అష్టాంగయోగప్రసిద్ధా।అచలతత్వబోధా।క్షీరాచలదయతే తవ సుప్రభాతమ్॥

8. నాగావళీనదీజలమజ్జననిర్మలాంగాః।నిత్యసుజనబోధిత।వేదాంతవేద్యాః।
భస్మత్రిపుండ్రసమలంకృతఫాలభాగాః।క్షీరాచలదయతే। తవ సుప్రభాతమ్॥

9. వేదప్రమాణాకృత వేదాంతవిద్యాప్రచారా।కామాదిషడ్వర్గపరిత్యజిష్టో।
బ్రహ్మోపదేశగురుశేఖరజగద్గురో।క్షీరాచలదయతే। తవ సుప్రభాతమ్॥

10. ఏకస్తమేవబహుధాభవభాసిలోకే।దేశసంచారీ।యోగప్రచారసిద్ధమూర్తి
అనాధనాథ।భక్తాశ్రయ।భవ్యతేజా।క్షీరాచలదయతే తవ సుప్రభాతమ్॥

11. సింహాద్రివిశ్వనాథావధూతసుప్రభాతమ్స్తోత్రంపఠన్తిభువియేమనుజాఃప్రభాతే
భుక్తిముక్తియుకామార్థంబులుస్తిరసిద్ధియో।శీఘ్రంశ్రీసనారీ పదమవాప్యముదంలభంతే॥

ఎ. శ్రీవిశ్వనాథఅవధూత ప్రసన్నమూర్తీ। సింహాద్రివంశప్రభవాశ్రితకల్పభూజా।
ఆచార్యనామశృుతిశాస్త్రపురాణవేత్తా। శ్రీమత్సనారిగురుశేఖరసుప్రభాతమ్॥

బి. విశ్వజ్ఞసత్కులసుశోభితతాపసేంద్రా।గౌర్యాంబగర్భశుభమౌక్తికభవ్యతేజా।
సంవాదగ్రంధకవితల్లజవేదవేద్యా। ధీమాన్సనారిపరమేశ్వర సుప్రభాతమ్॥

సి. దివ్యప్రభావ మహితోజ్వలవాక్పటుత్వా।గార్హస్థ్యధర్మపరిపాలితబ్రహ్మయోగీ।
సౌవర్ణయోగపరిపూర్ణసుధాస్వభావో।విశ్వేశ్వరప్రముఖతాపససుప్రభాతమ్॥

డి. విశ్వేశ్వరాఖ్యగురురాయకవిర్మనీషీ।శ్రీమత్సనారీపరమేశ్వర తత్వమూర్తి।
సాధ్వీఅన్నపూర్ణేశ్వరపూతయోగీ।రమ్యప్రభావమహిమాకరసుప్రభాతమ్॥

ఇ. శ్రీవీరయోగికులపావనధన్యభావా।మత్రార్థసారవిశదీకృతపండితార్యా।
సింహాద్రిమౌనిపరమేశ్వరపురాణపురుషా।శ్రీశైలవ్యాఘ్రబిలవాశిత సుప్రభాతమ్॥





## శ్రీశ్రీశ్రీ సనారీవారిదండకం:-

శ్రీమన్ మహాదేవ। దేవాదిదేవా।దివ్యతపఃప్రభావా।క్షీరాద్రివాసా। విశ్వనాథావధూత। భక్తమందార।దుర్వార।దుర్ధోష। దుర్భిక్షదూరా ।మహావీరా।మహానుభావా।మీశక్తి, మీయుక్తి, మీరక్తి, మీముక్తి, మీమహిమ లెన్నంగనేనెంతవాడన్। దయాసాగరా।రసవాదసిద్ధుండవై। స్వర్ణశిల్పాగ్రగణ్యుండవై। అష్టాంగయోగప్రసిద్ధుండవై। అష్టసిద్ధులన్బొంది। అజ్ఞానాంధ కారములన్ బాపి। సుజ్ఞాన జ్యోతుల్ వెల్గింతువీవే। శాపానుగ్రహ సమర్థుండవై మృతులన్ సజీవులం జేసి। కురూపికన్యన్ సౌందర్యరాశిన్ గావించి ।ఘనాపాఠీలగర్వంబు భంగంబు గావించి। వ్యక్తిభేధంబులన్। వర్ణభేదంబులున్। జాతిభేదంబులున్। మతభేదంబులన్। ఫంక్తిభేదంబులన్మాన్పి। లోకంబునందెన్ననాదర్శతత్వ ప్రధానంబు గావించి। ముజ్జగంబులన్ మేటివై। నిటాలాక్ష పద్మాక్ష భేదంబులేదంచుభాషించి। ద్వైతంబున ద్వైతవిశిష్టాద్వైత సిద్ధాంత తత్వంబులెంతేని సమర్థించి ।రాజయోగివై। శక్తిన్స్వాధీనంబు గావించి। శరీరార్ధ భాగంబునందుంచి। సనారీవై ।శ్రీభూతిరుద్రాక్షలన్ దాల్చి। కాపీనధారివై। దండక మండలంబుల్। కఠారిన్చేబూని। బ్రహ్మతేజస్సునన్।శీతోష్ణభేదంబులున్లేక। లోకసంచారివై। బ్రహ్మజ్ఞానం బెరింగించుచున్। యోగ సాధనాపద్ధతుల్ తెల్పుచున్। దుష్టులన్శిక్షించి। శిష్టులన్రక్షించి।ధర్మసంస్థాపనగావించి గ్రామదేవతన్శాసించి, ప్రాణులన్గాచి। భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షసాది। శాకినీ। ఢాకినీ। మోహినీ। యక్షిణీ।దుష్టగ్రహపిశాచాది। బాధల్ తొలంగించి। నీతనువున్ పరశువేదిన్ జూపి। భూనాధులన్మెప్పించి। శిష్యులన్గావించి। లోకమాన్యుండవై। నీదివ్యవాక్కున్। మొదలియార్ మహావ్యాధిన్ బోగొట్టి। దాక్షాయిన్వడిన్ జూపి।శృంగేరీ పీఠాధ్యక్షులన్। యోగవాదంబునందోడింప జగదీశ్వరుండంచు జేజేలుపల్కంగ। సనారీ సాక్షాత్కారంబు గావించి। త్రినేత్రంబుతో గడ్డిమేటల్భస్మంబు గావించి। ముక్కంటివై। పంచవేదంబులన్దిట్టవై। షట్శాస్త్రసారమున్గ్రహించి, ఉపనిషత్తుల భావంబుతెలిసి ।పురాణంబుల మర్మంబులెరింగి। "సహస్రశీర్షుండవై" కాయంబున్ స్థిరంబు గావించి। లోకకల్యాణ సంధాతవై నేడుశ్రీశైలగుహాంతరంబున్। మహాతపోనిష్ఠ యందుండి। నీదు భక్తులన్ గాచుచున్నట్టి అన్నపూర్ణా మనోనాయకా "లోకసుశ్లోక" నిరతమీపాదపద్మనీ రాజసంసేవనాదీక్షన్ ప్రసాదించుమా। మమున్కరుణ పాలింపుమా। మాకు సత్యధర్మార్థ। కామాది, మోక్షంబులన్గూర్చుమా। వడిన్ముక్తి నీయుమా" శ్రీవిరాట్ విశ్వకర్మముఖోద్భవా "పంచాననకుల ప్రసూతా" విశ్వకర్మ కులాగ్రగణ్యా। సింహాద్రివంశ పావనా "విశ్వబ్రాహ్మణకు లోద్ధారకా" అస్మదానంద సిద్ధిప్రధాతా। సాయిబాబాచార్యనగు మాపూర్వపుణ్యంబునన్ నీపూజలున్జేసి। నీనామంబులన్బాడి। నీదివ్య మహిమలన్ కీర్తించి। మీసుందరాకారమున్ కన్నారగాంచు, మాజన్మలన్సార్ధక్యంబుజేయవే। దయంజూపిమాపాలిభాగ్యంబు వైరక్షించి కాపాడుమా। ఆర్తత్రాణపరాయణా। ఆదిమధ్యాంత రహితా। మంగళాకారా ।కైలాసవాసా। శ్రీశైలమల్లేశ। కాశీపురాధీశ బ్రహ్మవిష్ణు। యింద్ర సూర్యతేజంబులున్ నీవే। శక్తియున్నీవే।సృష్టికర్తయున్ నీవే। మహేశాపాపవినాశా ।పాహిపాహి।పరమేశా। అన్నపూర్ణాసమేత విశ్వనాథానమస్తే। నమస్తే ।నమస్తే। జగద్గురు దేవా నమోనమః

## సనారీదీక్షకు ముందుమాట (యిది మాలాధారణ పుస్తకములోనిది)

సృష్టి స్థితిలయ కారకుడు ఆదిదేవుడగు పరమేశ్వరుడు. సర్వం శివమయం, సర్వం శివలయం, అర్ధనారీశ్వరతత్వమే ఈ విశ్వం. సర్వ సర్వం సహాప్రపంచ సృష్టికి మూలకారణం, త్రికరణశుద్ధిగా శరణన్న వారికి క్షణంలో ప్రత్యక్షమై కోరిన కోర్కెలు తీర్చువాడు, బోళాశంకరుడు భక్తసులభుడు కైలాసనాథుడు, ఆ విషయాన్ని ఋజువు పరచిన మహాభక్తుడు రావణబ్రహ్మ. పరమేశ్వరుని ఆత్మలింగమునకై అకుంఠితదీక్షతో తపస్సుచేయగా, పరమేష్టి ప్రత్యక్ష్యమై వరమడుగమనగా , **మహావిష్ణువు మహామాయని రావణునిలో ప్రవేశింపజేయగా, పరమేశ్వరుని ఆత్మలింగానికి మారుగా, పార్వతీదేవిని కోరగా, తన అర్ధాంగినిసైతము భక్తుని కొసంగినాడు.** "పరమేష్టి" అట్టి భక్తప్రియుడు భక్తులకోర్కెలు తీర్చుటకు పరమపవిత్రమగు కాశీక్షేత్రమున విశ్వనాథునిగా, శ్రీశైలమున మల్లిఖార్జుననిగా వెలసిన దేవాదిదేవుడు పరమేశ్వరుడు.

**వశిష్టోవాచ :** పంచాక్షరీ సమమంత్రం : పంచానన సమంకులం, పంచానన సమందైవం,నభూతోనభవిష్యతి॥, అన్నట్లుగా పంచాక్షరీ మహామంత్రం పరమ పవిత్రమైనది. ఆసర్వేశ్వరుని సామ్రాజ్యమునకు చేర్చునది, శివసాయుజ్యం పొందుటకు ఎన్నోమార్గాలు అన్నిటిలో అతిసులభమైనది, ప్రస్తుతకాలమాన పరిస్థితులలో ఆచరణకు వీలైనది, మాలాదీక్షా విధానమే, ఈ శివదీక్షను నిర్మలమనస్సుతో ఆచరిస్తే శివానుగ్రహం సులభంగా పొందగలరని, పురాణాలు చెబుతున్నాయి. ఈ మార్గంలో జగజ్జనని పార్వతిదేవి, శివుని అర్ధశరీరాన్ని పొందినది. పాండవ మధ్యముడు పాశుపతాస్త్రం పొందినాడు. ఈ కలియుగంలో ఎందరో భక్తులు, శివదీక్షచే తరించినట్లు పురాణాలుగాథలు చెబుతున్నాయి. అట్టి పరమేశ్వరుని అంశతో, పాలకొండలో సింహాద్రి వారియింట విశ్వనాథాచారిగా, జన్మించిన **"సనారీ"** వారి దీక్షను స్వీకరించి, కలిబాధలనుండి రక్షించబడి, వారికి గల సకలకోర్కెలు తీర్చుకుని అంత్యమున శివసాయుజ్యం పొందగలరు.

**ఎట్లనిన :** నేనే విశ్వబ్రహ్మము ఆననమునమున్న బుట్టినామయవంశంబేనని।
తలపుడి దయపంచానన కులముద్ధరింపజననం బైతిన్ ॥

అంటూ తన మానవ జన్మకారణాన్ని తెలిపి "సనారీ సంవాదమందు" వారి పూజావిధానములను, ఫలితములను గురించివివరంగా తెలిపిరి. అందలి ముఖ్య శ్లోకములతో సులువుగా, అందరూ ఆచరించునట్లుగా రచియించిన "శ్రీశ్రీశ్రీ సనారీ దీక్షావిధానము మహా శివరాత్రి నాటికి 41 రోజులగునట్లుగా దీక్ష" గైకొని మాలాధారణతో, మీ మీ కోర్కెలు తీర్చుకొని పూర్వకర్మల నుండి విముక్తికాగలరని ఆశిస్తూ, ఈ దీక్షావిధానము భక్తకోటికందించు మహాద్భాగ్యము నాకు కల్గినందులకు నా జన్మ ధన్యమైనదిగా భావిస్తూ , మీరునూ 11మార్లు దీక్షను పూర్తిచేసి మీ జన్మలు ధన్యత గావించుకొందురు గాక. "ఈ దీక్షావిధానము" పుస్తకం భక్తకోటికందించుటకు ఆర్థిక సహాయమందించిన చిరంజీవులు 1.కొండూరు కమాలాప్రసాద్‌చారి దంపతులు 2. కంటేశివకుమార్, దంపతులు 3.పాలతీర్థపు శ్రీనివాసాచారి దంపతులు, వీరిని జగద్గురువు, సద్గురువు, మద్ గురుదేవులగు సనారీ విశ్వనాథుడు ఆయురారోగ్యభోగభాగ్యములనిచ్చి సదా రక్షించి కాపాడుగాక।
శ్రీశ్రీశ్రీసనారీపీఠాధిపతి. సెల్ : 90322 53205, 9290582110, 89553827385

**పుస్తకములు దొరుకు చోటు: కె. ప్రసాదాచారి సంతోష్ నగర్, హైదరాబాద్, సెల్: 9032307467**

**ఇట్లు బ్ర॥ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ**





## ...నారీ మూలమంత్ర బీజఫలితము

...ూలమంత్రం : ఓం హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః, సౌః, క్లీం, ఐం, శ్రీం, హ్రీం, ఓం

**...ం కారం - పంచభూతాత్మకం, పరబ్రహ్మ స్వరూపం ప్రణవబీజం**

...మోక్షప్రదంచసర్వేషాం - ఓంకారాయనమోనమః

...ాం, కారం సర్వశక్త్యాత్మకం - సర్వాభీష్టప్రధాయకం
...చ్ఛాజ్ఞాన క్రియారూపం - హ్రీంకారాయనమోనమః

...ం, కారం- శివసారూప్యం - శివప్రత్యక్షకారకం
...వసాయుధ్యం తస్మాత్ - శ్రీంకారాయనమోనమః

...ం, కారం- వశ్యబీజకం - సర్వజనవశకరం
...ోగసిద్ధి ప్రధాయకం-ఐం కారాయనమోనమః

...ం, కారం-కామబీజకం- సర్వశక్తిసమన్వితం
...మితఫలదాయకం - క్లీంకారాయ నమోనమః

...ః, తమోబీజం తపఃసిద్ధి ప్రధాయకం-యక్షబీజం
...ర్వకల్యాణదాయకమ్ -సౌః కారాయ నమోనమః

...యిది ఆరోహణ- అవరోహణ క్రమంలో యిదే భావన.(సౌః క్లీం, ఐం, శ్రీం, హ్రీం, ఓం)

### శ్రీ సనారీ విశ్వనాథాయనమః ద్వాదశాక్షరీ బీజఫలితము

...ం. శ్రీసనారీ విశ్వనాథాయనమః - ద్వాదశాక్షరీ మంత్రము
...ం, అకార,ఉకార,మకారనాదసంయుక్తం ప్రణవనాదం విశ్వకర్మరూపం

...ర్వసృష్టికారకాయం ఓంకారాయనమోనమః

...్రీ, మహాబీజం సర్వశక్తి సమన్వితం లక్ష్మీబీజం
...అష్టైశ్వర్య ప్రధాయకం - శ్రీకారాయనమోనమః

..., తమోబీజం తమోగుణ ప్రధానమౌయక్షబీజం
...ర్వసిద్ధిప్రధాయకం సకారాయ నమోనమః

...ా, వారుణీబీజం సర్వ దేవనమస్కృతంధూమబీజం
...మోక్షప్రధాయకం - నకారాయనమోనమః

..., వహ్నిబీజం తేజోరాశిం- శివాత్మకంరుద్రబీజం
...రక్షితాధ్వరభాగంచ - రకారాయ నమోనమః

..., వారుణీబీజం విశ్వకారణం వీర భద్రేశం
...అపమృత్యునివారకమ్ - వకారాయనమోనమః

**శ్వ,** లక్ష్మీబీజం సర్వాభీష్ట సిద్ధికరం మహాబీజం
శివప్రత్యక్షకారకం - శకారాయనమోనమః

**నా,** ధూమబీజం - సర్వదేవసాక్షాత్కారమ్ విశ్వాత్మకం
పునరావృత్తినాశకం - నకారాయ నమోనమః

**ధా,** నైరుతిబీజం సర్వశత్రుసంహారకమ్ శక్తివంతం
సకల శుభప్రదాయకమ్- ధకారాయ నమోనమః

**య,** వాయుబీజం పరమేశ్వరసంస్థితం వాయుతత్వం
సర్వక్రత్వాత్మ కారకం యకారాయ నమోనమః

**న,** ధూమబీజం సచ్చిదానంద స్వరూపం వారుణీబీజం
సర్వసంకటహరణం- నకారాయనమోనమః

**మః** మంగళబీజం నాదబిందు కళాతీతం పార్వతీబీజం
చాతుర్మాస్యాత్మకపరం సిద్ధికరం మకారాయ నమోనమః

**ఫలశృతి:**

శ్లో॥ శ్రీ సనారీ ద్వాదశాక్షరి -యః పఠేత్సర్వదా।
భక్త్యాసద్గురు కృపయా - పునర్జన్మనవిద్యతే॥

శ్లో॥ సుగంధం వంశజాతేన - సాయిబాబాచార్య స్వామీజీ
ప్రణీత సనారీ స్తోత్రం - అణిమాద్యష్ట సిద్ధికరం భవేత్







## శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్ర ధ్యానం

శ్లో॥ శ్రీకరం పరమాత్మన మవాఙ్మానసగోచరమ్ - వేదవేద్యం మహంవందే విశ్వకర్మాణమవ్యయమ్
శ్రీమత్ ప్రణవరూపాయ భక్తహృత్పద్మవాసినే - లోకాలోకైక గురవే వీరాచార్యాయతే నమః
బాహ్యాంతర్వ్యా సినంపూర్ణ నివారణముత్తమం రాజయోగైక సంసిద్ధందేశికేంద్ర మహంభజే॥
ఓం, హ్రీం, క్లీం, శ్రీం, శివాయ బ్రహ్మణేనమః

ఈద్వాదశాక్షరీ మహామంత్రాన్ని నిత్యము 108 సార్లు పఠించు వారిని జగజ్యోతి జగద్గురు శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి ఆయురారోగ్య భోగభాగ్యములనిచ్చి సదా రక్షించి కాపాడును

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్ర చూర్ణిక

శ్రీమద్రాజాధిరాజ, రాజపరమేశ్వర, రాజచూడామణి, పంచరాజ, బహురాజ, పరమరాజ, రాజోత్తమ, చరాచరజగత్ సంతాన సముచ్చారణ, సంకల్ప, నిర్గుణ, నిర్వికల్ప, బహుగుణ ప్రకల్పిత, ప్రకృతిరూప, సహస్రరూప, సర్వరూప, సదానంద, స్వరూపులైన, అంతర్యోగ, బహిర్యోగ, ప్రకృతియోగ, పరమయోగ, భావయోగ, భక్తియోగ, ప్రకటయోగ, పాలనయోగ, ప్రపంచకయోగ, వియోగులైన, విధ్యాత్మ, వేదాత్మ వివిధాత్మ, విచిత్రాత్మ, జీవాత్మ, నిర్జీవాత్మ, పూర్ణాత్మ, శతాత్మ, అనంతాది సర్వాత్మనాయకులైన కుటిలసాగర, గుణసాగర, అగ్నిసాగర, సోమసాగర, సూర్యసాగర, సర్వసాగర, మహాసాగర, అర్థవంతులైన, ప్రణవాక్షర, పాలన, శీల, విశాలగోత్రమిత్ర, అమిత్ర, చిత్రవిచిత్ర, వీరపురుషాధిఖ్యాత, నానానామకులైన, త్రేతాండయోగ, అజాండయోగ, సర్వాండయోగ, వీరశక్తుండ, అవియోగపురుష, కుపురుష, సత్పురుష, నిరుపమ, పరమపురుష, నిర్వికార, నిరంజన, నిగమవేద్య, నిఖిలాంతర్వ్యాస, నిష్కళంక, నిర్వాణ, నిర్వికల్ప, వికల్ప, వినోద, నాదమోదితులైన , మహితహర, దురితవార, తామసహర, దైత్యహర, గుణహర, అజహర, అండజహర, హరణమేకో నారాయణనామక, సోమవంశోత్తమ తేజ, వీరభోజరాజ, మహారాజ, రాజ ముఖాంతరాధి, దశావతారవిహార, ప్రకాశ, అనంతావతార ప్రకాశ, అత్యంత విహార, వీరనారసింహ, నామఖండాగ్రేశ్వర, భీమప్రతాప, అఖండ నాయకులైన, దివ్యగణ, దేవగణ , మునిగణ, శక్తిగణ,సౌమ్యగణ, అవతారగణ, అఖిలగణ, అఖిలశక్తిగణ, పరమగణ, సుగుణగణ, సంపన్నులైన, అనంతవేద రహస్యజ్ఞాత, విఖ్యాతచరిత్ర, పవిత్రాంగ సత్యస్వరూపులైన నిత్యానంద, కృత్రిమావతార, విహార, అత్యంతగోప్యగూఢ జన్మప్రకాశ, కారణజన్మ కార్యాంగధార, ఆర్యసేవాధురీణులైన, అంతరంగ, ఆత్మసంగ, బహిఃప్రకాశ, ప్రపంచకసంగ, నిస్సంగ, సంగమధ్వంసక, హంసావతార, వీరపురుష,సేవాతరంగ. శ్రీ గురవేనమః

**వీరాచార్యమహంభజామి సతతం శ్రీ వీరనారాయణమ్॥**

**శ్రీవీరభద్రఖడ్గము**

ఓం నమోభగవతే, అధర్వణ మహాశాస్త్ర మంత్రాధికారిణే శ్రీం, హ్రీం, క్లీం కాత్యాయనీ కుమార, క్లీం, క్లీం, శరభావతార హ్రాం,హ్రాం, ఆదిమశూరఝుమ్ కార, ప్రణయరుద్రాకారా, క్షం క్షాం, సప్తకోటి, మహామంత్రాధికార, ఓం నమోవీరాయ నీ భూతికేలంబునినొసటం ధరింప।భుక్తిముక్తిప్రదంబులౌకామిని, మోహినీ, శాకినీ, ఢాకినీ, భూతప్రేత, పిశాచ బ్రహ్మరాక్షసగణ, మారీగణ, యక్షిణీగ్రహంబులున్, మొదలగుశల్యతంతు,శరతంతు, శాపరతంతు, జంబూకతంతు, రోమతంతు, సర్పతంతు, సర్వవ్యాఘ్రభల్లూకాది మంత్ర, యంత్ర, తంత్రజ్ఞులకున్ నోళ్ళాడక, కాళ్ళాడక, ఊరకంజూతురు। బాలగ్రహ, నేలగ్రహ దివసగ్రహ, వారగ్రహ,పక్షగ్రహ, మాసగ్రహ, ఋతుగ్రహ, అయనగ్రహ, అబ్ధగ్రహ, క్రూరగ్రహ, కృకురగ్రహ, చండీగ్రహ, ముండీగ్రహ, యక్షిణీగ్రహాదుల్. నిలువంజాలకనీకు మ్రొక్కులిడి వటద్వీపంబుకున్‌జను, శంభుని వరపుత్ర, అతిపరాక్రవిక్రమ, సర్వదేవాతాగర్వభంజన, పాహిమాం, పాహిమాం, శ్రీపోతులూరి పురనివాస, భూతిభాస, భూతనాశ, రిపుగణదొర్భలధ్వంస, శ్రీమహోద్ధండ వీరభద్రా నమస్తే , నమస్తే నమః

(ఈ మంత్రాన్ని నిత్యానుష్టానము చేయుచూ ఎవరికైనా, గాలి, ధూళీ, త్రొక్కిడిదోషాలు తగిలి, జ్వరబాధలుగానీ, యితరమైన బాధలుపడుచున్న వారికి, ఈ మంత్రాన్ని పఠించి విభూతి ముఖానికిపెట్టి, నీటిలోవేసి త్రాగించిన అన్నిబాధలుతొలగి ఆరోగ్యవంతులగుదురు. **మడిమైలు పాటించాలి.)**







**విశ్వకర్మ ధ్యానం :**

పంచవక్త్రం, జటాధరం, పంచదశవిలోచనం, సద్యోజాతాననం, శ్వేతం। వామదేవంతు, కృష్ణకం। అఘోరం, రక్తవర్ణంచ । తత్పురుషం,పీతవర్ణకం । ఈశ్యానం, శ్యామవర్ణంచ । శరీరం హేమవర్ణకం ।దశబాహు, మహాకాయం, కర్ణ కుండలశోభితం, పీతాంబరధరం దేవం నాగయజ్ఞోపవీతనం। రుద్రాక్షహార సంయుక్తం। వ్యాఘ్రచర్మోత్తరీయకం, అక్షమాలాబ్జ, నాగేంద్ర, శూలాయుధ, పినాకినం, వీణాం, ఢమరుకం, బాణం, శంఖ, చక్రకరాన్వితం ।- దేవదేవం మహాదేవం, విశ్వకర్మాణ మవ్యయం, ప్రాగ్ధక్షిణ, ప్రతిచ్యోదీచోఽర్ధ్వవక్త్రం జగద్గురుం నమస్కరోమ్యహం, భక్త్యా, భుక్తి, ముక్తి ప్రధాయకం॥

**విశ్వకర్మాష్టకమ్:**

విశ్వకర్మ పరబ్రహ్మ  
విశ్వకర్మా చవసవో  
విశ్వకర్మా సృష్టికారో  
విశ్వకర్మా జగన్మాతా  
విశ్వకర్మా సురజ్యేష్ఠో  
విశ్వకర్మా తథాచార్యో  
విశ్వకర్మా జగన్నేతా

విశ్వకర్మామునీశ్వరః  
విశ్వకర్మా మునుశ్శివః  
విశ్వకర్మా దేశికః  
విశ్వకర్మా చకశ్యపః  
విశ్వకర్మా జగద్గురుః  
విశ్వకర్మైవ శిల్పినామ్  
విశ్వజ్ఞోవిశ్వకారణమ్

ఏకద్విసప్తనామానియః పఠేచ్ఛృణు యాత్ క్రమాత్ విధ్యారంభే।  
వివాహేచ ప్రారంభే నిర్గమేతథా సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్యనజాయతే॥

**గాయత్రీ ధ్యానం**

ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః ।  
యుక్తామిందునిబద్ధరత్న మకుటాం తత్వార్థవర్ణాత్మికామ్  
గాయత్రీం వరధాభయాంకుశకశాః శుభ్రం కపాలంగదాం  
శంఖచక్రమదార విందయుగళం హస్తైర్వహంతింభజే ॥

**గాయత్రీమంత్రం :**

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ।  
ధీమహీ ధియోయోనః ప్రచోదయాత్ ॥

**చతుర్ధశభువనములను, 84 లక్షల జీవరాశులను, అనేక కోటిబ్రహ్మాండములు సృష్టించి, పోషించి,లయమెనర్చునట్టి ఆదిదైవములను త్రికాలములందునూ తలంచుతూ ధ్యానించుతూ తరింతురు గాక!**

**శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాధాలయమ్**  
**సెల్ : 9290582110**

## పంచాననులకు కామాక్షీ దేవీ అభయము




కైలాసమున ఒకనాడు ఆదిదంపతులగు పార్వతీపరమేశ్వరులు ఏకాంతసమయంలో ఎవరు అందంగా ఉన్నామనే సమస్య వారికి వచ్చింది. ఈ విషయం, కైలాసములోను, వైకుంఠములోను, బ్రహ్మలోకములోను, సురాసురబృందములలోనూ తేలలేదు. ఆఖరికి బృహస్పతి సోదరి యోగసిద్ధిప్రభకు. అష్టవసువులలో చివరివాడగు, ప్రభావసునకు పుట్టిన శిల్పిప్రజాపతి విశ్వకర్మను పిలిచి, ఆదిదంపతులుమాలోఎవరు అందంగావున్నామో చెప్పుమన్నారు. నీవు అనంతశిల్పములు, దేవతానగరములు గృహములు నిర్మించి దేవతాచార్యుడవైతివిగదా నీవే ఈసమస్య పరిష్కరించదగినవాడవనిరి, ఈ విశ్వకర్మ ఆలోచిస్తూ ఈ విషయం ముల్లోకములలోను. దేవాసురబృందములలోను తేలలేదు. అమ్మవారు బాగున్నారంటే అయ్యవారితో ఏంవస్తుందో పోనీ అయ్యవారే బాగున్నారంటే అమ్మవారితో ఏంవస్తుందో. యిద్దరూ త్రినేత్రధారులే మనకెందుకొచ్చిన గొడవని ఎవరిమటుకువారు గప్‌చిప్‌గా ఉండిపోయారు. ఆసందేహమే శిల్పప్రజాపతి విశ్వకర్మకూ వచ్చింది, ఏదో ఒక పరిష్కారం చేయాలని నిశ్చయించుకొని "ఆదిదంపతులారా" నేను ఈ విషయం చెప్పలేనుకానీ ఒక కాంస్యదర్పణం చేసియిస్తాను. అందులో మీ ప్రతిబింబాలు చూచుకొని మీరే నిర్ణయించు





కొండని, ఒక కంచుఅద్దాన్ని తయారుచేసి యిచ్చారు విశ్వకర్మ. ఆదిదంపతులు ఏకాంతస్థలంలో నఖశిఖ పర్యంతమూ చూచుకొని. అమ్మవారు, అయ్యవారే బాగున్నారని అంగీకరించింది. దానితో బోళాశంకరునికి మహానందంకలిగి శిల్పి ప్రజాపతిని పిలిపించి, సృష్టిలో ఎవరూ తేల్చలేని సమస్య నీవలన పరిష్కారమయింది. మీ శిల్పిజాతి చిత్ర విచిత్ర శిల్పరచనా సృష్టికర్తలు. మీకేదేని వరమొసంగినగాని నాకు తృప్తిలేదు. మీకేమి కావలయునో కోరుకొనుము. అది ఎట్టిదైననూ సంతోషముగా యిస్తానన్నాడు పరమశివుడు. అపుడీ విశ్వకర్మమాకు లేనిదేముందని యిస్తావులే అన్నాడు. వెంటనే శంకరుడు అలాఅంటే ఎలా మీకు లేనిదే యిస్తున్నానన్నారు. విశ్వకర్మ మాకు లేనిదేమిటి? ఆయన యిచ్చిందేమిటని మనోదృష్టితో చూచుసరికి వీరికి లేని దరిద్ర దేవతయగు "అలక్ష్మిని" అప్పగించారు. ముక్కంటి, దానికి కోపించిన విశ్వకర్మ "ఔరా" సంపదైశ్వర్య సుఖశాంతులు, కీర్తి ప్రతిష్టలతో అగ్రజాతిగా జీవించు మా జాతికి దరిద్ర దేవత నప్పగించి అతఃపాతాళానికి అణగద్రోక్కుతావా। నీ కసలురూపంపోయి లింగరూపుడవౌదువు గాకయని శపించగా పరిమేష్టి పాషాణ లింగమైనాడు. ప్రక్కన గల పార్వతీదేవి నిశ్చేష్టురాలై ఆవేదనతో యిదేమిటి తండ్రీ నా సౌభాగ్యానికే ముప్పు తెచ్చావేమిటని ప్రాధేయపడింది. దానితో విశ్వకర్మ మా జాతినే పాతాళానికి అణగద్రొక్కాడు నీపతి అన్నాడు. "చిరాకుగా" అలాకాదు తండ్రీ నేను కంచికామాక్షినై వెలసి మీ జాతివారు విశ్వకర్మీయులు నన్ను తలచినంతనే వెన్నంటి సకల కోర్కెలు తీర్చి రక్షించి కాపాడుదునని అభయమిచ్చింది. దానితో శాంతించిన విశ్వకర్మ అలాగయితే నీపతి నీకు దేహదారి, లోకులకు లింగధారి యని శాపాన్ని ఉపసంహరించాడు. ఆకారణంగా కంచి కామాక్షీమాత విశ్వకర్మ సంతతికి యిలవేల్పయి తన్ను తలచినవార్ని సదారక్షించికాపాడుచున్నది.

**అట్టి శక్తి స్వరూపిణిని విశ్వకర్మ కులజులు నిత్యం ధ్యానిస్తూ**
**సకల భోగభాగ్యములతో సదా వర్ధిల్లుదురుగాక.**

ఈ శక్తి ఆరాధనయే "సనారీ విశ్వేశ్వర సంవాదమందు " జగద్గురువులు సనారీ విశ్వనాధులు శక్తినెట్లు ఆరాధించవలయునో ఏఏ పదములతో పూజించి జగన్మాత కరుణను పొందగలరో రచియించి జాతికి ప్రసాదించిరి. అట్టి మహనీయుని నిత్యం తలుస్తూ ఆ పూజా విధానములనుసరించి మీ (మా)జన్మలను ధన్యము చేసుకుందుముగాక!

**కం॥ శ్రీ మహిత ఆర్తరక్షణ – కామిత మందారభక్తకల్పద్రుమ, సు**
**త్రామార్చితపదయుగశ్రీ – కామాక్షీ శరణు,శరణు, కారుణ్యనిధీ॥**

**కం॥ ఆశ్రితజనరక్షాదక్షులు – పతిదేవుడు నీవు, తల్లీ మీ పదముల బడితిమి**
**వెతలంబాపుడు, మీరే – గతియిక మాకు కామాక్షీ లోకకళ్యాణ మతీ॥**

శ్రీశ్రీశ్రీ దత్తాత్రేయ ఉగ్రప్రళయ, వీరనారసింహావతార అనంత కోటి సూర్యప్రకాశ, పాతాళగంగ జటాజూటధారులు, శ్రీ శైలవాసులు, మానససరోవరులు, హిమగిరివాసులు అగు **సనారీ విశ్వేశ్వర అవధూతస్వామి వారు క్షీరగిరి భువనేశ్వరులు. (సనారీవారు)**

## గ్రంధారంభానికి ముందుమాట

**శ్లో॥ యధాయధాహిధర్మస్యగ్లానిర్భవతిభారత అభ్యుద్ధాన।**
**మధర్మస్యతదాత్మానామ్ సృజామ్యహమ్॥ అనుగీతాశాస్త్రప్రమాణముచే**

పరమపవిత్రము, కర్మభూమియు, రత్నగర్భయగు ఈ భారతావనియందు ధర్మానికి హానికలుగుతరుణంలో, భగవంతుడేయిల మానవునిగా జన్మించి, ధర్మసంస్తాపన గావించిన సందర్భాలు అనేకములు అట్టిదివ్యగాధలలో, శ్రీమహావిష్ణువు, 15వ శతాబ్ధిలో విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామిగా అవతరించి, అనాటి హిందూముస్లిం మతోన్మాదమును, అస్ప్రుశ్యతా నివారణ, స్త్రీ స్వాతంత్ర్యమును, ఎలుగెత్తిచాటి, తానాచరించి, జనాన్ని జాగృతిపరచి, భవిష్యత్ కాలజ్ఞానమును రచియించి, వారిగోవిందవాక్యములతో జనాన్ని ధర్మవర్తునులను గావించి, దైవమార్గమున నడుపుచూ, ఆధ్యాత్మ పరులనుగావించిరి.

**గోవిందవాక్యం (తత్వం)**

**విశ్వంబులో విశ్వనాధావధూతయను, విశ్వ బ్రాహ్మణడొకరు పుట్టెనిమా।**
**విశ్వమ్ములో తాను శాశ్వతముగ నుండు విశ్వనాధుడునని పల్కేనుమా**
**దుష్టసంస్కర్తయై శిష్ట జనపాలనాధ్యక్షుడైముక్కన్ను జూపేను మా**
**అష్టాంగ యోగముల్ సృష్టి స్తితియుదెల్పి, దాక్షాయణివడిన్ జూపేనుమా**
**తన్ను నమ్మిన వారిని కనురెప్పగకాచి, యెన్నగాసౌఖ్యంబులొసగేనుమా**
**పన్నగేశ్వరనన్ను పాలింపుమనగ ఆపన్నుడైధృవసన్నిదొసగేనుమా॥**

హరిగోవింద గోవింద అనుచూ 18వ శతాబ్ధిలో జన్మించనున్న పరమేశ్వరుని గురించితెల్పుచూ, తానెన్నోమహిమలు జూపుతూ, తనదైవత్వమునకు సాక్షిగా, 16వ శతాబ్ధిలో తన సజీవసమాధి స్తలమందు నీటితో అఖండజ్యోతిని వెలిగించిరి. నేటికీ ఆమహాజ్యోతి ప్రజ్వరిల్లుచూ వారి సత్యమును చాటిచెప్పుచున్నది. కలియుగాంతమున బ్రహ్మంగారు సర్వదేవతాగణములతో, విశ్వనాధునితో సహావచ్చి ధర్మసంస్థాపనగావించి కృతయుగ ధర్మములతో రాజ్యాన్ని పాలించుదునని శెలవిచ్చిరి. బ్రహ్మంగారి భవిష్యవాక్యప్రకారమే సాక్షాత్ పరమ శివుడు 1794 సంవత్సరంలో కార్తీకశుద్ధపంచమీ సౌమ్యవాసరమున ప్రస్తుత శ్రీకాకుళంజిల్లా పాలకొండగ్రామమున, సింహాద్రివారియింట శ్రీ విరాట్ విశ్వకర్మ భగవాన్ అంశగా మన కథానాయకులగు **సనారీ విశ్వనాధులు** అవతరించిరి. వారు బాల్యమునుండి అనేక మహిమలు జూపుచూ జగన్మాతయగు **అన్నపూర్ణాంబను** వివాహమాడి, ''రాజయోగియై'' అనేక మహిమలను జూపి, అధర్మ వర్తనులగు జనులకు సద్ధర్మబోధచేయుచూకొన్నేండ్లు సంసారజీవితము గడుపుతూ వేదాంత ప్రబోధనలు చేయుచూ, తన అర్ధాంగినితనలో ఐక్యము గావించుకొని సన్యాసము స్వీకరించి పాలకొండ నుండి మదరాసు మహానగరానికి బయలు దేరి మార్గమందలి ప్రతీ పల్లె పట్టణములందు, మజిలీలు చేయుచూ వేదాంత ప్రబోధనలు గావించుతూ "సనారీ విశ్వేశ్వర సంవాదము" అను యంత్ర, మంత్ర, తంత్ర, యోగయుక్తంబగు మహాప్రబంధమును రచియించుతూ కొన్నేండ్లకు మదరాసు చేరి, మొదలియారు వద్ద గ్రంధముద్రణ గావించి తమ దివ్య వాక్కుచే ఆయనకుగల కుష్టువ్యాధి నివారించి తాను కైలాసవాసుడగు పరమేశ్వరుడనని ఋజువుపరచుకొని, అటనుండి శ్రీశైల గుహయందు మహాతపో నిష్టయందుండి కలియుగాంత మందు బ్రహ్మంగారితో కలసి వత్తునని, మహాజన సమక్షమున అంతర్ధానమైరి. వారి స్వహస్తములతో లిఖించిన గ్రంధమందు

**పద్యం :** నన్ను గ్రంధమును, నా అర్ధాంగి నా శక్తినిన్। పటు విజ్ఞాన భక్తమానసవశుల్





ప్రార్ధించి పూజించినన్। అటులోపాసకులైన మాంత్రికులకున్, అజ్ఞానముందీసి ఏ కుటిలోపాయంబు లెంచక కోర్కెలిచ్చెదను సంకోచంబు లేకుండగన్॥ అంటూ అభయమిచ్చినట్టి జగద్గురు జీవితచరిత్రను తెలుసుకొని వారి స్వహస్తములతో వ్రాసినట్టి పూజావిధులతో, నిత్యం ఆ పురాణ పురుషుని పూజించుట మన పవిత్రధర్మమై యున్నది. సనారీ వారి జీవిత చరిత్రను ఎందరో భక్తులు వారి అనుభవములను కూర్చి, వారు ఆనోటా ఆనోటా విన్న విషయాలు పొందుపరచి రచియించిరి. సనారీవారు రచియించిన గ్రంధంలో వారి జీవితచరిత్రను ప్రస్తావించక పోవుటచే, భక్తజనుల ద్వారా తాతలనాటి విషయములే జీవిత చరిత్రగా తెలుపబడినవి. అందుకొన్ని అముద్రితములు, ముద్రించినవి కూడా ప్రస్తుతము అందుబాటులో లేవు. నేను2007 లో సనారీ వారి నిత్యపూజావిధానాన్ని వ్రాయగా ఉయ్యూరు వాస్తవ్యులు **బ్రహ్మశ్రీ బంగారు నాగేశ్వరరావు** గారు వారి జననీ జనకుల జ్ఞాపకార్ధంగా 1000 ప్రతులు వేయించారు.పిదప 2008లో సనారీదీక్షా విధానాన్ని సంకలనంచేయగా **చి॥ కొండూరు ప్రసాదాచారి చి॥ కంటె శివకుమార్, చి॥ పాలతీర్ధపు శ్రీనివాసాచారి** వేయిప్రతులు వేయించగా నేను భక్తులకు పంచునపుడు అందరూ స్వామివారి జీవిత చరిత్ర తెలియదు. అది ముద్రించినబాగుండుననిరి ఆకారణమున ఈ గ్రంధాన్ని తయారు చేయడమైనది. దీని కొరకు నేను సనారీ భక్తులు ఎక్కడ ఉన్నారంటే అక్కడకు వెళ్ళి, ఎన్నోవ్యయప్రయాసల కోర్చి వారు చెప్పినవిషయాల నాకళించుకొని. నాకు తెలిసిన విషయాలు వారితో ముచ్చటిస్తూ, నేను దంపతీయుక్తంగా వెళ్ళిన ప్రతీయింటా సనారీ పూజలు చేయించుతూ. ఈ గ్రంధాన్ని తయారు చేసాను. సనారీభక్తులకు పేరెన్నికగన్న తెనాలి పట్టణంలో **బ్రహ్మశ్రీ వజ్రాల భీమలింగాచార్యులు** గారి ప్రోత్సాహముతో బ్రహ్మశ్రీ కాశీరామకోటిగారు 1943లో సనారీ భక్తబృందాన్ని స్థాపించి ప్రతీసంవత్సరం **కార్తీకశుద్ధ పంచమిరోజున సనారీ జయంతిని,** మాఘబహుళ ఏకాదశిమొదలు మహాశిరాత్రి వరకూ, 3 రోజుల వార్షికోత్సవ కార్యక్రమములు నిర్వహించెడివారు. ఆ పిదప 1954 నుండి మాఘబహుళ పంచమి నుండి మహాశివరాత్రి వరకూ నవరాత్రోత్సవములు నిర్వహించెడివారు. ఆ తర్వాత **బ్రహ్మశ్రీ పుల్లేటికుర్తివీరాచారి** గారి ఆధ్వర్యంలో, 1986 నుండి 21 సం॥లు కార్తీకశుద్ధ ఏకాదశిరోజు ఏకాహమును జరిపించి ద్వాదశిన అన్న నమారాధన జరిపెడివారు. 2007నుండి వీరాచారిగారి అనారోగ్య కారణంగా నిర్వహించలేకపోయారు. 1945 లో సనారీ వారి జీవిత చరిత్రను పాలకొండ వాస్తవ్యులు బ్రహ్మశ్రీ కవులూరి సూర్యనారాయణగారు రచించిన 4 పేజీల జీవిత చరిత్రను తెనాలిలో పంపిణీచేయించినారు. ఆ పిదప పాలకొండ వా॥ బ్ర॥దేవు సత్యన్నారాయణగారితో సనారీవారి చరిత్రను వ్రాయించి తెనాలిలో ప్రింటు చేయించి 1958 లో పంపిణీ చేసారు. వీరు దాదాపు 10 రకాలుగా సనారీ వార్ని గురించి రచియించి పుస్తకాలు ప్రింటు చేయించి పంచారు. ఆ సమయంలో బ్రహ్మశ్రీ కాశిరామకోటిగారు బ్ర॥గొన్నాభత్తుల సోమలింగాచారి గార్ని తెనాలి నుండి పాలకొండకు పంపి, సనారీ వారి జీవితచరిత్రయింకా ఎక్కువ వివరాలు సేకరించి తయారు చేయమని పంపించినట్లు , సోమలింగాచారి గారు ప్రింటు చేయించిన "శ్రీ స్వామి విశ్వేశ్వరలీలలు" అను సనారీ జీవిత చరిత్రలో ముందు మాటగా చెప్పుకున్నారు. వీరు ఏకారణంచేతనో సనారీ భక్తబృందమునుండి విడిపోయి స్వంతంగా "విశ్వేశ్వరనిలయం" అడ్రసుతో 1948 లో, 1. స్వామివారి జీవిత చరిత్రను ముద్రణచేయించిరి యింకా 2.సనారీ విశ్వేశ్వర సంకీర్తనలు 3 విశ్వేశ్వర వ్రతసంకల్పము 4.స్వామినాధుని సుభాషితము 5. విశ్వగురుతత్వసుధ 6. సనారీ విశ్వేశ్వర నామస్తుతి అను ఈ 6 గ్రంధములు రచియించినట్లు చెప్పుకున్నారు. కానీ ప్రస్తుతము స్వామివారి చరిత్ర మాత్రమే లభించినది. మిగతా 5 పుస్తకములు లభ్యంకాలేదు. ఈ విషయములను బట్టి సనారీ వారి జీవిత చరిత్ర మనకు తెలిసి ముద్రితమయినవి. 1945లో బ్రహ్మశ్రీ కవులూరి సూర్యనారాయణ గారి 4 పేజీల చరిత్ర, ఆ పిదప భక్తమౌళి బ్రహ్మశ్రీ అనుపోజులక్షణరావు గారి

సనారీ జీవిత చరిత్ర గీతారత్నమాల 1954 లో పులికొండ పరబ్రహ్మగారి సనారీ బుర్రకథ 2 భాగాలు గాను, పాలకొండ వాస్తవ్యులు బ్ర॥దేవు సత్యన్నారాయణగారు సనారీజీవిత చరిత్రను 1958లో రచియించగా వీటిని కాశీరామకోటిగారు భక్తుల సహకారంతో ముద్రించి పంపిణీ చేసారు. దేవు సత్యన్నారాయణ గారు సనారీ జీవిత చరిత్ర చిన్న పద్యకావ్యంగా రచియించి 1958 లో పంపిణీ చేసారు. తెనాలి వాస్తవ్యులు బ్ర॥గొన్నాభక్తుల సోమలింగాచారిగారు 1948 " శ్రీ స్వామివిశ్వేశ్వర లీలలు" రచియించగా, కర్రి అచ్యుతరామారావుగారు 1958లో సనారీ వారి జీవిత చరిత్రపద్యకావ్యంగా రచించారు. 1975 లో మేడపాటి వెంకటరెడ్డిగారు సనారీ జీవితచరిత్రను పద్య కావ్యంగా సనారీ శతకంగా రచించారు. ఆ పిదప 1987 లో "తెలుగు యోగులు" గ్రంథంలో సనారీజీవిత విశేషాలు వ్రాసారు. 1979 లో స్వర్ణసుబ్రహ్మణ్యకవి గారు సనారీ మహిమలు రచింపగా బ్రహ్మశ్రీ తుమపాల విజయశేఖరాచార్యులుగారు ముద్రించారు. శ్రీసనారీ వీర బ్రహ్మేంద్రాశ్రమస్థాపనాచార్యులు, బ్రహ్మశ్రీ చింతాడ సూర్యప్రకాశరావు (స్వప్రకాశానందస్వామి) 1967లో వారు రచియించిన "సుజ్ఞానబోధామృతం" లో సనారీ వార్ని గురించి కొన్ని విషయాలు వ్రాసారు. 1975 లో బ్రహ్మశ్రీ చెరుకూరి శివరామ పరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠాధ్యక్షులు బ్రహ్మశ్రీ గోనుగుంట వీరబ్రహ్మాచార్య స్వాములవారి చే రచియించ బడిన "సర్వశాస్త్రసార సంగ్రహము" లో సనారీ వార్ని గురించికొన్ని విషయాలు తెల్పిరి. బ్ర॥ కర్రి అచ్యుతరామారావు గారు రచియించిన "సనారీ జీవిత చరిత్రను ఏలూరు వాస్తవ్యులు బ్ర॥ సాతవల్లి భట్టాచారిగారు 1978 లో ముద్రణ ప్రారంభించి 1980 లో పంపిణీ చేసారు. మేడపాటి వెంకటరెడ్డిగారు 1987 లో రచించిన "తెలుగుయోగులు" "గ్రంథంలో సనారీవారు 23-10-1914 లో కార్తీక శుద్ధ పంచమినాడు శ్రీ శైల బదరి కావనంలో అంతర్హితులైనట్లు వ్రాసారు. 1998 లో బి.రామరాజుగారి ఆంధ్రయోగులు గ్రంథంలో సనారీవార్ని గురించి కొన్ని విషయాలువ్రాసారు. పట్టెసపు వెంకటేశ్వర్లుగారు రచియించిన "అద్వైత సుధానిధిలో సనారీవార్ని గురించి కొన్ని విషయాలు వ్రాస్తూ సనారీవారి గురువు శంకరానందులు వారనివ్రాసారు. 1998లో నాగశ్రీకవి "సనారీ జీవితచరిత్ర" బొమ్మలకథారూపంలో రచియించగా బ్ర॥పట్నాల సన్యాసిరావు గారి ఆర్థిక సహాయంతో ప్రింటుచేయించిరి. ముద్రితమైనవి. నాకు తెలిసినవియివి. యింకా ముద్రితమైనవి అముద్రితంగా ఉన్నవి. యెన్నున్నా యోగురుదేవులకే తెలియాలి. సనారీవారు స్వహస్తములతో లిఖించిన సనారీ సంవాదములో స్వామి వారివంశావళి, గ్రామము తల్లిదండ్రులు, భార్యా నామములు తప్పయింకే వివరాలులేవు.ప్రస్తుతమువాడుకలో నున్న జీవితచరిత్రలు ఆ నోటా ఆనోటా తాతలనాటి చెప్పుమాటలను ఆధారముగా రచించినవే గానీ ప్రత్యేక ప్రమాణములు లేవు. యిందలి సత్యాసత్యములు గురుదేవులకే ఎరుక, నేనునూ ఈ మార్గమునే అనుసరించితిని, యివన్నియూ గురుదేవులందలి భక్తిభావముతో సహృదయులు చేసిన రచనలు, సనారీ వారి యందలి అమిత భక్తిభావములకు నిదర్శనములు. సింహాద్రి విశ్వనాధావధూత స్వాములవారి స్వహస్తములతో లిఖించినవి. 1. సనారీ విశ్వేశ్వర సంవాదము 2. యోగసనారీ 3. యంత్రసనారీ 4. మోక్షసామ్రాజ్యము. 5. గోత్రా ధ్యాయము గ్రంథములు, యిందులో నావద్దనున్నవి. 1.4,5, గ్రంథములు 2. 3 గ్రంథములు కొందరు ఎక్కడో చూచామని చెప్పుటే గానీ, నేను ఎవరి వద్దనూ చూడలేదు. కావున భక్త మహాశయులు ఎవరివద్ద యివియున్నా మాకు తెల్పినచో వాటిని ముద్రించి భక్తలోకమునకందించి, స్వామివారు కరుణతో మనకు ప్రసాదించిన అమృతాన్ని అందరికీ పంచి, స్వామివారి మహిమలను మననం చేసుకుంటూ మనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించి, స్వామివారి కృపకు పాత్రులమై మీ(మా) జన్మలను సార్ధకం చేసుకుందాము.

పూర్వ బ్రహ్మఋషి సంతతివారగు విశ్వబ్రాహ్మణులకు, నవీన ఋషి సంతతివారగు విప్రులకు, గల వివాదములతో,పంచార్షేయ సంతతివారు అణగ ద్రొక్కబడి విస్తారమైన బాధలకులోనయిరి.





ఆ పరిస్థితులలో విశ్వబ్రాహ్మణ కులజులు తమ పూర్వచరిత్రలను, ఆచార వ్యవహారాలను, నిత్యానుష్ఠానములను మరచి నిస్తేజులై కాలంగడుపు తరుణంలో జాతినుద్ధరించుటకై జన్మించిన జగద్గురు శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధావధూత స్వామివారు సంధ్యావందనమును "విశ్వబ్రాహ్మణగోత్రాధ్యాయము" లిఖించిన తాళపత్ర గ్రంధాన్ని రాజమహేంద్రవరంలో పశ్చిమగోదావరిజిల్లా గౌరుపల్లి వాస్తవ్యవులైన బ్రహ్మశ్రీ చిలకలపూడి రాజలింగాచారి గార్కి ప్రసాదించి ప్రచారం గావించమనిరి. ఈనాడు విశ్వబ్రాహ్మణ గోత్రములు తెలుసుకొనుటకది మూలమైనది. స్వామిస్వహస్తములతో రచించిన సనారీ సంవాదమందు

**శ్రీశ్రీశ్రీ సనారీవారి జననకారణం :**

**విశ్వేశ్వర ఉవాచ:**

**పద్యం** : నేనే విశ్వబ్రహ్మము అననమునమున్నుబుట్టి। నామయ వంశంబేనని। తలపుడి,దయపంచాననకుల ముద్ధరింప జననంబైతిన్ ॥ అని గురుదేవుల తన మానవ జన్మకారణాన్ని గ్రంథమందు తెలిపినారు. శ్రీ విరాట్ విశ్వకర్మ భగవానుని పంచముఖములనుండి ఉద్భవించినట్టిమను, మయ, త్వష్ట, శిల్పి. విశ్వజ్ఞ, పంచబ్రహ్మలు పంచ వేదముల కధికారులైరి. అట్టి పంచవేదములో ప్రస్తుత ప్రపంచమున చతుర్వేదములే ప్రచారములోనున్నవి. ఆ లోటును భర్తీ చేయుటకై శ్రీ మహా విష్ణువు పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామిగా భువిపై అవతరించి "భవిష్యత్ కాలజ్ఞానము"ను రచియించి అందు ప్రపంచమున జరుగబోవు భూతభవిష్యత్ వర్తమాన వింతలు, విశేషాలు, ప్రళయములు, యోగసాధనా విషయములు వివరంగా తెలిపిరి. ఆ తర్వాత శతాబ్ధిలో సాక్షాత్ పరమశివుడు. పాలకొండలో "సింహాద్రి విశ్వనాధావధూతగా" అవతరించి "శ్రీవారు" సంధ్యావందనము, విశ్వకర్మ గోత్రాధ్యాయమునురచించి 1875 కరుణతో మనకు ప్రసాదించి అందుజాతి ఔన్నత్యమును ఆచార వ్యవహారలను మన సంస్కృతిని గుర్తుజేసి, ఆపిదప సనారీ సంవాదమందు తనువును స్వర్ణము గావించుకొనుట, శక్తినుపాశించి స్వాదీనపరచుకొనుట అణిమాది అష్టసిద్ధులను అవలీలగా పొందుమార్గములను, సృష్టి రహస్యములను ప్రకృతి ధర్మములను ఆధ్యాత్మిక విషయములను మానవుడే మాధవుడుకాగల యోగ రహస్యములను లిఖించిన మహాపురుషులు. ఈ దివ్య పురుషులు స్వహస్తములతో లిఖియించి పంచమ వేదములుగా మనకు ప్రసాదించినట్టి గ్రంధరాజములను నిత్య పారాయణచేస్తూ తోటివారికి వినిపించుతూ ఎవరికి సాధ్యమగు రీతిలో వారు ప్రచారం చేయుచూ నిత్యం వారిని సేవించుతూ విశ్వబ్రాహ్మణ జాతియావత్తూ ప్రతి నగరం పట్టణం, పల్లెలలో కనీసం 10 యిండ్లు గల ప్రతీ ప్రాంతముననూ విశ్వకర్మ జయంతి సెప్టెంబరు 17వ తేదిన, బ్రహ్మంగారి ఆరాధన వైశాఖశుద్ధ దశమినాడు, సనారీ వారి జయంతి కార్తీక శుద్ధ పంచమిన/ సనారీ వారి కళ్యాణం వైశాఖశుద్ధ ఏకాదశినాడు జరుపుకుంటూ సంవత్సరానికొక రోజైన వీరికి నివాళులర్పిస్తూ భావితరముల అష్టాదివర్ణముల వారికి ఈ సత్ సాంప్రదాయాన్ని అందించుటలో ప్రతీ విశ్వబ్రాహ్మణసంఘం, కుల ప్రముఖులు, అష్టాదివర్ణ భక్తులు తమవంతు కర్తవ్యంగాభావించి ఆచరించివారి జన్మలను ధన్యం జేసుకుంటారని ఆశిస్తున్న సనారీ పీఠాధిపతి.

**బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ :** సెల్ : 9032253205, 8099203873, 9290582110 శ్రీ సాయిజ్ఞాన నిలయం: ఓగిరాల వారి వీధి, డోర్ నెం. 23-11-1-6/బి సత్యనారాయణపురం విజయవాడ-11.

**అవతారిక: (గ్రంధావిర్భావము)**

**శ్లో: పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతామ్।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥**

అను గీతాశాస్త్రప్రమాణముగా శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడగు, విరాట్ విశ్వకర్మ భగవానుడు సృష్టించిన, పదునాల్గుభువనములలో భగవత్ ధ్యానమానస యుక్తమైనదియు, సత్య ధర్మ, దయాసౌభ్రాత్రుత్వముగలదియు, మానవాభ్యుదయము, కుటుంబ వ్యవస్థకు ప్రధానస్థానమాక్రమించినదియు, మహాపతివ్రతామతల్లులకు, మహాయోగులకు, మహాభక్తులకు ఆలవాలమైన భారతావనియందు, కలిప్రభావంబున సత్యదయా, ధర్మ భక్తి జ్ఞాన వైర్యాగ్యంబులు క్షీణించి, స్వార్ధపరతత్వము పెచ్చు పెరిగి, పాపకార్యములాచరించు మానవులను భరించలేనని భూదేవి దుఃఖించుచూ, వైకుంఠ వాసుని ప్రార్థింపగా శ్రీమన్నారాయణుడు **"భూదేవి నోదార్చి పల్కిన భవిష్యత్ పల్కులు"** కలిప్రభావమున అజ్ఞానాంధ కారములతో, మానవులు చేయుదుష్కృత్యములను మాన్పి, సద్ధర్మప్రబోధనములు చేయుచూ భవిష్యత్ కాలజ్ఞానము రచియించి, కొన్ని మహిమలు జూపుతూ, శిష్యగణంబుతో యావత్ భారతము పర్యటిస్తూకాలజ్ఞాన బోధలు చేయుచు, ఆధర్మవర్తనులకు కల్గు ఆపదలు తెల్పుతూ లోక ప్రళయములు వివరిస్తు భక్తులకు ధర్మవర్తనులకు కల్గుదైవ సహాయమును వివరిస్తూ జనాన్ని జాగృతి చేయుటకు నేను పరమపవిత్రంబగు కందిమల్లయ పురంబున, పోతులూరి "వీరబ్రహ్మేంద్రస్వామి" నామంబునవసించి శ్రీదేవి అంశయగు ''గోవిందమాంబను'' ధర్మపత్నిగా స్వీకరించి ''రాజయోగినై'' సుజ్ఞానతేజోవంతులగు భక్తులను, శిష్యులుగా స్వీకరించి , అందుదూదేకుల సిద్ధుని ప్రధాన శిష్యునిగా నియమించి, ఆసేతుహిమాచల పర్యంతం కాలజ్ఞానతత్వములతో జనాన్ని సత్య, ధర్మవర్తనులగావించుచూ వారణాసిజేరి గంగానదీ తీరంబున వటవృక్షచ్ఛాయను శిష్యగణంబుతో విశ్రాంతినొందు సమయంబున , నాప్రియశిష్యుడు సిద్ధుడు నాకు సపర్యలుగావించుతూ, గరుదేవా। వీరనారాయణా। పరబ్రహ్మావతారా ।జగద్గురూ। మీ భవిష్యత్‌కాలజ్ఞానమందలి ముఖ్యఘట్టంబులు, దైవాంశసంభూతులగు వారి విషయములు వినమనంబున కోర్కెకల్గినది. నాయభీష్టంబు తీర్చుదని అతివినయుడై ప్రార్థింపగా, విష్ణ్వంశసంభూతుండనగు, నేను విరాట్ వీరబ్రహ్మేంద్ర స్వామిగా సిద్ధుని కోర్కెపై శిష్యులకు తెల్పిన భవిష్యవాక్యం బెట్టదనిన.

**వీరబ్రహ్మోవాచ**

**శ్లో॥ న భూమి నజలంచైవనతేజో,నచవాయువః, నచబ్రహ్మనరుద్రనవిష్ణుః।**
**నచతారకాః సర్వశూన్యనిరాలంబో, స్వయంభూవిశ్వకర్మణః॥**

"సిద్ధా" సృష్ట్యాదియందు త్రిమూర్తులు పంచభూతములు, నవగ్రహములు. నక్షత్రతారకాదులు , సూర్యచంద్రులు. మరియేజీవరాశిలేని, వట్టిశూన్యమందు "అకార, ఉకార, మకార" సంయోగముచే ప్రణవనాదమగు "ఓం" కారధ్వని యేర్పడిదాని నుండి మహాతేజో వంతమగు మహాజ్యోతి బయల్పడెను. ఆ మహాతేజస్సు నుండి పంచముఖములతో విరాట్‌విశ్వకర్మ భగవానుడు ఉద్భవించి, ఆయన పంచముఖముల నుండి మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ. బ్రహ్మలను సృష్టించి, ఈ పంచబ్రహ్మలకు పంచశక్తులనిచ్చి తనమనోసంకల్పముచేత అనేక బ్రహ్మాండములను సృజించి వాటి నిర్వహణా బాధ్యతలువారి కప్పగించెను.

1. **మనుబ్రహ్మ** శివునకు ఆదిశక్తినిచ్చి "కైలాసము" సర్వజీవుల(పోషణ)లయములకుకర్తయై మోక్షమునిచ్చును.
2. **మయబ్రహ్మ** విష్ణువునకు పరాశక్తినిచ్చి "వైకుంఠము" సర్వజీవులను మాయామోహితులను గావించి విలాసములందు ముంచి ఐశ్వర్యములనిచ్చి భోగలాలసులనుజేయుట.
3. **త్వష్ట బ్రహ్మ** 84 లక్షల జీవరాసుల సృష్టిబ్రహ్మకు ఇచ్ఛాశక్తినిచ్చి(పితృలోకం) "సత్యలోకం" ప్రాణ ప్రతిష్ట జీవనఫలం లిఖించుట.





4. **శిల్పి బ్రహ్మ** దేవేంద్రునకు క్రియాశక్తినిచ్చి 84 లక్షల జీవరాసులను తయారుచేయుట (అమరావతి) "ఇంద్రలోకం" సుఖప్రదాత
5. **విశ్వజ్ఞ బ్రహ్మ** సూర్యునకు జ్ఞానశక్తినిచ్చి "అంతరిక్షం" 84 లక్షల జీవరాసులకు జీవశక్తి ప్రసాదించుచూ సాక్షీభూతుడై యుండుట పదునాల్గు భువనములు సంచరించుట వెలుగు ప్రసాదించుట.

ఒక్కొక్కరికి ఒక్కోలోకమును సృజించి, యిచ్చి సృష్టి, స్తితి, లయ, తిరోధాన, అనుగ్రహకృత్యంబులకు ఒక్కొక్కరిని అధినాధులగావించి, వీరికి ఊర్ధ్వ భాగంబున విశ్వకర్మ భగవానుడుండెను, ఈ పంచబ్రహ్మలు పితరుని ఆజ్ఞానువర్తులై బ్రహ్మాండ పరిపాలనా బాధ్యతలను, అప్రమత్తులైనిర్వర్తించుచుండిరి. యిట్టి పదునాల్గు భువనంబులలోగల, భూలోకమందు భగీరధుడు గంగను, గురించి ఘోరతపస్సు చేయగా భక్త వశంకరుడగు శంకరుడు భక్తునికోర్కెదీర్పగంగాదేవిని భువికి పంపుటకై, తన **జటాజూటము నుండి గంగను భువికిపంపి, ఆమెను వీడి వీడలేక, తానునూ గంగా సమేతంబుగాయిట, కాశీపురాధీశునిగా** అవతరించి. ఈ పుణ్యక్షేత్రంబున తన భక్తుల మనోరధములనీడేర్చుచూ మోక్షంబొసంగు చుండెను. భవిష్యకాలమున అష్ఠాదశ శతాబ్ధంబున మహాభక్తుడగు విశ్వకర్మ కులజుని తపోనిష్ఠలకు పరమేష్టి ఆనందపరవశుడయి, వారికోర్కెదీర్పకళింగ దేశమందలి వింధ్యాచల పర్వతప్రాంతమందలి క్షీరాచలమందుగల సుప్రసిద్ధ విశ్వబ్రాహ్మణ వంశమందు, సనత్కుమారబ్రహ్మ ఋషిగోత్రోద్భవుడైన బ్రహ్మశ్రీ వీరాచార్య గౌరమాంబలకు పుత్రుడై, సాక్షాత్‌పరమశివుడు విశ్వనాధాచారిగా అవతరించి, లోకంబున గల అజ్ఞానాంధ కారములు హరించి, సుజ్ఞాన జ్యోతులు వెలిగించి, అనేకమహిమలు జూపుతూ, రాజయోగియై., "సనారీగా" లోకంబున శాశ్వతంబుగ నుండును. తన్నునమ్మినవారిని కన్నురెప్పగాకాచి, వెన్నంటి రక్షించికాపాడుతూ వారికి మోక్షసామ్రాజ్యమొసంగు చుండునని తెలిపి, యిదిసత్యము । తధ్యము సత్యమని వీరగురుండు సిద్ధునకు 3వందల సం॥రముల ముందు భవిష్యత్ చెప్పగా, శిష్య బృందంబులు గురుదేవులకు పాదాభివందనములొనర్చి కాశీవిశ్వేశ్వరుని మనంబున ప్రార్థించుతూ సంతోషాంతరంగులై ప్రశాంతంగా విశ్రాంతి నొందిరి.

## కథారంభం

వేయేండ్ల తురుష్కుల పరిపాలనలో వారి ఘాతుకాలతో, ఆ పిదప విదేశీయుల కుటిలదమన నీతికి, సనాతన భారతీయ ధర్మ సంస్కృతులు అతలాకుతలమై అజ్ఞానంలో కొందరు, స్వార్ధంతో మరికొందరు, విదేశీయుల సంస్కృతులకు లోనై, ఆత్మ పరసంస్కృతి పాలై, మాతృసంస్కృతికి ద్రోహంచేసుకుంటున్న సమయంలో, భారతదేశ వివిధ ప్రాంతాలలో మహాపురుషులుద్భవించి, సనాతన ధర్మోద్ధరణకు కంకణంకట్టుకుని, తమ తపః ప్రభావంచేత, దివ్యబోధలచేత, సత్కర్మలచేత, విజ్ఞానప్రదములగు రచనలచేత, దివ్య మహిమలచేత, ప్రజలనాకర్షించి జ్ఞానబోధచేసి, ఆద్యాత్మిక సంపన్నులుగా తీర్చి, జనులను సనాతన ధర్మమార్గమున పయనింపజేసిరి. అట్టిమహాపురుషులలో **సనారీ విశ్వనాధులు** ముఖ్యులు.

## 1. ప్రథమాధ్యాయం

భారతదేశములోని ఆంధ్ర తమిళనాడు సంయుక్త రాష్ట్రముగా నున్న ఆనాటి గంజాం జిల్లాలో గల నాగావళీ నదీతీర మందలి, పాలకొండ గ్రామ కోమటి వీధిలోగల సుప్రసిద్ధ విశ్వబ్రాహ్మణ వంశమందలి సింహాద్రివంశ పారావారరాకా సుధాకరుడు పంచవేదములు, అష్టాదశపురాణములు సకల ఉపనిషత్తులు, షట్‌శాస్త్రములు సమస్తకావ్యములు పఠించినపండితుడు. శివపూజాదురంధరుడు, అనువంశీకముగా వచ్చు స్వర్ణవృత్తిచే జీవించువాడును, పాషాణములను

భస్మముజేసి వైద్య ప్రక్రియలందు ఉపయోగించి దీర్ఘవ్యాధులసైతము నివారణచేయు **వైద్యుడు** రసవాద ప్రక్రియ లెరింగినవాడు, సాత్వికుడు బంధుజనప్రియుడు, తోటివారిక్షేమము సదా కాంక్షించు సద్గుణుడు, బ్రహ్మజ్ఞానియునగు బ్రహ్మశ్రీ సింహాద్రివీరాచార్యులవారు, పరమపతివ్రతా శిరోరత్నంబగు గౌరమాంబ ధర్మపత్నితో గృహస్తాశ్రమంబున అతిధి అభ్యాగతులతో నిత్యాగ్నికార్యంబులతో సతత వేద పఠనతో ప్రశాంతజీవనము గడుపుచుండిరి. వారికి తోడుగా కర్మశాలయందు ఒక ఫణీంద్రుడు నివాసముండి వీరాచార్యులవారి పిలుపుతో వెలుపలకు వచ్చి క్షీరము గ్రహించి పోవుచుండెడిది. వైద్యప్రక్రియలలో భాగముగా వీరాచారిగారు దాని గరళము ప్రయోగించెడి వారు. గౌరమాంబయు తన యింటికి వచ్చిన అతిధులకు నిత్యము భోజనవసతులు కల్పించెడిది. అనుదినమూ ఆ ఇల్లు "నిత్యకళ్యాణ పచ్చతోరణమన్నట్లు " బంధుమిత్రులకు అన్నసమారాధన చేయుచూ కళకళలాడుచున్న వారి దాంపత్యమునకు ద్వాదశ వత్సరములు నిండినవి. యిట్టి వారి సంసారజీవనమున "అపుత్రస్యగతిర్నాస్తి" అపుత్రస్యగృహం శూన్యమను "శాస్త్రోక్తిచే ఆ దంపతులు పిల్లలు లేనియిల్లునరకమనియు, చంటిపిల్లల ఆటపాటలతో చిట్టిచిట్టి చిన్నారినడకలతో ముద్దులొలుకు మాటలతో కళకళలాడు గృహమేకదా స్వర్గతుల్యము అట్టిభాగ్యమునకు నోచుకొనలేకపోతిమి యిది ఏనాటి ప్రారబ్ధమని! విచారముతో కాలముగడుపుతూ దినములుగడచిన కొలది ఈ వ్యధ నధికముగా అనుభవించుచుండిరి. యిట్టితరుణమున ఒకనాడు వీరయోగీంద్రులు స్నాన సంధ్యానుష్ఠానములు నిర్వర్తించుకొని ధర్భాసనాసీనుడై వేద పారాయణచేయు తరుణంబున గౌరమాంబ పతి చెంతజేరి ముకుళిత కరములతో విచారవదనయై భర్తచెంత నిలబడియుండగా వీరాచార్యులు దేవీ! ఈనాడు యింత విచారముతో నుంటివి కారణమేమనగా? ప్రాణేశ్వరా! పుత్రసంతతికై ఎన్నో వ్రతములు, నోములునోచియు ఫలితము లేకుండుటచే, నామనస్సు చింతాక్రాంతమగుచున్నది. మాతృమూర్తిని కాలేక పోయితినను బాధ దినదినాభివృద్ధియై మనస్సును పీడించుచున్నది. మన సంసారజీవితమున ఏనాడు మిమ్మేదియు కోరియుండలేదు. తీర్ధయాత్రలుచేసిన ఏదైన దైవకృపతో నైనా సంతానముకల్గునని మనంబున తోచుచున్నది. ఈనా కోర్కెతీర్చి ఆనందముచేకూర్చుడని అతిదీనముగా ప్రార్ధింపగా, వీరాచార్యులువారు సతినిగాంచి దేవీ! దీనికింత ప్రాధేయపడవలెనా, త్వరలో మనము తీర్ధయాత్రలు చేయుదము. నీయభీష్టము తప్పకనెరవేరునని పరమేశ్వరుని ధ్యానించియాత్రలు చేయుటకు కావలసిన సంబారములు, తోడుగావచ్చువారిని గూర్చి ఆలోచనలు చేయుచూ యాత్రాప్రయత్నములలో నుండిరి.

## (2) ఉత్తరదేశ యాత్రలు

యాత్రలకు వెళ్ళుటకై ఆనాడు ప్రయాణసౌకర్యములు లేని కారణమున భక్తులు అనేక వ్యయ ప్రయాసలకోర్చి ప్రాణాన్ని ఫణంగా పెట్టి అరణ్యమార్గములనుండి నిర్జన ప్రదేశములు క్రూరమృగములు, దొంగలబారినుండి, తప్పుకొనుచూ కొండలు, కోనలు, నదీనదములు దాటుచూ, భక్తియే ప్రధానముగా, దైవముపై భారమువేసి బ్రతికిఉంటే తిరిగి వస్తామయిదే ఆఖరి చూపన్నట్లుగా, స్థిర చరాస్తులను వారసులకప్పగించి బంధుమిత్రాదుల వీడ్కోలతో ఆహారధాన్యములు, వంట సామాగ్రులు సేకరించి నమ్మకమగుసేవకులతో, చుట్టుప్రక్క గ్రామమందలి పలువురు కలసి ఎడ్లబండ్లు, గుర్రపుబండ్లపై, బయలుదేరియాత్రలు సాగించెడివారు. మార్గమధ్యమందలి, గ్రామములలోని గ్రామస్తులు విశ్రాంతి సదుపాయము లేర్పరచెడివారు మార్గమునకొన్ని ప్రాంతములందు సత్రములుండెడివి. యిట్టి త్యాగపూరితమైన యాత్రను ముందుగా ఉత్తరదేశయాత్ర చేయ సంకల్పించి, వీరాచార్యులు వారు యిరుగుపొరుగున గల కొందరు భక్తబృందములతో కలసి ఒక శుభముహూర్తమున బయలుదేరి, ముందుగా ముఖలింగేశ్వరునకు అభిషేకాదులు





చేసి తమయాత్రను దిగ్విజయము గావింపుమని ప్రార్ధించి "వారాహి" అమ్మవారికి కుంకుమార్చనలు చేసి అటనుండి పూరీ జగన్నాధముచేరి సముద్రస్నాన మాచరించి సుభద్ర బలభద్రసమేతుడైన జగన్నాధుని పూజించి, యాత్రసంపూర్ణము గావించమని ప్రార్ధించి, ఈ ముగ్గురి దారుశిల్పములకు అగ్నిస్పర్శ తగిలినదని దేవాలయ చరిత్రను పూజారి తెలుపగా క్షేత్రవిషయములు పూర్తిగా గ్రహించి, అటనుండి సాక్షిగోపాలము చేరి భక్తిశ్రద్ధలతో వేణుగోపాలుని పూజించి, అటనుండి బయలుదేరి మార్గమధ్యమునగల తీర్ధములందు సతీసమేతముగా గ్రుంకులిడుచు, పుణ్యక్షేత్రంబులను దర్శించుచు, దైవములనారాధించుచూ, ముక్తిప్రధాయకంబగు నట్టి పరమ పవిత్రంబగు కాశీక్షేత్రమును చేరిరి. వారణ - అసియను రెండునదుల మధ్యన ఉండుటచే వారణాసియని పిలువబడు. పరమపవిత్రమైనట్టి గంగానది యందు దంపతీయుక్తముగా స్నానమాచరించి, సాధుపుంగవులకు దక్షిణ లొసంగి,వారి ఆశీస్సులుగైకొని, కాశీక్షేత్రాదీశులగు అన్నపూర్ణాసమేత విశ్వనాధ, విశాలాక్షి అమ్మవారును, డుండి వినాయకుడు. కాలభైరవుడు కొలువై యుండగా, వారందరిని భక్తిశ్రద్ధలతో పూజించి వారితో తమ మనోవాంఛితములు తెల్పుచూ అర్ధించి, ఆలయనైరుతి భాగమున పంచముఖములతో బ్రహ్మచారి వయస్సుగల 12 అంగుళప్రమాణముగల విశ్వకర్మ భగవానునిపంచలోహ విగ్రహమును , వాయువ్య భాగమున పంచ ముఖములతో సుఖాసీనమైన 11 అంగుళములు గాయత్రీమాత పంచలోహ విగ్రహములు, బ్రహ్మోతేజస్సుతో విరాజిల్లు ఆ మూర్తులగురించి అర్చక స్వాముల నడుగగా, అవి క్షేత్రనిర్మాణము నుండియున్నవని చారిత్ర పరిశోధకులు నిర్ణయించిరని తెలుపగా, **విశ్వకర్మకుల** మూలమూర్తు లైనట్టివారికి షోడశోపచార పూజలొనర్చి, బయటకు వచ్చి ముఖ మండపమందలి నందీశ్వరుడు ఎదురుగాయున్న మసీదును చూస్తుండుట గాంచి ఆశ్చర్యచకితులై, అచటగల వృద్ధ పండితుని యిది ఏమిటిని ప్రశ్నింపగా, నాయనలారా! తురుష్కులమతోన్మాద చర్యకు సాక్షిగా నిలిచి నాడీనందీశ్వరుడు, కృతయుగమునాటి శివాలయమును ఔరంగజేబు పరిపాలనలో ధ్వంసముచేసి అందలి శివలింగమును ఈ ప్రాంగణమందలి భావిలో పడవేయించి గర్భగుడి ప్రాంతములో మసీదు నెలకొల్పగా, ముఖమండపమందలి నంది మాత్రము మిగిలినది. ముస్లింల రాజ్య పతనానంతరం హిందూ రాజుల పరిపాలనలో ఇటార్సీ **మహారాణి అహల్యాబాయి 1785 లో యిప్పటి దేవాలయము నిర్మింపగా,** రణజిత్ సింగ్ మహారాజు ఈ దేవాలయ గోపురానికి 22 మణుగుల బంగారపు రేకుల తొడుగు చేయించెను. యిది ఈ దేవాలయ వృత్తాంతమని తెలుపగా అచటి నుండి బయలుదేరి, గంగాయమునా, సరస్వతీ యను మూడునదుల కలియు ప్రదేశమగు త్రివేణీ సంగమమునకు అతి ప్రయాసతో చేరి, దంపతీయుక్తముగా స్నానము లాచరించి సర్వలోక పాలకుడు, కర్మసాక్షియగు సూర్యభగవానునికి, అర్ఘ్యపాద్యాదు లొసంగి, అటనుండి గయాక్షేత్రమున గల గధాధరస్వామిని సేవించి, అటనుండి బుద్ధ భగవానునిజ్ఞానోపదేశ ప్రాంతమునగల బోధి(రావి) వృక్షమునకు, బుద్ధ భగవానుని విగ్రహమునకు నమస్కరించి, అటనుండి గంగా ముఖద్వారమగు హరి ద్వారమున విష్ణుని "శివాయ విష్ణురూపాయ, శివరూపాయవిష్ణవే" యనుచూ హరిహర బేధములెంచరాదను చూపూజించి, బ్రహ్మకపాలమున జన్మనిచ్చిన తలిదండ్రులు కైవల్య ప్రాప్తినొంద వలెనని పితృదేవులకు పిండప్రధానములు గావించి, హృషీకేశమునవిష్ణుని సేవించి, కేదారమున కేదారేశ్వరుని భక్తి శ్రద్ధలతో అభిషేకించి, అమరేశ్వరక్షేత్రమున సంవత్సరమున కొకసారి మంచుతో పూర్తిశివలింగరూపుదాల్చి, క్రమేపిఅదృశ్యమౌ అమరేశుని భక్తిశ్రద్ధలతో పూజించి, ఆ చంద్రతారార్కమిట్లే శివలింగ దర్శనమౌనని అర్చకులు తెలుపదైవలీలలకు ప్రణతులిడుచూ, యిట్టిదివ్య క్షేత్ర దర్శనమున జన్మ ధన్యమైనదని భావించుచూ, బదరీ నారాయణ క్షేత్రమున గల

శ్రీమన్నారాయణుని భక్తితో పూజించి, పండరీపురము జేరి చంద్రభాగానదియందు శుద్ధులై పాండురంగని పూజించి, పుండరీకుని భక్తికి అచ్చెరు వొందుచు, అటనుండి మార్గమధ్యమున గల నర్మదానదియందు స్నానమాచరించి, ముని సాధు పుంగవులకు దక్షిణలొసంగుతూ ఆశీర్వదించబడుతూ, తపతీనదిచేరి. స్నానమాచరించి, కర్మసాక్షిని ప్రార్థించి, అర్ఘ్యములొసంగి, మార్గమధ్యమందలి నదీనదములందు గ్రుంకు లిడుచూ, పుణ్య క్షేత్రములను దర్శించుచూ యతులును సాధుపుంగవులను సేవించుతూ, నిత్యానుష్టానము క్రమముదప్పక జేయుచూ, ఉత్తరదేశ యాత్రసంపూర్ణము గావించి క్షేమంగా పాలకొండ చేరి, ప్రయాణబడలికను తీర్చుకొని ఒకనాడు బంధుమిత్రాదుల నాహ్వానించి, యాత్రావిశేషములు తెల్పుచూ యాత్రలో కొన్నపాత్రలు చూపుతూ, వచ్చిన వారందరికి కులమత బేధము లెంచక, అన్నసంతర్పణ జేసి దక్షిణతాంబూలాదులతో అందరిని తృప్తిపరచి అందరి ఆశీస్సులందుకొని కొన్నాళ్ళు విశ్రమించి, మరియొక శుభముహూర్తమున కొంతమందికలసి దక్షిణదేశయాత్రలకై బయలుదేరిరి.

## (3) దక్షిణదేశ యాత్రలు

ముందుగా అరసవల్లికేగి సూర్యనారాయణమూర్తికి అంజలిఘటించి, బ్రహ్మ స్వరూపముదయే। మధ్యాహ్నేతుమహేశ్వరం। సాయం ధ్యాయేసదావిష్ణుం,। త్రిమూర్త్యంచ దివాకరమ్।। అంటూ పూజించి తమ దక్షిణదేశ యాత్రదిగ్విజయ మొనర్చుమని ప్రార్థించి, అటనుండి శ్రీకూర్మముచేరి కూర్మనాధునిసేవించి, సింహాచలదివ్య క్షేత్రముచేరి కోనేటియందు దంపతీయుక్తముగా స్నానమాచరించి, సంధ్యావందనముగావించి కర్మసాక్షికి అర్ఘ్యములొసంగి , శిఖరారోహణగావించి లింగధారియు భక్తజనకల్పదృవమగు వరాహ నరసింహస్వామిని దర్శించి, భక్తితో అనేక విధములుగాస్తుతించి తీర్థప్రసాదములు స్వీకరించి అచటగల అతిసుందరమగు శిలా శిల్పమును చూచుచు, శిల్పియొక్క కళా ప్రతిభను మనస్సున కీర్తించుచూ అర్చక స్వాములచే దేవాలయస్థలచరిత్ర తెలుసుకొని, సింహాద్రినర్సన్నయను శిల్పిచే నిర్మాణమైనదని తెలుసుకొని, తమకుటుంబమువారి శిల్పకళా నైపుణ్యమునకు ఆనందపడి, శిల్పిమరణించియూ, భక్త జన హృదయములలో జీవించి యున్నారని సంతోషించి, చరిత్రాత్మకులారా! మీ త్యాగము అత్యంత శ్లాఘనీయుము, ఈ నిర్మాణమునకు జీవితము లంకితము గావించియూ, ఏ శిలా ఫలకమందునూతమ ఊరు పేరును లిఖించనిత్యాగ ధనులారా, మీకివే మా సహస్ర పాదాభివందనములని, ప్రస్తుతించుచూ ఆ దివ్యక్షేత్రమును వీడలేక, కొన్నాళ్ళట ఉండి తనివి తీరా ఆసుందర శిలా ప్రతిమలను, మరల మరలతిలకించుతూ, అటనుండి అన్నవరం జేరి, పంపానదీ పుణ్య జలంబుల జలకములాడి, రత్నగిరిపై వేంచేసియున్న త్రిమూర్త్యాత్మకరూపుడగు, శ్రీ రమాసహిత వీరవెంకట సత్యన్నారాయణస్వామిని దర్శించి, వ్రతమాచరించి కిన్నెరగ్రామమందు స్వయంభూయై వెలసిన, ఈ స్వామి అత్తవారిల్లగు యిచటకు వచ్చి, సతీసమేతుడైఅత్యంతవైభవముగా పూజలందుకొని భక్తులకోర్కెలు తీర్చుతున్నాడని, యోచించుతూతీర్థప్రసాదములు స్వీకరించి , స్వామి సమక్షమున రత్నగిరిపై ఆ రాత్రి నిద్రించి, మరునాడు దక్షిణకాశీయనబడు ద్రాక్షా రామము బయలుదేరి అచటగల పుష్కరిణిలో పుణ్యస్నానములు చేసి, శ్రీమాణిక్యాంబా సమేత భీమేశ్వరులకు భక్తి ప్రపత్తులతో అభిషేకాదులు జరిపించి, అమ్మవారికి కుంకుమార్చనలు చేసి మనస్సులోగల కోర్కెలు తెలిపి అటనుండి కోటిపల్లి చేరి, శ్రీ రాజరాజేశ్వరీ సహిత కోటేశ్వరస్వామిని అర్చించి, సాష్టాంగదండప్రణామంబు లాచరించి, ర్యాలిక్షేత్రవాసుడగు కేశవమూర్తిని దర్శించి స్వామి వెనక జగన్మోహిని అతివయ్యారముగా నిలుచుండునటులుండుట గాంచి, శిల్పి చిత్రరచనా కౌశలమును కీర్తించుచూ, మనంబున వారికి జేజేలర్పించుతూ, స్వామికి ధూపదీప నైవేద్యాదు లొసంగి ప్రణమిల్లి,





అచటినుండి అంతర్వేది జేరి పవిత్ర గోదావరి యందు పునీతులయి అంతర్వేది నరసింహుని అత్యంత భక్తి శ్రద్ధలతోఅర్చించి, అటు నుండి పాలకొల్లు జేరి క్షీరారామలింగేశ్వరస్వామికి క్షీరాభిషేకము చేయించి, గునుపూడి సోమలింగేశ్వర స్వామినిస్తుతించి, సోమలింగేశ్వరుని భక్తితో సేవించి, అటరాత్రి నిద్రించి, మరునాడు భీమవరంజేరి మావుళ్ళమ్మవార్ని కుంకుమతో పూజించి,అట నుండి విజయవాడ జేరి కృష్ణవేణి పవిత్రజలములందు స్నానమాచరించి,యింద్రకీలాద్రిపై వేంచేసియున్న శ్రీ మల్లికార్జునస్వామికి అభిషేకములు చేయించి, శ్రీ కనకదుర్గ అమ్మవారికి కుంకుమ పూజలు చేసి, ఆ పవిత్రస్థల మందు నిద్రించి, మరునాడు కృష్ణానదినిదాటి, మంగళగిరి చేరి పానకాల స్వామికి ప్రీతియగు పానకములర్పించి, ఎంత పోసిననూ అచట ఈగలు చీమలు లేకపోవుటయును, బిందెలతో పోసినా, గ్లాసుతో పోసిననూ, కొద్దిగా వదిలివేయుట శిల్పిచమత్కారమును శ్లాఘించుచూ, స్వామికి పానకము సమర్పించి, సంతోషముతో కాకాని మల్లేశ్వరునికి కానుకలొసగి, అమ్మవారికి హారతు లిచ్చి అమరావతి జేరి కృష్ణానదిలో శుచిర్భూతులై శ్రీఅమరలింగేశ్వరుని పూజించి అట నుండి బయలుదేరి మార్గమందలి ప్రదేశము తిలకించుతూ, అతి ప్రయాసతో శ్రీ కాళహస్తి జేరి స్వర్ణముఖినదిలో స్నానమాచరించి, కాళహస్తీశ్వరుని అభిషేకించి, కామితములు దీర్చుమని అర్థంచినాటిరేయి సత్రములో విశ్రాంతిగైకొని, అటనుండి తిరుపతికి ప్రయాణమైరి, మార్గమధ్యంబున నిద్రించుచున్న వీరయోగీంద్రులకు స్వప్నంబున భస్మోద్ధూళితవిగ్రహుండగు యతీశ్వరుండుకన్పించి "వీరయోగీ" జగశ్ఛిల్ప నిర్మాణ చతురుండగు విశ్వకర్మభగవానుండు, దర్శనమాత్రంబున సకల జనపాతకహరంబై, ముక్తి భుక్తులొసగు పరమపవిత్రంబులగు శిలావిగ్రహంబులకు దేవత్వమహత్వంబు గల్పించినట్టి మహత్తర శిల్పములు, త్రైలోక్య పూజితంబై, దేవాసుర మునిజనాభీష్టంబులగు, అష్టసిద్ధులు కాస్పదంబైయున్న సుబ్రహ్మణ్యేశ్వర నివాసంబగు తిరుమల మహాక్షేత్రంబున, సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయంబొకటికలదు. అయ్యది పూర్వదేవతా ప్రతిష్ఠితంబై ప్రాచీనంబగుటచే జనధనాకర్షణాది యంత్రంబులు జీర్ణములైన కారణమున, భక్తులా మహాదేవుని పూజించి తమ సకలదోషములు నివారించు కొనుటకచటికేగుటలేదు. అట్టి సమయంబున ధర్మపాలుడను ఉత్తరభారతమున కళ్యాణ పురవాసుడు విశ్వకర్మ కులదీపకుడు, కామాక్షీప్రసన్నుడగు కాంస్య శిల్పి నాయాజ్ఞచే అటకేగి దేవాలయమునందలి జీర్ణయంత్రములుతీసి, నవీన యంత్రములుజేసి, మయమత సిద్ధాంతంబుల పునరుద్ధారణంబు గావించి ఆగిరికేగు భక్తులకు క్రూరమృగంబుల నుండి, భూతప్రేత పిశాచాదుల నుండి, విషజంతువుల నుండి ఎట్టి ఆపదలేకుండుటకై మార్గమధ్యంబున నారసింహ, గరుడ, హనుమదాది, యంత్రంబుల స్థాపించి శిలాశాసనములు వేసెను. నాటినుండి ఆ క్షేత్రము దినదినాభి వృద్ధినొంది జన, ధనాకర్షణలతో నిత్య కళ్యాణ పచ్చతోరణమై వెలుగొందుచున్నది. నీవు ఆ పుణ్యక్షేత్రమున కేగిన నీ జన్మ కర్మలునశించి కోర్కెనెరవేరగలదని తెల్పి అదృశ్యుండాయెను. తెల్లవారు ఝామున కలగాంచి మేల్కాంచి, ఆ విషయములు స్ఫురించు కొనుచూ తిరుపతి జేరిరి. తిరుమలలో శైవమును, శాక్తేయముగా, చేసిశంకరాచార్యులు శ్రీ చక్రప్రతిష్ఠచేయగా, కొన్నేండ్లకు వైష్ణవ మతప్రచారానికి కంకణం కట్టుకున్న రామానుజాచార్యులువారు వెంకటేశ్వరునిగా మార్చి పూజించిరి- శాక్తేయము, వైష్ణవము గాను మారిన వేంకటేశునికి హిందూ ముస్లింలే గాక, షన్మతములవారును తలనీలాలర్పించి మ్రొక్కిన మ్రొక్కులు తీర్చుకొనుట గాంచి సంతసించుచూ, ఆ దేవాలయమున రహస్య నైవేద్యములు తరతరములనుండి యున్న అనువంశీక అర్చకులు నివేదన జేతురు. ఆ సమయమున ఎవ్వరికీ దర్శన అధికారమీయక తన పూజా నైవేద్యాదులందిన పిదప, వైఖానసులు, నివేదన, చేయుట మొదలగు విషయములు తెలుసుకొని అచట దైవాన్ని సుబ్రహ్మణ్యేశ్వరస్వామిగా ఆరాధించి అర్చించి

అటనుండి చెన్నపురిలోని మైలాపూర్‌లో రావణబ్రహ్మప్రతిష్ఠితమగు కపాలేశ్వరస్వామికి అభిషేకాదులు నిర్వహించి అచటినుండి బయలుదేరి మార్గమందలి, పుణ్యక్షేత్రాలు తిలకించుచూ, తిరుచ్చిచేరి తిరుచ్చిలోగల సుబ్రహ్మణ్య స్వామి దేవాలయ మందలి దక్షిణావృత శంఖముతో సమమగునది వేరెచ్చటాలేదను ఆర్యోక్తికి తగినట్లుగా, విశేషశుభలక్షణములతో సుబ్రహ్మణ్యస్వామి వద్ద ఆశంఖము శాశ్వత పూజలందు కొనుట ప్రశంసనీయము. అవన్నితిలకించి అటనుండి అలంపూరు వెళ్ళి జోగులాంబను సద్భక్తితోఅర్చించి, అచటనేగల బ్రహ్మదేవాలయ విషయములెరుంగలేక విచారించుతూ, వివరములు తెల్పువారు లేకచేయునది లేక అటనుండి వీరాచార్యులు కాంచీపురముజేరి విశ్వబ్రాహ్మణ వీధిలోగల కామాక్షీమాత ఆలయమున ప్రవేశించి ఆ మాతకు ధూపదీప నైవేధ్యములతో  పూజ చేయించి, కర్పూరకాంతిలో అమ్మవారి పాదముల చెంత గల మూడు శిరములను జూచి అర్చక స్వాములతో యిచట గల ఈ శిరస్సుల చరిత్రయేమని ప్రశ్నింపగా నియమనిష్ఠాగరిష్ఠుండగు ఆ పౌరుషేయబ్రాహ్మణుడు యిట్లు చెప్పనారంభించెను. నాయనా! భూమినుండి లభించి మానవ నిత్యజీవమునకు ఉపకరించు! సమస్త లోహములు ఒకే విలువగల కాలమున ఉత్తర భారతములోని మాళవదేశమందలి కళ్యాణపురమునందుగల విశ్వకర్మ వంశజుడగు ధర్మపాలుడుగలడు. వారు కాంస్యవృత్తిలో మహాద్భుత కళానైపుణ్యము గలవారు. వీరికి నల్గురు పుత్రులు గలరు. వారు శిల్పకళా నిపుణులేగాక, సత్యధర్మ వ్రతాచరణులగు ధర్మశీలురు. అమిత పరాక్రమవంతులు, గదబాణ, ఖడ్గము యుద్ధములం దారితేరిన వారు. ఘోరనియమనిష్టలతో శ్రీ కామాక్షీదేవినుపాశించి, మహామహిమాన్వితము, దివ్యశక్తులు గల "తూచుకోల" యను మంత్ర దండమును  దేవీకటాక్షమున పొందిరి. ఆ తూచుకోలను తమ జయసంకేతముగా రక్షణగా ఎచటికేగినా తమవెంట తీసుకువెళ్ళెడివారు. వారు భారతదేశమంతయూ వ్యాపారార్ధమై తిరిగెడివారు. ఒకసారి దక్షిణభారతము లోని కాంచీపురమున గల కంచికామాక్షీ ఆలయమును దర్శింప వేడుకతో, తాము నిర్మించిన చిత్ర విచిత్ర కళానైపుణ్యముతో బంగారు, వెండి, రాగి, కంచుతో తయారుజేసిన వస్తువులు ఎత్తుకురెండెత్తుల పసిడితో విక్రయించుచూ, వ్యాపారార్ధమై, తమ ముఫ్వురు పుత్రులను, సేవకులను, పనివారిని వెంటనిడుకొని నాల్గవ కుమారుని గృహరక్షణగా యింటివద్ద యుంచి, కాంచీపురము వచ్చి విశ్వకర్మకులజుల యిలవేల్పు యగు కామాక్షీ ఆలయప్రాంతమున విడిదిచేసి, తమ వ్యాపారము చేయుచుండెరి, కాంచీపుర "రాకుమారి" అమ్మవారి దర్శనార్ధం దేవాలయమునకు వచ్చి ఆచట గల కాంస్యవస్తువులను గాంచి వాటి కళానైపుణ్యమున కబ్బురపడుతూ, ముగ్ధురాలై ఒక కాంస్య దర్పణముచేకొని, అంతఃపురమున క్రయధన మొసంగుదురని వెడలిపోగా రుద్రసేనుడు క్రయధనమునకై రాజాంతఃపురమునకు వెళ్ళగా క్రయధనము సంగతటుంచి, మా రాజ్యమున వ్యాపారము చేస్తున్నందుకు తిరిగి సుంకము, చెల్లింపుడు. లేకున్న దండింతుమని మంత్రి రుద్రసేనుని బంధించ ప్రయత్నించగా "తూచుకోల" సహాయమున అచటగల  రాజపరివారమును జయించి తమ విడిది ప్రాంతముచేరి తండ్రికీ విషయము వివరించుచుండగా, ఆ దేశ సైన్యాధిపతి సర్వసైన్యముతో కాంశ్యకారులను బంధించుటకు రాగా, రుద్రసేనుడొక్కడే తూచుకోలతో సర్వసైన్యమును జయించెను. యిదివిన్న సూరన్న మంత్రివారి శక్తికి తూచుకోలయే ప్రధానమని, శుక్రవారము వారు ఆయుధములు ధరింపరని గ్రహించి సంధి ప్రయత్నముగా ధర్మపాలుని కుమారులగు రుద్రసేన, భద్రసేన ఇంద్రసేనుల ముఫ్వురనుకోటకు ఆహ్వానించి, తమ తొందర పాటుకు పశ్చాత్తాపపడుచూ, వారికి సకల బంధులాంఛనములతో విందు చేయించి, గౌరవముగా క్రయధనమిత్తుమని రాజప్రసాదమునకు తోడ్కొనిపోయి బంధుమర్యాదగా శిరఃస్నానము గావింతుమని వారిని కూర్చుండబెట్టి తలపై కుంకుడుకాయ పులుసుపోసి, ముందుగా తీయించిన





గోతులలో తలమాత్రము కనబడునట్లుగా బడద్రోచి, సుంకము కట్టుదుమన్నవిడుతుము లేకున్న తలలుతీయింతుమని హెచ్చరించిరి. వారట్లంగీకరింపక పోవుటచే ముఫ్వురి శిరములు ఖండింపగా అమ్మవార్ని ధ్యానించుచూవారి శిరములు అంబరవీధిలో అమ్మా, అమ్మాయనుచూ, ఆర్తనాదములు చేయుచూ పక్షులవలే ఆలయ ప్రాంగణమును ప్రదక్షిణ చేస్తుండగా, కామాక్షీమాత తనభక్తుల ఆర్తనాదములకు ఆగ్రహించిన అమ్మవారు తనముక్కంటి జ్వాలలచే కాంచీపురమును భస్మము గావించుచుండగా, పురప్రజల ఆర్తనాదములు గాంచిన రాజు భీతిల్లి దేవాలయము చెంతజేరి ధర్మపాలుని శరణుకోరగా ధర్మపాలుడు కాంచీపురజనులను రాజ్యమును రక్షించమని అమ్మవారిని ప్రార్ధించగా, కామాక్షీమాత కరుణించి, రాజునిక్షమించి, రాజ్యమునురక్షించి, ధర్మపాలుని ముఫ్వురు తనయులను సజీవులను జేసి ఈ చరిత్ర లోక ప్రసిద్ధి నొందుటకు తన భక్తులు ముఫ్వురి శిరములు తనపాదములచెంత గర్భగుడిలో ప్రతిష్ఠించుకొని, భక్తులపాలిట కల్పవల్లిగా అలరారుచూ తనకు జరుగు పూజాదులు ధర్మపాలుని తనయులకు చెంది, జగత్రసిద్ధి నొందునట్లను గ్రహించిన కరుణామయి కామాక్షీమాత యిట్టి "జగజ్జననిని" విశ్వకర్మకులజులు సదాసేవించిన సకల భోగభాగ్యములు పొంది చరితార్ధులగుదురు. నాయనలారా! దేవాలయమందు నమస్కరిస్తూ మీరు చేయు ప్రధమప్రదక్షిణ అహర్నిశలు శ్రమంచి తన శిల్పకళా కౌశలముచే రాతికి జీవంపోసిన శిల్పికి ఆ నిర్మాణానికి తల్లిగా చెందును.

రెండవది అనేక వ్యయప్రయాసలకోర్చి దేవాలయ నిర్మాణమునకు కంకణం కట్టుకున్నవారికి ఆ దేవాలయ నిర్మాణానికి తండ్రిగా చెందును.

మూడవది మీరు ఆత్యంత భక్తి శ్రద్ధలతో ఆరాధించు దేవతామూర్తికి చెందుననిరి.

ఈమాటలు విన్న వీరాచార్య దంపతులు అర్చకస్వాములు వారికి దక్షిణ సహిత తాంబూలములతో సాష్టాంగదండ ప్రణామం చేయగా "మనోవాంఛా ఫలసిద్ధిరస్థని" ఆశీర్వదించిరి అచటనుండి శివకంచిచేరి బంగారు బల్లులను స్పృజించి, బయలుదేరి మధురమీనాక్షి ఆలయముజేరి, కావేరీ నదియందు కృంకులిడి, మీనాక్షీ దేవాలయమందలి సువర్ణమేరువ శ్రీ చక్రమునకు కుంకుమార్చనలు జేసి, అటనుండి శ్రీ రంగము జేరి కావేరీనదిలో జలకములాడి, ఆండాళ్ళు సమేత శ్రీ రంగనాధుని భజియించి, అచటనుండి రామేశ్వరముజేరి స్వయంభూ లింగమునకు సాష్టాంగ దండప్రణామములాచరించి, కన్యాకుమారి అమ్మవారిని కుంకుమతో పూజించి, చిదంబరముజేరి చిదంబర రహస్యమును తెలుసుకొని, తంజావూరునందలి శివాలయములను దర్శించి, తిరుగు ప్రయాణమై లేపాక్షి క్షేత్రము జేరి అచట చిన్నకొండను నందిగామలచిన శిల్పిచాతుర్యానికి సంతసించుతూ, ఆ మంటప స్తంభములందు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల నాట్యము, వాద్యము, తాళములు వీణాదిగా గల సంగీతవాయిద్యములతో గల ఆసభయందు, విరాట్ విశ్వకర్మ భగవానుడు ఉన్నతాసనము పైకూర్చుండి ఆనృత్యగానమును వీక్షించు సన్నివేశమునకు అబ్బురపడి, శిల్పికిమనంబున సహస్రపాదాభివందనములర్పించి, విశ్వకర్మభగవాన్‌కు జేజేలు పలికి, ఆ రేయి అచట నిద్రించి, మరునాడు కందిమల్లయపురమునకు ప్రయాణమై, కంది మల్లయ పురముజేరి వీరబ్రహ్మేంద్రస్వామి  మఠాధిపతులను కలసి, తమ వృత్తాంతము తెలిపి మఠవిషయములను తెలుసుకొని, జేజి నాయనజీవసమాధికి సాష్టాంగదండ ప్రణామములనర్పించి.

**సీ॥ శ్రీవీర యోగీంద్ర చిన్మయబ్రహ్మేంద్ర- వందనీయమీకు వందనములు**
**శ్రీపోతులూర్వంశశేఖరా నీదివ్య - పాదకమలములకు వందనములు**
**శ్రీరాజయోగీంద్రసేవింతు గుణసాంద్ర - హరిహర బ్రహ్మాత్మ వందనములు**

**శ్రీకరా నీ నామ సంకీర్తనమె జేతు - భక్తిగా పూజింతు వందనములు**

**గీ॥ విశ్వవిఖ్యాతిచెందిన వేదవేద్యా విసుతిజేతుము శ్రీ విరాట్ వీరబ్రహ్మ ।**

**గురువరామమ్ముబ్రోవుము కోర్కెదీర అందుకొనుమయ్య మా శతవందనములు** ॥ అనుచగా ధూప దీప నైవేద్యాదులతో పూజించి, ఆరేయి మఠప్రాంగణమున నిద్రించిరి. మరునాటి ఉదయం ఆప్రాంగణమున ఒక యతీశ్వరుడు గౌరీదేవికి కన్పించగా, ఆమె ఆ మహనీయుని దరికేగి దీనవదనయై తన వృత్తాంతము తెలుపగా ఆయోగి బిడ్డా ఏల బాధపడెదవు, త్వరలో నీకు విశ్వము నేలు విశ్వనాధుడు జన్మించును. ఆమహాపురుషుడు మీవంశమునకేగాక విశ్వబ్రాహ్మణ కులోద్ధారకుడై, సమస్తమానవాళికి స్తుతి పాత్రుడగును. మీరు నిశ్చింతగా శ్రీశైలమల్లేశ్వరుని దర్శించి, గృహోన్ముఖులగుడు ॥"శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించి అదృశ్యుడాయెను. అంతగౌరమాంబ కలయా నిజమాయని, కొంతవడికితెప్పరిల్లి యతీశ్వరుడు వీరబ్రహ్మేంద్రునిగా తలంచి, ఆనందపారవశ్యమున స్వామినిస్తుతించుచూ భర్తదరికేగి విషయాన్ని వివరించగా వీరయోగి, వెంటనే శ్రీ శైలము వెళ్ళి మల్లికార్జునుని దర్శించి గృహోన్ముఖులగుదుమని, వీరబ్రహ్మేంద్ర స్వామి జీవసమాధికి ప్రదక్షిణలు గావించి, సాష్టాంగ దండప్రణామము లాచరించి అఖండ జ్యోతిని కనులకద్దుకొని, తీర్ధ ప్రసాదములు స్వీకరించి, మఠాధిపతుల ఆశీస్సులతో శ్రీశైలం బయలుదేరి, మహారణ్య దుర్గంబులందు పయనిస్తూ, అతి ప్రయాసతో అరణ్యమృగముల నుండి తప్పించుకొనుచు, మల్లేశుని మనసున నిలిపి "అన్యధా శరణం నాస్తి త్వమేవశరణంమమ" తస్మాత్ కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వరా॥ యని ప్రార్ధించుచూ ఎట్టకేలకు శ్రీశైల శిఖరదర్శన ప్రాంతమునకు జేరి, హేమనిర్మితంబైవెలుంగు శ్రీ శైల శిఖర దర్శనం జేసుకొని, పునర్జన్మ రహితులమైతిమని సంతసించుచూ, అచటినుండి సకలభూత ప్రేతపిశాచ బాధాపహారిణియగు పాతాళగంగలో మునిగి స్నాన సంధ్యానుష్ఠానములు చేసుకొని, సహస్రాక్షాది సకల ప్రముఖదేవతల పూజలందుకొను శ్రీశైల మల్లిఖార్జున స్వయంభూ లింగము, జ్యోతిర్లింగమని పెద్దలు చెప్పు వాక్యాను సారము ఆ దంపతులు నిదానించి చూడగా అందు జ్యోతి కన్పించగా వారు మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, పంచామృతములతో చేసి నానా విధఫలపుష్పములతో స్వామిని అర్చించి యిలా ప్రార్ధించారు.

**ప॥ మల్లిఖార్జునస్వామి - మముబ్రోవరావేమి**
**మామొరవినవేమి - మముదయగనవేమి ॥మ॥**

**అ॥ప॥ తల్లి పార్వతితోడ - తరలివచ్చియు మాకు**
**తనయునొసగుము స్వామి - సర్వాంతర్యామి॥మ॥**

**చ॥ స్వాంతమందునమేము - సంతానమునుకోరి**
**చింతజేయుచుకదలి - సేవింపవచ్చాము.**
**పంతమేలను నీకు - పార్వతీరమణ**
**చెంతజేరిన మాకు - శీఘ్రముగఫలమిమ్ము ॥మ॥**

అని స్తుతించి ఏకాదశరుద్రాభిషేకంబులు గావించి, మద్యాహ్నం మహానైవేద్యము నివేదనగావించి, తీర్థప్రసాదములు సేవించి, కొంత విశ్రమించి సాయంసమయమున భ్రమరాంబ దేవాలయమునకేగి ప్రదక్షిణ గావించుతూ, దేవాలయవెనుకభాగమున ప్రశాంతమనస్సుతో వినగా తుమ్మెద ఝుంకారము వినిపించగా, దానికే ఆ దేవి భ్రమరాంబయైనది యనితలంచి, ఈ క్షేత్రము అతి పురాతనమైనదియూ సాక్షాత్ పరమేశ్వరుడుసతీసమేతుడై యిచట నివసించుననియూ





"యతీశ్వరులకిది ముఖ్యస్తావరమను" ఆర్యోక్తి యదార్ధమని తలంచుతూ సంధ్యాసమయమున భ్రమరాంబికాదేవికి సహస్రనామ కుంకుమార్చనలుగావించి తీర్ధప్రసాదములు స్వీకరించి, ఆలయప్రాంగణమున ఆరేయి నిద్రించిరి. గౌరీదేవికి తెల్లవారుజామున పరమేష్ఠి స్వప్నమున సాక్షాత్కరించి అమ్మాగౌరమాంబా! మీ భక్తికి సంతసించితిని, మీకు త్వరలో కుమారుడనై జన్మింతునని "అభయమిచ్చి" అంతర్ధానమాయెను. వెంటనే గౌరీదేవిమేల్కాంచి పతిని నిద్రలేపి స్వప్నవృత్తాంతంబు వివరింపగా వారిరువురు ఆనందపారవశ్యమున ఆదేవదేవుని దివ్యనామములు కీర్తించుచూ భజించుచూ మల్లిఖార్జున స్వామి ధూళి దర్శనముగావించుకొని పాలకొండకు పయనమయిరి.

వీరాచార్య దంపతులు దక్షిణదేశ తీర్ధయాత్రలు ముగించుకొని క్షీరాచలముజేరి బంధు మిత్రులరావించి, అన్న సమారాధనలు జేసి యాత్రావిషయములు తెలిపి, వచ్చినవారందరికి దక్షిణసహిత తాంబూలము లొసంగి అందరినీ సంతృప్తి పరచి, పెద్దల ఆశీర్వాదములు గైకొని పరమేశ్వరుని దివ్యనామములు స్మరించుతూ ప్రశాంతముగా కాలము గడుపుచుండిరి.

## (4) విశ్వనాధునిజననము

సంతోషాంతరంగిణియగు గౌరమాంబ ప్రశాంతముగా నిద్రించు ఒకనాటి వేకువఝామున, స్వప్నమో సత్యమో, ఎరుగనిస్థితిలో జ్యోతిరూపమున వెలుగు గర్భమున ప్రవేశించెను. గౌరీదేవి వెంటనే నిద్రమత్తు నుండి స్పృహలోకి వచ్చి యోగధ్యానుడైయున్న భర్తనులేపి, తానుపొందిన అనుభూతి విషయము తెలుపగా దైవలీలగా భావించి, దంపతులా పరమాత్మను ధ్యానించి నిత్యకృత్యములలో నిమగ్నులయిరి. కొన్ని దినములకు గౌరీదేవి గర్భవతి యయ్యెను. ఆ వార్తను విన్న బంధుమిత్రాదులు ఆనందపరవశులయిరి. ఆ స్థితిలో ఆమెకు నవమాసములు 9 రోజులుగా గడిచిపోయినవి. చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించదగినట్టిరోజు ఆనందనామ సం॥ర కార్తీకశుద్ధపంచమి సౌమ్యవాసరం శ్రవణా నక్షత్రయుక్త అభిజిత్ముహూర్తము మకరలగ్నమున, జగద్గురు విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి కాలజ్ఞాన వాక్యప్రకారం సాక్షాత్ పరమేశ్వరుడు సుందరమానవాకృతితో గౌరమాంబగర్భవాసమున పుత్రుడై జన్మించెను. ఆ సమయమున క్షీరాచలమందలి దేవాలయములలో జయగంటలు మ్రోగినవి. అంతరిక్షమునుండి అమృతజల్లులు పడినవి. భూమాత ఆనందపారవశ్యమున పులకరించినది. ఒక్కక్షణకాలము ఓంకారధ్వని దశదిశల ప్రతిధ్వనించినది. ప్రకృతి పులకరింతకు పాలకొండ వాసులు ఆనందపరవశులయిరి. బాలుని 21వ రోజున వేదాధ్యయన సంపన్నులగు పౌరుషేయ బ్రాహ్మణ పండితులవేదమంత్రములతో హోమాదుల నాచరించి , వీరాచార్యులవారు శివభక్తుడగుట చేత శ్రీశైలమల్లేశ్వరుడు పుత్రుడనై జన్మింతునని తెల్పుటచేతను , బారసాలమహోత్సవము ఘనంగా జరిపి బాలునకు "విశ్వనాధాచారి" యని నామకరణం జేసి ఆకార్యక్రమమునకు విచ్చేసిన బంధు, మిత్ర, కవి, గాయక, పండితవరేణ్యులను, శిల్పులను, చిత్రకారులను వీరాచార్యులవారు పంచభక్ష్యపరమాన్నములు ,నవకాయ పిండివంటలతో విందు నేర్పరచి, అతిధులందరకూ వస్త్రదక్షిణ సహిత తాంబూలంబు లొసంగి, అందరిని సంతృప్తుల గావించి సంతోషముతో సాగనంపెను. సాక్షాత్ పరమేశ్వరాంశతో జన్మించిన బాలుని వారు అల్లారు ముద్దుగా పెంచుచుండిరి.

## (5) బాలుని అన్నప్రాశన, అక్షరాభ్యాసం

బాలుని ముద్దుమోము చిరునవ్వు, హృదయానందము కల్గించుకేరింతలు, చిన్నిచిన్ని పలుకులు, కూనిరాగములతో కన్నవారిని అనుక్షణం ఆనందపరచుచూ నవమాసములు 9 రోజుల వలే వారికి గడచిపోయినవి. బాలునకు ఒక శుభముహూర్తమున వీరాచార్యులు వారు అన్నప్రాశన ఏర్పాట్లు ఘనంగా జరిపించిరి. ఆనాడు బాలవిశ్వనాధుని స్వర్ణాలంకారభూషితుని జేసి,

పూజామందిరము నందు ఫల,పుష్పములు పసుపు, కుంకుమలు, కత్తి, సుత్తి, ఘంటము, పుస్తకము, స్వర్ణా భరణములు, దేవతాప్రతిమలు, క్షీరాన్నము మొదలగు వస్తువులన్నియూ చుట్టూ పెట్టి బంధుమిత్రాదులు చూచుచుండగా గౌరీదేవి బాలుని అచట కూర్చుండబెట్టెను. బాలుడు అచటగలవారందరూ ఆశ్చర్యపడునట్లుగా పూజాపీఠమందలి రుద్రాక్షజపమాల విభూతిని తీసెను. రెండవసారి ఘంటము, దైవవిగ్రహములను, మూడవసారి వదిలినపుడు శివలింగముతో ఆటలాడుట గాంచిన, బంధువులు ఈతడు సామాన్య బాలుడుకాడు. కారణజన్ముడని కొనియాడి, కన్నవారి జన్మలు ధన్యమగునని కీర్తించిరి. అమితానందముతో వీరాచార్యులవారు వచ్చిన అతిధులందరికి ఘనసత్కారములతో షడ్రసోపేతమగు విందునేర్పాటుచేసిరి. అతిథులందరూ మహదానందముతో, బాలుని ఆశీర్వదించి నిజ గృహంబులకుజనిరి. యిట్టి నిత్యకృత్యములతో బాలునికి ఐదవసంవత్సరము ప్రవేశించినది. వీరాచార్యులవారు బాలుని 4 సంవత్సరముల 5 నెలల 5 రోజులకు అక్షరాభ్యాసం ముహూర్త నిర్ణయించి, శుభ లగ్నమున బాలునకు అభ్యంగన స్నానముచేయించి పట్టువస్త్రములు ధరింపజేసి తండ్రి తనయునితొడపై కూర్చుండబెట్టుకొని , ఘంటము బాలుని చేతపట్టించి తాళపత్రముపై ప్రణవమును, తర్వాత పంచాక్షరిని వ్రాయించిరి. వెంటనే బాలుడు "ఓం నమః శివాయ సిద్ధం నమః" అని వ్రాసి ఆకార్యక్రమమునకు విచ్చేసిన బంధుమిత్రాదుల నానందపరచెను. కన్నవారి ఆనందమునకవధులు లేకపోయినవి. వీరయోగీంద్రులు వచ్చిన వారందరికి ఘనసత్కారములు జరిపి సంతోషముతో సాగనంపిరి.

## (6) అన్నపూర్ణమాత జననము

విశ్వనాధుడు జన్మించిన కొన్నేండ్లకు అచటదగ్గరలోగల సుమంగళీపుర గ్రామమున సుప్రసిద్ధ విశ్వకర్మకులజులు శాక్తేయులునగు భ్రమరాంబ, బ్రహ్మనందాచార్య దంపతులకు పూర్వజన్మ సుకృతంబున, వారినిత్యానుష్ఠానప్రభావంబున, వారికి సాక్షాత్‌పరమేశ్వరి అన్నపూర్ణమాతగా జన్మించినది. ఆ బాలిక చిన్నతనమునుండి శివనామము జపించుతూ, శివభజనలు చేయుచూ, పరమేశ్వరుని అద్భుతలీలా విలాసములు కన్న వారితో చెప్పించుకొనుచూ, తోటి బాలబాలికలకు చెబుతూ, నిరంతరము శివధ్యానియై యుండెను. శివుని దూషించిన వారిని దూరముచేయుచూయున్న, కుమార్తె భక్తి ప్రపత్తులకు తల్లిదండ్రులు మురిసి ముగ్ధులగుచుండిరి. యిది అన్నపూర్ణాంబ బాల్యము ఆది దంపతుల జననముతో భూమాత సంతసించి దుష్టశిక్షణ జరుగునని సంతోషించినది.

ప్రధమాధ్యాయము సమాప్తి

❀ ❀ ❀



దేవాలయ గర్భగుడి చిత్రము





## (7) పురాణ ప్రసిద్ధి చెందిన విశ్వకర్మ చరిత్రలు (ద్వితీయాధ్యాయము)

వీరాచార్యులు వారు కుమారుని తొడపై కూర్చుండబెట్టుకుని ఆదిలో విరాట్ విశ్వకర్మ భగవానుని ఆవిర్భావము, తద్వంశీయుల చరిత్రలు తెల్పెడి వారు. ఒకనాడు బాలునితో నాయనా ప్రాచీనకాలమున "**విశ్వకర్మయను పేరుతో ననేక సుప్రసిద్ధ పురుషులుండిరి.** వారిలో **పురాణ ప్రసిద్ధి చెందిన విశ్వకర్మలు** ముగ్గురు.

### 1. విరాట్ విశ్వ కర్మభగవానుడు

సృష్ట్యాదియందు ఏ యితర పదార్ధములు లేని సమయమున వట్టి బయలందు అకార, ఉకార, మకార సంయోగముచే ప్రణవ నాదమేర్పడి అందుండి ఆది అంతములు లేని మహాజ్యోతివెల్వడెను. ఆ మహాతేజస్సే విరాట్ విశ్వకర్మ భగవానుడు స్వయంభూ, జ్యోతిరూపుడు, సాకారుడు, నిరాకారుడు, వీరే పురుషుడు, "స్త్రీయునూ" ఆమె గాయత్రీమాత, వీరిని ఈ అనంత విశ్వమందలి ఏ దేశము, ఏ ప్రాంతం, ఏ భాష, ఏ మతం లేక ఏకులం వారు ఏ రూపున ఏ భాషతో ఆరాధించిననూ వారికా రూపుననే కామితము లీడేర్చుచుందురు. ఈ విరాట్ విశ్వకర్మకు పంచముఖములైన సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈ శానముఖములు గల్గి తనమనో సంకల్పముచే త్రిలోకములను, అనేకోటి బ్రహ్మాండములు. పదునాల్గు భువనములు, పంచభూతములను, నక్షత్ర గ్రహతారకాదులను సృజించిరి. (యజుర్వేద 1-31-17)

**శ్లో॥ అద్భ్యః సంభూతపృధివ్యైరసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే**
**తస్యత్వష్టా విదధద్రూపమేతి తన్మర్త్యస్య దేవత్వమాజానమగ్రే॥**

ఈ ప్రకారంగా విశ్వకర్మ పరమాత్మ ఆజానదేవతలైన (అయోనిసంభూతులైన) ఈశ్వరుడు, విష్ణువు, బ్రహ్మ, దేవేంద్రుడు, సూర్యభగవానులను, తన పంచముఖముల నుండి సృజించి వారి మరోరూపగు గాయత్రీమాత పంచముఖములనుండి వరుసగా ఆదిశక్తి, పరాశక్తి, యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తులను తమమనోసంకల్పముచే సృజించి, అణువునుండి బ్రహ్మాండమంతటా తానైయుండి సకలచరాచరములందు తానుండి, ఎవరికీ అంతుచిక్కక ఈ అనంత విశ్వపరిపాలనా బాధ్యతలను పంచ దైవజంటలకప్పగించి, తాను సాక్షీభూతుడై, ఎవరికీ గోచరింపక బ్రహ్మ విద్యాపరులకు మాత్రమే త్రికూట స్థానమున జ్యోతిరూపమున సాక్షాత్కరించుచుండెను. ఈ అనంత విశ్వమును సృజించినవారు కావుననే ఈ మహనీయుని విశ్వకర్మయందురు. గాయత్రీ, విశ్వకర్మ భగవానులు ఒక్కరే వేరుగాదు. ప్రముఖ వాగ్గేయకారుడు, రచయిత, బ్రహ్మజ్ఞాని అయిన అన్నమాచార్యులన్నట్లు బ్రహ్మమొక్కటే, పరబ్రహ్మమొక్కటే అనేకములు లేవు. మన ఊహచే ఏకమునుండి అనేకములను ఆరాధించుచున్నాము. ఎవరే రూపంలో ఆరాధించినా వారికారూపుననే ఆదిదేవుడు సాక్షాత్కరించి మోక్షమును ప్రసాదించును.

### 2. శిల్పప్రజాపతి విశ్వకర్మ

బృహస్పతి సోదరి "యోగసిద్ధ" ప్రభకు అష్టవసువులలో చివరి వాడగు " ప్రభావసు" నకు శిల్ప ప్రజాపతివిశ్వకర్మ జన్మించెను. ఈయన ప్రహ్లాదుని కుమార్తెయగు "రచనను" వివాహమాడెను. ఈ మహనీయుడు తనమనోశక్తిచే, అనంత శిల్పములను రచించువాడును. అనేక దేవతానగరములు నిర్మించి, కుబేరునకు లంకాపురిని పుష్పకవిమానమును, శ్రీ కృష్ణునకు ద్వారక, కౌరవులకు యింద్రప్రస్థమును, పాండవులకు మయసభను నిర్మించి యిచ్చిన మహాశిల్పి, త్వష్ట బ్రహ్మ కుమార్తెయగు సంజ్ఞాదేవి తనపతియగు సూర్యభగవానుని తీక్షణమును తాళజాలక, తనకు మారుగా ఛాయాదేవిని గృహమందుంచి, తాను తండ్రి వద్ద ఉండి పోయెను. యిది గ్రహించిన బ్రహ్మదేవుడు శిల్ప ప్రజాపతికీ విషయము తెలుపగా, ఈ విశ్వకర్మ తన దృష్టిచే సూర్యుని తీక్షణా

శక్తిని కొంత గ్రహించి, దానిచే శివునకు త్రిశూలమును, విష్ణువునకు సుదర్శనచక్రమును, దేవేంద్రునకు వజ్రాయుధము "విజయ"అనురధమును నిర్మించియిచ్చిన మహా శిల్పి. దేవతలకు నివాస భవనాలను, రధాలను, శస్త్రాస్త్రములను, ఎవరికి తగినట్లుగా వారికి నిర్మించి యిచ్చెడివాడు. ఈయన కుమారుడగు నీలాచార్యుడు శ్రీరామునకు సేతువు నిర్మించి లంకా ప్రవేశమునకు కారకుడైనాడు. విశ్వకర్మ వాస్తుకళ, శిల్పశాస్త్రరంగాలకు మాత్రమే పరిమితం కాకుండ సమస్త మానవాళికుపకరించు అనేక యంత్రాలను నిర్మించి, మానవాభ్యుదయమునకై శ్రమించిన మహనీయుడు. అంతేగాక మానసిక వికాసమునకై సంగీత సాధనాలను, నృత్య ఆహార్యాదులను, చిత్ర, శిల్పకళలకు ఆధారుడైన మహాశిల్పి.

## 3.భువనపుత్ర విశ్వకర్మ

విరాట్ విశ్వకర్మ భగవానుడు "అధర్వణవేదమును" అంగిరబ్రహ్మఋషిద్వారా ప్రకాశింపజేసెను. ఈయన గొప్ప విద్వాంసుడు, ఉన్నత ఆశయములుగల వ్యక్తి ఈయనకు 7గురు పుత్రులు జన్మించిరి. ఆఖరివాడు ఆప్త్యబ్రహ్మఋషి యితనుగొప్ప విధ్వాంసుడు మహాతేజస్వి. ఈ మహనీయునకు జన్మించినవారే భువనపుత్ర విశ్వకర్మ.

వీరు ఆదిలో సమస్తభూమండలమును ఏకఛత్రాధిపత్యముగ ఏలిన విరాట్ చక్రవర్తి ఈ మహనీయుడు విశ్వమానవమనుగడకు పంచదాయిలవారితో పంచవృత్తుల కర్మాగారములేర్పరచి, అందు మనుబ్రహ్మవంశజులకు యినుపపని, మయబ్రహ్మ వంశజులకు కొయ్యపని, త్వష్ట బ్రహ్మవంశజులకు లోహవృత్తిని, శిల్పబ్రహ్మ వంశజులకు రాతిపనిని, విశ్వజ్ఞ బ్రహ్మవంశజులకు సువర్ణవృత్తిని చేయుటకు నియమించి, ఈ పంచవృత్తులచే ప్రపంచ జనజీవనములకు కావలసిన అన్ని వస్తువులను తయారు చేయించి వంశపారంపర్యములుగా ఈ క్రియలచే జీవించునట్లాశీర్వదించి, శిక్షణలనిస్తూ ప్రపంచమందలి సర్వమానవమనుగడకూ మార్గదర్శులైరి. పంచాననులు కర్మశాల నిర్వాహకులు కావుననే "కంసాలు" లను పేరు పామరులలో చిరస్థాయిగా నిలచెను. కాలప్రవాహమున యినుము పనిచేయువారిని కమ్మరులని, చెక్కపనిచేయువారిని వడ్రంగులని, శిలానిర్మాణముచేయు వారిని, రాతిపనివారని (శిల్పులని) లోహవృత్తి చేయువారిని కంచరులని, పిలువబడుచున్నారు. బంగారుపని చేయువారిని స్వర్ణకారులని యిటుల ప్రస్తుతం పంచాననులకు అనేక వికృత నామములేర్పడినవి.

భువనపుత్ర విశ్వకర్మ సర్వమానవులను సక్రమముగా పాలించుటకు కావలససిన పరిపాలనా విధానములను రచియించి ప్రతీ పల్లెయందు ఐదుగురిచే పంచాయితీలను నియమించి ఆచరింపజేసి, సుభిక్షముగు రాజ్యపాలనజేసి, సమస్తభూమండలమును తన ఆధీనముగావించుకొనుటకు, నేలమీద, నీటిమీద, గాలిలోను విహరించు ప్రయాణ సాధనములను తయారుజేయించి సమస్త భూమండలమును తన ఆధీనములోనికి తెచ్చుకొనిరి. వీరేసమస్తచేతివృత్తులవారికి ఆధిదేవత, ఆరాధ్యదైవమున్నూ వీరిని సెప్టెంబర్ 17వ తేదీన కన్యాసంక్రమణ పుణ్యదినమునవిశ్వకర్మ జయంతిగా ఆరాధించి సకల వృత్తులవారు తమ భక్తి భావమును ప్రకటించుకొనుచున్నారు.

### యింకా వీరి బిరుదములు

### శరణాగతత్రాణ బిరుదాంకితులు:

1. త్రేతాయుగమున నారాయణావతారియగు పరశురాముడు క్షత్రియులపై ద్వేషించి రాజవంశములను నాశనమొనర్చుచుండగా, వానికి భీతిల్లిన "హైహయ వంశజులగు రాజులు" భువిపై వారికి రక్షణ యిచ్చువారు లేక ఆదిదేవుడగు విరాట్ విశ్వకర్మ భగవానుని ప్రసన్నుని





గావించుకొని శరణుకోరగా వారి మొరలాలించిన పరమేష్టి అభయమొసంగి పరశురాముని శాంతింపజేసిరి. నాటినుండి "విశ్వకర్మీయులు" **శరణాగతత్రాణులని** కీర్తింపబడిరి.

2. పంచ బ్రహ్మలలో మూడవవాడగు త్వష్టబహ్మదేవతలకు పౌరోహిత్యము వహించుటచే దేవబ్రాహ్మణుడై ఆ సంతతివారగు పంచాననులు **దేవబ్రాహ్మణులని** కీర్తింపబడిరి.
3. దేవతలకు ఉపదేశములనిచ్చి దేవాచార్యుడు బృహస్పతి జగద్గురువాయెను. గనుక ఆ సంతతివారగు పంచబ్రాహ్మణులు జన్మతో **జగద్గురువులని** కీర్తింపబడిరి.
4. వీరలకు పంచబ్రహ్మలు తండ్రులు కాగా పంచశక్తులు తల్లులై పంచాననులను **శాక్తులుగా** పిలువబడిరి.
5. విశ్వాన్ని సృష్టించిని విశ్వకర్మభగవానుని పంచముఖములనుండి ఉద్భవించిన వారమగుటచే "బ్రాహ్మణోస్యముఖమాసీత్" అనువేదప్రమాణముచే మనలను ఈ అనంత విశ్వమందు **విశ్వబ్రాహ్మణులందురు.**

## 7. విశ్వనాధుని ఉపనయనము

విశ్వనాధుడతిబాల్యము నుండి తండ్రి చెప్పిన సమస్త విషయములను ఆకళింపచేసుకొని, సమస్త వేదములను, షట్ శాస్త్రములను, అష్టాదశ పురాణములను, ఉపనిషత్తులను, వేదాంతగ్రంధములను ఏక సంథాగ్రాహియై, కన్నవారికి చూపరులకు ఆశ్చర్యం గొల్పునట్లుగా తండ్రివద్ద అభ్యసించుతూ, కర్మశాలయందు తండ్రితో కూర్చునికులవృత్తిని, రసవాద రహస్యంబులు గ్రహించుచూ, ఆధ్యాత్మిక విషయము లందాసక్తుడగుచుండెను. కుమారుని అఖండ ప్రజ్ఞాపాఠవములకు కన్నవారు అమితానందమున రోజులు, నెలలు సంవత్సరములు క్షణములవలే గడచి బాలుడు 8 వ సంవత్సర ప్రాయుడై అమిత తేజస్సుతో ఉపనయన వయస్కుడాయెను. వీరాచార్యులవారు ఉత్తరాయణ పుణ్యకాలమున వసంత ఋతువు వైశాఖమాసమందు తారాబల, చంద్రబల, రవిబలము అష్టమ శుద్ధిగల ద్విస్వభావ లగ్నమును నిర్ణయించిరి. యింతటి జ్ఞానికి ఈశ్వరాంశ సంభూతునకు బ్రహ్మోపదేశమిచ్చి ఉపనయనం జరిపించగల బ్రహ్మజ్ఞానికొరకై వీరాచార్యులవారు అన్వేషించు చుండిరి, ఒకనాడు సద్బ్రాహ్మణుని కోసం తీవ్రంగాయోచించి ఆదమరిచి నిద్రించిరి. తొలికోడికూత సమయమున వీరాచారి గార్కి స్వప్నమందు, విశ్వకర్మ భగవాన్ సాక్షాత్కరించి, విశ్వనాధునికి బ్రహ్మోపదేశం చేయగల మునిపుంగవుడు ఊరి చివరగల దేవాలయమందు యోగ నిష్టలోనున్నాడు. నీవాతనిని ఆహ్వానించి బ్రహ్మోపదేశముచేయించిన శుభమగునని తెల్పగా, వీరాచార్యులవారు మేల్కాంచి నిత్యకృత్యములు తీర్చుకుని ఉదయాన్నే ఊరి చివర నున్న దేవాలయమునకేగి, బ్రహ్మతేజో విరాజితుండయి తపోనిష్టయందున్న యతీశ్వరుని గాంచి, వారు యోగనిష్టనుండి మేల్కాంచు వరకూ నిరీక్షించి కనులు తెరచిన వెంటనే, సాష్టాంగదండ ప్రణామంబులనాచరించి, స్వామీ మీ రెవరో మహనీయులవలేనున్నారు. దయతో నాకుమారుని ఉపనయన మహోత్సవమునకు విచ్చేసి బ్రహ్మోపదేశమిచ్చి నాయభీష్టం తీర్చుడని ప్రార్ధింపగా, నాయనా నీ సంకల్పము త్వరలో సిద్ధించునని ఆశీర్వదించి, వీరాచారిని పంపించి ఉపనయన సుముహూర్తమునకు విచ్చేసి బ్రహ్మపీఠమునలంకరించి, వేదోక్త విధానమున సశాస్త్రీయముగా గాయత్రి మంత్రోపదేశముచేసి, యజ్ఞోపవీతధారణ గావించి "బ్రహ్మజ్ఞానప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించెను. ఆనందపరవశుడై వీరాచార్యులు బంధుమిత్రాదులతో ముచ్చటిస్తూ, యతీశ్వరునకు దక్షిణ తాంబూలములిచ్చి సత్కరించుదమని చూచుసరికి, యతీశ్వరుడెచ్చటా కానరాలేదు. కలయందు కన్పించిన విశ్వకర్మ భగవానుడే ఈ కార్యము నిర్వహించెనని పరమానంద భరితుడయ్యెను.

ఆకార్యక్రమమునకు విచ్చేసినవారందరిని తగురీతిని సత్కరించి సాగనంపి వీరాచార్యుడమితానందముతో నుండెను. **విశ్వనాధాచారి మాతా వియోగము** తానొకటి తలచిన దైవమొకటి తలుచునన్నట్లు వీరాచార్యులవారి ఆనందము అనతికాలంలో అదృశ్యమాయెను. కుమారుని ఉపనయనమైన సంవత్సరములోనే మాతృమూర్తి అస్వస్థత చెంది ఏ ఔషధమునకు శాంతించక, కొన్నాళ్ళు వ్యాధితో తీవ్రంగా బాధ పడి గౌరమాంబ కైలాసప్రాప్తి చెందినది. వీరాచార్యులవారు తల్లిదండ్రుల బాధ్యతలను తానే స్వీకరించి తల్లిలేనిలోటు తెలియకుండా పెంచుతుండిరి.

### (8) హస్తమస్తక సంయోగం:-

విశ్వనాధుడు ప్రతినిత్యము బ్రహ్మముహూర్తమున మేల్కాంచి నిత్యకృత్యములు తీర్చుకొని గ్రామ తూర్పుదిక్కునగల జంగాలచెరువునకు బోయి, స్నానమాచరించి సంధ్యా వందనము చేయుచు, జగత్పితయగు విరాట్ విశ్వకర్మ భగవానుని కనులు మూసి ప్రార్థింపగా, పితామహుడు తపస్విరూపమున మహాతేజస్సుతో తామర పద్మమందు ప్రత్యక్షమాయెను. అదిగాంచిన విశ్వనాధుడానందడెందమున వినయుడై నమస్కరించుతూ తలవంచి నిలచి యుండెను. అంతనాపరమేష్టి మందహాసవదనార విందంబున, దక్షిణహస్తమును విశ్వనాధుని శిరస్సునుంచి "శ్రీఘ్రమేవసంపూర్ణ బ్రహ్మజ్ఞాన సిద్ధిరస్తు అనుచు" ఆశీర్వదించెను. అంత విశ్వనాధుని ఆవరించిన మాయ పూర్తిగా తొలగి అంతవరకు విశ్వనాధుని యందు ఉండిలేనట్లున్న మహత్తర తేజము, మబ్బువిడిచిన సూర్యబింబమువోలె ప్రకాశించినది. అదిమొదలు విశ్వనాధుని జీవితమందాశ్చర్యకరమగు శకము ప్రారంభమైనది. అతని ప్రతిపలుకు పరమార్ధమగుచున్నది. చేతిస్పర్శచే చిల్లరిరాయి సైతమూ శివలింగమగుచున్నది. అది మాయో, మంత్రమో, మందికర్ధమగుటలేదు. అతను జంగాల చెరువులో మునిగివస్తూ కాశీలో గంగాస్నాన మాచరించితిననుట, నేనే కాశీపతి విశ్వనాధుడననుట, నేనపుడున్నది. మంచుకొండ తెలుపు, యిపుడున్న పాలకొండ తెలుపు, యిట్లను విశ్వనాధుని గాంచి కొందరు పిచ్చి అని, కొందరు మదపిచ్చియని, మరికొందరిది నాటకమని, కొద్దిమంది యిది మహాత్ముల మొదటి లక్షణమని, పలువురు పలురీతులుగా పలుకుచుండిరి. యివన్నీ ఆమహనీయునకు సంతోషముగనే యున్నవి.

### (9) బాలవిశ్వం వేదాంతబోధ:

బాల్యమున ఆటపాటలతో కాలంగడుపుతోటి బాలురనుగాంచి, మిత్రులారా। ఏల ఈకాలయాపన అణువునుండి అనేక బ్రహ్మాండములు తన సంకల్ప మాత్రముచే సృజించి, సూక్ష్మమైన క్రిమినుండి మహాభీకరమగు గజరాజు వరకు గల సర్వజీవకోటి యందుండి సాక్షీభూతుడైనట్టి ఆ విరాట్ విశ్వకర్మ భగవానుని సదా ఆత్మయందు తలచండి. "మిత్రులారా" దేహమే దేవాలయం అందలి జీవుడే దేవుడు. అది గుర్తెరింగి సదా దైవధ్యానంతో మీ జన్మలు ధన్యముచేసుకొనుడు 84 లక్షలజీవరాసులలో మానవజన్మ ఉత్తమమైనది. యెన్నోజన్మలతపఃఫలముగా ఈ జన్మ వచ్చినది యిందుండియే మోక్షము పొందగలరు. అది గుర్తెరిగి సదా దైవధ్యానంతో మీ జన్మలు ధన్యముచేసుకొండు. ఈ జన్మలో గడచిన ఒక్కక్షణమైననూ తిరిగిరాదు సుమా, అట్టికాలము విలువనెరిగి సద్వినియోగ పరచుకొనుడు తస్మాత్ జాగ్రత, జాగ్రత, జాగ్రత అనిబోధింపుచుండగా, ఆదారిన గొర్రెను భుజంపై వేసుకొని పోవుయాదవునిగాంచి, బాలురు అదేమి? గొర్రెను మోయుచున్నావనగా! యాదవుడు నాయనలారా। ఈ గొర్రె మరణించినదనగా విశ్వనాధుడు ఏదీ చూతుమని, **ఆ గొర్రెను దక్షిణ హస్తముతో సవరించగా, మరుక్షణం గొర్రెయాదవుని భుజం**





**నుండి దూకి చెంగుచెంగునగెంతుచూ, గొర్రెలమందలో కలసిపోయినది.** అదిగాంచిన యాదవుడు సంభ్రమాశ్చర్యములతో, విశ్వనాధుని గాంచి మహనీయా నీవు బాలుని రూపంలో గల భగవంతుడవని, ఆనందముతో విశ్వనాధుని భుజంపై నెక్కించుకొని, పాలకొండ వీధులలో త్రిప్పుచూ ఆ మహిమను ఊరంతా చాటెను. దానికి గ్రామస్తులచ్చెరువొంది యిదికలా? నిజమా? ఈ వెర్రిగొల్లడు భ్రమచెందెనా? మరణించిన గొర్రె జీవించుటేమి? యిదంతయూ వింతగాయున్నదని పలువురు పలువిధములుగా తలంచుకొనుచు దిగ్భ్రాంతి నొందిరి. మరియొకనాడు కొంటె బాలురుకొందరు విశ్వనాధుని పరీక్షించుటకై ఒక బాలుని చచ్చినట్లు పరుండబెట్టి, ఆదారినవచ్చు విశ్వనాధునితో విశ్వం వీడు ఏరోగము లేకయే హటాత్తుగా మరణించెనని, విలపించుతూ చెప్పిరి. కాలము తీరిన అట్లేయగునని విశ్వనాధుడచట నుండి వెడలిపోయెను. అంతబాలురునగుచు హాస్యమునకన్న మాటను గ్రహించలేక పోయెనితడేమి మహనీయుడనుకొనుచు, పరుండని బాలుని తట్టియింక "నీ నటన చాలులే " అనిరి! అతడెంతకు ఉలుకు పలుకు లేకపోవుటచే భయపడి ఏడ్చుతూ పెద్దల దరికేగి విషయమునెరింగించిరి. బాలుని తల్లిదండ్రులు గుండెలు బాదుకొనుచూ ఏడ్చుచూ పరుగుపరుగున బాలుని శవం భుజంపై వేసుకొని, వీరాచార్యుని యింటికి చేరి, విశ్వనాధునిపాదాలపైబడి మహనీయా నిన్ను ఆటపట్టించుటకై పరీక్షింపదలచి మాకుమారుని బలిపెట్టిరి. నాయనా మాకు పుత్రభిక్షపెట్టమని గోడుగోడున ఏడ్చు వారలను గాంచి. "పెద్దలారా" నేనును మీ పుత్రుని వంటి వాడనే కదా ? నేనేమైనా మహాత్ముడనా, మహిమలుగలవాడనా, చనిపోయినవారిని బ్రతికించుటకు, అనుచు బాలుని చెంతజేరి, ఏమిరా! ఆటలాడుచున్నావా అనుచూ దక్షిణహస్తముతో తట్టుసరికి "ఆ" అనుచూలేచి కూర్చుండెను. యిదంతయూ కనులారా గాంచిన వారందరూ, ఈతడు బాల విశ్వనాధుడుగానీ సాధారణ బాలుడుకాదని కొందరు. చిన్నవయస్సున యింతటి గారడీ ప్రదర్శించెనని కొందరు, యిదంతయూవింతగా నున్నదని మరికొందరు.

యిటుల ఎవరికి తోచినట్లువారు అనుకొనుచుచూ అటనుండి వెడలిపోయిరి. మరికొందరీతని కన్నతల్లిదండ్రుల జన్మపావనమైనదని కీర్తించిరి.

### (10) కురూపి కన్యను సౌందర్యరాశిగా మార్చుట

పాలకొండచుట్టు ప్రక్కలగ్రామములందలి ఘనాపాఠీలైనవారికి ఈ విషయం తెలిసి, వారి పండిత చర్చలలో ఈ విషయాన్ని గురించి ప్రస్తావనరాగా "మహాపండితులమగు" మన మీ విషయాన్ని తేల్చుదమని, విశ్వనాధుని శక్తిని మహిమలు పరీక్షింప నెంచి, ఒకనాడు కురూపియగు కన్యను తీసుకుని పాలకొండకువచ్చి, స్వామివారు వచ్చు మార్గమున కాపుకాచి। స్వామివారు సమీపించగా। ఓయీ విశ్వనాధం నీవేమో మహత్యములు చూపుచుంటివట, చచ్చినవారిని సైతము బ్రతికించు మహనీయుడవని, దైవాంశ సంభూతుడవని, ఈ గ్రామమందలి పామరులు కొందరు కీర్తించుచున్నారు. నీకట్టి మహిమ కల్గిన ఈ కురూపిని సౌందర్యరాశిని గావించిన, నీ మహత్యము ఋజువగును. మేమునూ నిను కీర్తింతుము. ఈ బాలిక జీవితమూ, ఆనందమయ మగును. ఒక నిర్భాగ్యురాలికి సుఖమగు జీవితం ప్రసాదించిన వాడవగుదువు కాన నీ దైవత్వమును ఋజువు చేసుకోమనిరి. అంత బాల విశ్వనాధులు "మహా పండితులారా" "మీరు వేదాధ్యయన సంపన్నులు" షట్ శాస్త్రకోవిదులు మంత్రశాస్త్ర ప్రవీణులు, పెద్దలు మీముందు నేనెంత, లోకులమాటలు మీరు పట్టించుకోనేల? ఎవరియిచ్చవచ్చినటుల వారు మాట్లాడుదురు. నాదారిన నన్ను పోనిండని స్వామివారటనుండి పోవుచుండిరి. అపుడు పండితులునగుచూ హనుమంతుని ముందా కుప్పిగంతులు ఈనాడీతని గుట్టు రట్టయినది. ఈతని తాంత్రికవిద్యలు, గారడీలు సామాన్యుల చెంతగానీ, ఘనాపాఠీలమగు మనచెంతనా అనుచూ అవహేళన చేయుచుండిరి. యిదంతయూ

గమనించి కురూపికన్య పరుగున స్వామిచెంతకు బోయి, మహాత్మామిమ్ము పరీక్షించుటకు నన్ను రమ్మనిరని తెలియక వీరి వెంటవచ్చితిని. యిందు నాదోసమిసుమంతయూ లేదు. నా వలన కల్గిన ఈ అవమానమునకు నన్ను మన్నింపుడని పాదములపైబడి పరిపరివిధముల ప్రార్ధింపగా, కరుణాంత రంగుడు భోళా శంకరుడగు విశ్వనాధుని మనసుకరిగి, కుమారీ। నాకంతయు తెలియును. నీవు నిష్కల్మషచిత్తవు ఈ అహంకారులు నన్నుహేళన చేయుటకై నిను గొనివచ్చిరి. నీ అనన్యభక్తి భావమునకు సంతసించితిని. నీకిపుడే జగదేక సౌందర్యమునొసంగుచుంటినని, కమండల మందలి జలమును మంత్రించి ఆమెపై చల్లగా, చూచువారందరూ సంభ్రమాశ్చర్యములతో దిగ్భ్రాంతి నొందునటుల "ఆకురూపిజగదేకసుందరి" అయ్యెను. ఆకన్య అమితానంద పరవశయై నోట మాటరాక, పాదాలపైబడి కన్నీటితో గురుదేవులపాదములు కడుడుగుచూ గురుదేవా, కైలాసవాసా, దయామయా, పరమేశా, పార్వతీరమణా, జగద్గురుదేవా, నను బ్రోచుటకు అవతరించిన స్వామి, శరణుశరణు, అనుచు పరిపరివిధముల ప్రార్ధింపగా। **"సమస్త సన్మంగళాని భవంతు"** అని ఆశీర్వదించిరి. అంత ఆమె అతి భక్తిప్రపత్తులతో

సాకి ॥ **చంద్రకళాధర। చండికహృదయా-సర్వమునీవని సన్నుతి చేసెద।**
**గరళకంధరా। గజ చర్మాంభరా-గణపతి సేవిత నన్నుకావరా।**
**నాగాభరణా నందివాహనా-నరహరి సన్నుత నన్నుబ్రోవరా।**
**త్రినేత్రధారి త్రిశూలపాణీ - త్ర్యయంబుసేవిత త్వరితము రావా**
ప॥ **దేవా ఓ దేవా నను పాలింపగరావా - ఓ విశ్వనాధా ఓ దేవా ॥దేవా॥**
చ॥ **1. ద్రాక్షారామమున భీమేశుడవై- భక్తులబ్రోచేభూతనాధా॥దేవా॥**
**2. శ్రీశైలమున మల్లేశుడవై - శ్రీ జనపాలా లోకనాధా॥దేవా॥**
**3. కాశీలోన విశ్వేశ్వరుడవై- విమలస్వరూపా ఓ విశ్వనాధా॥దేవా॥**
**4. రామేశ్వరమున రామలింగమై- ఆర్తినిబాపిన అమరేశ్వరుడా ॥దేవా॥**
**5. క్షీరాచలమున చింతలుబాపే- చిన్మయరూపా సర్వేశ్వరుడా ॥దేవా॥**
**అని కీర్తించుచుండగా**

యిదిగాంచిన పండితులు సిగ్గుతో తలదించుకొనగా, అచట గల వారిని గాంచి గురుదేవులు "నాయనలారా" సృష్టికర్త మహాపరిశుద్ధుడు గొప్పవాడు, నిష్పక్షపాతి, తన, పర, బేధంలేనివాడు, సన్మార్గులు, దుర్మార్గులు ఆయనసంతతివారే. 84 లక్షల జీవరాసులందును ఆయన తేజస్సుండిమనగల్గుచున్నవి. అది తప్పినచో మృతజీవులగు చున్నవి. అట్టి పరమేష్టికి శుద్ధము, అపరిశుద్ధము, సుగంధము। దుర్గంధమూ, చీకటి, వెలుగు, మానావమానములు, బీద , ధనిక, మంచి చెడులు, బేధములు లేక సర్వాంతర్యామియై అణువునుండి బ్రహ్మాండమంతయూ నిండియుండి తనసంకల్ప మాత్రముచే, అనేక కోటి బ్రహ్మాండంబులు, సకలచరాచరజగత్తును సృష్టించి, పోషించి, వినోదించి మరల ఈ సమస్తమును తనయందు ఐక్యము జేసుకొను లీలావినోది. అట్టి పరమేష్టి ప్రతిరూపములే వేదములు, అందలి ధర్మములు విస్మరింపక నీతిమార్గమున ఆచరించు వారలకు, "మోక్షసామ్రాజ్యము" వారిదైయున్నది అవినీతి ప్రవర్తనులకు జన్మకర్మలు తప్పవు. భగవంతుని నమ్మి చెడినవారు చరిత్రలో లేరు. నమ్మనివారు సర్వభ్రష్టులై కర్మలననుభవించుచున్నారు. ఎన్నోజన్మలజీవి తపఃఫలముగా మానవజన్మవచ్చు చున్నది. యిందుండియే జన్మరాహిత్యమును పొందవలయును. తస్మాత్ జాగ్రత। జాగ్రత। జాగ్రత అంటూ హితబోధచేయగా కొందరు మెచ్చుకొనిరి. కొందరు నొచ్చుకొనిరి యింకొందరు ఈ ఉపన్యాసములకేమిలే అనుచూ ఎచటివారచ్చటకు వెడలిపోయిరి.





## (11) విశ్వనాధుని పితృవియోగం:

విశ్వనాధాచారి ప్రతిదినము వేకువనేలేచి స్నానసంధ్యానుష్టానములు సూర్యోదయ సమయమునకు పూర్తిగావించుకొని, తండ్రితో శిల్పశాల చేరి, తండ్రిచేయు రసవాద విద్య యందును పంచాననంవారి పంచవిద్యలందును, తండ్రికి చేదోడువాదోడుగా ఉంటూ, సకలవిద్యాప్రవీణుడై తండ్రితో ఆనందముగా కాలముగడుపు తరుణంలో, తండ్రి అనారోగ్యంతో మంచానపడి విచారవదనంతో కుమారునిచేరబిలిచి, తన అన్నకుమారుని రప్పించి "నీలాచారీ " తమ్మునకు బాల్యమున మాతృవియోగము కలుగ, ఏ కొరతలేకుండా యుక్తవయస్కుని గావించితిని. యిప్పుడు పితృవియోగము సంభవించుచున్నది. కన్నవారమగు మాకు కుమారుని కల్యాణముగాంచు భాగ్యములేక పోయినది. **విశ్వనాధాచారి చేయి పట్టుకుని** నాయానా! యింక తల్లి, తండ్రిఅన్నియూ నీ అన్నయే అతనిమాట జవదాటకుము. నేను నేర్పిన స్వర్ణయోగ రహస్యములను, వైద్యప్రక్రియలను, వాదవేద, విద్యారహస్యములను, సర్వులకూతెలియజేసి ఒకయింటి వాడవై గృహస్తాశ్రమ ధర్మముల నిర్వర్తింపుచు "రాజయోగివై" మా ఆత్మకు శాంతిని చేకూర్చుము నీవు కారణజన్ముడవని తెలిసియు, పుత్రవ్యామోహమున యిట్లు పల్కితిని, లోకమంతయూ ఏకమైననూ నీధర్మమునీవు నిర్వర్తింపుము. నీలాచారీ తమ్ముని నీకప్పగించు చున్నాను. ఈతని నొకయింటివాని జేసి మా ఆత్మలకు శాంతి చేకూర్చుము అనుచూ చేతిలో చేయివేయించుకొని కన్నీరు కార్చుచుండగా, **నీలాచారి** తండ్రీ! విచారింపకుడు. తమ్ముని కంటికి రెప్పవలే కాచుకుందును. ఏలోటూ లేకుండా వివాహముగావించుదునని చేతిలో చెయ్యివేసి చెప్పుచుండగా, వీరాచార్యుల వారు ఓంనమః శివాయ అనుచూ అసువులు బాసిరి.

## (12) అన్నపూర్ణమ్మ బాల్యము

సుమంగళీపురం గ్రామంబున అన్నపూర్ణాంబ శుక్లపక్షచంద్రునివోలే దినదిన ప్రవర్ధమానయై ఎదుగుచూ పూర్ణచంద్రునిబోలుమోము, విశాలమగు ఫాలభాగము, గండు తుమ్మెదలను బోలుముంగురులు, చెక్కుటద్దమును బోలు చెక్కిళ్ళు, దొండపండువంటి పెదవులు, కలువరేకుల వంటి కనురెప్పలు, యింద్రధనుస్సునుబోలు కనుబొమలు, విశాలనేత్రములు. ముత్యాల సరులబోలుపలువరుస, శ్రీకారములైనచెవులు, శంఖమును బోలు కంఠము, ఆజాను బాహువులు, కుందనపు ప్రతిమను బోలు సుందరాకారముతో మందగమనయై ఆట పాటలందును, చదువు సంధ్యలందును, సాటిలేని మేటియైకన్యపెరుగుచూ కల్యాణ ప్రాయురాలైనది. ఆమె నిరంతరము శివుని పూజించుచూ, ధ్యానించుచూ, శివ విగ్రహము తదేకదృష్టితో తిలకించుతూ, ఆతనితో మాట్లాడుచున్నట్లు తనలో తాను మాట్లాడుకొనుచూ, తోటి బాలికలకు శివపురాణగాధలు వినిపించుతూ, ఆనందించు వారినాదరించుతూ, హాస్యమునకైనా నిందించిన వారిని విడిచి, వేరొకచోటికి పోవుచూ, పరమేశ్వరునికి నివేదించక మంచినీటినైననూ ముట్టక, అనుక్షణం శివనామస్మరణతో గడుపుచూ, బంధుమిత్రులకు తలలోని నాల్కవలే మసలుతూ, అందరికీ ఆప్యాయురాలైయుండెను. కన్నవారామెనుగాంచి బ్రహ్మానందముననుభవించుతూ యుక్త వయుస్కురాలాయెనే వివాహము చేసినయిల్లు వీడిపోవునని యోచించుచున్న కన్నవారికి పరమేష్ఠియేనాపతియని తెల్పు చుండెడిది.

## (13) విశ్వనాధాచారి విరాగివలే తిరుగుట:

తండ్రిగతించిన తర్వాత విశ్వనాధచారి మితభాషియై, క్షురకర్మ వర్జించి, బ్రహ్మ ముహూర్తమున మేల్కాంచి నిత్యకృత్యములు దీర్చుకొని, పాలభాగమున శ్రీగంధ కుంకుమ విభూతి రేఖలుధరించి, మెడలో రుద్రాక్షమాలలు వైచుకొని నిత్యానుష్టానము నెరవేర్చి, ఎచటికి పోవునో? ఎప్పుడువచ్చునో?

ఏమిచేయునో? ఎవ్వరికీ తెలియదు. తనలో తాను మాట్లాడు కొనును, పుణ్యక్షేత్రములు తిరుగుచూ గ్రామదూర ప్రాంతములందు ఒంటరిగా కూర్చొనుచూ, జపమో, మంత్రామో, తంత్రమో, చేయుట, ఏదో వ్రాయుట చేయుచుండెను. ఈ మహానుభావుడిట్లు విరాగియై తిరుగుట గాంచి గ్రామప్రజలు వింతగా చూచుచూ ఒక్కొక్క రొక్కక్క విధముగా మాట్లాడుకొనుచుండిరి. యిదంతయుగాంచిన నీలాచారి ఒకనాడు సోదరుని పిలిచి తమ్ముడూ! నీ గురించి గ్రామ ప్రజలు తలకొక విధంగా చెప్పుకొనుచున్నారు. ఎట్టి వారి కైనా కన్నవారిలోటు తీర్చుట సాధ్యం కాదు. నీవుయిల్లూ, వాకిలి పట్టకుండా విరాగివలే తిరుగుట, నిన్ను చూచి అందరూ హేళన చేయుట "తాంత్రికుడవని, మాంత్రికుడవని, చిల్లంగులు పెట్టువాడవని," లోకులు పలుకాకులై కూయుట నేను సహింపలేకున్నాను. యిట్టి నీ స్థితిని గాంచి పిల్లనెవ్వరిత్తురు. నీ తండ్రికిచ్చిన మాటనేనెట్లు నిలుపుకొందును, నీకు కల్యాణమెట్లు గావించగలను. యిప్పటికీ మించినదిలేదు. నీవు మనయింటి గౌరవము నిల్పుటకైవృత్తి బాధ్యతలను స్వీకరించి, స్థిరముగా యుండి ఒక యింటివాడవు కమ్ము. ఈ వయస్సున నీకీ వైరాగ్యమేల? కుటుంబీకుడువై, "రాజయోగి" గా నీ ఆశయములు నెరవేర్చు కొనుము. అని నీలాచారి పరిపరి విధములు తమ్మునకు చెప్పి, వివాహ ప్రయత్నములు చేయగా, ఎచటికి వెళ్ళినా పిల్లనిచ్చుటకు ఎవ్వరూ అంగీకరించకపోవుటచే నీలాచారి దిగులుగా కూర్చుని యుండుట గాంచిన విశ్వనాధాచారి, అన్న చెంతజేరి "అన్నా" ఏల విచారపడుచుంటివి? నా వివాహప్రయత్నములు ఫలించలేదనియా, దీనికింత విచారపడనేల అనగా! నీలాచారి సోదరా ! నీకు పెండ్లిజేసి నిన్నొక యింటివానిజేసి మీ యింటికి నిను పంపుదునని పిన తండ్రికి మాటయిచ్చితిని. దానికై విశ్వప్రయత్నము చేయుచూ, ఎచటికి వెళ్ళినా నిన్ను చులకనగా మాట్లాడుట నేను సహింపలేకున్నాను. యిట్టి పరిస్థితులలో విచారము గాక ఆనందముండునా అనగా. విశ్వనాధుడు అన్నా అజ్ఞానుల మాటలకు నీవేల బాధపడెదవు .మన యింటి కోడలగు అర్హత వారికిలేదు. నీకు మరదలగు సుగుణశాలి సుమంగళీపురం గ్రామంలో గల సదాచార సంపన్నులు శాక్తోపాసకులు సద్వంశజులునగు భ్రమరాంబ బ్రహ్మానందాచార్యులు పుత్రికయగు అన్నపూర్ణకలదు. నీవచటికేగిన నీ ఆశయంనెరవేరునని చెప్పగా నీలాచార్యులు అమిత సంతోషమున తమ్ముని కౌగిలించుకొని ముద్దాడి, భార్యకు విషయం చెప్పి సుమంగళీపురము పోయి సంబంధము ఖాయపరుచుకొనవలయునని ప్రయాణసన్నాహములు చేయుచు, మంచి ముహూర్తమున భార్యాసమేతుడై సుమంగళీపురము బయలుదేరెను.

## (14.) విశ్వనాధాచారి వివాహనిశ్చయము:

నీలాచార్యులు కామేశ్వరి సతితో సుమంగళీపుర గ్రామముజేరిబ్రహ్మానందా చారినివాసము గ్రామస్తులచే ఎరింగి యిల్లు చేరగా, గృహయజమాని అతిధులకు అర్ఘ్యపాద్యాదులొసంగి, అల్పాహార విందు గావించి, యోగక్షేమములు విచారించునపుడు, నీలాచారి సంబంధమందు కొనుటకువచ్చితిమని తెలుపగా, బ్రహ్మానాందాచార్య దంపతులు సంతోషించి, మీా తమ్ముని మేము లోగడ నాగావళీ తీరమందలి పుణ్యక్షేత్రములు సందర్శించునపుడు, మాగ్రామ వీధులలో తిరుగాడునపుడు ఆతని బ్రహ్మతేజస్సున కచ్చెరువొంది, కుశలప్రశ్నలలో స్వకులస్తుడని గ్రహించి, మధ్యాహ్న సమయమగుటచే విందు కూడా యిచ్చితిమి. ఈ సుముహూర్తమునకై మేమును ఎదురు చూచుచుంటిమి. ఈనాడు మాకు చాలా సంతోషముగాయున్నదనిసంబంధము ఖాయ పరుచుకొని వియ్యాలవారికి షడ్రసోపేతమగువిందునేర్పరచి, భోజనానంతరం పౌరుషేయసిద్ధాంత శిరోమణులను సంప్రదించి శ్రీముఖనామ సం॥ర వైశాఖశుద్ధ ఏకాదశీ శుక్రవారం ఉత్తరానక్షత్ర యుక్త కర్కాటక లగ్నమున అన్నపూర్ణ విశ్వనాధుల కల్యాణమునకు సుముహూర్తము నిర్ణయించిరి.





## (15) విశ్వనాధుని వివాహము

అన్నపూర్ణ విశ్వనాధుల కల్యాణమునకు వియ్యాలవారిరువురూ సర్వసన్నాహములు గావించిరి తూరీ మంగళవాయిధ్యములతో నీలాచార్య దంపతులు పెండ్లికుమారుని, బంధు మిత్రాదులను తోడ్కొని ఏతత్ సుముహూర్తమునకు సుమంగళీపుర గ్రామముచేరిరి. గ్రామపొలిమేర వద్దకు బ్రహ్మానందాచారి బంధుమిత్రులతో ఎదురేగి, సగౌరవముగా వియ్యాలవారిని ఆహ్వానించి వివాహవేదిక వద్దకు తోడ్కొని వచ్చిరి. కల్యాణమండపము ముత్తయిదువుల మందహాసముతో మామిడి తోరణ, రంభాస్తంభాలంకృతములతోడను, కవి, గాయక, పండిత, విద్వజ్జనముతోడను, కులశ్రేష్టులతో బంధుమిత్రాదులతో, కళకళలాడుచుండగా సుముహూర్తమునకు స్మార్తవిద్యాగ్రగణ్యులైన పౌరుషేయపండితోత్తములు "అన్నపూర్ణ విశ్వనాధుల" కల్యాణ మతివైభవముగాజరిపించగా నూతన దంపతులపై ఆకాశము నుండి పుష్ప వర్షముకురిసినది. విశ్వనాధునికి పిల్లనీయ నిరాకరించినవారిది గారడీయనిరి. భక్తజనమిది ఆదిదంపతులకల్యాణమనిరి. ఆనందోత్సాహాలతో బంధుమిత్రుల పరామర్శలతో నున్నవారికి, పెండ్లికివచ్చిన వారందరికి బ్రహ్మానందాచార్యులు షడ్రసోపేతములయిన, నవకాయపిండి వంటలు పంచభక్ష్య, చోష్య, లేహ్య పానీయాదులతో, వియ్యాలవారికి మహావైభవముగా విందు సమకూర్చిరి. నూతనదంపతులను గాంచి నీలాచారి పరమానందభరితుడై నేటికి పినతండ్రి కిచ్చిన మాటచెల్లించుకొంటినని సంతుష్టుడై, బంధు మిత్రపరివారముతో నూతన దంపతులను వెంట బెట్టుకుని పాలకొండచేరిరి. తమ్ముని మరదలిని కొన్నాళ్ళు తన యింట నుంచుకొని 3వ నెలలో బాబాయి గారింట వేరే కాపురము పెట్టించెను. అన్నపూర్ణ విశ్వనాధులు రాజయోగ దీక్షా కంకణబద్ధులై పరిపూర్ణ తత్వధర్ములై మంటినంటక తిరుగు కుమ్మరి పురుగు చందంబున గృహస్థాశ్రమ ధర్మములు నెరవేర్చుచుండిరి.

## (16) విశ్వనాధుని నిత్యాన్నదానం

విశ్వనాధుడు నిత్యం బ్రహ్మముహూర్తమున మేల్కొని, నిత్యకృత్యములు నెరవేర్చుకొని సంధ్యావందనము, నిత్యానుష్టానమాచరించి, మధ్యాహ్నం వరకూ కులవృత్తి చేయుచూ, మధ్యాహ్నం సంధ్యావందనం పూర్తిచేసుకుని యిల్లు చేరుసరికి, అన్నపూర్ణాంబ పతిపాదములు పళ్ళెరమందుంచి పాదపూజ చేసి ఆజలాన్ని శిరస్సున దాల్చి వంటింటిలోనికి బోవును, విశ్వనాధుడు వీధిలోనికి బోయి అతిధినెవరినైనా తోడ్కొని యింటికి వచ్చి యిరువురు భుజించిన పిదప, అతిధిని సాగనంపి సాయంకాలమువరకూ వృత్తిచేసి సాయంసంధ్యావందనమాచరించి, రాత్రి తనవద్దకు వచ్చిన వారికి వేదాంతోపన్యాసములు చేసి యోగ, సాధనా విషయములు తెల్పెడి వారు. ఆయింట నిత్యపూజలు, అగ్నికార్యము, పుణ్యకార్యాలు జరుగనిరోజుండెడిది కాదు. ఈ ఉన్నతిని జూచి ఓర్వలేని కొందరు "వీరినెట్లయినా పరాభవించ వలెనని" పట్టుదలతో కుట్రపన్ని ఒకనాడు లెక్కకుమించిన సాధువులను పాలకొండకు రప్పించి, ముందు కొంతమందిని విశ్వనాధంగారింటికి భోజనానికి పంపించిరి. యిది గ్రహించిన స్వామివారు "అన్నపూర్ణా అతిధులు వచ్చిరి నీపేరు నిలుపుకోమనిరి." అన్నపూర్ణ శిరస్సువంచి "తమయాజ్ఞ" యని వచ్చిన వారికి తృప్తిగా వడ్డించగా భుజించి లేచిరి. యింతలో మరి కొందరు భోజనానికి వచ్చిరి. ఆ తరువాత మరికొందరు యిలా అంచెలంచెలుగా సాయంత్రం వరకూ రాసాగిరి వచ్చిన వారందరికి తృప్తిగా అన్న సంతర్పణచేయగా "భోక్తలు" అన్నపూర్ణయింట అన్నమునకు కొదవుండునా **"అన్నదాతా సుఖీభవ"** అంటూ ఆనందముగా వెడలిపోయిరి. కొందరు వీరి పనులను పిచ్చివారి చేష్టలను కొనుచుండిరి. మరికొందరిదియే జీవితము పరమార్ధమను కొనుచుండిరి. మరికొందరిదియే జీవిత పరమార్ధమనుకొనుచుండిరి.

## (17) విశ్వనాధుని జలస్తంభన

ఒకనాడు ప్రాతఃకాలమున విశ్వనాధుడు జంగాలచెరువుకు బోయి తటాక మధ్యమున మునిగిపోయిరి. అప్పుడే చెరువుకు వచ్చిన వీరయ్య శ్రేష్ఠి, రజకుడు సోములు ఈ దృశ్యముచూచి అయ్యో పిచ్చి విశ్వనాధమన్యాయముగ నీటమునిగి పోయెననుకొనుచూ, బాధపడుచుండగా స్వామివారు కొంతసేపటికి నీటిమీదతేలి

శ్లో॥ బ్రహ్మేస్వరూపముదయే। మధ్యాహ్నేతు మహేశ్వరం।
సాయంధ్యాయే సదావిష్ణుం। త్రిమూర్త్యంశ దివాకరమ్॥

అంటూ స్తుతించి దోసిలితో నీళ్ళుతీసి 3 సార్లు అర్ఘ్యమిస్తుండగా జలంతోపాటు పుష్పాలు చేతులనుండి రాలినవి గాఢాంధకారహరణాయ। జగద్ధితాయనమోనమః। అంటూ నమస్కరించి సంధ్యావందనము ముగించుకొని బయటకు వచ్చి రామలింగేశ్వర శివలింగము నారాధించుచుండిరి.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాధంచ । శ్రీశైలే మల్లిఖార్జునమ్ -ఉజ్జయిన్యాంమహాకాల। ఓంకారమమలేశ్వరమ్
ప్రజ్వల్యాంవైద్యనాధంచ। ఢాకిన్యాం భీమశంకరమ్-సేతుబంధేతురామేశం। నాగేశందారుకావనే
వారణాస్యాంతు విశ్వేశం। త్ర్యంబకంగౌతమీతటే-హిమాలయేతు కేదారం। ఘృష్టేశంచవిశాలక్షే
ఏతానిజ్యోతిర్లింగాని । సాయంప్రాతౌపఠేన్నరః-సప్తజన్మకృతంపాపం। స్మరణేనవినశ్యతే॥

అని పఠించిరి.

యిదంతయూ కనులారాగాంచిన వీరయ్య, సోములు, ఆచార్యులు సామాన్య మానవులు కారని దైవాంశసంభూతులని విశ్వసించి సాష్టాంగ దండప్రణామము లాచరించి "మహాత్మా" అందరివోలే మేమును మిమ్ములను పిచ్చి విశ్వనాధమనియే తలంచితిమి. మీరునూ లోకులకు మీ నిజస్వరూపము తెలియనీయక మాయలోనుంచితిరి. మా పూర్వజన్మసుకృతమున మీదైవత్వము తెలిసినది. గురుదేవా మమ్ము మీశిష్యులుగా స్వీకరించి జ్ఞానభిక్షనొసంగుడు అనుచూ వారు పాదములు పట్టి ప్రార్థించిరి. స్వామివారు నాయనలారా। నన్నాశ్రయించిన వారినినేనెన్నడూ ఏ పరిస్థితులందునూ విడువకవెన్నంటి రక్షింతునని అభయమిచ్చిరి.

విశ్వనాధాచారిగారి గృహమెుక గురుకులాశ్రమరూపురేఖలు దిద్దుకొన్నది. నిత్య అన్నదానములు, ఆధ్యాత్మికోపన్యాసములు, జరుగుటచే వారి శిష్యులేగాక ఆసక్తిగలవారు కుల, మత, పేద, గొప్పబేధంలేకుండా తండోపతండములుగా వచ్చి స్వామివారుచెప్పు ఆధ్యాత్మికోపన్యాసములలో, షట్చక్రవిచారణ, అజపసంచారక్రమము, స్థూల, సూక్ష్మ, కారణదేహ , స్వరూపమును, జీవాత్మ, పరమాత్మ సంధానము, గురు, శిష్యసంబంధము, కాలప్రమాణము. చతురాశ్రమవిధానము, ఛాయా పురుషలక్షణము, యోగసాధనలు, ప్రాణాయామసాధనము, మానసపూజా విధానము, మొదలగు వేదాంతవిషయములు వినుచూ ఆధ్యాత్మికపరులు పరమానందభరితులగుచుండిరి. యిదిగాంచినస్వకులస్తులు కొందరు దుష్ప్రచారములు చేయచూ సహించలేకపోవుట గాంచిన "గురుదేవులు" వారి ఆగడములు చూచీ చూడనట్లు, వినీవిననట్లు ఏమీఎరుగని వానివలే, మిన్నకుండిరి.

## (18) విశ్వనాధుని దేవాలయప్రతిష్ఠ అఖండఅన్నదానము

స్వామివారు యిట్టి పరిస్థితులలో పండితపామరులు సైతము తరించుటకు విగ్రహారాధనయే ప్రథమ సోపానముగానపాలకొండసరిహద్దునగల అన్నవరగ్రామ మందు పొలందున్ననపుడు లభించిన శివలింగముతో రామలింగేశ్వరాలయము నిర్మింపజేసి దేవాలయనిర్వహణకు మాన్యములనిచ్చి దేవాలయమున శివలింగప్రతిష్ఠాసమయమున అన్నదానము చేయుటకై





ప్రయత్నములు చేయుచుండిరి. స్వామివారి కీర్తిప్రతిష్ఠలను చూచి సహింపలేని స్వకులస్తులు, మరికొందరు కలసి యిరుగుపొరుగు గ్రామాలు తిరిగి విశ్వనాధాచారిగారు మహాన్నదాన కార్యక్రమము జరుపుచున్నారు. కావున యావన్మంది బంధుమిత్ర సపరివార సమేతంగా విచ్చేయుడని ఆహ్వానించి మిన్నకుండిరి. స్వామివారి మహిమలు విన్న చుట్టుప్రక్క గ్రామాల ప్రజలందరూ స్వామివారి హస్తములతో జరుగు ప్రతిష్ఠను తిలకించి, స్వామివారిని గాంచి వారిచే తీర్ధ ప్రసాదములు స్వీకరించి ధన్యులగుటకై కొందరు. ఆనాటి మహాకరువుతో అన్నం లేక అంబలితో కాలంగడుపుతూ పండుగలకే అన్నం తినే చుట్టుప్రక్కల గ్రామ జనులు తండోపతండములుగా చీమలబారువలే వచ్చుచుండిరి. అదిగాంచిన కార్యకర్తలు భయభ్రాంతులై గురుదేవుని చెంతజేరి, స్వామీ ఈ జన ప్రవాహామునకు మనము తయారు చేయించిన పదార్ధములేమూల? ఏమిటి ఈ వైపరీత్యము.వీరందరిని ఎవరు ఆహ్వానించిరి? ఏమిటీ పరీక్ష భోజన పంక్తిలో కూర్చున్నవారికి అన్నంపెట్టలేనివారమను అపఖ్యాతిని పొందవలసిన దేనా? ఇపుడేది దిక్కు అనుచు విచారించు భక్తులను గాంచి, గురుదేవులు నాయనలారా నన్ను అప్రతిష్ఠపాలు జేయుటకు పెద్దలు గతములో వందలాది సాధువులను పంపిరి. యిపుడువేలమందిని పంపుచున్నారు. మీరేమీ భయపడవలదు. యిదంతయూ నేనెరుంగగదును సర్వజీవులకు ఆహారమొసగు అన్నపూర్ణ నాచెంతనుండగా మీకేల ఈ దిగులు అనుచూ కమండలమందలి జలమును మంత్రించి ఆహారరాసులపై జల్లి, యింకవడ్డన ప్రారంభించుడనిరి. అక్షయపాత్రయందలి ఆహార పదార్ధములవోలే, ఎంత తీయుచున్ననూ ఆహారరాసులు తరుగక, వచ్చిన వారందరికీ తృప్తిగా వడ్డించిరి. యిదిగాంచిన అసూయాపరులు, తోటికులస్తులలో కొందరు పశ్చాత్తాపము చెంది స్వామి మన గ్రామమున జన్మించిన మహాపురుషుడు, అలనాడు నంధ్యాల విశ్వబ్రాహ్మణులు బ్రహ్మంగార్ని కించపరచుటకు యత్నించి భంగపడినట్లు ఈనాడు మనము ప్రవర్తించితిమి. స్వామిని మనతోటి వానివలే భావించి ఆదినుండి ఎన్నో అపకారములు చేసితిమి. అయినను ఈ మహనీయుడు కరుణా సముద్రుడగు పరమేశ్వరుడగుటచే మనతప్పులన్నియూ క్షమించుచున్నాడు. ఈతడు సాక్షాత్ పరమశివుడే గానీ సామాన్యమానవుడు గాడని కొందరు। "ఆ" యిదంతయూ గారడి విద్యలేయని యింకొందరూ తలంచిరి. పరమేశ్వరుడనుకొన్నవారు పాదాలుపట్టి ప్రాధేయపడి క్షమాపణకోరిరి. అనుమానిస్తున్నవారు తటస్తంగాయుండిరి. క్షమాపణ కోరినవారి నుద్దేశించి స్వామివారు నాయనలారా! ఆహార, నిద్ర, మైధునాదులతో చతుష్పాద జంతువుల వలే జీవించు మానవులకంటె విగ్రహారాధన చేయువారు శ్రేష్ఠులు. వారికంటే నిర్మలబుద్ధితో పరమాత్మయనెడు పరబ్రహ్మమును మనోవాక్కాయములచే ఆరాధించు వారు శ్రేష్ఠులు, వారికంటె సత్తూచిత్తూ ఆనందమనెడు సంపదను గల్గి పరమాత్మ సంధానులుగా మైమరచియుండువారు శ్రేష్టులు, వీరికంటే తన్నుతానుమరచి బ్రహ్మానంద సాగరమునతేలుచూ భావోన్మత్తులై యుండి ఉన్నచోటున కదలకయుండు మహనీయులను కనిపెట్టి వారికి ఆహార వస్త్రాదులనిచ్చువారు ఉత్తములు, యిట్టి మహనీయులు వచ్చికోరినవి అర్పించనివారు తమకుగల సంపదలు క్రమంగా హరించి హీనస్థితికి చేరుదురు. తమకు కల్గినదానిలో వీరిని తృప్తిపరచినవారు క్రమంగా ఐశ్వర్యవంతులై సకల యిహలోక భోగభాగ్యములను భవించి, అంత్యమున పరంధామము చేరుదురు. కావునమీరును భక్తిమార్గానువర్తులై తత్వానందాసక్తులై, సగుణ, నిర్గుణోపాసనా, బేధోపాయములందుత్తీర్ణులై, జ్ఞాననేత్రము తెరచి, జ్ఞానసుజ్ఞానులు కండు! యోగమార్గమున దైవత్వసిద్ధినొంది నిర్వికారులై అవాఙ్మానస గోచరులగుటయే జ్ఞానిలక్షణము. భక్తిమార్గమున తరించుటకు ప్రథమసోపానము విగ్రహారాధనయే గాన, మీకు ప్రీతిపాత్రమగు దైవమునారాధించి మీజన్మలు సార్ధకం జేసుకొనుడు. దైవకార్యక్రమములకు మీ శాయశక్తులా సహకరించి సగటు మానవులై జీవించుడు, ఈర్ష్య, అసూయ, ద్వేషం, కుల మతాహంకారములు,

జ్ఞానాన్ని మరుగుపరచి, అజ్ఞానాన్ని ప్రజ్వలింపజేయును, కానరాగద్వేషములు దరిచేరనీయక, దైవసాన్నిధ్యాన్ని చేరి ధ్యానించి, సేవించి, పూజించి, పూజకు సహకరించి తరింపుడు. ఇదియే జన్మసార్ధకతకు మార్గము కానవివేకులై మెలగుడని బోధించి, యిప్పటికి కొందరికైననూ జ్ఞానోదయమైనందులకు చాలా సంతోషము అనుచూ, పాదాలపైబడిన వారికి సన్మంగళాని భవంతు "సద్గురుదేవకరుణకటాక్ష ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించి పంపిరి.

## (19) సర్పమునకు ప్రాయశ్చిత్తం

యిట్టికాలప్రవాహంలో పాలకొండగ్రామమున సకలసద్గుణసంపత్తి గలిగి వ్యవసాయవృత్తిచే జీవించు కాపుదంపతులు కలరు. సంతానలేమిచేవారు అనేక వ్రతములాచరించి, వీరాచార్యులవారితో కలిసి తీర్థయాత్రలు సేవించి, జ్ఞానులనాశ్రయించి లేక లేక కల్గిన పుత్ర సంతతితో వారు సంతోషంగా కాలముగడుపుచుండిరి. దినదినాభివృద్ధితో యవ్వన వంతుడైన కుమారునకు కల్యాణ ప్రయత్నములు చేయుచుండిరి. అట్టి తరుణంలో ఆ యువకుడు పాము కాటుకు గురై ప్రాణములు విడువగా, స్వామివారి మహిమ లెరింగిన ఆ వృద్ధదంపతులు గోడుగోడున ఏడ్చుచూ కుమారుని మృత దేహముతో స్వామివారి చెంతకు వచ్చి, పాదముల పైబడి పుత్రభిక్షపెట్టి మా వంశమును నిల్పుతండ్రీయనుచూ విలపించుచుండిరి. గురుదేవులు కనులుమూసి యోగదృష్టిచే, జరిగినదంతయూ గ్రహించి రోదించు ఆవృద్ధులనూరడించి, కనులు మూసి భృకిటిని హస్తముంచి మంత్రించగా ఒకసర్పము జరజరావచ్చిస్వామివారి పాదాలపైబడి తప్పు మన్నింపుమన్నట్లుగా శిరస్సు ఉంచినది. స్వామివారు దక్షిణ హస్తముతో పడగనుసవరించి లెమ్మని ఆజ్ఞాపించిరి. ఫణిరాజా! నిరపరాధులనిట్లు బలిచేసితివేని, ఘోరపాపములపాలై జన్మరాహిత్యము నొందక నరకముల బడియుందువు. ఈ పాపానికి ప్రాయశ్చిత్తముగా "యింద్రాద్రిలో 12 సంవత్సరములు తపమాచరించి" జన్మరాహిత్యమును బొందుము. యిపుడునీ వొనరించిన తప్పిదమును నీవే సవరించుకొనుము అని ఆజ్ఞాపించిరి. వెంటనే సర్పము చనిపోయిన వానిచెంతకేగి కాటువేసిన చోటున తన నాలుకతో విషాన్ని తీసివేయగా "గురుదేవుల కరుణా కటాక్షవీక్షణలతో" ఆయవకుడు నిద్రమేల్కొన్నవానివలే లేచి నిలబడెను. యిదంతయూ చూచువారు ఏమిటీ వింతయని ఆశ్చర్యచకితులై మైమరచి భక్తిపారవశ్యమున జయజయ ధ్యానములతో కీర్తించిరి. మరికొందరు గారడీవలేయున్నది ఎలా జరిగింది? అనే అనుమానాస్పద ఆలోచనలతో ఉండిరి. ఆవృద్ధ దంపతులు పరమేశ్వరావతారా। నీలకంఠాభరణా! నీదయచేత మాకు పుత్రభిక్షపెడితివాదేవా యనుచూ పాదాలపైబడి పరిపరివిధాలుగా ప్రార్థించగాస్వామి **"సమస్తసన్మంగళానిభవంతు"** అని ఆశీర్వదించగా పుత్రునితోడ్కొని వృద్ధ దంపతులు ఆనందముగా యింటికిబోయిరి.

## (20) విశ్వనాధుని నిత్యకృత్యము

గురుదేవులిట్టి మహిమలు జూపుతూ, త్రికాల సంధ్యావందనము లాచరించుచూ, యజ్ఞయాగక్రతువులుచేయుచూ, నిరతాన్నదానములు జరుపుచూ, అన్నికులములవారికి ఏకపంక్తిభోజనాలు చేయించుచూ, సర్వులకూ వేదమంత్రార్ధములు విప్పిచెప్పుట, యోగరహస్యములనెరింగించుట, కులమతబేధంలేకుండా అందర్నీ శిష్యులుగా స్వీకరించుట ఉపదేశములిచ్చుట వైశ్యుడు, రజకుడు ప్రధాన శిష్యులుగా ఉండుట, కులపెద్దలకు ఈర్ష్యఅసూయలు కలిగి, విశ్వనాధస్వామి అన్నగారితో, నీలాచారీ మీ తమ్మునితో తప్పుతాంబూలం పెట్టించు లేకున్న అతనికి కులబహిష్కరణతప్పదని హెచ్చరించిరి. నీలాచారి తమ్ముని తప్పుపట్టలేక, కులపెద్దలనెదిరించలేకమిన్న కుండెను. యిటువంటి గ్రామపరిస్థితులలో స్వామి సత్యధర్మ సూత్రంబులనెడి విజ్ఞానజ్యోతులచే, లోకారిష్టంబగు అజ్ఞానాంధకారములను పాలద్రోలు భాస్కరుని చందంబున. విశ్వనాధుడు వెలుగొందు చుండెను. ఇట్లు భక్తజన సేవిత శోభాయమాన మానస





బోధనీయులై "ఆదిదంపత" అవతారస్వరూపంబనందగు ఆపుణ్య దంపతులుదర్శన భాగ్యంబున, సర్వపాప హరణంబై, సత్సాంగత్య సాంప్రదాయమునకు సాన్నిధ్యమొసగి, మోక్షమార్గంబు జూపుస్వామియెడ భక్తిభావ మానసులైన జనులు, శుశ్రూషలు సలుపుచుండిరి. యిట్లనేక భక్తులకు తననిజతత్వోపదేశమొసగుచు, బ్రహ్మతేజస్సుతో రాజయోగియై కాలము గడుపు తరుణంబున, జగన్మాతయగు అన్నపూర్ణాంబ ముకుళిత కరకమలయై స్వామిచెంతజేరి। నాధా! ఈమాయా ప్రపంచమున నాఅవతారమునుచాలించిన మీరు సన్యాసాశ్రమము నిర్వర్తింపవీలగును! అపుడు మీరు లోకసంచారము జేసి సద్ధర్మములు జగతికి బోధించి, దుష్టశిక్షణా శిష్టరక్షణాధ్యక్షులై తమవిధి నిర్వర్తింపవలసియున్నది. మీరాజ్ఞయొసంగిన నా ధర్మము నేను నిర్వర్తింతుననగా విశ్వగురుడు అర్ధాంగి పలుకులకు సంతసించి, దేవీ నేతెల్పు విషయములు సావధానముగా వినుము. మన అవతార నిర్ణయప్రకారం నీవు మైసూరుపట్టణమున నాటుకోటు శెట్టియార్ అనే రత్నాలశ్రేష్టి యింట వారి తపఃఫలితముగా జన్మించుము. నీ 8వ సంవత్సరమున చెన్న పట్టణమందు కలియుదము. ఆపై విషయములు ఆనాడెరింగితునని తెల్పుగా, అన్నపూర్ణామాతా ప్రసన్నవదనమున తలయూపినది.

## (21) పంచాననం వారి వృత్తులు :

పూర్వము మనుసంతతివారు కమ్మరవృత్తిని, మయసంతతివారు వడ్రంగ వృత్తిని, త్వష్టసంతతివారు కంచరవృత్తిని శిల్పిసంతతివారు శిలాశిల్పవృత్తిని, విశ్వజ్ఞ సంతతివారు స్వర్ణవృత్తిని ఆచరించెడివారు.

**స్వామివారి జీవనోపాది ఎట్లనగా :** బ్రహ్మముహూర్తమున మేల్కాంచి, నిత్యకృత్యము లాచరించి నదీ లేక తటాకములందు సంధ్యావందనముగావించి, సూర్యోదయ సమయమున ప్రత్యక్షదైవమగు సూర్యభగవానునికి అర్ఘ్యమొసంగియిల్లు జేరి, విభూతి రుద్రాక్షలు ధరించి, శిల్పశాలయందు విశ్వబ్రాహ్మణ ఆరాధ్యదైవమగు కామాక్షీమాతను పూజించి, భూమిపై మెత్తని ఆసనము నేర్పరచుకొని సుఖాసీనుడై (తనమేధస్సనే) ఆకాశము క్రిందను హోమగుండమనే అగ్నిని, వాయు సహాయంతో ప్రజ్వలింపజేసి "పట్టెడపై సుత్తితో కొడుతూ" బంగారాన్ని తనకు కావలసిన ఆకారం వచ్చువరకు కాల్చుతూ నీటిలో చల్లార్చుతూ యిలా ప్రతీ స్వర్ణకారుడూ తనకు తెలియకుండానే పంచభూతముల సహాయంతో (సాక్షిగా) శక్తి అంశమగు సువర్ణముతో ఆభరణములు చేయుచుండెడివారు. ఈ విధమగు స్వర్ణవృత్తిని సనారీవారు శిల్పశాల యందు చేసెడివారు. వారు వృత్తి ఆరంభానికి ముందుగా అగ్ని కార్యము గావించి, కామాక్షిమాతను స్మరించుసరికి వారి వాగీశ్వరికుండమున(కుంపటిలో) ఆ రోజు ఖర్చులకు సరిపడు బంగారాన్ని అమ్మవారు యిచ్చెడిదట. దానితో ఆ దినము సంతృప్తిగా తలంచిన కార్యములన్నియూ నెరవేరెడివట! యిలా స్వామివారి నిత్యకృత్యములు జరిగెడివి. వారు ఏ పని ఎవరికి చేసినా ధనం పుచ్చుకునేవారు కాదట. సాటి కులస్తులు ఎంత కష్టించిన నూ నిత్యజీవనమే దుర్భరముగా నుండుటచే స్వామివారు ఏ సంపాదన లేకుండా సత్ కార్యములు కొరతా లేకుండా జరుపుటచే కులస్తులకు ఈర్ష్యా అసూయలు కల్గినవి..... యిట్టి కాలప్రవాహములో

## (22) అన్నపూర్ణ జీవసమాధి

ఉత్తరాయణ పుణ్యకాలమున ఒక సుదినంబున అన్నపూర్ణామాత మంగళ స్నానము లాచరించి నూతన వస్త్రములు దాల్చి మోమంతయూ పసుపు రాసి, సంధ్యాభాస్కరునట్లు నుదుట కుంకుమబెట్టి సిగను పూలమాల అలంకరించుకొని సంపూర్ణ సౌభాగ్య చిహ్నములతో, శాంకరివలె భర్తదరికేతెంచి పాదపూజలు గావించి ఆ తీర్థము సేవించి, శిరస్సున దాల్చి ముమ్మారు ప్రదక్షిణలు గావించి, పరమభక్తాంతరంగియై పతిదేవుని యాజ్ఞతో పద్మాసనాసీనురాలై ప్రాణాయామమున ప్రాణవాయువుల బంధించి సంపూర్ణ సమాధి యోగంబు చెంది అచేతనురాలయ్యెను. ఈ వార్త గ్రామమంతయూ

వ్యాపించినది. వెంటనే నీలాచార్యులు సంఘ పెద్దలు దరికేగి తన మరదలు సుమంగళియయ్యెనని సమాధి కార్యమునకు సహాయముకోరగా సంఘపెద్దలు "నీలాచారీ" నీ తమ్మునిచే తప్పు తాంబూలము పెట్టించలేకపోయితివి. పోనీ ఆ విశ్వనాథమిపుడైనా మా దరికివచ్చి సంఘ పెద్దల సహాయము కోరెనా? గతంలో ఎవరింటికైనా శుభమునకుగానీ, అశుభమునకుగానీ వెళ్ళెనా? అతనికి సంఘమన్నా సంఘ పెద్దలన్నా నిర్లక్ష్యము. అటువంటి వానికి ఈనాడు ఆపద వచ్చినదని నీవు పిలుచుట సమంజసంగా లేదు. సంఘ ఆదేశములను ధిక్కరించిన వారికెవరికైనా తగినశాస్తి జరిగినచో తతిమా సంఘీయులందరికి సంఘమన్న భయభక్తు లేర్పడును. నీవునూ యిపుడు మాతో ఏకీభవించవలయును. లేనిచో తమ్ముడని పరామర్శింప బోయినచో నీకు సంఘ బహిష్కరణ తప్పదు. వృత్తిలో సహకారములు కోల్పోయి గుక్కెడు మంచినీటికి కటకటబడుదువు ఆలోచించుకొనుము ఈ గ్రామమందుందువో? పొరుగూరు పోదువో! నీ యిష్టము అని హెచ్చరించిరి. నీలాచారికి సంఘము నెదిరించు ధైర్యము లేక తమ్ముని పరిస్థితి తలంచుచూ విచారవదనుడై కూలబడెను. కులమందలి బంధుమిత్రాదులు ఒక్కరైననూ ఆ యింటి వైపు కన్నెత్తి చూడలేదు. విశ్వనాథుని స్వగృహమందు శిష్యులందరూ జేరి అమ్మవారికి పాదపూజలు చేసి భక్తితో నామ సంకీర్తనలు, శ్రీ సూక్త పఠనములు చేయుచుండగా విశ్వనాథుడు తన అర్ధాంగిని తనయందు ఐక్యము చేసుకొని "సనారీయై" పార్థివ శరీరమును తన స్వహస్తములతో తన యింటియందు సమాధిజేసి దానిపై తులసి వృక్షము నాటెను. శిష్యగణ మంతయూ సమాధికి పూజలు జరిపి ముమ్మారు ప్రదక్షిణలు భక్తిపూర్వకముగా ఆచరించి స్వామివద్ద శెలవు తీసుకొని గృహోన్ముఖులైరి.

ద్వితీయాధ్యాయము సమాప్తి



మాస శివరాత్రి అన్నాభిషేక ఛాయాచిత్రం





## (23) గ్రామస్తులు కొత్వాలుకు ఫిర్యాదు చేయుట (తృతీయా ధ్యాయము)

విశ్వనాథుని యింట జీవసమాధి కార్యక్రమము పూర్తియగుసరికి భాస్కరుడు అస్తమించెను. యిదంతయూ చూస్తున్న యిరుగు పొరుగువారు, ఏమిటీ విపరీతం గ్రామమధ్యలో సమాధి గ్రామానికే చేటు గదా! ఈ విషయం కొత్వాలుకు ఫిర్యాదు చేయవలెనని ఆ రాత్రంతా జాగరణ చేసి ఎప్పుడు తెల్లారుతుందా? ఎప్పుడు దివాణం తెరుస్తారు? ఎప్పుడు ఫిర్యాదు మనము చేస్తామని అత్రంగా ఆ రాత్రి గడిపి, ఈ వార్తను ఉదయాన్నే కొత్వాలు వారియొద్దకు బోయి తెలిపి గ్రామ క్షేమమునకై మీరు చర్యలు తీసుకొని సమాధిని యింట్లో తీయించి స్మశానంలో చేయించాలని తెలిపిరి. వెంటనే కొత్వాలు పరివారముతో విశ్వనాథాచారి యింటికి వచ్చి గ్రామస్తుల ఫిర్యాదును చెప్పి సంజాయిషీ కోరిరి. దానికి స్వామివారు కొత్వాలు మహాశయా! మీరు విన్నది సత్యమేననిరి. అట్లయిన ఆ సమాధిఎక్కడో చూపమనిరి. స్వామి గదినిచూపి లోనికిపోయి చూడుడనిరి. కొత్వాలు గది తలుపులు తెరువగనే కనులు మిరుమిట్లుగొల్పు గొప్పకాంతితో గదంతయూ మహాప్రకాశవంతమై మధ్యభాగమున పద్మాసనాసీనయైన అన్నపూర్ణాదేవి అభయహస్తముతో లీలగా దర్శనమీయగా ఆ మహాతేజస్సును చూడలేక కళ్ళు మూసుకొని కొత్వాలు బృందం వెనుదిరిగి స్వామీ మా అపరాధం మన్నింపుడని ఆచార్యుల వారి పాదాలపైబడి శరణుకోరిరి. స్వామి వారిని లెండు మీ ధర్మము మీరు నిర్వర్తించితిరి నాయనలారా! "మీకు శుభం కలుగుగాక" యని ఆశీర్వదించి పంపించిరి. కొత్వాలు ఫిర్యాదు చేసిన వారిని పిలిపించి గ్రామమధ్యనున్నది సమాధి కాదు. "సాక్షాత్ జగన్మాత" అచట అలా ఉండుటే గ్రామానికి క్షేమము. యిటువంటి ఫిర్యాదులింక తెచ్చిన దండింతునని హెచ్చరించి పంపిరి.

## (24) నీలాచారికి సంఘం బెదిరింపు

యిట్టి మహిమలు ప్రదర్శించుచున్ననూ అసూయాపరుల ఆగడములు ఆగలేదు. దుష్ప్రచారములు మానలేదు. యిదంతయూ కనికట్టు విద్యలని ప్రచారము చేయుచునే యుండిరి. విశ్వనాథుడిపుడు ఒంటరివాడు. నీలాచారికి నలుగురు కుమారులు. ఒక కుమార్తె గల కుటుంబీకుడు. ఒకనాడు కుల సంఘంవారు సమావేశ మేర్పరచి నీలాచారిని పిలిపించి ఏమిటి నీ తమ్ముని ప్రవర్తన ఊరిమధ్యన సమాధిచేయుట ఏమిటి? ఏ శాస్త్రమందు ఈ విషయమున్నది. అసలు నీ తమ్ముడు ఆచార్యుడెట్లయ్యెను? ఎవరిచ్చిన బిరుదది? మాతృసంఘము నుండి ఎట్టి ప్రశంసా పత్రము పొందియుండలేదే? అతడు వేదపాండిత్య మెక్కడ అభ్యసించెను? నీ పినతండ్రికికినీ ఏ సంఘంవారూ బిరుదులిచ్చియుండలేదే! అతడు చెప్పు సిద్ధాంతములే గ్రంథమున ఉన్నవి? "లేవే!" వానిదంతయూ క్షుద్రవిద్య, చేతబడులు చేయువాని తంతు. మాలోని శంకరావధానికన్నా శాస్త్రము లెరింగినవాడా? వెంకయ్యాచారి కన్నా వేదములునేర్చినవాడా? పాపయ్యశాస్త్రికన్నా పండితుడా? తెలిసీ తెలియని నీ తమ్మునివంటివాని వద్ద ఉపదేశంపొందినవారికి "ఉచ్ఛిష్టనరకం తప్పదని" నీవెరుంగవా నీ తమ్ముడు సంఘంవారి ఆదేశములు లెక్కింపడు, కొన్నాళ్ళు పెంచినందులకు నీవే అతని మందలింప వలయును. అరే కొత్వాలునుకూడా యింద్రజాల విద్యతో కనుగప్పినాడే నీలాచారీ నీవతని ఆగడములు కట్టించనిచో నీ కుటుంబము గ్రామం వదిలి పోవలసియుండును యిదేనీకు ఆఖరి హెచ్చరిక ఊళ్ళోఉంటావో? పిల్లాజెల్లా, పెళ్ళాంతో పొరుగూరు పోతావో? తేల్చుకో అంటూ తమ అధికారాన్ని ప్రదర్శించి నోటికి వచ్చినట్లు మాట్లాడి కొట్టినంతపనిజేసి పంపిరి.

## (25) విశ్వనాధుడు నీలాచార్ని శపించుట :

సంఘంవారి మాటలకు ఆవేశమొందిన నీలాచారి విశ్వనాధుని యిల్లు జేరి తమ్మునితో నిన్ను చేరదీసి ఒకయింటి వానిని జేసినందుకు నాకు ఈ గ్రామమున నిలువనీడలేకుండా చేయుచున్నవా?

నీవేషభాషలు, చేష్టలకు, గ్రామప్రజలు భయబ్రాంతులగు చుండిరి. నీకు హితవుచెప్పమని సంఘపెద్దలు నన్ను నానా మాటలనుచున్నారు. యింతటి ఛాందసుడవు మా కుటుంబమున ఏలా పుట్టితివి. మానవుడు సంఘజీవియని యెరుగవా? సంఘమన్నా పెద్దలన్నా లెక్కలేదు. పెద్దవాడనగు నన్నుకూడా లెక్కచేయకున్నావే యనుచూ కోపావేశమున నీధోరణి మార్చుకుందువా లేదా యని విశ్వనాధుని కొట్టుటకు చెయ్యిపైకెత్తెను. సహనం కోల్పోయిన స్వామి "ఆగ్రహంతో" నీయింటవాళ్ళిన మంచమెత్తక వరుసగా మరణించెదరని శపించెను. నీలాచారి ఆవేశమంతయూ ఒక్కసారిగా నీరుగారి పోయినది. నోట మాటరాక ఏమీతోచక విచారముతో యిల్లు జేరెను. అప్పటికే పెద్దకుమారుడు అధిక జ్వరబాధతో మంచానబడెను. విశ్వనాధుని శాపఫలితంగా తన నల్గురు కుమారులు వరుసగా మరణించిరి. మిగిలి కుమార్తె మంచానబడినది నీలాచారి వెర్రివాని వలే దిగాలుగా ఒక మూల మాట, మంచిలేక కూలబడెను. పరిస్థితి విషమించినదని గ్రహించిన కామేశ్వరి కడుపుకోత భరించలేక విశ్వనాధుని యింటికి బోయి క్షమాపణ కోరినది. శాంతించిన సనారి వదినా విధి వ్రాలు అట్లున్నది. మనము నిమిత్తమాత్రులము. మీ యింటి వాళ్ళిన మంచములేవదు గనుక ఆమంచముతో అమ్మాయిని నా యింటికిచేర్చమనిరి. అట్లే పినతండ్రియిల్లు చేరినభ్రమరాంబ త్వరలో సంపూర్ణఆరోగ్యముతో పినతండ్రియింటనే ఉండిపోయినది.

## (26) పక్షులకు ప్రాణభిక్ష - ఎరుకులకు జ్ఞానభిక్ష

గురుదేవులొకనాడు సంధ్యావందనాది నిత్యానుష్ఠానములు తీర్చుకుని కర్మశాల యందున్న సమయంబున, కొందరాటవికులు అడవియందు స్వేచ్ఛగా విహరించుచున్న పక్షులను బంధించి విక్రయించుచుండిరి, స్వామివారలను బిలచి ఓయీ! ఈ పక్షులనేల బంధించి తెచ్చితిరి. యిట్లు బంధించుట పాపము గదాయనిరి. అదేమిటి దొరా? వింతగా అడుగుచుంటిరి; కోటివిద్యలు కూటికొరకేగదా ! ధనము కొరకు వీటిని బట్టి విక్రయించుచుంటిమనిరి. మేమును బహుకష్టములకోర్చి వీటిని బట్టి ధనము సంపాదించు చుంటిమి. వీటిని ప్రీతితో భుజించి ఆకలి తీర్చుకొనువారలు, పాపమని ఎరుగరా? అనుచూ గిరిజనులు పాపమో, పుణ్యమో, మేమెరుగముదొరా! మా జీవనాధారమిదియే తరతరంబుల నుండి ఈ వృత్తి చేకుటుంబములు పోషించు కొనుచున్నాము. మాకు యింతకుమించి ఏమియూ తెలియదు దొరాయనిరి. అప్పుడు స్వామి నాయనలారా! మీరు చెప్పినది సత్యమే ఈ చరాచరప్రపంచమున ప్రతిజీవియూ జీవనపోరాటము చేయుచున్నది. 84 లక్షల జీవరాసులలో పరమేష్టి మానవులకు ప్రత్యేకముగా జ్ఞానమొసంగెను. దానిచే, ధర్మాధర్మముల నెరింగి జీవించినగదా, సగటు మానవులగుదురు. లేనిచో జ్ఞానశూన్యమగు మృగప్రాయులగుదురు. కావున జీవహింస చేయక అహింసా మార్గమున, జీవించిన గదా మానవ ధర్మము నిర్వర్తించిన వారమగుదుము. కావున మీ జీవనోపాధికి ధనమిచ్చెదను వాటిని విడువుడని, వారడిగినధనమిచ్చి పక్షులను విడిపించి స్వేచ్ఛనొసంగెను. నాయనలారా ! నేటినుండి అహింసామార్గమున జీవించుటకు మీకు వేరొక మార్గము తెల్పెదనని వారలను చేరబిలచి, వారి నాలుకపై బీజాక్షరములు లిఖించి, నేటినుండి మీకు కల్గిన ఎఱుకదెల్పు శక్తితో, మీరు, మీభావితరముల వారునూ, యధేశ్చగా అహింసా మార్గమున, జీవింపుడని చెప్పిరి, వారికి జ్ఞానోదయమై "గురుదేవా", మా పూర్వజన్మ సుకృతమున మాకు అహింసా మార్గమున జీవించుదారి జూపి, మా జన్మలను ధన్యముగావించితిరని, సాష్టాంగ పాదాభివందనములు చేయగా! గురుదేవులు మందహాసముతో "శుభంభూయత్" అని ఆశీర్వదించి ఆప్యాయముతో లేవనెత్తిరి. వారు అపరిమితానందముతో నమస్కరించి వారి గూడెములకు సంతోషముతో బోయిరి. వారే ఈనాటి ఎఱుకలవారై" ఎఱుక దెల్పుతూ ఆంధ్రదేశమున కన్పించుచున్నారు.





## (27) నవరత్నాల ఉంగరం

పాలకొండ సమీపమునగల వీరఘట్టం దగ్గరలోగల సంతనర్సీపురంగ్రామంలో భూకామందగు కర్రి వెంకటనాయుడను 75సం॥ల వయసుగలకాపుకులస్తుడుకలడు అతనిని ఆశ్రయించిన వారికి ఉండుటకు వసతి చూపించి భోజనాదిసదుపాయములు సమకూర్చెడివాడు ఎవరు వెళ్ళినా, ఎవరు మీరు, ఎందుకు వచ్చారు, ఏమికావాలి, ఎప్పుడు వెళతారని అడిగేవారు కాదు ఎప్పుడు, ఎవరేది కావాలంటే అవి యిచ్చిపంపేవారు వారికి జాతకరీత్యా నవరత్నాల ఉంగరంధరించాలనిజ్యోతిష్కులు చెప్పారు. అది శాస్త్రీయముగా తయారు చేయగల సమర్ధులెవరిని విచారించగా సనారీవారి గురించి పలువురు చెప్పగా వెంకటనాయుడు స్వయంగా పాలకొండవచ్చి గురుదేవులకు విషయాన్ని చెప్పి తులంబంగారం నవరత్నాలు యిచ్చి శాస్త్రీయముగా తయారు చేయమనికోరారు. అందులకు స్వామి అలా చేయడానికి చాలాకాలంపడుతుంది. నేను యిచ్చే వరకూ మీరు ఉండగల్గితే తప్పక చేసియిస్తానన్నారు. మీరు శాస్త్రప్రకారము చేయండి. ఎంతకాలమైనా ఫరవాలేదు. మీరు ఎంత ధనం కోరినాయిస్తానన్నారు. అపుడుస్వామి అన్నిటికంటే ముఖ్యంగా మధ్యలో చూపించమంటే కుదరదు అలా మీరు యిష్టపడితేనే చేస్తానన్నారు. నాయుడు సరేనని బంగారం, నవరత్నాలు యిచ్చి వెళ్ళిపోయారు. ఆ ప్రక్కనేయున్న సోములు సందేహంగా "గురుదేవా" వారికి అంతకాలం పడుతుందన్నారు ఎందుకోనాకు అర్ధంకాలేదు అన్నాడు. దానికి స్వామి యిలా చెప్పారు. నవరత్నాల ఉంగరం మామూలుగా చేస్తే 3 రోజులలో అవుతుంది. కానీ యిది అలా కాదు. ప్రారంభించిన దగ్గర నుండి కొన్ని నియమాలు పాటించాలి. దోషంలేని నవరత్నాల నెంచుకుని ముందుగా యజమాని శుభతారలందు రవిబలంగాయున్నపుడు అమృతఘడియలలో గణపతిని, యిష్టదైవాన్ని ధ్యానించి, పూజించి, నవగ్రహములను ఆరాధించి నారికేళమును సమర్పించి, శ్రీసూక్త పఠనంతో బంగారాన్ని కరిగి పని ప్రారంభించాలి. ఉంగరంగాటు తయారైన పిదప నవగ్రహములఉచ్చస్థితిని గానీ మూలత్రికోణములందు గానీ యున్నప్పుడు వర్జ్యం దుర్మహూర్తములు లేని సమయంలో ఆ గ్రహనక్షత్రంతో కూడిన వారంగానీ, గ్రహమిత్రవారం గానీ, హోరగానీ, ఆగ్రహానికి శత్రులగ్నం కాకుండా గ్రహం6- 8-12 స్థానాల్లో లేకుండా గ్రహబల సమయమందు అనగా రవి-మధ్యాహ్నం, చంద్ర-రాత్రి-కుజపగలు, యిలావరసక్రమంగా ఆగ్రహాన్ని రత్నంలోకి ఆవాహనచేసి ప్రాణప్రతిష్ఠ పంచపూజలుజేసి ఉంగరంలో ఆ రత్నాల గ్రహమూల బీజములతో జపిస్తూ రత్నాన్ని వాటిఆకారంలో రవివర్తులం, చంద్రుడు అర్ధచంద్రాకారం, కుజుడు త్రికోణం, యిలాగ బిగించాలి. అంగుళీయము పూర్తియైన పిదప పంచగవ్యము లందొకదినము, నారికేళజలమందొక దినము నవధాన్యములందొక దినము, శుద్ధోదకములందొక దినము అధివాసములు గావించి, కర్తచే నవగ్రహ హోమం జరిపించి అంగుళీయమునకు రుద్రాభిషేకం చేయించి కర్తయిష్టదైవాన్ని షోడశోపచారములతో పూజించి, శుభతారలందు కర్తచేశక్తి మేర అన్నదానము చేయించి. స్వర్ణశిల్పికి నూతన వస్త్రములు దక్షిణ సహిత తాంబూలాదులు సమర్పించి సంతృప్తిని గావించి వేదొక్త మహదాశీర్వాదమును పొంది శుభసమయమున ఆశీర్వాదయుక్తముతో అంగుళీయాన్నీ ధరించాలి. దీనికి నవగ్రహగతి అనుకూలమును బట్టి ఎంత కాలము పట్టునో నిర్ణయించబడును. త్వరపడిన ఫలితముండదు. అందుచేత కాలనిర్ణయము చేయక సమయమువచ్చు వరకూ వేచియుండమంటిని. యిదిధన వంతులైనా, రాజ్యాధిపతులైననూ, ధరింపలేరు. దీనికి ధనముకన్నా ధరించు అర్హతకావలయును, వీని అర్హత ఎట్లున్నదో వేచి చూడవలయును గతంలో యిలా తయారు చేసిన అంగుళీయమును, విశ్వజ్ఞ బ్రహ్మసంతతివాడగు "తుకా బ్రహ్మనందయోగి" స్వర్ణశిల్పి "ఛత్రపతి శివాజీకి బహుమతిగా నీయగా, శివాజీ ఉంగరమును జూచి అందముగా లేదని, అలక్ష్యముచేసెనట, దానితో శిల్పి

ఆవేదన చెంది, శివాజీనిగాంచి, నీవు చేయు హిందూ మతోద్ధరణకు, ఆనందపడి నిన్నింకనూ గొప్ప శక్తి వంతుని జేయ సంకల్పించి నీ కొరకు నా శాస్త్రవిజ్ఞానమునంతటినీ కేంద్రీకరించి, దీని రూపకల్పన గావించితిని, యిట్టిమహిమ గల అంగుళీయమును నీవు నిరసించుటచే, నా శ్రమయంతయూ వ్యర్థమాయెను. యిదింకెందులకని ఆ ఉంగరమునునేలపై విసిరి కొట్టెను. తక్షణమే గొప్ప ధ్వనితో, కనులు మిరిమిట్లుగొల్పు కాంతితో, నవరత్నములతో ప్రతిష్టించిన నవగ్రహములు ఆకాశమునకెగసి పోయినవి, అది గాంచిన శివాజీ నిచ్చేష్టుడై అయ్యో ఎంత అపరాధం జరిగినదని విచారిస్తూ మరొక అంగుళీయము తయారు చేయుడని, శిల్పిని అర్థింపగా! "లేదు వీరా" యింక అసాధ్యము, నీకా యోగ్యతలేదు. గ్రహములు గతులు తప్పినవి. నీకొరకు శక్తి విగ్రహముతయారు జేసి యిత్తును, దాని నర్చించి చరితార్థుడవుకమ్మని, ఆ మహా శిల్పి వెడలిపోయెను. దీనిని ధరించుట అందరికీ సాధ్యపడదు. అతనికర్హత కావలయునని చెప్పి స్వామివారు ఒక సుముహూర్తమున అంగుళీయ నిర్మాణ మారంభించిరి. కాలప్రవాహమున 21 మాసములు గడచినవి అప్పుడప్పుడు నాయుడుగారు స్వామి వద్దకు నౌకర్లను పంపుతున్నారు స్వామి తయారవుతున్నదని చెబుతున్నారు. ఆగ్రామజ్యోతిష్కులు నాయుడుగారితో ఎంత శాస్త్రీయంగా చేసినా ఒక ఉంగరానికి యిన్ని సంవత్సరాల సమయం కావలయునా? అసలు బంగారం ఉందో లేదో ఒకసారి చూడండని సలహాయిచ్చారు. బంగారం ఉంటే యిన్ని నెలలెందుకు. ఒక్క ఉంగరం యిన్నాళ్ళూ చేస్తూనే ఉంటాడా? అని హేళనగా మాట్లాడారు ఆ మాటలకు నాయుడుగార్కి బాధకలిగి పనివార్ని పిలిచి స్వామివారిని యిలా అడగమని చెప్పారు. గ్రహస్తితి బాగోక కదా ఉంగరం చేయించుకునేది యిన్ని నెలలకి కూడా పూర్తి కాకపోతే ఎలా? త్వరగా పూర్తిచేయమని కబురు పెట్టారు. దానికి స్వామి ఆ పనిమీదే వున్నాను. తయారు కాగానే పంపుతానన్నారు కాలగర్భంలో మరో 3 నెలలు కలసిపోయాయి. సహనం కోల్పోయిననాయుడు గార్కి జ్యోతిష్కులు హేళనలు అగ్నిలో ఆజ్యంపోసినట్లయినది. దాంతో నాయుడుగారు కోపించి గ్రహస్తితి బాగోక ఉంగరం చేయించుకుంటున్నాను. ఇంకా ఎన్ని నెలలు వేచి యుండను. నాకు 3 రోజులలో ఉంగరం కావాలని కబురు పంపారు. దానికి స్వామి అలాగే ఉంగరం తెస్తాను ఆనాడు పండిత సభ ఏర్పాటు చేయించమని వారితో కబురు పంపారు. తెస్తానన్న సమయానికి స్వామి ఉంగరంతో సంతనర్సీపురం వెళ్ళారు. స్వామిని జూచి పండిత బృందం ఉంగరం తెచ్చారాయని ప్రశ్నించారు. తెచ్చానుగానీ। నేను యిచ్చే వరకు మధ్యలో చూడకూడదని నాయుడుగార్కి చెప్పాను కదా? యనగా నాయుడుగారు తటపటాయిస్తుండగా పండిత బ్రాహ్మణబృందం పర్వాలేదు ఎంత వరకూ అయ్యిందో ఒక్కసారి చూస్తామన్నారు. **"స్వామి"** నాయుడు గారూ మధ్యలో చూపిస్తే దాని ప్రభావం పోతుందని దాన్ని మంత్రయుక్తంగా గ్రహగతిననుసరించి తయారు చేస్తున్నదని చెప్పానుగదా? అనగా నాయుడుగారు ఆలోచనలో పడ్డారు. పండితులు జోక్యం చేసుకొని నాయుడుగారు యితనొక తాంత్రికుడు. యితని మాటల గారడిలో పడవద్దు. ఈ ప్రపంచమంతా దైవాధీనం! ఆదైవం మంత్రాధీనం అట్టిమంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణులకు మించిన దైవజ్ఞులు లేరు. మావద్దనా వీనిమంత్రతంత్రములని హేళన చేసిరి. దానికి స్వామి అవును వేదరహస్యములు అన్యులకు తెలియనీయకుండా మీ వాళ్ళు అధికారులనాశ్రయించి చాలా శాసనములు చేయించినారు, బ్రాహ్మణేతరులు వేదములు తాకిన చేతులు నరికించుట, చూచినకళ్ళు పొడిపించుట, వినిన చెవులలో సీసము కరిగించిపోయించుట, వేదము పల్కిన వారి నాలుక కోయించుట, శాసనములతో వేదరహస్యములు యితరకులస్తులకు తెలియ కుండా చాలా జాగ్రత్తపడ్డారు. కానీ మా వద్ద మీ ఆటలు సాగవనిరి. దాంతో పండితులు వేదములు, మంత్రములు మాకే స్వంతం నీవేదో మహా





మహిమతో మంత్రయుక్తంగా చేసిన ఆ ఉంగరం యిపుడే చూపమని నాయుడుగారితో అడిగించిరి. స్వామి అదిచూపిన ఈ జన్మలో నవరత్నాల ఉంగరం ధరించు ప్రాప్తముండదన్నారు. దానికి పండితులు కల్పించుకొని ఈ మాత్రంపని మేమెక్కడైన చేయించగలము, ఆ మహిమేదో ప్రదర్శించమన్నారు. దాంతో స్వామి వారు ఉంగరంచేత్తో పట్టుకుని, సభవారందరూ చూస్తుండగా, ఒక్కొక్కమంత్రం చెప్పుసరికి, ఒక్కొక్క రత్నం గొప్పధ్వనితో కనులుమిరిమిట్లు గొల్పుకాంతితో, ఉంగరం నుండి పైకెగసిపోయినవి. అదిగాంచిన పండితులు నాయుడు, సభాసదులు, సంభ్రమాశ్చర్యములతో అచేతనులైరి స్వామివారు యిదిగో అంగుళీయము మంత్రం బాహ్మణాధీనంకదా, మీరు మంత్రోచ్చారణతో గ్రహముల నావాహనచేయుడని, కాళీ ఉంగరం వారి చేతికిచ్చిరి. బాహ్మణులు దిగ్భ్రాంతి నుండి తేరుకుని, దిక్కుతోచక యుండిరి. వెంటనే నాయుడు గారు స్వామీ వీరి మాటలచే యింత జరిగినది. నాయందు దయఉంచి, మరల ఉంగరం తయారుచేయుడు మీరుకోరినదేదైనాయిస్తాననిరి. అపుడు స్వామివారు "నాయుడుగారు" ఈ అంగుళీయధారణ యోగ్యత మీకు లేదు. యింక మీ ఆయుః ప్రమాణము 3 నెలలు మాత్రమే ననిరి, నాయుడు గారు స్వామి పాదాలపైబడి, పలువిధముల ప్రాధేయ పడిననూ స్వామి ప్రయోజనము లేదు. నాయుడుగారు, గ్రహములు గతులు తప్పినవి. మరల ఉచ్ఛస్తితికి చాలా సంవత్సరములు పట్టును. విధిబలీయమైనది, చెప్పుడు మాటలచే కల్గిన ముప్పుయిది యింకనే పోవుదుననిరి. యిప్పుడు పొద్దుపోయినది. వేకువజామున వెళుదురు. రాత్రికి మా యింట విశ్రమింపుడు మా యింట విశ్రమింపుడని అందరూ కోరిరి. స్వామి చిరునగవుతో బయలుదేరి కొంతదూరమువెళ్ళి కనుమరుగైపోయి పాలకొండ చేరిరి. ఆపిదప నాయుడుగారు 3 నెలల్లో పరలోక ప్రాప్తి చెందిరి. ఆపదలలో ఆదుకొను ధర్మదాత కాలంచేసెనేయని యిరుగుపొరుగు గ్రామస్తులందరూ దుఃఖించిరి. ఆ ఉంగరం ధరించిన జీవించెడి వారు గదాయని అనుకొనెడివారు. కాలం కలసిరానపుడిట్లే జరుగునని మరి కొందరు తలంచిరి.

గమనిక : ఉంగరములో రత్నములు బిగించు సమయమున ఆ వారమునకు నిషిద్ధమైన తిధులను గమనించాలి. ఉదాహరణ: శనివారము-షష్టి, శుక్రవారము-సప్తమి, సోమవారము-భద్రతిధులు, ఇలా లేకుండా రత్నములు బిగించాలి.

## (28) స్వామికి అగ్నిపరీక్ష :

స్వామి వారిట్టి మహిమలు ప్రదర్శించుచున్ననూ యితరుల ఔన్నత్యము సహింప లేని ఈర్షా మాత్సర్య దురభిమానులగు దుష్టులు, నాస్తికులు కలసి దుష్టాలోచనలు జేసి కపటభక్తి నటియించుచూ స్వామిదరిచేరి "గురుదేవా" మా వాడ కరుదెంచి తత్వోపదేశములు, ప్రాణాయామపద్ధతులు చెప్పి ప్రత్యక్షముగాచూపి చేయించి మమ్ముద్ధరింపవలెనని ప్రార్థించి కొరగా స్వామివారలటులనేయనిరి. వారు స్వామి మనగ్రామంబున చిక్కుతున్నాడని సంబరపడుతూ దుర్బుద్ధితో అతి వినయమును ప్రదర్శించుతూ స్వామిని తమ వాడకు తోడ్కొనిపోయి ఆ గ్రామమున దీనికై ప్రత్యేకముగా నిర్మించిన తాటాకు పందిరియందు మండువేసవిలో వేదికయందు ఆసీనులగావింప చేసిరి. ఆ వేదికచుట్టు పురజనులాసీనులై యుండగా స్వామివారు సత్య, ధర్మ, భక్తిజ్ఞాన, వైరాగ్యములనుతెలిపి, ప్రాణాయామ క్రమంబులనుతెలిపి, ప్రాణాయామముచేసి చూపించుటకై వాయువును పూరించి కుంభకమందుస్తంభించి, నిశ్చలుడై యుండగా కుట్రపన్ని స్వామినాహ్వానించిన దుష్టులు బయటకు వచ్చి తాటాకుపందిరికి నాల్గువైపులా ఒక్కుమ్మడిగా నిప్పుఅంటించిరి. ఒక్కపెట్టునపందిరి దహనమౌట యందుండుప్రజలు ఎవరికి వారే ప్రాణరక్షణకై బయల్పడుటకు ప్రయత్నించిరి పందిరి ఆకాశమున కెగసిన మంటలతో దహనమగు చుండెను. మండువేసవిలో ఆచుట్టప్రక్కల ఎచటనూ నీరు

దొరకదాయెను. ఈ హటాత్పరిణామము నుండి గురుదేవులభక్తులు, శిష్యులు తెప్పరిల్లి ఈ దుష్కృత్యము ఆహ్వానించిన వారే ఆచరించిరని నిశ్చయించుకొని, వారిని పట్టికొట్టుట ప్రారంభించిరి. వారు అయ్యో మేమే పాపమెరుగమని ఆర్తనాదములు చేయుచుండిరి. యిదియునూ స్వామివారి మహత్తైయుండునేమో? మమ్ము అన్యధాతలంపవద్దని సిగ్గు, భయములతో ఏడ్వసాగిరి అగ్నిక్రమంగా చల్లారి పందిరంతయు కాలిబూడిదయ్యెను. వేదికపైన గురుదేవులు ఏమాత్రము హానిలేక పుటంపెట్టిన బంగారం అపరంజియైనటుల దివ్యకాంతిలో నిశ్చల నిర్వికార ముద్రయందు ప్రభాతసమయమున భానోదయమైనట్లు కనులు విప్పి చిరునగవుతో అచట గల జనసమూహమును గాంచి "నాకుపకారంచేసిన" ఈ కార్యకర్తలను బాధింపవలదు. విడువుడనిరి గురుదేవుల ఆజ్ఞానువర్తులైన శిష్యులు "ఛీ" పొండనివారిని వదిలివేసిరి. స్వామి ఆకార్యకర్తలను చేరబిలిచి నాయనలారా! మీరు గావించిన ఈ అగ్నిసంస్కారమున నన్నింకనూ తేజోవంతుని గావించితిరి. నాకు గల కోపతాపములిందు భస్మమైనవి. నాకు చాలా ఉపకారము చేసితిరని "అపకారికి ఉపకారము" చేయురీతిలో వారిని క్షమించి వదిలివేసిరి వారు సిగ్గుతో తలదించుకొని మా అపరాధములు క్షమించుడని పాదాల పైబడి ప్రార్ధించిరి. కొందరు కపట భక్తినటించి తప్పించుకొనిరి. దీనిని మహత్తుని కొందరు మాయాజాలమని మరికొందరు అయోమయంగా వున్నదని మరికొందరు ఎవరికి తోచినట్లు వారనుకొనిరి

### (29) సన్యాసాశ్రమ స్వీకారం :

ఇట్లు దుష్ట సంస్కరణాశయమున తన నగ్నికిఆహుతి గావింప ప్రయత్నించిన వారిపట్ల జాలిపడుటయే గాక తత్వోపదేశము జేసిన మహాకరుణామూర్తియై యిల్లుజేరి ఒక సుముహూర్తమున అన్నకుమార్తెయగు భ్రమరాంబకు యోగ్యునితో కల్యాణము జరిపించి సారె చీరలిచ్చి సాగనంపి మిగిలిన ఆస్తిని ప్రియశిష్యులగు వీరయ్య, సోముల కప్పగించి, అమ్మవారి సమాధిచెంత నిత్యధూపదీపనైవేద్యాదులు జరుపుటకై పంట భూములు అప్పగించుచుంటిని. నేనెల్లప్పుడు యిచట సంచరించుచుందును. ఎవరేని అన్యాక్రాంతమునకు పాల్పడిన వారివంశక్షయమగునని హెచ్చరించి, కాషాయాంబరములు ధరించి దండ కమండల, కతారీలు చేబూని "జై సనారీ" అను నామంతో నిష్కపటయోగియై యిల్లు వీడి స్థిరచరాస్తులు యావత్తూ పరిత్యజించి, లోకంబున హిందూమత ప్రచారము, ధర్మ సంస్థాపన, ఆర్తులను రక్షించుటకై, అనంత విశాలంబౌ లోకంబున ప్రవేశించెను.

### (30) సనారీ దేశ సంచారము :

విశ్వనాధాచారి గారు సన్యాసం స్వీకరించి పాలకొండ విడిచి దేశసంచారము బయలు దేరిన సంగతి తెలిసిన, చుట్టు ప్రక్కగ్రామప్రజలు, వార్ని దర్శించవలెనని కొందరు, స్వామితో ఆశీర్వదింపబడాలని కొందరు, వేదాంత భోదనలువిని ఆచరించి తరించవలెనని యింకొందరూ స్వామినుండి స్వర్ణయోగ రహస్యంబులు గ్రహించవలెనని మరికొందరు, కొందరు స్వామి కరుణా కటాక్షమున శాశ్వతానంద మోక్షమును పొందవలెనని, నోటివాక్కుతో తమ సమస్యలు చక్కబడునేమోయని యింకొందరు, యిలా అనేకములగు కోర్కెలతో స్వామి వారిదరిచేరి తెల్పుచూ వారి అనుగ్రహము కొందరు పొందుచూ, యింకొందరు స్వామి తమకేమీ తెలుపలేదనుచూ, రకరకములగు వ్యాఖ్యానముల చేయుచుండిరి. యిలా మార్గమునగల పుణ్యక్షేత్రములు, హరిజన గిరిజన వాడలు, గ్రామములు ఆలయములు దర్శించుచూ, నదీనదములందు స్నానసంధ్యానుష్టానములు నెరవేర్చుకొనుచూ, తానున్న ప్రతిగ్రామచివరలో పర్ణశాల నిర్మించుకొని, జీవనార్ధము కుల వృత్తి చేయుచూ, తన వద్దకు వచ్చినవారికి రాత్రులందు వేదాంత ఉపన్యాసములు చెప్పి యోగసాధనా పద్ధతులు తెల్పుచూ, వారికి గల సందేహములుతీర్చుచూ జనాన్ని, భక్తి,





జ్ఞానవైరాగ్యములందు ఆసక్తులను జేయుచూ, కొద్దిరోజులలో యింకో గ్రామము చేరి హిందూ ధర్మములను, తెల్పుచూ నరుడే నారాయణుడు కాగల యోగరహస్యము లెరింగించుచూ, ఆధ్యాత్మిక బోధనలు చేయుచూ భక్తులసంశయముల తీర్చుతూ, షణ్మతములైన, శైవ, వైష్ణవ, శాక్తేయ,గాణపత్య,బౌద్ధ కాపాలిమతస్తులతో, వేదాంతచర్చలు జరుపుతూ, హితభోధనలు చేయుచూ, శ్రీకాకుళం జేరి శ్రీకాకుళేంద్రునిదర్శించి, అరసవల్లిచేరి, సూర్యనారాయణమూర్తిని పూజించి అచటనుండి, బొబ్బిలి కాలినడకన ప్రయాణమై దారిలో కలిసిన వారికి కావలసిన విషయములు తెల్పుచూ స్వామివారు బొబ్బిలిచేరిరి.

### (31) బొబ్బిలి లో స్వామివారికి కోర్టు సమన్లు :

వెలమరాజుల పౌరుష ప్రతాపాలతో ఆచంద్రతారార్కము "బెబ్బులులుగ" ఘనత వహించిన తాండ్రపాపారాయుని వంటి వీరులనుగన్న బొబ్బిలి లో స్వామివారు కడియంవారింట బస చేసి వెలమవారివీధినుండి పెద్ద చెరువుకు స్నానానికి వెలుతుండగా వెలమకులస్తులు స్వామివార్ని పాదరక్షలతో తమ వీధిలో నడువరాదని హెచ్చరించిరి. స్వామివారు పట్టించు కోకుండా వెళ్ళిపోయిరి. యిలా వారం జరిగిన తర్వాత వెలమవీధి వారు మేజిస్ట్రేట్ కోర్టులో స్వామివారిపై పిర్యాదు చేసారు. కోర్టు సమన్లు సనారీ వారుంటున్న కడియం వారింటికి వచ్చింది. దానిని చూచి గృహయజమాని పెద్దచిక్కులో పడ్డామని ఆందోళన చెందుచుండగా, స్వామివారు నీవేమి భయపడవలదని ధైర్యం చెప్పి, మధ్యాహ్న భోజనాంతరం కడియంవారితో కోర్టుకు బయలుదేరి వస్తుండగా మేజిస్ట్రేట్ గుమస్తాయగు పాలకొండవాసి అల్లంతదూరాన స్వామివార్ని జూచి ఏమిటి స్వామివారిక్కడికి వస్తున్నారని తోటి ఉద్యోగినడుగగా, వెలమవారి ఫిర్యాదు మేరకు సమన్లు పంపినామని తెల్పిరి. ఆ మాటకు గుమస్తా ఆవేదన చెందుచూ, అయ్యో ఎంత పని చేసితిరి. స్వామివారంటే ఏమనుకున్నారు. చాలా మహిమాన్వితులు సాక్షాత్ పరమేశ్వరుడు. ఆయన అగ్రహాఽనుగ్రహ శక్తివంతుడు, ఆగ్రహిస్తే సర్వనాశనం, అనుగ్రహిస్తే సకలశుభములు చేకూరుతాయని మేజిస్ట్రేట్ గార్కిచెప్పగా ! మేజిస్రేట్ భయపడుతూ వెలమవారి పిర్యాదుమేరకు యిలాచేసాను. పిలుస్తున్న దెవరినో ఎరుగక జరిగిన తప్పిదమిది యిప్పుడేమి కర్తవ్యమని గుమస్తానడుగగా మనం స్వామివారికెదురేగి స్వామి, ఈ విధముగా తమ దర్శనభాగ్యం కలుగుతుందని ఇలా చేసాను. మీ పాద స్పర్శతో మా న్యాయస్థానాన్ని పావనంచేయుడని, పాదాలపై బడుడనగా గుమస్తా సలహాప్రకారం మేజిస్ట్రేట్ స్వామివారికెదురేగి క్షమాపణ కోరిరి. దానికిస్వామి మందహాసం చేస్తూ "శుభం భూయాత్" అని ఆశీర్వదించారు. యిది గాంచిన కడియంవారు, కోర్టు ఆవరణయందలివారు "జైజై" సనారీ అంటూ జయజయధ్వానముల పల్కిరి. స్వామివారు నేనేమి చేసినా లోకకళ్యాణమునకే వెలమవారి వీదిలో గల దుష్టగ్రహములను పారద్రొలుటకే అట్లుచేసితిననిరి. కొన్నాళ్ళుగా ఆ వీధి వారికి గల దుష్టగ్రహపీడ నాటితో తొలిగినది. ఈ వార్త బొబ్బిలి మహారాజా వారికి చారుల వలనతెలిసి స్వామి వార్ని సకలలాంఛనములతో కడియంవారి యింటినుండి తమకోటకు రప్పించుకొని, పాదపూజ గావించి ఉచితాసమున కూర్చుండజేసి ఆధ్యాత్మికమగు వారి సందేహములు తీర్చుకొని స్వామివారిచే ఉపదేశం పొందిరి. స్వామి వారిట్టి కొన్ని మహిమలు ప్రదర్శించగా వారిని సాక్షాత్ పరమేశ్వరుడని తలంచి ఘనసన్మానములు చేసి పూజించి తరించిరి బొబ్బిలివారి యింట నాటినుండి నేటివరకూ వంశపారంపర్యంగా సనారీవారి పాదుకలు పూజలందుకొనుచున్నవి.

### (32) స్వామి సాలూరు జేరిరి :

స్వామి వారటనుండి బయలుదేరి వచ్చు సంగతి నెరింగిన సాలూరు విశ్వబ్రాహ్మణులు భక్తులుఎదురేగి, గ్రామపొలిమేరలో పూర్ణకుంభంతో స్వాగతం పల్కి తమ గ్రామమునకు

సాదరంగాతోడ్కొనివచ్చి స్వామివారికి సకల సదుపాయములు సమకూర్చిరి. స్వామివారు నిత్యానుష్టానములు పూర్తిచేసుకొని విరామసమయములలో ఆధ్యాత్మిక విషయములు, శాస్త్రరహస్యములు, యోగరహస్యములు తెల్పుచూ వారికి గల సందేహములను తీర్చుచుండిరి. వారును మహదానందమున బ్రహ్మజ్ఞానాసక్తులై జ్ఞానామృతమును గ్రోలుచుండిరి. నాస్తికులగు స్వకులస్తులు కొందరు, పనీపాటా లేకుండా తిరుగు సన్యాసితోచేరి గ్రామస్తులు భ్రష్టులగు చున్నారనుకొను వారును. సాక్షాత్ పరమేశ్వరాంశయగు విశ్వనాధుడు జాతియందుద్భవించుట కులము నకే గర్వకారణమని మరికొందరు. పలువురు పలువిధముల తలంచుటస్వామి గమనించి "బుద్ధిఃకర్మానుసారణిః" ఎవరెవరి పూర్వజన్మకర్మలనునుభవించుటకు తగు బుద్ధులే పుట్టు చుండునని తలంచి, ఆస్తికులకు, నాస్తికులకును, తన చెంతజేరిన వారందరికి ఆధ్యాత్మికోపన్యాసములు చెప్పి జీవన్ముక్తి మార్గములు తెల్పుతు అచటకొన్ని దినములుండి విద్యలనగరమగు విజయనగరం బయలుదేరిరి.

## (33) సాలూరు నుండి స్వామివారు విజయనగరం చేరిరి:

గౌరీదేవి శాపగ్రస్తుడగు గౌరీనాధుడు భూలోకమున మానవునిగా విశ్వబ్రాహ్మణ యింట కాళీహస్తాచార్యునిగా జన్మించి తన అఖండ తపః శక్తిచేత అమోఘ విద్యాసంపదచే, అమేయ ధర్మోపన్యాసములచే ఆ సేతు హిమాచల పర్యంతం పర్యటించి కాశీ, శృంగేరి విజయనగరము లందు, సావిత్రి, సరస్వతి, గాయత్రీ, పీఠములను స్థాపించిరి. విజయనగర ప్రతిష్ఠారంభము నుండి క్రమముగా గాయత్రీ పీఠమును 9 మంది బ్రహ్మచారులధిష్టించగా 10వ పీఠాధిపతి గృహస్థాశ్రమాచార్యత్వమున పీఠాధిపతియయ్యెను. నాటి నుండి వంశపారంపర్యముగా వచ్చుచూ అమితప్రజాదరణ పొందుచూ క్రీ॥శ॥ 1796 సం॥లో శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మంగారి పౌత్రురాలగు శ్రీశ్రీశ్రీ ఈశ్వరీమాత ప్రియశిష్యులు సమస్త వేద శాస్త్రయితిహాస ప్రవీణుడగు బ్ర॥ కనపర్తి బసవాచార్యులు "విజయనగరం సంస్థాన విద్వాంసులు 49 మందిని రధకార బ్రాహ్మణ హక్కుల గురించి వాదించి" గెలుపొందిన విజయనగరం విద్యలనగరముగా ప్రఖ్యాతినొంది విజయరామ గజపతి పరిపాలించు కాలమున, స్వామిసర్కారువారి సిపాయి శిక్షణాశిభిరము ఎదుట చిన్నపర్ణశాల నేర్పాటుచేసుకొని, నిత్యానుష్టానముల పిదప పగలంతయూకులవృత్తిని జేయుచూ సాయంసమయమున సంధ్యా వందనములు ముగించుకొని, రాత్రులందు తన వద్దకు వచ్చిన అష్టాదివర్ణములవారికి ఆధ్యాత్మిక విషయములు, సనాతన ధర్మములు, యోగ రహస్యములు తెల్పుచు, శ్రోతల సందేహములను దీర్చుచూ, కోరినవారికి తగిన మంత్రోపదేశము చేయుచూ తానాచరించు విధమిట్టిదనిరి.

**సీ॥ కామాది వర్గముల్ కడ కాలబెట్టితి ।సోమసూర్యాగ్నులచూపుగలిగి।**
**దోషాలకు మూలమీషణత్రయములు। కోసివేసియు కావిగోచికడితి।**
**యారాలు సరిపోరెయష్ట భోగంబులు। పెడబెట్టి సంప్రాప్తమిష్టపడితి**
**తగ్గులెచ్చును మానితత్వంబుశోధించి నిగ్గువిశ్వబ్రహ్మనీడనుంటి॥**
**క॥ నా యోగముతో సరిగలదే యోగము చూడలేదుయే లోకములో।**
**నాయోగ భోగమందిన మాయతంత్రంబువాని మానకకలదా॥**

కర్మజీవులారా। జగన్మాయాంధకారములలో మునిగి, సత్య।దయా।ధర్మ, భక్తి మార్గముల నాచరింపలేక, దేహభ్రాంతిచే, జన్మకర్మాదులగు శృంఖములచే బంధీకృతులగుచూ కదలలేక, తన్ను తాను మరిచి, లోకైక సుఖంబులకై ప్రాకులాడుచూ, ఈ షణత్రయంబులలో జిక్కి ఆశాపాశబద్ధులై కుల, మత, వర్ణ, ప్రాంతీయ దేశ బేధములతో, అలమటించు చున్నారే, గానీ నిత్యము, సత్యము,





శాశ్వతము, నిత్యానంద కరమగు బ్రహ్మమునగు, నాయంశయగు జీవి, 84లక్షల జీవ రాశులందుండి, దేనికీఅంటకప్రత్యేకముగా యున్నాను. కానదేహము, యింద్రియములు, సకలభోగములు, యింకనూ సమస్తకర్మలూనన్నంట జాలవు, మరియు నేనింకెట్లున్నాననగా। పరబ్రహ్మమునుండి అణుస్వరూపముగా వచ్చి, ఈ దేహమున జేరిన వాడనుకాన, నాకు పరబ్రహ్మమునకూ ఎలాంటి భేదములు లేవు. యిట్టి రూపముగల నాయందు ఎవరుమనసునైక్యము చేయుచున్నారో అట్టివారు నానిజరూపమును బొందుదురు. వారు మరలాజననమరణాదులందు ప్రవేశింపరు. అనగా "జీవబ్రహ్మైక్యము" పొందిన మహాత్ములని భావము. ఏదిజగస్సాక్షిగా నుండునో, ఏదిపిపీలకాది బ్రహ్మపర్వంతముగ సర్వశరీరములందు వ్యాపించి। జాగ్రత్త, స్వప్న, సుషుప్తియవస్థల యందును తనంతట తానుగా ప్రకాశించుతూ, సాక్షియైయుండునో। ఆవస్తువే నేననియు, కంటికి కనబడువస్తువు నేనుకాదనియు, ఎవ్వరెరుంగుదురో వారు అధమజాతి వారైననూ అగ్రజాతి వారైననూ వారేనాగురువని ఆదిశంకరాచార్యులన్నట్లుగా (అనగా అట్టివారే బ్రహ్మజ్ఞానులనిరి) అట్టి నిత్యము, సత్యమూ నిత్యానందకరమగు బ్రహ్మమునెరిగి, జన్మసార్ధకముజేసుకొని బ్రహ్మజ్ఞానులై, భక్తిమార్గమున తరింపవలెననివేదాంత ప్రబోధనలు చేయుచుండగా, విజయనగర సంస్థాన సిపాయిలు రోజురోజుకూ అధిక సంఖ్యలో పాల్గొనుచూభక్తివర్తనులై విభూతి రుద్రాక్షలు ధరించుచూ, అనాసక్తితో విధులకు హాజరగుచూ, ఎప్పుడూ వేదాంత చర్చలతో నిమగ్నులగుట గాంచిన, అధికారులు ఈ విషయములు రాజుగార్కి విన్నవించిరి. యిందలి యదార్ధములు గ్రహింపరాజుగారొకనాటి రేయి, స్వామివారి చర్యలు గమనింపరహస్యముగా పర్ణశాలవద్దకు బోయిరి. అపుడు గురుదేవులు। ఓ భక్తులారా। 84 లక్షల జీవరాసులలో మానవ జన్మదుర్లభమైనది జీవి ఎన్నోజన్మల తపఃఫలముచే నరజన్మకు వచ్చుచున్నది **ఈనరుడు** సర్వకాల సర్వావస్థల యందును తనస్వార్థమే జీవితలక్ష్యముగా జీవించువాడు, ఈతడు ధర్మాధర్మవి చక్షణను సదామనస్సున తర్కించుకొంటూ, స్వవిషయములకు ప్రాధాన్యతనిస్తూ తన శక్తిమేర తోటివారలకు సహాయపడువాడు **మానవుడ**నిపించుకొనును. ఈతడు సర్వమానవ సమానత్వము, సర్వజీవులందు భూతదయగల్గి స్వవిషయములందు ప్రాధాన్యతచూపక, లోక కల్యాణమే పరమార్థముగా తలంచుచూ, త్రికరణశుద్ధిగా క్రమంతప్పక ఆచరించువారు **మహాత్ములు** వీరు నిత్యానుష్ఠానములతో ధర్మం, సత్యం, శీలం, నిస్వార్థం, నిరాడంబరతగల్గి సదాయోగ ధ్యానమున తన్నుతాను మరచి ఆనందసాగరమున తేలియాడువారే **"నారాయణస్వరూపులు"** దైవసమానులు. ఈ స్థితికినరుడు రావలెనన్న అష్టబంధములందు దగులు కొనక, దైవత్వమును సాధింప వలయును, బంధనలేవనిన వివాహమువలన అడవిలో స్వేచ్ఛగా తిరుగు జంతువులు వలలో చిక్కిస్వేచ్ఛను కోల్పోవునట్లుగా 1. వివాహముతో మొదటి బంధము దీని తర్వాత వరుసగా బంధము లేర్పడును గాన వివాహము వద్దు వద్దు 2. కోతినిబట్టి సాము నేర్పిన భంగి భార్య బోధలబడకు బడకు 3 చాకలివాకిట్లో గాడిదను కొయ్యకు కట్టినట్లు కుటుంబ బాధ్యతలు అన్నిటినీ అడ్డుకుంటాయి. 4. ప్రమిదలోని దీపాన్ని జూచి కీటకము ఆహారమని భ్రమించి తుదకు దానికి ఆహుతియౌనటుల వ్యామోహాలలో బడకు. 5. బురదలో చల్లదనముకై పంది దొర్లునటుల స్త్రీల కలయిక వద్దని వదలి పెట్టు 6. ధనముపై ఆశబడి మాయలు తంత్రాలు చేయుట, మేకల మంద వెనుక పరుగులిడునట్లు మాను. 7.పశువులకాపరి వలె పనిగట్టి తిరుగుటలాగున ఈ షణేంద్రియంబులువదులు. 8. బొంతపైనవేసుకొని సంతలో వ్యాపారివలే, ఏ ధర్మము లేకను మాపుమాపు "వద్దు" ఈ బంధములు ఒకటి కోరితే దానికింకొకటి తోడై చేరుతాయి.వీటిని వదలి విజ్ఞానమార్గంబులో నుండుట మంచిది. సంసారమందున్ననూ తామరాకుపై నీటిచందమునుండాలి ఈ సంసారమనే అడవిలో భార్యయే పెద్దవలగాను, పుత్రులే

శత్రువులుగాను, ధనమే అగ్నిజ్వాలలుగాను యున్నది. ఈధనముకొరకు తండ్రీకొడుకులు, భార్యాభర్తలు,తోబుట్టువులు, స్నేహితులు, బంధువులు విరోధులగుచున్నారు. అజ్ఞానులు యిట్టిసుఖము కోరుచున్నారేగానీ సత్యమగు పరమాత్మను పొందగోరరు. జ్ఞానితన స్వజన సౌఖ్యముల కొరకు ప్రాకులాడక। తనప్రాణప్రయాణమునకు కావలసిన సాధనజేయుచూ, ఈ క్షణమో, కొంతసేపటికో, నేడో, రేపో ఈ శరీరము మన్నగుటనిజమని నిరంతరంభగవ ధ్యానంలో నుండి తరించాలి. అట్టి ప్రయత్నములు గావించి జీవన్ముక్తులగుడని బోధలుచేయుచున్న స్వామిని విజయరామ గజపతిప్రభువుగాంచి స్వామివారి దివ్యతేజస్సు గంభీరముగా వచించు ధర్మోపన్యాసములు చల్లని చూపులుతో, శ్రీ భూతి రుద్రాక్ష, దండ, కమండలములతో అపర శంకరుని వలే కన్పించు ఈయన సామాన్యుడు కాడని ధర్మసంస్థాపనకై దివినుండి భువికేతెంచిన పరమాత్మగాతలంచి, భక్తిభావముతో వినమ్రుడై స్వామిదరిజేరి, స్వామీ తమదర్శనభాగ్యమున ధన్యుడనైతిని తమవంటి పురాణపురుషులు మారాజ్యమున జన్మించుట, మారాజ్యప్రజలు మేమునూ చేసుకొన్న పూర్వజన్మ పుణ్యఫలము మీరు మా సభాస్థలికి విచ్చేసి ఆతిధ్యమును స్వీకరించి మీ ఆధ్యాత్మికోపన్యాసములచే మా పూసపాటి వంశమును, మారాజ్య ప్రజలను తరింపజేయుడని ప్రార్థింపగా, గురుదేవులు మందహాసముతో, రాజా ! మాబోటి సర్వ సంగపరిత్యాగులకు మీరాచమర్యాదలేల? మాకు మానావమానములు, ఉచ్ఛనీచలు, సుఖదుఃఖములు, రాజప్రాసాదములు, పూరిండ్లు, పంచభక్ష్య పరమాన్నము భిక్షాన్నమూ, సమానమే కాన మీరాచ మర్యాదలువలదు, మేము సర్వస్వతంత్రులము యిపుడిక్కడ, మరికాసేపటి కెక్కడో యనిరి, అంతమహారాజు స్వామీ మారాజ్యమున మీ స్వేచ్ఛకెన్నడూ అంతరాయ ముండదు. మా యింటమీయిచ్ఛయొచ్చినరీతిగా వ్యవహరింపుడు. స్వామీ మారాజ్యాభివృద్ధికి మా క్షేమము ప్రజాక్షేమమునకై మా ఆస్థానమునకాలిడి మమ్ము పావనులుగావించి మీ ప్రబోధనలతో ఆస్థానమునగల వారందరినీ పునీతులను జేయుడని, అర్థింపగా స్వామిసరే మీసభా స్థలియందలివారికి రాజ్య ప్రజలకు జ్ఞానభిక్షనొసంగుదనని అంగీకరించిరి.

**(34) రాజాగారు స్వామివార్ని పూర్ణకుంభంతో సభాస్థలికి ఆహ్వానించుట:**

మరునాడు మహారాజు మంగళవాయిద్యములు పూర్ణకుంభములతో, పురుష సూక్తపఠనముతో సపరి వారముతో వచ్చి స్వామివార్ని సభామండపమునకు తోడ్కొని వచ్చి ప్రత్యేకాసనము నొసంగి స్వామిని సత్కరించిరి. నిరంతరము గురుదేవులు ఆధ్యాత్మికోపన్యాసములతో, సభికులను ఆత్మజ్ఞాన వర్తనుల గావించుచుండిరి. గురుదేవులకు జరుగుతున్న మర్యాదలను జూచి సహింపలేని ఆస్థాన పండితులు అసూయమనస్కులై ఒకనాడు

**(35) రాజుగారితో పండితుల ఫిర్యాదు:**

మహారాజుని ఏకాంతమందిరమునగలసి, మహారాజా! మీరు దర్బారుకు వచ్చునపుడు మంత్రి సామంత, దండనాయక, పురోహిత, కవిగాయక, చిత్ర శిల్పకారులు సైతమూ, ఘనాపాఠీలమగుమేమును నిలబడి నమస్కరింతుము. మీరు సింహాసనాధిష్టులయిన పిదప కూర్చుందుము. కానీ విశ్వనాధాచారి మాత్రము మీరు నమస్కరించునపుడు ప్రతినమస్కారము చేయక, ఆసనమునుండి లేవక కూర్చుని యే ఆశీర్వదించును. యిది ఏమి వింత? "నావిష్ణు పృధ్వీపతిః" అనునార్యోక్తి ననుసరించి ప్రజలను పాలించుమీరు దైవసమానులుగాన ఈ రాజ్యమందలి సమస్త ప్రజానీకము మీకు శిరస్సువంచి నమస్కరించవలయును. కానీ విశ్వనాధాచారి ఆసనమునుండి కూర్చిండియే మిమ్మల్ని దీవించును ఇదంతయూ చూచుటమాకు చాలా బాధగాయున్నది. మిమ్ము నిర్లక్ష్యము జేసి సభాసాంప్రదాయములను పాటింపక రాజదర్బారు చరిత్రకే కళంకమాపాదించుచున్న ఆ కపటయోగికి తగిన శిక్ష విధించమని, పండితబృందము





రాజుగార్కి విన్నవించిరి. యిదంతయూవిని రాజుగారు తలయూచి మిన్నకుండిరి. మౌనమర్ధంగీకార మనుకొని పండితబృందము రాజుగార్కి నమస్కరించి వెడలిపోయిరి. విజయరామగజపతి రాజావారొకనాడు దర్బారునకు మంత్రిసామంత దండనాధులను, పురోహిత, కవిగాయక, శిల్పిచిత్రకారులను, కళాకారులను, ఉద్దండపండితులను, ఆంతరంగిక సలహాదారులను, ప్రత్యేక సమావేశమునకు తాకీదు పంపిరి. ఆనాడు దర్బారున కందరూ హాజరై తమ తమ ఆసనములు నలంకరించిరి. గురుదేవులు చందన కుంకుమ వీభూతి, రుద్రాక్ష దండకమండల, కఠారి ధారియై కాషాయాంబరములు ధరించి పావుకోళ్ళతో వచ్చి తమ ఆసనముపై ఆసీనులయిరి.

**(36) స్వామివారు రాతికి నమస్కరించుట:**

మహారాజు వందిమాగదకైవారములతో మంగళవాయిద్యములతో దర్బారునకు ప్రవేశింపగా అందరూ లేచి నిలబడి రాజుకు నమస్కరించిరి. అంత మహారాజు సభకు నమస్కరించి , గురుదేవులకు ప్రత్యేకముగా నమస్కరించి, నవరత్నస్థగిత సువర్ణ సింహాసనమునందాసీనులైరి. సభాసదులందరూ రాజునకు నమస్కరించి ఆసీనులైరి. గురుదేవులు ప్రభువునుగాంచి ఆసనమందుండి యే "శుభమస్తు" అని ఆశీర్వదించిరి. యింతలో ఒకవృద్ధపండితుడులేచి విజయనగర సంస్థాన ప్రత్యేక గౌరవము పొందిన విశ్వనాధాచారి గారూ మీకు దర్బారు సాంప్రదాయము తెలియదా? తెలిసి నిర్లక్ష్యభావమా? ప్రభువులు దర్బారుకు వచ్చునపుడు సామంతరాజులనుండి ఉద్దండపండితులు సమస్త ప్రజానీకమువరకూ లేచి నమస్కరించుచుండ, తమరిట్లు ప్రవర్తించుట ప్రభువులను కించపరచుటకాదా ? పాలకుడగుప్రభువు విష్ణుస్వరూపులని తమరెరుగరా? అనగా గురుదేవులునగుచూ నాయనలారా! యివన్నియూ యింకనూ నేనెరుంగుదును. నా నమస్కారము సర్వసర్వంసహా సృష్టికర్తయగు విరాట్ విశ్వకర్మ భగవానుడు దక్క అన్యులు భరింపజాలరు. కావున ప్రభుక్షేమము కోరి ఆతని నాశీర్వదించితిననిరి. ఆ మాటలకు పండితులందరూ ఒక్కుమ్మడిగాలేచి, నీ నమస్కార మంతటి అమోఘమైనదా? ఆ శక్తిని సభాస్థలికి చూపుము, లేదేని దర్బారు సాంప్రదాయముననుసరించి ప్రభువునకు నమస్కరించమనిరి. స్వామివారు మీ కంత కుతూహలముగాయున్న పెద్ద బండరాతిని తెప్పించుడనిరి. వెంటనే భటులందరూ కలసి పెద్దరాతిబండను సభాస్థలికి తెచ్చిరి. అపుడు గురుదేవులు రాతిబండను సమీపించి నేనా సృష్టికర్తను తప్ప, అన్యులకు నమస్కరించిన యిదేఫలమని ఆ రాతికి నమస్కరింపగా, దిక్కులు పిక్కటిల్లునట్లుగొప్ప ధ్వనితో ఆ బండరాయి వేయి ముక్కలయినది. అదిగాంచిన సభాసదులందరూ భయభ్రాంతులతో గడగడవణుకుచూ స్వామివార్ని క్షమాపణ కోరిరి. మహారాజు స్వామివారి దరికేగి "గురు దేవా" మీ శక్తినే నెరిగియూ సభాస్థలికి తెలియజేయుటకై మిన్న కుంటిని, యిందు నాదోసమావంతయూ లేదనిరి. గురు దేవులు "శుభంభూయాత్" **అని ఆశీర్వదించుసరికి పగిలిన బండముక్కలు పుష్పములుగా దర్బారు అంతా పడినవి.** యిందతయూ చూచిన తాంత్రికవేత్తలు యిది స్వామి వారి మహిమ కాదు తాంత్రిక విద్యయని, వారు ధరించిన పాదుకల మహిమయని, వాటిని తస్కరించుటకై ఒక భటుని నియమించిరి. స్వామి వారి పాదుకలు తీయుటకు ఆ భటుడు పొంచి యుండి సమయముచూచి స్వామి వారి పాదుకలు తస్కరించెను. మరునాడు ఈ తాంత్రికులు పాదుకలు లేని స్వామి వారు ఎట్లు దర్బారుకువచ్చెదరో చూచుటకు కోట గుమ్మము వద్ద పొంచి చూచుచుండిరి. అపుడు గురు దేవులు భూమికి అడుగుఎత్తులో వట్టి కాళ్ళతో వచ్చుట గమనించిన భటుడు భయభ్రాంతుడై పాదుకలు తీసుకుని ఎదురేగినమస్కరించి స్వామీ మీరు సర్వజ్ఞులు మీ కంతయూ తెలియును నన్ను మన్నింపుడని మోకరిల్లి, పాదుకలు గురు దేవుల పాదములకు తొడిగి క్షమాపణ కోరెను. దయార్ద్రహృదయుడగుస్వామి నాయనా యిందు నీ దోషమిసుమంతయూ

లేదు. నిన్నీ చోర కార్యమునకు నియోగించినవారే ఫలితమను భవింతురనుచూ పాదుకులతో నడచుచూ దర్బారు చేరిరి. పాదుకల నపహరింపప్రేరేపించిన వారి పాదములు బొబ్బలెక్కి నడువలేక బాధపడుచూ, దారికాచి క్షమాపణకోరి బాధానివారణ పొందిరి. యింత జరిగిననూ అసూయ పరులు కొందరు ఆచార్యుల ఆసనముపై పల్లేరు కాయలు పోయించి, దానిపై పట్టువస్త్రము కప్పినారు. అజ్ఞానులు గావించిన దుష్కార్యము గ్రహించిన గురుదేవులు పల్లేరు కాయలను పూవులుగామార్చి సుఖాసీనులైరి. సభానంతరం స్వామి వారు చేటు తలపెట్టిన వార్ని చేరబిలిచి నాయనలారా! పీఠముపై పూలు పోయించిన పుణ్యమూరకే పోదని వెడలిపోయిరి. జరిగినదేమిటనివారు పట్టు వస్త్రమునెత్తుసరికి అవి తేళ్ళయి వారిని కుట్టి బాధించినవి! భాధ తాళలేకవారు పరుగున స్వామి పాదములపై బడి క్షమాపణకోరి బాధావిముక్తులయిరి.

## (37) గోపబాలుని యోగం :

ఒకనాడు విజయనగరాధీసులు స్వామి వారితో కలసి ఎలగాడుకొండమీద గల విశ్రాంతి మందిరమునకు బోయిరి. అచట రాజావారు యోగ సాధనావివరములు స్వామి వారిని కోరగా రాజా శాంభవీముద్రచే ధ్యానంచేయగా పుట్టిన చిదగ్నిచేత పురుషుడు అనేక కోట్ల జన్మలందు త్రికరణములచేత చేసిన బ్రహ్మ హత్యసురాపానాదులు, యింకనూ అనేక రకములయిన మహాపాతకములు బడబాగ్నివలె దహిస్తూయున్నవి. కనుక శాంభవీముద్ర అన్నిముద్రలకంటెనూ ప్రశస్తము యిందుకు ప్రమాణము.

శ్లో॥ బ్రహ్మహత్యా సహస్రాణి ।వీరహత్యాశతానిచ ।
ఏకేనధ్యానయోగేన। ధహోశ్ఛగ్నిర్వేంధనం ।

అని శాస్త్ర ప్రమాణము ఈ శాంభవీముద్రలో చూపులు 3 విధాలు, 1 కనురెప్పలు మూసినాసికాగ్రాన్ని చూస్తూ లోదృష్టి గలిగియుండేది. యిది అమావాస్య దృష్టి అధమము 2 సగంపైగా కన్ను తెరచి భ్రూ మధ్యాన్ని చూస్తూ రెప్పవేయక చూపు చెదరకుండా ఉండుటే పాడ్యమి దృష్టి యిది మధ్యము 3. యికపున్నమి దృష్టి శుచియైన స్తలమున ఏదైనా ఆసనంపరచుకొని కూర్చుండి, గురువును స్మరిస్తూ ముఖం కొంచెం వంచి నల్లగుడ్డు పైరెప్పలోకి త్రిప్పి బయటకు కనబడకుండాజేసి తెల్లగుడ్డు కనబడునట్లు చేసి స్థిరచిత్తంబుతో దినందినం చూడగా, చూడగా తారక చిన్హాలు కనబడును. కొంతసేపటికి అన్ని నిలచి పున్నమి వెన్నెల కనబడును మరీ చూడగా ఆపండు వెన్నెలలో సకలేశ్వరుడగు పరమాత్మ కోటిసూర్య ప్రకాశంగా । అభిన్న వలయాకృతియైకనబడును । అది దర్శించిన వారు పరబ్రహ్మమును పొందుదురు । ఈరాజ యోగమే బ్రహ్మ విష్ణు, మహేశ్వరాదుల జీవనాధారం. యిటివంటి రాజ యోగి ఎక్కడ ఉన్నా పరబ్రహ్మ స్వరూపుడేగానీ వేరు కాదు. ఈతడు సామాన్య యోగీశ్వరుడుకాడని యెరుంగుము కావున అన్ని యోగముల కన్నా రాజయోగమే శ్రేష్టమయినదని తెల్పుచుండగా । ఆకొండపై గోవులును కాయుట కైయున్న గోపబాలుడు పొంచి ఈ బోధనంతయూవిని । పూర్వ జన్మసుకృతం బుచే జ్ఞానోదయమై । స్వామిని గురువుగా భావించి ధ్యానించి ప్రాణాయామసాధనకు పక్రమించి నిశ్చలుడైయుండెను. ఎంతరాత్రయినా గొల్లబాలుడు యిల్లు చేరుక పొవుటచే కుమారుని వెదుకుచూ తల్లిదండ్రులు కొండపైకి వచ్చి పద్మాసనాసీనుడై యోగనిష్టలో నున్న బాలునిగాంచి అచ్చెరువొంది । దరిజేరి పిలిచినా పలుకకపోవుటచే కుమారునకేమైనదోయని భయపడి ఏడ్చుచుండిరి । బాలుడు ప్రాణవాయువును కుంభక మందునిల్పి యోగనిద్రా పరవశుడై యుండగా తల్లిదండ్రులు కుమారుడు మృతి చెందెనని రోదించుచుండిరి । స్వామివారిదంతయూ యోగదృష్టిచే చూచి ఆవృద్ధ దంపతుల నూరడించుటకచ్చోట ప్రత్యక్షమై । ఏల మీరిట్లురోదించుచుండిరి బాలుడు యోగ నిద్రలోనున్నాడని





ఊరడించి స్వామిహస్త స్పర్శతో బాలుని మేల్కొలిపిరి । బాలుడు కళ్ళు తెరచి ఎదుటగురుదేవులను గాంచి అంజలి ఘటింప । నాయనా ప్రత్యక్ష దైవములగు తల్లిదండ్రుల సేవించి గృహస్థువై రాజయోగంలో ప్రాణాయామ విద్యచే తరింపుము. " "శుభం భూయాత్ " అని ఆశీర్వదించి తల్లిదండ్రులతో యింటికి పంపించిరి.

## (38) 6 గురుమాంత్రీకుల చరిత్ర :

విజయనగర సంస్థానమందలి చుట్టుప్రక్క గ్రామములలో 6 గురు మహాశక్తివంతుల గుక్షుద్రోపాసకులుగలరు. వీరందరూ కలసిన ఎంతటి గొప్పవ్యక్తినైననూ యిట్టే మట్టు పెట్టగలసమర్థులు. వారికి ఎదురుతిరిగిన మాంత్రికులు సైతమూ బ్రతికి బట్టకట్టలేరు యిప్పటికి వీరులెక్కకుమించినవారిని తమక్షుద్ర శక్తికి బలిచేసిరి. విజయనగరమున విశ్వబ్రాహ్మణ వీధిలో గల ఒక విశ్వబ్రాహ్మణయువకుడు వీరిమంత్ర శక్తికి బలియైపోయెను. వానిబంధువులకు ఈ హఠాత్ మరణమునకు కారణము తెలియరాక దిగాలుగా పడియున్న స్తితిలో, వారు స్వామివారి మహిమలు విని వారినికలసి తమగోడుతెల్పిరి. స్వామివారీ విషయమంతా దివ్యదృష్టిచే గ్రహించి, నాయనలారా! దేనికైనా కాలంకలసిరావాలి. ఎంతటివారికైనా జన్మకర్మలు అనుభవించక తప్పదు, విధిని విధాతకూడా తప్పించలేడు జరుగవలసింది జరిగిపోయింది. జరుగబోవునది ముందున్నది. అన్ని సమస్యలు కాలం పరిష్కరిస్తుంది. ప్రేక్షకులవలే చూచుటే మానవధర్మం. ఈ సమస్య వచ్చే అమావాస్యనాడు పరిష్కారమగును. నాకు నిత్యానుష్టానమునకు సమయమైనది. మీరునూక్షేమమున బోయి లాభమునరండు వచ్చే కృష్ణ చతుర్ధశికి మరలా కలియుదమని వారిని సముదాయించి యిండ్లకు పంపించిరి. విజయనగర సంస్థానమున ప్రతీపౌరుడు సనారీవారి మహిమలు చెప్పుకొనుచుండగా ఈమాంత్రీకులు విని, వీరందరూ వారి సాంకేతస్తలమున సమావేశమై. మనరాజ్యమందు ఎవరీసనారీ? ఏమిటీ తని శక్తులు ? పామరుల ఎదుట ఏవో విద్యలు ప్రదర్శించుట. వాటికి పౌరులు ఆతడొక మహనీయుడు కారణజన్ముడని కీర్తించుట. దైవాంశసంభూతుడని ప్రార్ధించుట. రాజావారాతనిని అందలమెక్కించి పూజించుట. మహామాంత్రికులమగు మనము యివన్నీవింటూ చూస్తూఊరకుండుట చాలా అవమానముగాయున్నది. మనం సాధించిన శక్తులకే సిగ్గుచేటు, ఈతని శక్తిని తేల్చాలి! వచ్చునది ఆదివారంతో కూడిన అమావాస్య క్షుద్రశక్తులు విజృంభించు దినము. ఆనాడు మనమంతా ఏకమై మన శక్తులను ప్రయోగించి అతని రూపుమాపుదా మనుకొని స్వామి వారిపై కక్షపెంచుకొనుచుండిరి. స్వామివారిదంతయూ గమనించుచూమిన్న కుండిరి. చతుర్ధశి శనివారంనాడు మంత్రవేత్తలు 6 గురు ఏకమైవారి రహస్యపూజా మందిర మందు క్షుద్రదేవతా ఆవాహనకై హోమగుండంచుట్టూ ముగ్గులు పెట్టె 4 గురు హోమగుండం 4 వైపులాకూర్చుని నిద్రాహారములు మాని అతిభయంకరముగా అగ్నిబీజములతో మారణ దేవతావాహన చేస్తున్నారు. యిద్దరు కపాలభైరవి విగ్రహము ముందు ముగ్గులు వేసి జంతుబలితో దేవిని మారణ బీజములతో అర్చిస్తూ శనివారం ఉదయం నుండి ఆదివారం రాత్రి వరకూ నిద్రాహారములు మాని ఏకధాటిగా తమ ఆవాహన శక్తిని ఆరాధిస్తూ కూర్చుండిపోయారు. యిదంతయూ గమనిస్తున్న గురుదేవులు విశ్వబ్రాహ్మణ వీధిలోని విధవరాలి యింటియందు స్వామివారు పద్మాసనాసీను లైకూర్చుండి। 120 బిందెలతో నీళ్ళు తెప్పించి మంత్రించి యింటిలో నుంచి, ఆవిధవను గదిగుమ్మముముందుంచి. అచట ఎవ్వరూ లేకూండా బంధువులను వేరే గదిలోనుంచి. ఆమెతో అమ్మాయి ఈఅర్ధరాత్రి మనయింటికి ఒక వికృతాకారుడు వచ్చి తలుపు తట్టుతాడు, నీవుభయపడకుండా, వాని ముఖంచూడకూండా, తలుపుతీసి నిల్చునిఉండు, నన్నుగురించి అడుగుతాడు మాట్లాడకుండా, ఈ చీటీని యివ్వు అతడు వెళ్ళిపోతాడు నీకేమీ

భయములేదు, నేనిక్కడే గదిలో ఉంటాను. నీ బంధువులు ప్రక్కగదిలోనున్నారని ధైర్యంచెప్పి స్వామివారు ప్రక్కగదిలో యోగముద్రలో ఉండిపోయారు. ఆమె ధైర్యంగా నిద్ర మేల్కొని ఉంది. ఆదివారం అమావాస్య అర్ధరాత్రి దాటినతర్వాత స్వామివారు చెప్పినట్లుగా ఒక వికృతాకారుడు వచ్చి తలుపు తట్టాడు. ఆమె ఒకసారి స్వామివారిని చూచి ధైర్యంతో వెళ్ళి తలుపుతీసింది. వచ్చిన వ్యక్తి స్వామివార్ని గురించి అడుగగా ఆమె ఆతని వంక చూడకుండా,బదులుచెప్పక చేతిలో చీటిని అతనికందించింది. అది చూచుకొని వెనుదిరిగి పోయిందా మారణశక్తి.వెంటనే ఆమెవిపరీతమగు శరీరతాపంతో రోదించ మొదలిడెను.వెంటనే ప్రక్కగదిలోనున్న బంధువులు వచ్చిస్వామివారుచెప్పినట్లు ఆబిందెలలోని మంత్రజలంతో ఆమెను నఖశిఖపర్వంతం తడుపగా, శాంతించి స్వస్తత చెందినది. వెనుదిరిగిన కాలుడు బయలుదేరిన చోటుకు వెళ్ళిపంపించిన 6 గురు మంత్రవేత్తలను హతమార్చి అంతర్ధాన మయ్యెను. పూజామందిర మంతయూ, రక్తసిక్తమై 6 శవాలతో అతి భయంకరంగా తయారైనది. మాంత్రికుల భార్యలకు వీరి చర్యలు తెలిసియూ, భర్తలకు ఎదురు చెప్పలేక మౌనంగా కాలంగడుపుచుండిరి.వారుయిట్టి పూజలు నిర్వహించినపుడు వేకువజామునకు యిల్లుచేరేవారు.ఆనాడు బారెడు పొద్దెక్కినా యిల్లు చేరకపోవుటచే,వారు ఊరు చివరగల దెయ్యాలబంగళా వద్దకువెళ్ళిచూచి గుండెలు బాదు కొనుచూ,వారందరూ స్వామివారున్నతావుకువచ్చి పాదాలపై బడిపతి భిక్షకోరిరి. స్వామివారు వారినూరడించి. తల్లులారా! మీరు మహాపతివ్రతలు కావున వీరి ఆగడములిన్నేళ్ళు జరిగినవి, యిప్పటికి వీరు 120 ప్రయోగములు చేసి అమాయకులను హతమార్చిరి. మీకివన్నీయూ తెలిసికూడా మారణహోమముల నాపలేకపోయిరి. వారు పెంచినశక్తియే వారలనుబలిగొన్నది. దుష్టశక్తులతో, మారణహోమములుచేయు వారెప్పటికైనా వాటితోనే అంతమగుదురన్న సత్యాన్నికాలం ఈనాడు బుజువుపర్చినది. మీ భర్తలవలన ఎన్నికుటుంబములు దిక్కుకోల్పోయి అలమటించుచున్నవో చూడుడు. యిట్టివారు జీవించినచో యింకెన్ని జీవితములు మట్టిపాలగునో ఆలోచింపుడు. అమ్మలారా మీరు యిట్టిభర్తలతో మనశ్శాంతి లేక దినదినగండములతో జీవించుట కంటే, యికనుండి ప్రశాంతమగు జీవనముచేయుచూ. మీభర్తలు చేసిన దుష్కార్య ఫలితములు మిమ్మంటకుండా దైవధ్యానంతో జీవితము గడుపుడు. ఈ మారణ హోమములతో సంపాదించిన పాపపుధనమును,నిరుపేదలకు నిర్భాగ్యులకు పంచి, మీవంతుకర్తవ్యాన్ని మీరు పూర్తిచేసుకొని, కొంతైనా మీ భారాన్ని తగ్గించుకొనుడు. అపుడు మీకు ఉత్తమ జన్మలు లభించునని హితవుచెప్పి, మంత్రోపదేశముచేసి, మోక్షమార్గమును జూపి "సద్గురు కటాక్షప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించివారిని పంపించిరి. యిటుల దుష్టశిక్షణ శిష్టరక్షణగావించగా ఆప్రాంతీయులు కొందరు దైవాంశసంభూతుడనిరి.మరి కొందరు మహామాంత్రీకుడనిరి. యింకొందరు యిదేదో వింతగానున్నదనిరి.

**(39) ఘంటా సీతప్ప :**

విజయనగర సాంమ్రాజ్యశృంగవరపు కోట తాలూకాలోగల, "దేవులపల్లి" సామంత రాజ్యం ఆగ్రామమునపద్మసాలివంశస్తుడగు ఘంటాసీతప్పయను, నిత్యశివపూజాదురంధరుడు, దానధర్మపారాయణుడు,సుగుణశాలి ఉదారస్వభావుడు కవిత్వములు చెప్పుదిట్ట, శ్రీమంతుడునగునతడుగలడు. అతడు గురుదేవులను త్రికరణశుద్ధిగా నమ్మిపూజించు భక్తుడు. । ఆకాలమున వానలుకురియక పంటలు పండక, శిస్తుచెల్లించనందున ప్రభుత్వము వారాతనిని చెరసాల యందుంచిరి. సీతప్ప నాటినుండి అన్నపానీయాలుముట్టక, తదేకధ్యానంతో గురుదేవులనర్చించుటచే, స్వామివారొకనాడు చెఱసాలయందు ప్రత్యక్షమై "సీతప్పాయిటురా " అనుటతో జైలుతాళములు వీడిపోయి తలుపులు తెరువబడెను. సీతప్పఆనందభాష్పములతో





గురుదేవులదరికివచ్చి పాదములపై బడి అనేక విధముల స్తుతించెను । స్వామివారాతని ఆప్యాయముగా లేవనెత్తి। పన్నుచెల్లించకపోవుట ప్రభుత్వదృష్టిలో నేరమైననూ, స్వయంకృతాపరాధము కానందున, నీపూర్వజన్మ కర్మఫలమునేటితో తీరినది. నీవీనాడేబంధ విముక్తుడవగుదువని ఆశీర్వదించి, అదృశ్యులైరి. ఈవిషయములు సిపాయిల ద్వారా తెలుసుకున్న ప్రభువులుస్వామివారి మహిమలు తెలిసియుండుటచే స్వామియాజ్ఞగా అతనినానాడే బంధవిముక్తుని గావించిరి.

**(40) కర్రిలచ్చన్న స్వామివారి భక్తుడగుట స్వామికరుణించుట :**

విశ్వబ్రాహ్మణుడగు కర్రిలచ్చన్న "కొణిశ" గ్రామమున జన్మించి బాల్యమందే తల్లిమరణించుటచే, తల్లి తండ్రియగు తాతగారింట శృంగవరపు కోటలో పెరిగి పెద్దయి పెండ్లి యనంతరము తండ్రిగారి ఊరగు"కొణిశ" గ్రామముందు కాపురముంటూ ఘంటాసీతప్ప గారి వద్ద కవిత్వము నేర్చుకొని కొన్ని గ్రంధములు రచించిరి. తనగురువగు సీతప్పగారు శిస్తుకట్టనందున సర్కారువారు కారాగార మందుంచుటయు, కొన్నాళ్ళకు సనారీవారు ప్రత్యక్షమై కవిగార్ని బంధవిముక్తులను గావించుటయు, తెలిసినలచ్చన్నగారు సనారీ వారియందు భక్తిభావముతో నుండి, వారిదర్శనముకై తహతహలాడు చుండిరి. ఆ సమయమున సనారీవారు కొణిశి గ్రామముమీదుగా వచ్చుచున్నారని తెలుసుకున్న లచ్చన్నస్వామి వారి రాకకై ఎదురుచూస్తూ, సనారీవారు కన్పించుటతోడనే ఎదురేగి పాదాభివందనముగావించి.తన గృహముపావనము చేయుడని ప్రార్థింపగా, స్వామి అందుకంగీకరించి లచ్చన్న గారింటికి వెళ్ళిరి. సుగుణఖనియగులచ్చన్న భార్య ద్వారమునకెదురేగి స్వామి పాదములను పళ్ళెరమునందుంచి దంపతీయుక్తముగా పాదపూజగావించి, ఆ జలమును శిరస్సున జల్లుకొని, సపర్యలు చేసి ఆతిధ్యమిచ్చి ఉన్నతాసనమునపై కూర్చుండబెట్టి, స్వామి పాదముల కడ దంపతులు కూర్చుండి సపర్యలు చేయుచూ స్వామీ తమ దయకు పాత్రుడయిన సీతప్ప శిష్యుడను దయయుంచి నన్నునూ, మీ శిష్యునిగా స్వీకరించి, తమ దివ్యోపదేశములచేమమ్ము. పునీతులను చేయుడని పాదపద్మములంటి ప్రార్థింపగా వారికి స్వామి తారక మంతోప్రదేశము జేసి "సమస్త భోగ భాగ్యములు సద్గుణముల తోను బ్రహ్మజ్ఞానము కలిగి" వర్థిల్లుదువుగాకయని ఆశీర్వదించి మూడుదినములా గ్రామస్తులకు వేదాంత బోధనలు చేసి యోగ మార్గమున పవిత్రులుకండని తెలిపి విశాఖపట్నం ప్రయాణమైరి.

**41. అమ్మన్నశాస్త్రి గారి అహంకారానికి శిక్ష :**

లచ్చన్నస్వామివారు విశాఖపట్నంలో నున్నంతకాలము గురుసేవలు చేయుచూ ఆనందముగా జీవించెను. విశాఖపట్నంలో అమ్మన్న శాస్త్రియను విశ్వబ్రాహ్మణుడు శృతి స్మృతి పురాణేతిహాసములు చదివినదిట్ట, స్వామివారితో వేదాంత విషయములు చర్చించు చుండెడివాడు.ఒకనాడు స్వామివార్ని మీచేతి మీదుగా పాలకాయపూసలు చేసి యిమ్మని పదేపదేకోరిరి. స్వామివారు సరేయనిరి శాస్త్రిగారు వెంటనే బంగారంయిచ్చిరి. స్వామి వారాతనిని పరీక్షింప ఎంతకాలమునకూ పూసలుయివ్వక రేపు ఎల్లుండియని త్రిప్పుచుండిరి. దానితో కోపించిన అమ్మన్నశాస్త్రి అంత చేయలేనివాడివి బంగారమెందుకు తీసుకొంటివని, అసలు బంగారం ఉన్నదాలేదా? రేపు యివ్వనిచో మర్యాద దక్కదని చరచరా వెళ్ళిపోయిరి. అమర్నాడు అమ్మన్నశాస్త్రిగారు వచ్చిపూసలు ఏవి? అనిరి. స్వామివారు యింకా కాలేదనిరి, దాంతో ఆగ్రహించిన శాస్త్రిగారు తెలిసీ తెలియని వాగ్వాదములతో ప్రజలను మోసగించి జీవించుచున్నది గాక, బంగారం దిగిమ్రింగుచుంటివా. నీముఖముచూచిన పంచమహా పాతకములు చుట్టుకొనును. నీ పేరెత్తిన నోరుచెడిపోవును. అనగాస్వామివారు శాస్త్రిగారిచ్చిన బంగారు పొట్లాం తిరిగిశాస్త్రిగారి చేతులలోనుంచెను. అది విప్పిచూడగా, యిచ్చిన బంగారమట్లేయున్నది. గురుదేవులా బంగారంపై మంత్రజలాన్ని సంప్రోక్షించగా చూచుచుండగనే

పూసలుగా మారినవి. అపుడు గురుదేవులు శాస్త్రిగారూ ఎన్ని శాస్త్రములు చదివినా, అరిషడ్వర్గములు జయింపలేక అజ్ఞానంలోనుంటిరి. నా నామముచ్చరింప గూడదంటిరికదా, "తథాస్తు" నానామోచ్చరణ లేక మీజన్మ పవిత్రము గాకుండుగాక యనిశపించిరి. తర్వాత కొన్నేండ్లకు శాస్త్రిగారు పశ్చాతాపముతో స్వామివార్ని స్మరించుచూ ప్రాణములు వీడిరట. స్వామివారటనుండి సింహాచలం ప్రయాణమైరి.

## సింహాద్రి అప్పన్న గుడి చరిత్ర

విశాఖపట్టణ సమీపమున గల సింహాచల క్షేత్రంలో గల సింహాద్రి అప్పన గుడి శిలాశిల్పములకు ప్రసిద్ధి చెందినదని పలువురు ప్రశంసించుట విన్న స్వామివారు తమ కుటుంబీకుల కళావైభవమును తిలకించుటకై అప్పన్న గుడికి వెళ్ళి, గర్భాలయమున గంధంపూసి తిరునామములు పెట్టి యున్న శివలింగమును, ఆలయ స్తంభములకు రెండంగుళముల సున్నం పూచి యుండుటచూచి, దీనికి కారణమేమియని పద్మాసనాసీనులై మనోదృష్టితో దాని పూర్వచరిత్ర తిలకించిరి.

సింహాద్రి నరసన్న శిలాశిల్పములు మలచుటలో సిద్ధహస్తుడు. మంచి యోగాభ్యాసపరుడు. నిత్యానుష్ఠానపరుడు. వీరుస్తపతిగా సింహాచలం కొండనుదొలిచి, ఆగమశాస్త్ర ప్రకారముగా శివాలయమును నిర్మిస్తూ, దేవాలయ స్తంభములకు రెండంగుళములు బొద్దు తీర్చి అందులో, శివలీలా వినోదములెన్నియో చిత్రించిరి. వీరు భార్య గర్భవతియై యుండగా యిల్లువీడి, ఆలయనిర్మాణముకై యిచటకు వచ్చి పుష్కరకాలం పైగా శిష్యబృందముతో కొండపై నివాసముంటూ, అహర్నిశలు శ్రమిస్తూ, లోకోత్తరములగు శిల్ప రచనలతో ఆలయ నిర్మాణము గావించుచుండిరి. యింటివద్ద భార్య, పుత్రుని ప్రసవించగా, బాలునకు అప్పన్నయని పేరిడి, పితామహుని సంరక్షణలో శిల్పశాస్త్ర మభ్యసించుచూ 12 సంవత్సరములు ప్రాయమునకే మంచిశిల్ప విద్యాశాస్త్ర ప్రవీణుడయ్యెను. అప్పన్నకు తండ్రిని, తండ్రి శిల్ప రచనా కౌశలమును చూడ మనసుకలిగి, తల్లిని వివరములడిగి తెలుసుకొని తండ్రిని చూచుటకు యిల్లు వీడి బయలుదేరి, మార్గమందలి దేవాలయములు దర్శించుతూ, మహాశిల్పులకు సైతము నిర్మాణ దోషములు తెల్పుచూ క్రమముగా సింహాచలముచేరి నిర్మాణంలో గల ఆలయమును చూచి, ముఖద్వారము విదిక్కులోనున్నదని ఆక్షేపణ తెలుపగా, అచటి శిల్పులు బాలుని స్తపతియగు నరసన్నగారి వద్దకు తోడ్కొనిపోయిరి. వారు ఆ బాలునితో శిల్పశాస్త్ర విషయములు చర్చించి, యిచట గల నైసర్గిక వాస్తుచే నిర్మాణమిట్లు చేయుచుంటిమి. యింతకంటే ముఖద్వారమునకు అవకాశము లేదు. దీని దోష పరిహారార్థము యంత్రస్థాపన చేయుదుననిరి. దానికి అప్పన్న మీరు మహాశిల్పులు. మీ శిల్పరచన మహాద్భుతము, లోకోత్తరమైనది. కానీ ద్వారము విషయమాలోచింపుడనెను. నరసన్నగారు బాలకా అన్ని విధముల ఆలోచించియే యిట్లు నిర్మించుచుంటిమనిరి. దానికి అప్పన్న మహాత్మా మీరు పితృతుల్యులు. మీ రాజ్ఞ యొసంగిన, నే నీ ద్వారమును మార్చి వాస్తు దోషము నివారింతుననెను. నరసన్నగారు బాలుని చూచినగుచూ ఏమిరా! నీ వీ దేవాలయమును త్రిప్పివేయుదువా యని హాస్యమాడిరి. మీ అనుజ్ఞయయిన అదెంత పనియని అప్పన్న వినయముగా అనెను. ఆ మాటలకు కోపించిన నరసన్న శిల్పి ఏరా! యిది బొమ్మలాటను కొనుచుంటివా? ఈ ఆటలు నీ తోటివారితో ఆడుకొనుము. విగ్రహప్రతిష్ఠాముహూర్తము కొలది దినములలో కలదు. మా కాలమును వృథాపరచక నీ దారిని నీవు పొమ్మనిరి. దానిని అప్పన్న మీ వంటి పెద్దలతో హాస్యములాడునంతటి అవివేకిని గాను. మీ రంగీకరించిన ప్రతిష్ఠా సమయమునకు ముందుగానే దేవాలయము సవ్యదిశయందుంతును. అట్లుగాకున్న యిచట నా ప్రాణములు వీడెదనని ప్రతిజ్ఞ గావించెను. నరసన్నగారు యిచట మా





పనులను ఆటంకపరచక నీ ప్రయత్నములు నీవు చేయుము. దీనికోరకు ప్రాణములు ఫణముగా పెట్టనక్కరలేదనిరి. దానికి బాలుడు ఆడిన మాట తప్పుట మావంశమున లేదనెను. నరసన్నగారునగుచూ "పిట్టకొంచెము, కూత ఘనము" సరే నీ ప్రయత్నములు నీవు చేయుమని అట, నుండివెడలిపోయిరి అప్పన్న దేవాలయ ప్రాంగణమున గల చిన్న కొండముక్కను రాతి రథముగా గుర్రములతో సహా మలచి తనకు సాధనతార యందు అమృత ఘడియలలో, ఆ శిలారథమునకు ప్రాణప్రతిష్ఠ గావించి, దేవాలయమునకు ఉద్వాసము చెప్పి, పునఃప్రాణప్రతిష్ఠ గావించి, రథ సహాయముతో దేవాలయమును సవ్యదిక్కుకు క్షణకాలంలో త్రిప్పి, దేవాలయమునకు, శిలా రథమునకూ ఉద్వాసన చెప్పి ఊరకుండెను. మరునాటి ఉదయానికి దేవాలయము దిశమారుటగాంచిన శిల్పిబృందము దిగ్భ్రాంతి చెందినది. యిది గాంచిన నరసన్న శిల్పి ఈ మార్పునకు బాలుని ప్రతిభాపాటవములకు ఈర్ష్యతో కూడిన ద్వేషమున "ఉగ్రనరసింహుడై" దీర్ఘకాలము నుండి అహర్నిశలు తాముచేసిన కృషియంతయూ నిర్వీర్యమై బాలునకగ్రతాంబూల మందునన్న క్రోధముతో బాలుని చేరబిలిచి, తన తొడలపై పరుండబెట్టుకుని హిరణ్యకశిపుని నారసింహుడు పొట్టచీల్చి వధించినట్లుగా, తన వాడిగోళ్ళతో అప్పన్న ఉదరము చీల్చుచుండగా, ఈ హఠాత్ పరిణామమునకు బాలుడు నిశ్చేష్టుడై, మహనీయా! నేను మీకేమి అపకారమొనర్చితినని యిట్లు చేయుచుంటిరి. నా జనకుని అన్వేషణకై యిల్లు వీడిన నన్నిట్లువధించుట ధర్మమా? యనుచూ రోదించుచుండగా నరసన్న ఎవడురా నీతండ్రియని గద్దించగా! బాలుడు సింహాద్రి నరసన్నయని దీనముగా పలుకగా, నరసన్న నిశ్చేష్టుడై, "హా కుమారా!" లోకోత్తరమగు నీ శిల్పవిద్యకు, శిల్పశాస్త్ర ప్రజ్ఞకు ఆనందపడవలసిన నేనే పుత్రహంతకుడనైతినా. హా పరమేశ్వరా! పగవారికైననూ యిట్టి దుస్థితి రాకూడదు. అనుచు రోదించుచూ కుమారుడు ప్రతిజ్ఞగా పల్కిన ప్రాణత్యాగవాక్కు పరమేశ్వరుని ఆజ్ఞయా, లేక నా అహంకారమా అనుచూ ఆత్మవ్యధజెందుచూ....

ఆత్మావై పుత్ర నామాసి । సజీవశరదశ్శతం॥

అంటూ ఆశీర్వదించి, దేవాలయ విగ్రహ ప్రతిష్ఠా కాలంవరకూ తన తపః శక్తిచేబాలుని ప్రాణములునిలిపి, తర్వాత ఆ కొండపై బాలుని సమాధిజేసి పశ్చాత్తాపముతో ఎంతటి తపః స్సంపన్నులకైనా బ్రహ్మజ్ఞానులకైననూ,ఆరిషడ్వర్గములను జయించుట అసాధ్యమని జీవితాంతం హృదయావేదనతో జీవించిరి.

అప్పన్నను కొండపై సమాధి చేయుటచే అప్పన్న కొండయని దేవాలయదిశ మార్చుటచే అప్పన్న గుడియని ఆ దేవాలయం ప్రసిద్ధిచెందినది.

యిలా కొన్నేండ్లు కాలగర్భంలో గడిచిన పిదప వైష్ణవమత ప్రచారమునకై కంకణం కట్టుకున్న రామానుజాచార్యులు, సాధ్యమైనంతవరకూ ఆధ్యాత్మిక పరులను వైష్ణవులుగా, శివాలయములను విష్ణ్వాలయములుగా మార్చుచూ, సింహాచలం వచ్చి జనసమర్ధములేని సమయమున శిల్పిని ప్రలోభపరచి శివలింగముపై సూకర ముఖమును ఎట్లెట్లో నాలుగు గీతలు కొట్టించి, వరాహ నరసింహ స్వామి వెలసెనని కల్పించిరి. ఈ విషయము చోళభూపాలుని కొల్వునకు విచారణకురాగా "రాజు" రామనుజాచార్యులవారిని విచారించగా రామనుజాచార్యులు మహాప్రభో! శివాయ విష్ణురూపాయ। శివరూపాయ విష్ణవే॥ యని వేదములు ఘోషించుటచే భవిషత్తులో మతద్వేషములణిగి, శివకేశవ భేదములంతరించునని శివలింగముపై వరహ నరసింహస్వామిని చెక్కించితినని సమర్థించుకొనగా, శైవాభిమానియగు **చోళరాట్కులేంద్రుడు** తనకు ఆప్తులు, సర్వశాస్త్ర కోవిదులగు వారితో ఆంతరంగిక చర్చలు జరుపగా, అందరూ రామానుజునకు శిరచ్ఛేదనయే తగిన శిక్షయని తెలుపగా, అమరశిల్పి జక్కనాచార్యులు మాత్రము "మహారాజా"

శ్లో॥ **శివాయ విష్ణురూపాయ - విష్ణురూపాయ శివః**
**శివస్య హృదయం విష్ణుః - విష్ణోశ్చ హృదయం శివః॥**
**యథాశివమయం విష్ణుదేవం - విష్ణుమయం శివః**
**యథాంతర నపశ్యామితథామే స్వస్తిరాయుషి॥**

అను వేద ప్రమాణముచే శివకేశవాద్వైత సిద్ధాంతములు ప్రతిపాదించి, సత్యాహింసల స్వరూప స్వభావం గల గంభీరోపన్యాసములు చేసి, మరణదండన ఆలోచనలు మాన్పి, రాజా! ఈ భావన అరిషడ్వర్గంబులజిక్కిన వారికే గాని సర్వాంతర్యామి యగు పరమాత్మకు లేవు. ఆ జగత్పిత ఏ దైవమును, ఏ మతమును, ఏ కులము వారు ఏ రూపునారాధించిననూ స్వీకరించును. సర్వమూ ఆ విరాట్ పురుషునకే చెందునని శాంతింపజేసి, ఆ కాలమున మతద్వేషంబున జరుగుతున్న మారణహోమములను మాన్పి. సమతాధర్మమున స్థాపించిన మహనీయుడును రామానుజాచార్యులకు ప్రాణభిక్ష పెట్టినదియూ దక్షిణ భారతదేశ విశ్వకర్మీయుడగు అమరశిల్పి జక్కనాచార్యుడే, ఈ వివరణతో సమాధానపడిన "చోళరాజు" ప్రతిష్ఠించిన శివలింగమును భంగపరుచరాదని యోచించి, ఈ మార్పు వైశాఖ శుద్ధ తదియనాడు జరుగుటచే ఆ ఒక్కరోజు రామానుజాచార్యుల కోర్కెపై వరాహనరసింహ స్వామిగా, మిగిలిన 364 రోజులు గంధంపూసి కామదహనమూర్తియని పూజింపుడని శాసించిరి. ఆ ప్రకారముగనే నందీశ్వర లక్షణములతో నున్న కోడెదూడలను ఆబోతులుగా నిర్ణయించి, శాస్త్రోక్తముగా పూజించి సమారాధనలు చేయుచూ నాటినుండి నేటివరకూ శైవసాంప్రదాయములు జరుపుచున్నారు. కామదహనమూర్తి యగు ముక్కంటి శివుడై, అమ్మవారు అపర్ణాదేవియైయుండగా, కాలక్రముమన వీటన్నిటినీ మరుగుపరిచి వరాహనరసింహ స్వామియని పూజించుచూ, వైష్ణవసాంప్రదాయములు నిత్యమూ జరుపుచున్నారని స్వామివారు యోగముద్రలో గ్రహించిరి.

సనారీవారు మెల్లగా కనులుతెరిచి చూచుసరికి చుట్టూ భక్తులు చేరి నమస్కరించుచూ స్వామీ తమదేయూరు, నామధేయమేమనిరి. నాయనలారా! సర్వసంగ పరిత్యాగులకు ఒక ఊరేమి, నా జన్మస్థలం పాలకొండ. నన్ను సనారీ విశ్వనాథుడందురు.
స్వామి! ఈ దేవాలయ చరిత్ర తెలుపుడని ప్రార్థింపగా, బిడ్డలారా! వేమనయోగి చెప్పినట్లు

**శిల్పి కన్న గురుడు సీమ నెవ్వడు లేడు - శిల్పి చెప్పిన గురి సీమకెల్ల**
**శిల్పిని దిట్టిన శ్రీని దూషించినట్లు గాదె వినుముయవనివేమ॥**

శిల్పిని తలంచిన సకల శుభములు చేకూరును. యిప్పటి కలి ప్రభావముచే, అసత్య ప్రచారములు, అన్యధన, మాన, ప్రాణస్వీకారములు, అక్రమార్కులకు అగ్రపీఠ మొసంగుట. ధనవంతులు దైవసమానులుగా కీర్తింపబడుట యుగధర్మమైయున్నది. ఈ దేవాలయ నిజస్వరూపమును గాంచవలెనన్న కలిమాయచే కల్గిన అంధత్వమునకు జ్ఞానమను కలికమును వేసి, దేవాలయ స్తంభములకు పూసిన సున్నమును తొలగించి చూచినచో, ఎందరి శిల్పులు జీవిత మా కళానైపుణ్యమున కాహుతియయ్యెనో, శిల్పులెంతటి ప్రతిభావంతులో, యిది ఏ దేవాలయమో అర్థమగును. కానీ యిది అసత్య యుగము కదా! సత్యములిట్లే మరుగనబడి అసత్యప్రచారములందలము లెక్కు చున్నవి. యిది మహాశిల్పి అప్పన్న గుడియని సింహాద్రి అప్పన్న కొండయను యథార్థ జననానుడిని మరుగుపరిచి ఏవో కట్టుకథలల్లారీ యుగశ్రేష్టులు దైవాన్ని సైతమూ మార్చి వారి ప్రచారములకే పట్టముగట్టుకొనుచున్నారు. యిది ఎట్లున్నదనగా యాగార్థము విప్రుడు నల్లమేకనుగొనిపోవుచుండగా కొందరు వంచకులు దారికాచి మేకనపహరించుటకు పథకం ప్రకారం ఒక్కొక్కరు వరుసగా అదేమి పంతులుగారు కుక్కను





తీసుకుపోతున్నారేమని నలుగురూ ప్రశ్నింపగా? యిది మేక కాదు కుక్కని భ్రమించిన బాపడు మేకను వదిలివేసినట్లుగాయున్నది. యిలా సత్యములు మరుగునపడి అసత్యప్రచారములే ప్రభలుచున్నవని తాను మనోదృష్టితో గాంచిన విషయములు వారికి చెప్పి అసత్య ప్రచారములు భవిష్యత్తులో పోనుపోను యింకనూ ప్రభలమగును. కాలవైపరీత్యమిట్లున్నది. మానవుని స్వార్థమే మారణహోమములకు కారణమగును. కావున సత్యాహింసల మార్గమున జీవించి మానవజన్మము సార్థకముగావించు కొనుడని వేదాంతోపన్యాసములు చేసి అటునుండి ద్రాక్షారామము బయలుదేరిరి.

## 42. కోడూరు విశ్వబ్రాహ్మణుల సత్కారం :

స్వామి సింహాచలం నుండి బయలుదేరి మాడుగుల దగ్గర గల ఏ కోడూరు వెళ్ళగా, ఆగ్రామమందలి విశ్వబ్రాహ్మణులు స్వామినిగాంచి ఈశ్వరాంశగా కన్పించు స్వామివారి దరిజేరి స్వామీ మీదేయూరు, ఎచటికి వెళుతున్నారని ప్రశ్నించిరి. "నేనేసనారీ విశ్వేశ్వర అవధూతననిరి".స్వామివారి మహిమలు విన్నస్వకులస్తులు స్వామీమాగృహమునకు దయచేసి మమ్ముపావనులనుజేయుడని, ఆహ్వానించి యింటికితీసుకువెళ్ళి దంపతీయుక్తముగా పాదపూజ గావించిరి. యిటుల గ్రామమందలి విశ్వబ్రాహ్మణులు అందరూ ఒక్కోరోజు తమయిండ్లలో ఆతిధ్యములనిచ్చిరి. ప్రతిదినము నిత్యకృత్యములు తీర్చుకొని విరామ సమయములందు వారికి వేదాంతోపన్యాసములు చెబుతూ వేదవిద్యారహస్యలను తెల్పుచూ, వారికి గల సందేహములు తీర్చుటచే, పరమానందభరితులగుచుండిరి. స్వామివారు భుజించు నపుడు ఆహార పదార్థములన్నియూ ఏకంజేసి భుజించుచుండగా, ఒకగృహస్థు స్వామివారి నుద్దేశించి స్వామీయిలాభుజించుటకు కారణమేమనిరి. స్వామివారు నాయనా నీవును అన్నమందు పప్పుకలిపి నెయ్యి వేసుకొని ముద్దజేసి నోట పెట్టిమరలా కూరనొకసారి పచ్చడినొకసారి చేర్చిభుజింపుచుంటివి గదా. నేను యింకొన్ని కలిపి మొత్తంగా తినుచుంటిని. ఈపద్ధతిరాబోవుకాలములో ముందుగా ఉన్నత కుటుంబాల వారునూ పిదప అందరూయిట్లే తిందురనిరి. ఆగ్రామమున కొన్ని దినములుండి, వారికి సనాతనధర్మములు బ్రహ్మవిద్యా రహస్యములు తెలిపి అచటినుండి బయలుదేరి నర్సీపట్నం దగ్గర కృష్ణదేవిపేట వెళ్ళేదారిలోగల ధార మఠమునకు బయలుదేరిరి.

## (43) ధారమఠము విశేషాలు :

సనారీవారు కోడూరు నుండి బయలుదేరి, వడ్డాది శారదానదీతీరమున వెలసిన మంగళ గౌరిదేవత ఆలయమున ప్రవేశించి, అచట పూజలు చేయుచున్న భక్తులను గాంచి, పరమేశ్వరుని అర్థాంగియగు మంగళగౌరిని పూజించినవారికి, సుమంగళీత్వము సిద్ధించునని తెలిపి, అచట గల వారందరికి జ్ఞానోపదేశముగావించి, వారికి "బ్రహ్మజ్ఞానసిద్ధిరస్తనుచూ", ఆశీర్వదించి అటనుండి పాడేరు మీదుగా చింతపల్లి వెళ్ళుమార్గములో పోతుగడ్డ అనుగ్రామముగలదు. దానినానుకొని ఉత్తరవాహినిగా గల నదిగలదు. అచట స్వామివారు 3 రోజులుండి అచట గిరిజనులకు వేదాంతోపన్యాసములు చెప్పివారికి యోగవిద్యను ప్రసాదించి, వారిచే జటల స్వామియని కీర్తింపబడి, అచటినుండి బయలుదేరి "కిన్నెర" యను గ్రామమందు స్వయంభూ వీరవెంకట సత్యన్నారాయణ స్వామి ఆలయముకలదు ఆస్వామియే యిపుడు అత్తవారిల్లగు అన్నవరం చేరియున్నారు. ఆదేవాలయమందు 3 రోజులుండి అచటి భక్తుల ఆతిధ్యములు స్వీకరించుతూవారికి వేదాంత బోధనలు చేస్తూ, వారికి జ్ఞానోపదేశం గావించి. అచట నుండి నర్సీపట్నంలో 3 నాళ్ళుండి వేదాంత ప్రబోధనలు చేసి అటనుండి కృష్ణదేవి పేట వెళ్ళుదారిలో గల "సోద్యము" అను గ్రామంలో మూన్నాళ్ళుండి అచట భక్తులకు వేదాంతబోధలు చేసి అటనుండి 6 మైళ్ళ దూరములో గల ధారమఠము జేరిరి. పర్వతశిఖరము నుండి జలధారపడు ప్రదేశముగా వున్న దానిని ధారమఠ

మందురు. అచట క్రూరమృగ సంచారము విస్తారముగానుండుటచే, మానవులాప్రాంతమునకు వెళ్ళుటకు సాహసింపరు. స్వామి ఆజలపాతమందు స్నానసంధ్యానుష్ఠానములు పూర్తిజేసుకొని, శివలింగమును ప్రతిష్ఠించి, 3 రోజులచట తపోదీక్షయందుండిరి. 4వ దినమున ఒక భక్తుడు పొలముపనికై ఆప్రాంతమునకువచ్చి తపోనిష్ఠయందలి స్వామినిగాంచి ఆశ్చర్యచకితుడై ఈయన సామాన్య మానవుడు కాడనిభావించి, స్వామియధాస్థితికి వచ్చువరకూ వేచియుండి, స్వామి కనులు తెరువగనే నమస్కరించుతూ, స్వామీ మీదే ఊరు, ఎవరుమీరు? ఎన్నాళ్ళనుండి ఇక్కడ ఉన్నారని ప్రశ్నింపగా? నాయనానాకొక ఊరేమి. దేశమంతయూ నాదే నేను విశ్వనాధుడను, 3 దినములనుండి ఇచట ఉంటిననిబదులు చెప్పిరి. స్వామీ మీరు సామాన్య మానవులుగారు, పగటియందు ఈ ప్రాంతమునకు జనులు వచ్చుటకు భయపడుదురు. యిచటక్రూరమృగములు విషసర్పములు యధేశ్చగా సంచరించుచుండును. యిట్టి ప్రదేశములో శివలింగప్రతిష్టజేసి 3 దినములు తపోనిష్ట యందుంటిరి. స్వామీ మీరు ఈశ్వరాంశ సంభూతులేగానీ వేరు కాదు. యిట్టిమిమ్ము దర్శించుట, నాపూర్వజన్మసుకృతము. మీరు నాతోవిచ్చేసి మాగృహము పావనము జేసి,మమ్ములను ధన్యులగావింపుడని ప్రార్ధించగా, స్వామివారు వానివెంట బయలుదేరిరి. ఆతడా గ్రామ మునసుబువారు. వెళ్ళుమార్గమందలి జనులు భక్తిచే నమస్కారములు చేయుచూ స్వామివారికి స్వాగతములు పల్కిరి. యింటి వీధిగుమ్మందరి చేరుసరికి, ఆ యింటిల్లాలు పళ్ళెరమందు స్వామివారు పాదములుంచి. దంపతులిరువురూ పాదపూజచేసి ఆనీటిని శిరస్సున జల్లుకొని స్వామి వార్ని ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి, దాహముతీర్చుకొనుటకు మజ్జిగనిచ్చి. విశ్రాంతిగా శయనింపుడనిరి. రాత్రికి వేదిక నేర్పరచి గ్రామస్తులందరిని రావించి స్వామివారితో వేదాంత బోధనలు చేయించిరి. ఆ గ్రామమున 3 దినములుండి గ్రామస్తులకు స్వామిజ్ఞాన బోధగావించి సదా దైవమునందు మనసునిల్పి సత్య, ధర్మాచరణులై జీవించి మీరు గ్రహించిన విషయములు లోకమున ప్రచారముగావింపుడని "సనారీవిశ్వేశ్వరుని" పూజించి సకలభోగభాగ్యములతోనుండుడని ఆశీర్వదించి, అచట నుండి అడవి మార్గమున ద్రాక్షారామం బయలుదేరిరి.

**(45) రాయవరం స్వామి చేరిరి :**

స్వామి మార్గమధ్యమున రాయవరంలో దునియావేసిరి రాయవరంలో వెంకటరెడ్డియను ఉన్నత కుటుంబీకుడుగలడు. స్వామివారతని ప్రహరీ ప్రక్కన దునియా వేసిరి. సాయంకాలం సమయంబున వేదాంతోపన్యాసములు చెప్పుచు భక్తులకు ధర్మ సందేహములు తీర్చుచుండిరి. రెడ్డిగారొకనాడు స్వామి వారిని తమయింటి కాహ్వానించి, ఉచితరీతిని సత్కరించి పలహారముకై ఫలములనిచ్చిరి. స్వామివారొక ఫలము కొరికి, రెడ్డిగారిపెంపుడు చిలకకుపెట్టిరి. పెట్టినదే తడవుగా మహాప్రసాదముగా తినుచున్న తనకీరముగాంచి రెడ్డిగారు విస్మయమందుచూ స్వామినిగాంచి "మహాత్మా" మా చిలుక ఎంగిలి పదార్ధములు ముట్టదుమేము పెట్టిన పదార్ధములు వెంటనే ముట్టదు. కానీ తమ ఎంగిలి నేవగింపక భగవత్ప్రసాదమటుల భక్తిశ్రద్ధల నారగించుటకేమి కారణమని యడుగగా। ఆచార్యులవారంటత రెడ్డిగారు యిది జన్మాంతర చరిత్ర ఈ రామచిలుక పూర్వ జన్మయందొక క్షత్రియుడు, శివనామముగిట్టని వైష్ణవుడు, ఒకనాడు తన యింటికివచ్చిన శివయోగికి తన యెంగిలిపదార్ధములను తినుటకీయుగా నా తపస్వీ "ఓయీ" ముందొకనాటికి నీకీ ఎంగిలియేగతికానున్నదని శపించెను. క్షత్రియుడు శివయోగిని క్షమాపణ కోరగా కటిుణించి పునర్జన్మయందు నీవు శ్రీమంతుల యింట పెంపుడు చిలుకవై యుండగా యీనీగతచరిత్రనాలకించిన పుడు శాపవిముక్తి యగునని చెప్పెను. ఈ మాట విన్న చిలుక ముమ్మారుస్వామి చుట్టుప్రదక్షణ చేసి స్వామి వారి దునియా యందు బడి అసువులు బాసెను, యిదంతయూ చూచినరెడ్డిగారు





స్వామివార్ని మానవాకృతిలో గల మహాపురుషునిగా గుర్తించి పాదాలపైబడి బహు విధముల కీర్తించి సేవించి తరించిరి. స్వామివారు అటనుండి ద్రాక్షారామము బయలుదేరిరి.

**(46) స్వామివారు ద్రాక్షారామము చేరిరి :**

ద్రాక్షారామము పురాణ ప్రసిద్ధిగన్న పుణ్యక్షేత్రము ఈ క్షేత్ర పాలకుడు భీమేశ్వరస్వామి ఈ క్షేత్రమును రాజధానిగా ప్రప్రధమమున భువనపుత్ర విశ్వకర్మ భూమండలసమస్తము నేలిన పిదప. కశ్యపుడును ఆ తర్వాతదక్షుడు ప్రజాపతులైరి. దక్షుని పెద్ద కుమార్తెయగు సతీదేవి శివుని అర్ధాంగి. దక్షప్రజాపతియొకనాడు యజ్ఞమాచరించుచూ కూతురల్లుళ్ళను ఆహ్వానించుటకు కైలాసము వెళ్ళగా, శివుడు యోగదీక్షలో మామగారి రాక గమనించలేదు. అల్లుడు యింటికి వచ్చిన మామను ఆహ్వానించలేదని, అలిగికుమార్తెను చూడక వెనుదిరిగి పోయెను. తన తోబుట్టువులందరూ తండ్రి యజ్ఞమునకు వెళ్ళుచున్నారని తెలిసిన సతీదేవి, తానూ యజ్ఞమునకు వెళ్ళుటకు పరమేష్టిననుమతి కొరింది। దానికి శివుడు దేవీ పుట్టింటి వ్యామోహమున యిట్లనుచుంటివి. పిలువని పేరంటమునకుబోయిన అపఖ్యాతి పాలగుదువు వలదనిరి దానికి సతీదేవి అది నాపుట్టిల్లు, నా తల్లిదండ్రులు, నా తోబుట్టువుల మధ్య నాకెమికొదువని పుట్టింటి మమకారమున పల్కెను. శివుడెంతవలదనుచున్ననూ సతీదేవి పుట్టింటికి పయనమై వెళ్ళెను. దక్షప్రజాపతి కుమార్తెరాక నెరింగి భార్యను పిల్లలను, బంధుమిత్రాదులను యజ్ఞశాలయందెవ్వరినీ సతీదేవిని పలకరింపరాదని శాసించెను. ఎంతో ప్రేమతో వచ్చిన సతీదేవికి తీరని పరాభవము కల్గినది. ఆయవమానము భరింపజాలని సతీదేవి పతియాజ్ఞధిక్కరించి వచ్చినందున, కైలాసమునకు పోవుటకు మనస్సంగీకరింపక యోగాగ్నిలో భస్మమైన ప్రదేశమే ఈ పుణ్యక్షేత్రము.

**(47) గ్రామదేవతా దిగ్భంధన :**

స్వామి ద్రాక్షారామము చేరుసరికి సూర్యాస్తమయమగుచున్నది. ఆ గ్రామ ప్రజలందరూ ఏదోహడావుడిగా యిళ్ళలోకి పోయి తలుపులు బిగించుకొనుచుండిరి. స్వామివారొకయింటి అరుగుపై కూర్చొని యిదంతయూ చూచుచుండిరి. ఆ యింటియజమాని కిటికీ తలుపులు తెరిచి స్వామినుద్దేశించి అయ్యా తమరు పరదేశివలేయున్నారు. ఈ ఊరి పరిస్తితి మీకు బొత్తిగా తెలిసినట్టులేదు. ఈ ప్రక్కవీధిలో కాళికాలయమున్నది. రాత్రి వేళయందాదేవీ విగ్రహంవీధుల వెంట తిరిగి తన కెదురగు మానవ, మానవేతర జీవులను భక్షించుచున్నది. కావున నీవీ రాత్రికి మా యింటనిద్రించి నీ పాౖణములు నిల్పుకొమ్మని యింటిలోనికి రమ్మనిపిలిచెను. దానికి స్వామివారు చలింపక అయ్యానాకు నాయను వారెవ్వరునూలేరు. నాకొరకు మీరు విచారింపవలదు. "మీరు క్షేమముగనున్న చాలు" ననగా నా యింటిపెద్ద "నీ కర్మ" నీకీ నాటితో నూరేండ్లు నిండినవి కాబోలునేనేమి చేయగలననుచూ కిటికీ తలుపుల గట్టిగావేసుకొనెను. ఆ మాటలకు స్వామి వారు నవ్వుకొని, ఈనాడు కాళిక ఆగడములు అరికట్టించ వలయుననుకొని, అతి జాగ్రత్తగా కాళికాదేవిని గమనించు చుండిరి. నిశిరాత్రిదాటి నడిరేయి కాబోతున్నది. భద్రకాళి అపరమృత్యుదేవతవలే గుడినుండి బయలుదేరినది. ఆమె కెదురైన రెండుగేదెలు రక్తంగ్రక్కి చనిపోయినవి. మరొక వీధిలోకి మలుపు తిరిగినది. స్వామి అదనుచూచి ఆలయంలోనికి ప్రవేశించి నలుమూలలా పరికించి చూడగా, వాస్తుదోషమేమియు కానరాలేదు. అమ్మవారి విగ్రహం క్రిందగలమూల యంత్రమును పరికించిచూచి, యంత్రమందలి బీజాక్షరములు క్రమముదప్పుట గమనించి వాటిని తనమంత్రశక్తిచే సరిచేసి , యంత్రము యధాస్తానమందుంచి కాళికాదేవిని గుడిలోకి రాకుండా దిగ్భంధనముచేసి గర్భగుడి లో స్వామివారు తలుపులు వేసుకొని శయనించిరి. ఊరంతా తిరిగిన కాళికబ్రహ్మ ముహూర్తమున గుడిదగ్గరకు వచ్చి గర్భగుడిలోకి ప్రవేశింపలేక లోపల స్వామినిగాంచి గంభీరముగా ఎవరు నీవు? నన్నెందుకిటుల దిగ్భందనగావించితివని ప్రశ్నించింది. స్వామి వారు తల్లీ ఏ

దేవతలైననూ సకలజీవరాసులను కన్నబిడ్డలవలె కాపాడవలెనుగానీ యిటు భక్షింతురాయనగా। యంత్రమందలి బీజాక్షరప్రభావమున యిట్లు ప్రవర్తించితిని యిందు నా దోషమేమున్నదనెను। స్వాముల వారాదేవతతో "తల్లీ నీవు చెప్పునది సత్యమైనను, నిప్పుచూచి ముట్టినను, చూడకముట్టిననూ, కాలకుండునా। కారణమేదైననూ నీవలన ధర్మమునకు హాని కలిగినది. కర్మఫలమును అనుభవింపక ఎవరికినీ తప్పదు. నీకిక పూజలు జరుగవు. భవిష్యత్తున గోదావరి పొంగినపుడు నీవు నీ గుడియు ప్రవాహమున బడిపోవుదురు. అంతదనుక నీవిచట శిలవై పడియుండు మనుచుండగా తెల్లవారినది. భద్రకాళి బండగ మారినది. ఆమెను గుడిలోకి పోకుండా కదలకుండా శక్తులన్నింటిని బంధించి స్వామివారు నిత్యానుష్టానమునకు బోయిరి. యిదంతయు ఆ వీధిలోని వారు కిటికీ సందులోనుండి చూచి స్వామి వారి అనుష్ఠానం పూర్తియ్యేసరికి గ్రామస్తులంతా జేరిస్వామివారికి పాదాభివందనాలు చేసి, అనేక విధములుగా ప్రార్ధించి ఆపధ్భాంధవునివలే వచ్చిమమ్ము, గ్రామాన్నీ ఆపదనుండి కాపాడిన పరమేశాయనుచూ గ్రామస్తులందరూ కీర్తించి స్వామిని వారు గ్రామదేవత ప్రవర్తనకు కారణమేమనిరి.

అపుడు స్వామివారు నాయనలారా! దైవంయంత్రాధీనం, యంత్రం మంత్రాధీనం, మంత్రం మనుష్యాధీనం- తన్మనుష్యగ్రహాధీనం= యంత్రమును నిర్మించునపుడు బీజాక్షరములు క్రమము తప్పక అక్షరదోషం లేకుండా తయారు చేసి, యంత్ర సంబంధిత మంత్రమును నియమ నిష్టలు గల బ్రహ్మచే అక్షర లక్షలు జపింపజేసి, యంత్రమునకు ధారపోసి ప్రతిష్ఠించినచో ఆ దైవము ఆరాధించిన వారి సకల కోర్కెలు తీర్చి కన్న బిడ్డలవలె కాపాడును. యిందులో ఎట్టి ఆపరాధములు జరిగినా ఒక్కోతప్పిదమున కొక దుష్ఫలితములు సంప్రాప్తించును. దేవాలయములు నిర్మించువారు ఈ విషయమున ప్రత్యేక శ్రద్ధ వహించవలయును. యింకనూ దేవతామూర్తికి ప్రాణప్రతిష్ఠ జేసి షోడశ కళలనావాహన జేసిన గానీ దేవతలు సత్ ఫలితములనీయజాలరు. యంత్రములు కొన్నేండ్లకు తమ శక్తిక్షీణించి జీర్ణమగు చుండును. అట్టి వాటిని తొలగించి మరల నూతన యంత్రములు క్రమబద్ధంగా స్థాపించిన సత్ ఫలితములు కల్గుచుండును. ప్రతిష్ఠాపకుడు దీనికొరకు సద్గురువునాశ్రయించి త్రికరణ శుద్ధిగా సత్యధర్మవ్రతాచరణుడై నియమ నిష్టలతో, నిత్యానుష్ఠానపరుడగు వానికి గురుకటాక్షమున గ్రహములు అనుకూల ఫలితము లొసంగుచుండును. అట్టి వానికి వాక్సిద్ధికలిగి వారు చేయు ప్రతీ కార్యము దివ్యత్వము నొందును. మీరునూ సత్యధర్మవ్రతాచరణులై సుఖముగా జీవింపుడు. యింక మీ గ్రామమునకు ఈ దేవతచే ఎట్టి ఉపకార, అపకారములు జరుగువని వారిని ఆశీర్వదించి స్వామివారు అచటనుండి రాజమండ్రి బయలుదేరిరి.

**తృతీయాధ్యాయం సమాప్తి**







## (48) స్వామి రాజమండ్రి చేరిరి : (చతుర్థాధ్యాయము)

విశ్వకర్మవంశస్తుడు పౌలస్త్యబ్రహ్మ పౌత్రుడు, విశ్రవసుబ్రహ్మపుత్రుడు, పరమేశ్వర ప్రసాదితరావణబ్రహ్మనామధేయుడునగు, దశకంధరుడు, గోదావరీ తీరమందలి శ్రీ కోటిలింగేశ్వరస్వామి నర్చించుటకు, తన రాజ్యము నుండి రాజమహేంద్రికివచ్చి స్వామి నర్చించి లంకాద్వీపమునకేగెడివాడు. ఒకనాడు శ్రీకోటిలింగేశ్వరస్వామి సన్నిధిని కూర్చొని నిమీలితనేత్రుడై..

శ్లో॥ **"స్పటికచ్ఛాయవిభూతిధారణ భవాః శంభో మహాదేవః**
**త్వన్నటనాకౌశల ప్రభావ, భాగ్యఘటనా నైపుణ్యలావణ్యమిచ్చట**
**గోదావరీ తటినీతటాంచల కళాసాధ్వీతరంగాలతో,**
**స్ఫుటమై, నవ్యనటీనట ప్రణయమై పోషింపగా జేయుమి"॥**

అని ధ్యానంలోమునిగియున్నాడు. ఆసమయాన ఆప్రాంతానగల పండితులు, కవులు, గాయకులు వచ్చి రావణబ్రహ్మను చూచి నమస్కరిస్తూ

గీ॥ **బ్రహ్మతేజస్వి శంకరుభక్తవరుడు - దైవవరలబ్ధ శస్త్రాస్త్రజీవనుండు।శౌర్య సమవర్తిరావణ**
**చక్రవర్తి అస్మదాభివందనములనందుకొనుమ విశ్వ విఖ్యాత రావణ విశ్వకర్మ॥**

"మహాత్మా" తమరు అపరశంకరులు తమదర్శనం చేత సమస్తపాపాలు పటాపంచ లౌతాయి. ఈ కోటిలింగక్షేత్ర ప్రాంతమున దుష్టస్వభావులను సంచరించకుండా చేయండి.మరియు మీరు పంచవేదాలు నేర్చిన వేదమూర్తులు, మీరు వేదమునకు ఏర్పరిచిన "వేదఘన" జటలను యిచ్చట గల చిరంజీవులకు బోధింపుడని సవినయంగా ప్రార్ధించిరి. అంతరావణ బ్రహ్మ ఆబృందమునుగాంచి, మీరు కోరిన ఈ చిన్నకోర్కెనుకాదందునా.తప్పక ఈ పరమ పవిత్రమగు కోటిలింగక్షేత్ర ప్రాంతమును. "దుష్టస్వభావులు సంచరించ కుందురుగాక" యని ఆనజేసి, యిచ్చటగల మీబిడ్డలకు నేనేర్పరచిన "ఘన - జటలేగాక," వేదములకు నేనుగావించిన వ్యాఖ్యను గూడా బోధింతును. యిది "ఈశ్వరాజ్ఞగా" తలదాల్తునని వరమిచ్చెను. అందుచేత ఈ కోటిలింగ క్షేత్రము యెంత పవిత్రమైనదో, వేరే చెప్పనేల యిట్టిపురాణ ప్రసిద్ధి గల రాజమహేంద్రవరమును. రాజ రాజ నరేంద్రుడు పరిపాలించెను.

రాజు తనకుమారుడగు సారంగధరుని కల్యాణమునకై పలు దేశపు రాకుమార్తెల చిత్రపటాలు తెప్పించి చిత్రాంగి చిత్ర పటాన్ని గాంచి మోహావేశపరుడై తానే ఆ కన్యను వివాహమాడగా, విషయాన్ని ఎరింగిన చిత్రాంగి రాజుని మభ్యపెట్టి, సారంగధరునికై పరితపించి, ఆతడు నిరాకరించిన కారణంగా యువరాజుపై నిందమోపి, "కాళ్ళు చేతులు ఖండించుటకు" కారకురాలై ఆ పిదప ఆత్మాహుతి చేసుకొన్నది. కాళ్ళు చేతులు ఖండింపబడిన సారంగధరునికి మరల అవయవములనిచ్చి రక్షించినట్టి మహాతపస్వులకు, కవులకు, గాయకులకు, ఘనాపాఠీలకు, ఉద్ధండులగు పండితులకు, సంఘసంస్కర్తలకు నిలయమగు పుణ్యభూమి అట్టి నగరమున, గోదావరీ నదీ తీరమందలి కోటికి ఒక్క లింగం తక్కువగల కోటి లింగాల రేవున అపరకాశీయనదగు, ఆ మహాక్షేత్రమునకుగల కోటిలింగాలరేవు వద్ద స్వామిదునియావేసి. నిత్యానుష్ఠానములు నిర్వర్తించుచూ తనదరికి జేరిన వారికి వేదాంతోపన్యాసములు, సనాతన హిందూధర్మములు తెల్పుచూ, సనారీ విశ్వేశ్వర సంవాదమను యంత్ర, మంత్ర, తంత్రయోగయుక్తమగు మహాప్రబంధమును రచియించుచుండిరి.

## (49) తాసిల్దార్ గర్వభంగము

రాజమహేంద్రవరమున అహంకారి యగు తాసిల్దార్‌గలడు. అతడు వీధులలో సంచరించునపుడు, తన ఎదుటబడినమస్కరించని వారిని కొరడాతో గుర్రంపైనుండి దండించెడివాడు. ఒకనాడు గురుదేవులు పురవీధినుండి కోటిలింగాలరేవుకు వెళ్ళునపుడు, ఆ ప్రభుత్వోద్యోగి గుర్రమెక్కి కచేరీకి పోవుచుండెను. తన కెదురైన ఈ బైరాగి తనకు నమస్కరించలేదని, కొరడాతో కొట్టుటకు చెయ్యి పైకెత్తెను. ఆగ్రహముతో స్వామి వారాతని చూచుసరికి గుర్రముతో సహా శిలా ప్రతిమవలే ఉండిపోయెను. ఈ సంగతి నెరింగిన ఆతని భార్య పరుగుపరుగున కోటిలింగాల రేవుకుబోయి స్వామిపాదాలపైబడి క్షమాపణ కోరినది. పతిభిక్షకై అర్ధించినది విశ్వేశ్వరులు కరుణించి, మంత్రజలమాతనిపై జల్లుసరికి, యధాస్థితికి వచ్చి, అతని అహంకారమంతయూ పోయి, స్వామివారి పాదాలపైబడి శరణుకోరి సుఖంబుననుండెను.

## (50) స్వామి బ్రహ్మరాక్షసిని వదిలించుట :

రాజమండ్రి లక్ష్మీవారపుపేటలో సద్‌బ్రాహ్మణ కుటుంబముకలదు. ఆ యింట యుక్తవయస్సుగల కన్యను బ్రహ్మరాక్షసి ఆవహించినది, ఆ కుటుంబములోనివారిని, యిరుగుపొరుగు వారిని, ఆ వీధిలోని వారందరిని భయంకరాట్టహాసములతో భయపెట్టుచూ, బాధించుచుండెను. ఒక నాడు విశ్వనాధుడా వీధిన వెళ్ళుచుండగా, యింటి అరుగుపై కూర్చున్న కన్యగభాలున స్వామివారిముందుకు దూకి నిన్ను మింగెదనని అట్టహాసంచేసినది. ఓసీఛండాలీ నేటితోనీపనిసరి ఆగుమని స్వామి గద్దించిరి. అంతనాకన్యనావహించిన బ్రహ్మరాక్షసి ఆగిపోయినది. స్వామివారు విభూతి మంత్రించి యువతి నొసటపెట్టిరి. ఆ బ్రహ్మరాక్షసి స్వామివార్కి నమస్కరించుతూ మీదర్శనభాగ్యంబున నేటికి నాకు జ్ఞానోదయమైనది. నా పూర్వజన్మకర్మచే నాకీ దుస్థితి కలిగింది స్వామియనుచూ, తన పూర్వవృత్తాంతమును చెప్ప సాగింది. నేను శ్రీమంతులగు వైశ్యులబిడ్డను మాఅత్తవారింకనూ ఐశ్వర్యవంతులు. పేదవారినిన నాకు బహుచిరాకు. ఒకనాడు మా యింటికి బిచ్చమడగ వచ్చిన బైరాగిని నానా తిట్లు తిట్టితిని, ఆ మహనీయుడు ఆగ్రహించి బ్రహ్మరాక్షసివి కమ్మని శపించెను. ఆయనరోషా వేశమునకు భయపడి, కరుణించమనిప్రార్ధించగా, భవిష్యత్తులో పరమేశ్వరావతారుడగు విశ్వనాధుని దర్శించినపుడు, నీకు శాపవిమోచనమని, అంతవరకూ బ్రహ్మరాక్షసిగా ఉండమని తెల్పిరి. నేడు మీ దర్శనభాగ్యంబున శాపవిమోచనమయి నాకు పూర్వజన్మగోచరించినది. పాహి, పాహి, పరమేశా, విశ్వేశ్వరా, విశ్వనాధావదూతా పాహి, పాహిమాం అనుచూ పాదములపైబడి సాష్టాంగ దండ ప్రణామము లాచరించి బ్రహ్మరాక్షసి బ్రాహ్మణకన్యను వీడి అంతర్ధానమైపోయినది. యిదిగాంచిన వీధి ప్రజలు బ్రాహ్మణ కుటుంబ సభ్యులు, గురుదేవులననేక విధంబుల ప్రార్ధించగా, కరుణాంతరంగుడగు విశ్వనాదుడందరిని ఆశీర్వదించి కోటిలింగాల రేవుకు వెళ్ళిరి.

## (51) పుష్కర మహాత్యము :

గురుదేవులు రాజమహేంద్రవరంలో నున్న సమయంలోగోదావరి పుష్కరాలు వచ్చినవి. పూసపాటి విజయరామగజపతి రాజేంద్రులు స్వామివార్నిదర్శించి, పుష్కరమహాత్యము చూపమనిరి. గురుదేవులు రాజుగార్ని పడవలో గోదావరి మద్యభాగమునకు తీసుకుపోయి, రాజా నవగ్రహములందరి గురువు తన12మంది భార్యలతో కలసి, సింహరాశిలో ప్రవేశించుకాలాన్ని గోదావరి పుష్కరమందురు. అపుడు ముక్కోటి దేవతలు వారితో నుందురు. కావున భక్తులు ఆ పవిత్రజలమందు స్నానం చేసి పునీతులగుదురు అనుచూనది మధ్యనుండి నల్లని త్రాసువలే పారుచున్న పాయను చూపి, అందు రాజుగార్ని స్నానం చేయమని స్వామి సంకల్పము చెప్పి పునీతులను గావించి, ఆశీర్వదించి సాగనంపిరి.





## (52) స్వామివారు చనిపోయిన ఈగల్ని బ్రతికించుట :

రాజమహేంద్రవరమునందు గురుభక్తిగల విశ్వబ్రాహ్మణుడొకడుస్వామివార్ని ప్రతిదినముతనయింటపాలుత్రాగునటుల ఏర్పాటుచేసెను. కానీ ఆయింటి యిల్లాలికది గిట్టలేదు. ఒకనాడామెనట్టింట వ్రాలిన ఈగలను చంపి పాలలో వేసి గురుదేవులకు త్రాగటానికిచ్చినది. అదిగాంచిన స్వామికి ఆగ్రహం కలిగిచచ్చిన ఈగలను చేతిలోకి తీసుకుని "ఫూ" అని ఊదగానే చచ్చిన ఈగలు బ్రతికిలేచి పోయినవి. యిది చూచి గడగడవణుకు యిల్లాలిని స్వామి చూచి, యిక మీయింట ఈగలాకారముగలవారే పుట్టుదురని అటనుండి వెళ్ళిపోయిరి. అప్పటినుండి ఆయింట ఈగ తలవంటి తల, మిడిగుడ్లు, లావుకడుపు, సన్ననికాలు చేతులు, గల సంతతికలుగనారంభించినది. ఆ గృహస్థులు విశ్వనాధుని క్షమాపణకోరి సేవించు తున్నందున కాలక్రమేణ, సంతానములో కొంతమార్పువచ్చుచున్నది. స్వాములతో పాములతో సక్రమంగా ఉండాలి. లేకుంటే యిట్టి అనర్ధములే జరుగుతాయి.

## (53) స్వామి వారు పెద్దలకు గోదావరీ పుష్కర పిండప్రధానము చేయుట :

గోదావరి పుష్కరకాలంలో స్వామి తమ పెద్దలకు పిండప్రదానము చేయసంకల్పించి స్వకులస్తుల కొందరి నాహ్వానించిరి. వారు ఈయనను చూచి సన్యాసి గోదావరీ తీరమందు చేయు పితృకార్యమని అలక్ష్యముచేసి ఎవ్వరునూ వెళ్ళలేదు. స్వామి వారానాడు స్వహస్తములతో మహాప్రసాదాన్ని తయారుచేసి పెద్దలకు పిండప్రదానములు గావించి గోదావరిలో కలిపి, ఆహ్వానితులకై ఎదురుచూచి ఎంతకీ రాక పోవుటచే పద్మాసనాసీనులై ధ్యానముద్రలో కూర్చోనగా వింతరూపులతో కొందరు వచ్చి విందునారగించి అదృశ్యులయిరి. కొందరీ వింతను గాంచిపుర వీధులతో చెప్పుకొనునుండగా సంఘీయులకు తెలిసిస్వామి మనకులములో పుట్టిన మహానీయుడని తలంచి సంఘ నాయకులు స్వామి కలియుటకు నిర్ణయించుకొనిరి.

## (54) విశ్వబ్రాహ్మణులు రసవిద్యచెప్పమనుట :

విశ్వనాధుడు రాజమండ్రివచ్చి 10 సంవత్సరములైన నూ విశ్వబ్రాహ్మణ సంఘీయులు గానీ సంఘనాయకులుగానీ, స్వామిని గుర్తించలేదు. రోజురోజుకూ స్వామివారి మహిమలు గుర్తించిన జనులు స్వామి వారిని సేవించుచూ కీర్తించుట విన్న సంఘనాయకులు, ఒకనాడు కోటిలింగాల రేవు దగ్గరగల స్వామిదునియాకు వచ్చి, నమస్కరిస్తూ మహానుభావా మీమహిమలు గ్రామస్తులు చెప్పుకొనుచుండగావిని మహదానందము పొందితిమి. మీరిటకువచ్చి 10 సంవత్సరములయినా మిమ్ముదర్శింపనందులకు క్షంతవ్యులము. మీరు సర్వజ్ఞులు. మన వారి జీవితములు మీకు తెలియనివికావు. పంచదాయిలవారునూ, రేయింబవళ్ళు కష్టించిననూ అంతంత మాత్రముగనే కాలము వెళ్ళబుచ్చుచుండిరి. మీకు రసవాద విద్యతెలియుననియు, దానివలననే నిత్యకృత్యములు నెరవేర్చుకొను చుంటిరని వింటిమి, కాన మాయందు దయయుంచి కులాభిమానముచే మాకా విద్యను బోధించి, సాటికులస్తులకు జీవన భిక్షపెట్టుడని అతి వినయముతో అర్ధించిరి. దానికి స్వామివారు చిరునగవుతో నాయనలారా! మీ అంతర్యము గ్రహించితిని రసవాదంచెప్పనేల మీకందరకూ చేసియే చూపెదను. ఒకే తూకంగల నవపాషాణములు, రెండులోహపాత్రలు తెండనిరి. వెంటనే నాయకులు మామూలమున జాతికంతయూ జీవనోపాది లభించును. మా ఘనత సంఘీయులందరూ కీర్తింతురని ఆనందపడుతూ కార్యకర్తలను పిలిచి త్వరగా స్వామివారు చెప్పినవి తెండని ధనమిచ్చి పంపిరి. వారునూ ఆవింత ఏదో చూతుమని అతి త్వరలో ఆవస్తువులను తెచ్చియిచ్చిరి. సంఘీయులందరూ స్వామి ఏమి చేయుదురోయని ఆత్రంగా చూచుచుండగా స్వామి వారొక్కొక్కపొట్లాంవిప్పి కల్వములో వేసి చితకగొట్టి తినుచుండిరి. అదిచూచి సంఘీయులు

ఏమి జరుగునో, యివివిషములు గదాయని భయభ్రాంతులై నిచ్చేష్టులైయుండిపోయిరి. స్వామి వారట్లు 9పాషాణములు తిని వారు తెచ్చిన లోహపాత్రలపై ప్రక్కకు తిరిగిమూత్రించిరి. అందరూ చూస్తుండనే ఆలోహపాత్రలు సువర్ణముగా మారిపోయినవి. అప్పుడు స్వామివారు నాయనలారా ! చూచితిరి గదా?యిట్లే సువర్ణము చేసుకోవచ్చుననగా వచ్చినవారందరి మొగములు వాడిపోయినవి వాలిపోయినవి. "స్వామి" అజ్ఞానులము మమ్ము క్షమించి యిందలి అంతరార్ధమును తెలుపుడని ప్రార్ధించగా బిడ్డలారా తుచ్ఛమైన బోగముల నిచ్చు బంగారం కంటే తనువును బంగారం చేసుకొని, అణిమాదులను అవలీలగాపొంది. ప్రకృతిని, శక్తిని స్వాధీనపరుచుకొను యోగాభ్యాసములనాచరించి చరితార్ధులుకండు. కేవలం ధనం వలన భార్యభర్తలకు, తోడబుట్టినవారితో, కన్నవారితో బంధువులతో స్నేహితులతో అనేక బాధలు పడవలసియుండును. ధనం వలన మనఃశ్శాంతిని కోల్పోయి ఆత్మవ్యధతో జీవించి అధోగతి పాలగుదురని హితవుచెప్పి పంపిచిరి.

**(55) చిలకలపూడి రాజలింగాచారిగార్కి స్వామి గోత్రాధ్యాయగ్రంధమిచ్చుట.**

రాజమండ్రి దగ్గరలోగల గౌరిపల్లె వాసి యగువిశ్వకర్మీయుడు శుద్ధశోత్రియుడు, నిత్యానుష్టానపరుడునగు చిలకలపూడి రాజలింగాచారి అపుడపుడు విశ్వనాథునిదునియాకు వచ్చిసేవించి వారినుండి వేదాంత యోగవిషయములందలి తన సందేహములు తీర్చుకొనుచుండెడివాడు. ఒక నాడు రాజలింగాచారి వచ్చి గురుదేవా! విశ్వబ్రాహ్మణులు స్మాంతరాతికోటపతానానంతరము.క్రమక్రమంగా తమ ఔన్నత్యముకోల్పోయి హీనస్థితికి దిగజారినారు. ఆపై గోపరాజురామ ప్రధానికుతంత్రముతో ఒక్కుమ్మడిగా 6 వేల గ్రామ కరణీకములు రద్దయి ఆర్ధికముగాయింకనూ దిగజారి, నిత్యజీవనవిధానమే కరువయి ఉదరపోషణార్ధమై అహర్నిశలు శ్రమించుతూ, పంచదాయిల వారు పడరానియిక్కట్లు పడుచున్నారు. ఈపరిస్తితులలో నిత్య అనుష్టాన, ఉపాసనలకు తిలోదకాలిచ్చి యాంత్రిక జీవనముచేయుచూ,శూభా ఉ శుభకార్యములందు కనీసం గోత్ర,సూత్రప్రవరలు తెలియనివారై, కొన్ని సందర్భములలో ఏకగోత్రకులనే వివాహం చేసుకొనుచున్నారు. గోత్రముచెప్పక తప్పని పరిస్తితులలో బహుళ ప్రచారములో గల సానగ, సనాతన, సుపర్ణ బ్రహ్మర్షిగోత్రములు చెప్పుకొనుచున్నారు. గురుదేవా! మన కులసంతతివారు నిత్యానుష్మానములు నెరవేర్చలేక పోయినా కనీసం గోత్ర,సూత్ర, ప్రవర, బొట్టు, దండములనైనా తెలుసుకొను మార్గమును శెలవీయండనీ ప్రార్దించగా । నాయనా। ఈ హృదయా వేదనతోనే **"విశ్వబ్రాహ్మణగోత్రాధ్యాయం సంధ్యావందనము"** లిఖించితిని. దీని యందు ఆస్తకి గల వానికైచూచుచుంటిని నేటికి నీవు కోరితివి. యిదుగో గోత్రాధ్యాయము, సంధ్యావందనం. దీనినికులస్తులందరికీ తెలియజేసి నీ ఆశయము నెరవేర్చుకోమ్మని 1875 సం॥లో తాళపత్రగ్రంధము రాజలింగాచారికి యిచ్చి "మనోవాంఛా ఫలసిద్ధిరస్తునీ" ఆశీర్వదించి పంపి అటనుండి హేలాపురికి బయలుదేరిరి.

**(56) స్వామి వారు రాజమండ్రినుండి హేలాపురి (ఏలూరు)కు బయలుదేరిరి:**

స్వామివారు రాజమండ్రి నుండి ఏలూరు ధూమ్రేలు రైలుబండిలో బయలుదేరినారు. మార్గమధ్యమున నాస్తికుడగు రైల్వే ఉద్యోగి స్వామివార్ని టికెట్ అడిగెను. దానికి స్వామి సర్వసంగపరిత్యాగులము ఈ నాడిచట రేపొకచోట నుందుము ధనసంపాదనమాకేమి గలదు, మావద్ద ధనమేముండుననిరి. ఉద్యోగిమరి ఆహారమెట్లు వచ్చునని ప్రశ్నించెను. నాయనామాకు ప్రాప్తమున్నచో పిలిచి ఆహారాదులిడుదురు లేనిచో, ఏమీఉండదు అంతా ఈశ్వరేశ్ఛయనిరి. ఈ వేదాంతమునకేమి గానీ టిక్కెట్టులేని ప్రయాణం నేరము, వచ్చుస్టేషన్‌లో దించివేయుదుననెను. సరే నీ యిష్టం నాయనా। నన్ను క్రిందకు దింపి వెళతావా? అలాగే అనిరి. రైలు ప్రక్కస్టేషన్‌లో ఆగగనే స్వామి వార్ని బండిదింపె నా శ్వేతజాతి ఉద్యోగి, స్వామి రైలుదిగి ప్లాట్ ఫారముపైగల





వేదికపై చిరునవ్వుతో కూర్చుండిరి. రైలుకదులుటకు గార్డు సంకేతమునిచ్చెను యింజనుధ్వనితో రైలు బయలు దేరబోయెను, కానీ అక్కడ నుండి రైలు కదలలేదు. యింజను డ్రైవర్‌యింజను భాగములు పరిశీలించుచుండెను. అన్ని సరిగాయుండి బండి కదులుట లేదు 3 గంటలు కాలముగడిచినది. అప్పుడు స్వామి వారితోటి ప్రయాణికులలో ఆధ్యాత్మీకులు రైల్వే ఉద్యోగితో బ్రహ్మతేజస్సుగల ఆమహనీయుని రైలుదించావు. బండి ఆగిపోయింది. ఆస్వామి అపుడే అన్నారు నన్ను వదిలి వెళతావా? అని. యిది ఆ స్వామిమహిమయే మనము వారిని ప్రాధేయపడి బండిఎక్కించిన బండి కదులుననిరి. ప్రయాణీకులతో కలసి ఉద్యోగి, స్వామి దగ్గరకు వెళ్ళి నా తప్పుమన్నించి మీరూ మాతో ప్రయాణం చేయండి.యింకెప్పుడు నేనుగానీ, మా ఉద్యోగులుగానీ మీలాంటి వారిని బాధించము, యిది మా కొకగుణపాఠము, యిప్పటికే చాలా సమయము అయినది నాయందు దయఉంచి రండి అని, స్వామిని ప్రార్ధించి ప్రాధేయపడగా స్వామి చిరునవ్వుతో వెళ్ళికూర్చుండిరి. వేంటనే రైలు బండి బయలుదేరినది. ఆపెట్టెలోని ప్రయాణీకులందరూ స్వామి నామధేయము తెలుసుకొని జై విశ్వనాథావధూతస్వామి కీ, "జై" యనుచూ జయ జయ ధ్వానములు చేసిరి.

**(57) స్వామి హేలాపురిలో శివాలయంలోని నందిని బంధించుట :**

స్వామివారు హేలాపురి చేరి అచట సుప్రసిద్ధ పురాతన దేవాలయమగు "జలాపహరేశ్వరాలయం" వద్దకుజేరి పరమేశ్వరుని అర్చించి విశ్రమించు సమయమున, సాక్షాత్ పరమశివునివలేనున్నట్టి స్వామిని అచటి జనులు చూచిస్వామిదరికేగి కుశల ప్రశ్నల అనంతరము స్వామీ ఈ దేవాలయమందలి **"నంది" "అర్ధరాత్రి సమయమున లేచి పొలాలపై బడి పంటలను ధ్వంసంచేయుచున్నది.** తెల్లవారు ఝామున దేవాలయమున ప్రవేశించి యధాస్తానమందుండును. వ్యవసాయ వృత్తిచే జీవించు మాకు చాలా కష్టములు నష్టములు కలుగజేయుచున్నది. యిదిచాలా వింతగా యున్నది. దీనినే విధముగా అరికట్టవలెనో తెలియక చాలా బాధపడు చున్నాము. చాలామందిని సంప్రదించి వారితో ఏవేవో చేయించితిమి. ధనవ్యయము తప్ప ఫలితము శూన్యముగాయున్నది. మేము అన్నిరకములుగా హీనస్తితికి జేరితిమి.మీరు దైవాంశసంభూతులవోలే కన్పించుచున్నారు. మాయందు దయయుంచి ఈ ఆపదనుండి మాకుటుంబాలను రక్షించుడు. అని పరిపరివిధముల ప్రాధేయపడిరి. వారి మొరలాలించినగురు దేవులు కరుణించి తగిన సమయమున దానినదుపు చేయుదునని వారికి ధైర్యముచెప్పి పంపించిరి. వారు స్వామివారికి కావలసిన స్వయంపాకము నిత్యమూ సమకూర్చుచుండిరి. ఒక సుదినాన మంత్ర యుక్తమగు లోహపు కడియాన్ని నందికాలికివేసి బంధించి కలియుగాంతము వరకూ కదలకుండా దిగ్భందనగావించిరి. ఈనాటికి ఆకడియాన్ని కాలికిఎలా వేసినది ఎవరికీ అంతు పట్టుటలేదు. స్వామివారట నుండి బెజవాడ బయలుదేరిరి.

**(58) స్వామివారు బెజవాడలో కృష్ణానదీ తీరమునగల**
**ఒక విశ్వబ్రాహ్మణ యింటికి వెళ్ళిరి.**

శ్రీశ్రీశ్రీ కనకదుర్గా మాత కరుణా కటాక్షవీక్షణలతో దిన దిన ప్రవర్థమానంగా తేజరిల్లు పురములో ద్వాపరయుగమున యింద్రకీలాద్రి పై పాండవ మధ్యముడు వరమేప్షిగురించి ఘోరతపమాచరించునపుడాతని పరీక్షింప మల్లిఖార్జునస్వామి కిరాతకునిగా అర్జునునితో వాదులాడునపుడాతడు శివుని మెప్పించి విజయుడైన ప్రదేశము విజయవాడయై, ఆ కాలంలో ధర్మరాజు ప్రతిష్టించిన శివాలయంలో నాటి నుండి నేటి వరకూ మహాశివరాత్రి సందర్భమున ఆది దంపతులగు పార్వతీపరమేశ్వరుల కల్యాణమునకు ముందుగా విశ్వబ్రాహ్మణ సంఘీయులచే,

మహాశివభక్తరావణబ్రహ్మావాహనముపై పురవీదులందు గ్రామోత్సవము జరుపు ఆచారములగల నగరమును క్రీ॥శ॥ 1580 నుండి 1610 వరకు విశ్వబ్రాహ్మణుడగు ధవిళేశ్వరపుమార్కేండేయ మహా ప్రభువులు పరిపాలించిన నాటి బెజవాడ నగరము క్రమముగా, కళలకు, సాంస్కృతికి, రాజకీయాలకు తలమానికమై వర్ధిల్లుతున్నట్టి బెజవాడకు స్వామి వారు చేరి కృష్ణానదీతీరమందలి పేద విశ్వబ్రాహ్మణ యింటికి వెళ్ళిరి.

ఆయింటియజమాని దుర్మరణముపాలుకాగా విధవస్త్రీ ఒక్కతే భిక్షాటనచే జీవించుచున్నది. స్వామి వారామెను కుశలవార్తలడుగగా ఆమె నమస్కరించుచూ, నాయనా నాభర్తగతించినాడు. మాకు సంతతియూలేదు, పుట్టింటనన్ను పోషించువారు లేక నేనిచటయాచన వృత్తిచే జీవించు చుంటినని అతి దీనముగా చెప్పెను. స్వామివారు అమ్మా! నేనిచట ఒక పక్షం దినములుండెదను కావలసిన పదార్ధములన్నియూ తెప్పించెదను, అని ఆమెకు చెప్పి కృష్ణానదికిపోయి వచ్చెదనని వెడలిరి. అంతలోనే ఒకవ్యక్తి ఆనాటి వంటకు కావలసిన పదార్ధములు నెయ్యివిస్తర్లతో సహా యిచ్చివెళ్ళెను. స్వామి తన నిత్యానుష్ఠానములెచటో జరుపుకొని భోజన సమయమునకు వచ్చి భుజించుట. రాత్రులందు పరుండుట, ప్రతీదినము ఎవరో వచ్చి దినభత్యములు యిచ్చుచుండిరి. యిటుల కొందరు శిష్యగణముప్రోగైరి. అందులో నీదయ్య అను కాపుకులస్తుడు స్వామి వార్కి ప్రత్యేకముగా కావలసినవి సమకూర్చుచుండెను. నీదయ్యతో స్వామివారు రేపు మల్లేశ్వర స్వామికి క్షీరాభిషేకము, అమ్మవారికి కుంకుమార్చనలు చేయుదమనిరి. నీదయ్య తోటి భక్తులందర్ని రేపు ఉదయం మల్లేశ్వరస్వామివారికి గురుదేవులు క్షీరాభిషేకము చేయుదురు అచటికిరమ్మనిరి.

## (59) స్వామి మల్లేశ్వర స్వామికి క్షీరాభిషేకము చేయుట :

స్వామి మల్లేశ్వరస్వామికి క్షీరాభిషేకము చేయుదమనిరి. కానీ ఎవరికీ పాలు తెమ్మని చెప్పలేదు. అందరూ ఫలపుష్పములతో గర్భగుడి చేరిరి. అర్చకులు స్వామివారికి నమస్కరించి మీరు శిష్యగణముతో అభిషేకమునకు వచ్చుచున్నారనివింటిమి. పూజాద్రవ్యాలు, క్షీరమిచ్చిన అభిషేకం చేయుదుమనిరి. భక్తులు తెచ్చిన ఫలపుష్పాదులనిచ్చిరి. అర్చకులు క్షీరమడుగగా స్వామి కమండలము అర్చకులకిచ్చి ప్రారంభించమనిరి అర్చకులు కమండలంచూచి యిందులో జలముండునుగానీ క్షీరముండునా యనిరి. స్వామినగుచూ నాయనలారా! మీరభిషేకింపుడనగా కమండలం నుండి క్షీరము ఏకధారగా ప్రవహింపగా, మల్లేశ్వరస్వామిని అభిషేకించిరి. అచట భక్తులదిగాంచి మాజన్మలు ధన్యమైనవని గురుదేవులను కీర్తించి స్వామి కృపకుపాత్రులైరి. పిదప వారంతా అచటనుండి కనకదుర్గాదేవి ఆలయమునకేగి అమ్మవార్ని స్తుతినస్తూ కుంకుమార్చనలుగావించి, ఎవరియిండ్లకువారుపోయిరి. స్వామివారు ఆరాత్రి గృహిణితో అమ్మా! నేను రేపు ఉదయం వెళుతున్నానని చెప్పిరి. ఆమె కన్నీళ్ళతో స్వామీ ఈ 15 దినములుని కృష్టమగు యాచనము చేయక తృప్తిగా యింటిలోనే జీవించితిని. రేపటి నుండి ఊరంతా తిరిగి ముష్ఠి ఎత్తి జీవించవలెనని విలపించుచుండగా ఆమెను స్వామివారు ఓదార్చి అమ్మానీవువిచారింపవలదు. **నీవు వంటచేయు పొయ్యిక్రింద ఎముకలున్నవి వాటిని నీవు త్రవ్విపారేసిన దీనముగా పరులను యాచించవలసిన అగత్యముండదు.** నీవునిశ్చింతగా యుండుము, నేను పోయివచ్చెదనని ధైర్యంచెప్పి తెల్లవారు జామున యిల్లు వీడిపోయిరి. ఆ బీదరాలు తెలవారగనే లేచి పొయ్యిక్రింద త్రవ్వి చూడగా, ఒక బిందెనిండా బంగారు వరహాలున్నవి. యిక ఆమె ఆనందమునకవధులు లేవు, ప్రతి నిత్యము గురుదేవులను ధ్యానిస్తూ సుఖసంతోషములతో జీవిస్తూ భక్తిమార్గమును వీడక, నిత్యం అన్నదానములు చేయుచూ, గురుదేవులకృపతో జన్మధన్యంజేసుకొని ముక్తిపొందినది.





## (60) స్వామి వారి ఆహార విసర్జన :

స్వామివారాఅనాధస్త్రీకి ద్రవ్యరాసి నొసంగి ఉదయాన్ని కనకదుర్గాలయ సమీప బజారులో వెళుతుండగా విజయవాడ వాస్తవ్యులగు సత్యదీక్షితులు, దుర్గాంబయను దంపతులు శుక్రవారము అమ్మవారినిదర్శించి, పూజలుచేసి గృహోన్ముఖులగుచూ, దారిలో గురుదేవులను గాంచివారి బ్రహ్మతేజస్సుకు అచ్చెర వొంది యిట్టిమహానీయునకు గృహమున ఆతిధ్యమిచ్చిన, గృహము, తమజన్మలు పావనమగునని తలంచి స్వామివారికి సాష్టాంగ దండప్రణామము లాచరించి భక్తితో నమస్కరిస్తూ ఈ రోజు మాగృహామును తమ పాదస్పర్శచే పావనము చేసి, మాయింటవిందునారగించి మా జన్మలు ధన్యముచేయుడని పరిపరివిధముల ప్రార్ధింపగా । స్వామి,వారి భక్తిప్రపత్తులకు పరవశులై తప్పక వత్తునని అంగీకరించిరి. ఆదంపతులు స్వామివార్నితోడ్కొని తమయింటికి తీసుకువెళ్ళి అర్ఘ్యపాద్యాధివిదులపూజించి, పాదపూజగావించి తత్తీర్థముశిరస్సునదాల్చి. ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి శ్రీఘ్రముగా సమస్తభోజన పదార్ధములు దీక్షితులు దగ్గరఉండి చేయించుచుండెను. మహాపతివ్రతా తిలకమగు దుర్గాంబభక్తిప్రపత్తులతో పంచభక్ష్య పరమాన్నములు తయారుచేయుచూ, ఆమె మనంబున యిట్లు తలంచెను. ఎట్టి మహిమలు గలవారైనా, తపఃశక్తికలిగినా, తత్వమును స్వాదీనపరచుకొన్ననూ, కారణజన్ములైననూ, మానవజన్మమున క్షుద్బాధను జయించలేరు గదాయని తలపోసెను. యిది గ్రహించిన గురుదేవులు అమ్మాదుర్గాంబా! వంటకములన్నియూ తయారైనవాయనగా? చిత్తంస్వామీ అన్నియూతయారైనవి, రండిస్వామియని రెండు పీటలువేసి, దేవతార్చనలకు రెండు రజితపాత్రలు జలములతోనింపి. బోజనమునకు రండు స్వామియనిఆప్యాయతతో పిలిచినంతస్వామి ఆపుణ్యదంపతులను చూచుచూ, అమ్మా ముక్తికాంతా, మోక్షప్రదాయినీ, ప్రకృతి కాంతవలే నాకు గోచరమై, ఈ సూక్ష్మోపదేశము గావించితివాతల్లీ! దీనికై నీ గృహమునకు అతిధిగావచ్చితిని. తల్లీయిటురా! నీబిడ్డపై ప్రేమతోనేనొసంగు ఈ పారితోషకమును గ్రహించమని సుమంగళీ చిహ్నాములగు రెండు మాంగల్యములను మనోశక్తిచే సృష్టించి యిచ్చిరి. ఈ హఠాత్ పరిమాణమునకు ఆ దంపతులలిరువురు భయపడుచు, స్వామీ మీ మాటలు మాకు ఆందోళన కల్గించుచున్నవి. మీ బిడ్డల అపరాధములు క్షమించవా దేవా తెలియక మీ పట్ల మేమొనర్చిన తప్పిదములు దయతో మన్నింపమనుచూ, పాదములపైబడబోగా వలదుతల్లీ, మీ దోసమావంతయునూలేదు. పుణ్యదంపతులారా ! అమ్మశెలవైనది. యింక పక్వాహారం విసర్జించమన్నదనిరి. తండ్రీ అట్లయిన ఈఫలములు భక్షించి క్షీరమును గ్రోలిమమ్మనుగ్రహింపుడనగా స్వామి వారి కోరికదీర్చి వారికి మంత్రోపదేశము జేసి, చిరంజీవులారా "మీ దాంపత్యమత్యంత వైభవములతో, భక్తిజ్ఞాన వైరాగ్యములతో, జీవించి "అంత్యమున కైవల్యమును పొందుదురు గాక" యనిదీవించి అచటినుండి బయలుదేరిరి.

## (61) స్వామి పొన్నూరు చేరిరి :

స్వామి విజయవాడ నుండి బయలుదేరి కృష్ణానదిదాటి, మంగళగిరి పానకాల స్వామిని దర్శించి, గంధకపు కొండను శాంతింపచేయుటకై శిల్పిచాతుర్యముతో పానకాలస్వామిని కొండగుహలోమలచి స్వామికి పానకం సమర్పించుటలోని,శిల్పిచాతుర్యమునకు సంత సించుచూ, అటనుండి, తెనాలి రామలింగమునకు కృష్ణదేవరాయలు కానుకగాయిచ్చి నట్టి తెనాలి గ్రామంలో విశ్వబ్రాహ్మణభక్తులకు, వేదాంత ప్రభోధనలు చేసిఅటమూన్నాళ్ళుండి అచటనుండి పొన్నూరు గ్రామం చేరి. విశ్వబ్రాహ్మణయిండ్లలో ఆతిధ్యము స్వీకరించు చుండిరి. ఒకనాడు పండ్లుపాలు స్వీకరించి ప్రశాంతముగా గృహస్తుతో యోగాసాధన విషయములు చర్చించు చుండగా, ఒక అతి బాషి అచటకువచ్చి వీరెవ్వరు? ఎటనుండి వచ్చితిరి ఏమి పని? ఎన్నాళ్ళుందురు. వీరిపేరేమిటి?

యిచటవీరి బంధువులుగలరా? మీకు వీరే మగుదురు. అనుచూ వేయు ప్రశ్నలకు గృహస్తు అతిగా మాట్లాడుచున్నాడనగా, స్వామి "పిచ్చివాడు లేఅన్నారట. నాటినుండి అతడున్మాదియై వీధులు వెంట తిరుగుచూ కొన్నాళ్ళకు మరణించెను. పొన్నూరు విశ్వబ్రాహ్మణులు స్వామివార్ని 4 దినములుంచి సాగనంపుటకై రైల్వేసేష్టన్‌కు వచ్చి మదరాసు బండి ఆసల్యమగుటచే ఏవేవో ముచ్చటించుకొనుచూస్వామి వార్ని, చూచుసరికి ఉత్తరాభిముఖముగా నడచి నట్లగ పడి అంతలో అదృశ్యులైరట. వారు స్వామివారి మహిమలకు అచ్చెరువొందుచూ భక్తితో నమస్కరించి యిండ్లకు బోయిరి.

## (62) పేరయ్య స్వామి వెంట కందుకూరు వెళ్ళుట :

తెనాలి తాలూకా యింటూరు గ్రామములో స్వామివారు సంచరించునపుడు ఆ గ్రామ మునగల కొణిదెపురామలింగం అను శివభక్తుడు చూచెనట. ఆయన వడ్రంగి వృత్తిచే జీవించు చుండెను. ఆయనకు యిద్దరు కుమారులు ఒక కుమార్తెగలరు. అనాడతడు పని తొందరలో స్వామిని పరామర్శించలేక పోయెను. అతని పెద్ద కుమారుని పేరు పేరయ్య అతడు వీధిలో అటలాడుచు స్వామి వారి వెంటబడి పోయెను. తెలతెలవారు సరికి కందుకూరు గ్రామం చేరిరి. ఆ బాలునకు ఏదో కొత్తవూరు కనబడుసరికి ఏడ్చుచుండెనట. స్వామివారాబాలునితో "ఏమిరాయింటికి పోదువా " యనగా ఆ బాలుడు తలయూపగా స్వామి వారాబాలుని కొంతసేపు కనులు మూసుకొని యుండు మనిరట. కొంతసేపటికి బాలుడుకనులు తెరువగా తన యింటిముందుండెనట. ఈ విషయం తన తండ్రికి చెప్పగా నాయానా మీరు రైలు బండిపై పోతిరా? నడిచి పోతిరా? యనగా ఆతడు రైలు ఎక్కలేదు, నడవలేదు. నీళ్ళ తెప్పపైకదులు చున్నట్లు తోచినదని చెప్పెను. పిదప ఆ బాలుడు గొప్ప శివభక్తుడై స్వామివార్ని నిత్యం ధ్యానించుతూ వాక్సిద్ధికలిగి, అనేక మహిమలుచూపుతూ 108 ఏండ్లు జీవించి శివైక్యముచెందెనట. స్వామివారితోకలిసి ప్రయాణించి నందులకాతడు శక్తివంతుడై చరితార్ధుడయ్యెను.

## (63) కందుకూరిలో శివలింగము గర్భాలయమునుండి ధ్వజస్తంభము దగ్గరకు వచ్చుట:-

ఈనాడు ప్రకాశం జిల్లాగా వ్యవరించుతున్న కందుకూరు గ్రామంలో, శ్రీకృష్ణదేవరాయల కాలమున మహాకవి "కందుకూరు రుద్రకవి" యనెడి విశ్వబ్రాహ్మణు డుండెడివాడు. ఆయన కవిత్వమున దిట్ట, వాక్సిద్ధినొందిన మహనీయుడు "శాపానుగ్రహసమర్ధుడు" ఈయన శ్రీకృష్ణదేవరాయల "భువన విజయం"లో అష్టదిగ్గజములలోని ఒకరై ఈశాన్య సింహాసనమధిష్టించిన వారని ప్రసిద్ధి. ఆయన రచించిన "నిరంకుశోపాఖ్యానము"లో సమాజంలోని కుళ్ళును కడిగి బజారులో ఆరబెట్టినాడు. వారికాలంలో కందుకూరులో శివాలయం! విష్ణాలయంగలదు. అగ్రామమున ఒక శివభక్తి శిరోమణియగు విశ్వబ్రాహ్మణుడు కలడు. ఆయనకు తన స్వహస్తములతో శివలింగమునకు, అభిషేకించ వలయునని కోరిక చాలాకాలంగా కలదు. అచటిపూజారులు అన్యులు శివలింగంతాకినమైలుపడునని, ధర్మకర్తలను సైతంలోనికి రానిచ్చుటలేదు. ఈ పరిస్థితిలో స్వామివారు, కందుకూరు వీధులలో వెళుతుండగా, శివభక్తుడగు ఈశ్వరాచారి, విశ్వనాధావధూత స్వామివారి రూపురేఖాదులను చూచి, అపరశంకరునివలే నున్నారనియెంచి, వారిని కలసి యోగక్షేమములు తెలుసుకొని యింటికి ఆహ్వానించి, అతిధి మర్యాదలు చేసి విశ్రాంతి సమయమున, స్వామికి సపర్యలు చేయుచూ తన మనస్సునందలి కోర్కెను వారికి విన్నవించెను. "స్వామి" ఈశ్వరాచారీ వచ్చేశివరాత్రికి శివుని పూజించుటకు సిద్ధము కమ్మనిరి. ఈశ్వరాచారి ఆనాటికన్నీ పూజాద్రవ్యములు సిద్ధపరిచి, స్వామివారితో శివాలయమున ప్రవేశించిరి. అభిషేకమునకు



శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానము-మహిమలు

గర్భాలయము ప్రవేశింపబోగా, అర్చకులు అడ్డగించి బ్రాహ్మణేతరులు గర్భాలయంలో ప్రవేశింపరాదనిరి. దానితో స్వామివారు పొట్టకూటికై పనిచేయువారితో పాండిత్య ప్రసంగములేల, ఈశ్వరాచారి ఈ శివరాత్రి పర్వదినమున పరమేశ్వరుడు నీపూజను స్వీకరించునో లేదో చూతము నీవు ద్వజస్తంభము వద్ద నిలువుమని స్వామి మంత్రోచ్చాటన చేయుసరికి, గర్భాలయ మందలి శివలింగము గొప్పధ్వనితో కదిలిధ్వజస్తంభము వద్దకుచేరినది. గురుదేవులు మంత్రోచ్చాటన చేయుచుండగా, ఈశ్వరాచారి అమితానందముతో, నేను కైలాసమున పరమేశ్వరుని పూజించుచున్నాను. బ్రహ్మదేవుడు పురోహితుడు, నాచుట్టూ ఉన్నవారు ప్రమధగణములు, దేవతలు సువాసినీలు వారుఫలపుష్పాదులు నాకందించుచున్నారు. యిచట, సరస్వతీ, లక్ష్మీ, పార్వతీ, శశీదేవి, సంజ్ఞాదేవీ మొదలగు ముత్తైదువులు కన్పించు చున్నారు. అనుచూ తన్మయుడై వేయి ఏనుగులబలము కలవానివోలే, ఠీవిగానిశ్చలంగా యుండెను. తిరునాళ్ళకై వచ్చిన జనసందోహము అమితాశ్చర్యపరవశులై, అచేతనులై, దివ్యతేజస్సుతో సాక్షాత్ పరమశివునివోలే కన్పించు స్వామివారికి సాష్టాంగదండ ప్రణామములాచరించు చుండిరి. కొంతవడికి తెప్పరిల్లిన పురోహిత బృందము, స్వామివారి పాదాలపైబడి పాహిమాం, పాహిమాం, సాక్షాత్ శివునివోలే కన్పించు మీ దివ్యతేజస్సు గాంచియూ, అజ్ఞానమున ప్రవర్తించితిమి మమ్ము క్షమించి శివలింగమును యధాస్తానమున ప్రవేశపెట్టమని ప్రార్ధించిరి. స్వామివారు మిమ్ము క్షమించునది ఈశ్వరాచారియే, ఆతని తీవ్రతపః ఫలితముచే శివలింగమాతనిదరికరుదెంచినది. ఆతనిని ప్రార్ధించి ఒక సుముహూర్తమున, ఆతనిచే శివలింగప్రతిష్టచేయించుకొనుడు. అంతవరుకు ఈ శివలింగము నిచటనుండి ఎవ్వరూ కదల్పజాలరు. సత్యదయా ధర్మములకుశంకరుడు భక్తజనవశంకరుడని తెలిపి. సత్ప్రవర్తనలతో జీవించుడని హితవుచెప్పి, శివపూజకు అందరూ అర్హులేయని అందరికీ శివపూజార్హత కల్గించిరి. ఒక సుముహూర్తమున గర్భలయమున ఈశ్వరాచారిచే స్వామి శివలింగప్రతిష్ట చేయించిరి. ఈశ్వరాచారి గురుదేవులపాదములపైబడి, స్వామీ మీకరుణా కటాక్షములతో నా చిరకాల వాంఛదీర్చి, శివలింగప్రతిష్టకు అవకాశం కల్పించి నాజన్మను ధన్యము చేసితిరని, పరిపరివిధములుగా స్తుతించి చరితార్ధుడయ్యెను. స్వామి వారచట భక్తులకు వేదాంతోపన్యాసములు చెప్పి, యోగసాధనా పద్ధతులు తెలిపి, వారి సందేహములు తీర్చి, నెల్లూరునకు ప్రయాణమైరి.

## (64) "జగత: పితరౌవందే - పార్వతీ పరమేశ్వరౌ"

సర్వజగత్తునకు తల్లిదండ్రులై, ఆదిదంపతులై, భక్తులకోర్కెలను దీర్చు పార్వతీ పరమేశ్వరులు వెలసియుండుక్షేత్రములలో, నెల్లూరు సమీపమున పెన్నానదీతీరమున గల "యజ్ఞవాటిక " (జన్నవాడ) పురాణ ప్రసిద్ధికెక్కిన దివ్యక్షేత్రము. ఈ క్షేత్రమున భక్తితో సాష్టాంగపడువారికి, ఆది దంపతులు ఆరాత్రి స్వప్నమున వారికోర్కెలు తీర్చుకామ్యదాయిని కామాక్షీదేవి మల్లిఖార్జునులు. కశ్యపప్రజాపతి యిచట యజ్ఞమొనరింప ఆయజ్ఞ గుండమున శ్రీమల్లిఖార్జునుడు ధ్భవించినప్రదేశము, కావున ఈ క్షేత్రమునకు "జన్నవాడ" యజ్ఞవాటికయను పేర్లుగల్గినవి. ఎన్నాళ్ళుకూ, తిరిగిరానిభర్తకొరకు వెదుకుచూ కామాక్షిదేవి యిచటకువచ్చి, మల్లిఖార్జునిగలియుటయు సర్వేశ్వరుడామెనోదార్చి భక్తులకు నిరంతరము కోర్కెలు దీర్చుచూయిచటేయుందుమనెను. అప్రాంతమున మయునిచేగోపురము దేవాలయము నిర్మింపబడుట సుప్రసిద్ధము, అట్టిపవిత్రక్షేత్రమును స్వామివారు దర్శించి అచటిభక్తులకు తీర్ధప్రసాదములనిచ్చి మూన్నాళ్ళుండి నెల్లూరు పట్టణము చేరిరి.

## (65) పతివ్రతకు పతిభిక్ష :

కాకతీయుల పరిపాలనలో సింహపురిగా ప్రసిద్ధినొంది. ప్రస్తుతము నెల్లూరు పట్టణముగా వ్యవహరింపబడు పట్టణముస్వామిచేరి, అచటిబహుపురాతనమగు రంగనాధ దేవాలయమునకువెళ్ళి

అచటగలభక్తులకు ఆధ్యాత్మిక విషయములు బోధించుచుండగా, హైమవతీ సర్వేశ్వరరెడ్డి దంపతులు గురుదేవులనుగాంచి, సాక్షాత్‌పరమ శివావతారులుగా భావించి వారిదివ్యబోధనలకు తన్మయులై, స్వామివారికి సాష్టాంగ దండప్రణామముల నాచరించి, గురుదేవా మాగృహమునకు విచ్చేసి మాకు యోగసాధనా విషయములు బోధించి, మాజన్మలు ధన్యముచేయుడని ప్రార్ధింపగా, స్వామివారువారి నిజగృహమునకేగిరి. ఆదంపతులు బ్రహ్మానందభరితులై దంపతీయుక్తముగా, పాదపూజలు గావించి. గురుపాదోదకం సేవించి, శిరస్సున ధరించి, జన్మపావనమైనదని ఆనందించుచూ స్వామివార్ని ఉన్నతాసముపై కూర్చుండజేసి, పండ్లుఫలహారములు గోక్షీరమునిచ్చి పాదసేవ జేయుచూ తమకుగల సాధనా సందేహములు తీర్చుకొనుచు సాక్షాత్‌పరమశివుని దర్మన, స్పర్శన, సంభాషణలతో ధన్యులమైతిమని మనంబున వేయివిధంబుల స్తుతించుచూ 3 దినములు 3ఘడియలవలే జరిగిపోయినవి. స్వామివారిభక్తి ప్రపత్తులకు, సద్గుణసంపదకు ఆనందించుచు, ఫలములు భుజింపుచుండడగా, సర్వేశ్వరరెడ్డి, రేపటికి ఫలములు తెచ్చేదనని బయటకువెడలగా, అదిగాంచి స్వామివారు చిరునగవుతో శిరః కంపనగావించుట చూచిన, హైమవతికి మనస్సున సందేహము కల్గినది. ఆతరుణంబున స్వామివారు దండకమండలంబులు చేబూని ప్రయాణోన్ముఖులగునంతలో, హైమవతి స్వామీ! యిచట మీకేమి అపచారం జరిగినది. మీహటాత్ ప్రయాణమునకు కారణమేమి? నాసంశయము నివృత్తికానిదే మీపాదములు విడువనని పాదములపైబడినది. తల్లీ! ఏలనీకీసంశయము నేను పోయివత్తునని స్వామివారనగా । హైమవతి విచారవదనంతో, స్వామీ మీఆశీర్వాద భాగ్యము మాదంపతులకు లేదా? మమ్మిటులనిర్ధయగా జూచుట న్యాయమా తండ్రీ, మాకేదో విపత్తుకలదని మీప్రవర్తన తెల్పుచున్నది. దయామయా! మాసంశయములు నివృత్తికానిదే, మీ పాదములు విడువనని దుఃఖించుచుండెను. అమ్మా! ఎందులకీఅడియాస ప్రకృతి విరుద్ధమగు కార్యము మానవసాధ్యమా? తెలుసుకొని ప్రయోజనమేమి । నన్ను పోనిమ్మనిరి. గురుదేవా! ఈశ్వరాంశ సంభూతులగు మీరు, మాఅండనుండగా అసాధ్యమే ముండును. సత్యస్వరూపా, సనారీ విశ్వనాధా! తండ్రీ ఎందులకీ నాటకము మీ వాక్యములతో నా అంతరాత్మ సంతసించునా, మీ మాటలతో మాకేదో ఆపదగలదని మనస్సు శంకించుచున్నది. మీరేయిట్లని వెడలిపోయిన మమ్ము రక్షించువారెవరు. తండ్రీ! కరుణతో మము కాపాడవే । నీవుగాక మాకు దిక్కేవరు అనుచూదుఃఖించు పతివ్రతాశిరోమణి యగు భక్తురాలినిగాంచి, తల్లీగతజన్మకర్మలనను భవించుట మానవధర్మంగదా. విధిని ధిక్కరించి మనలేముగదా, తల్లీ! ఏలనన్నిట్లు బాధించెదవు. అనుస్వామి పల్కులకు । హైమవతి దుఃఖించుచూ । సర్వాంతర్యామి । సచ్చిదానందస్వరూపా। సనారీ విశ్వనాధా। జగద్గురూ। అలనాడు సతీ అనసూయ త్రిమూర్తులను బిడ్డలను జేసి జోకొట్టలేదా? సతీసావిత్రి సుజ్ఞానముతో యమునిమెప్పించి పతిప్రాణములు తిరిగి తీసుకోలేదా? సతీసుమతి సూర్యోదయమునాపి పతిప్రాణములు కాపాడుకోలేదా? స్వామీ! ఏలనన్నీ ప్రపంచ మాయాజాలమున బంధీకృతురాలిని జేయుదురు. ఈ బిడ్డపై దయాంతరంగముతో సంశయనివారణ జేయవేయని ప్రార్ధింపగా! స్వామి ఓపుణ్యవతీ విధి బలీయమైనది. దానినెరుగుటసాధ్యమైననూ, ప్రతిఘటించుట మానవుల కసాధ్యము. అదిదేవత్వ సిద్ధినొందినగానీ సాధ్యముగాదు. బిడ్డా! ఏల ఈ అడియాశ నీపతిఈ అర్ధరాత్రి పరలోకప్రాప్తి చెందును. అదిగానక మాయాంధకారములోబడి, రేపటి గురించి పల్కినదానికి నాకు నవ్వువచ్చినది, అనగా ఆపతివ్రతారత్నము విలవిల లాడుచూ, తండ్రీనాకు పతిభిక్ష పెట్టుడని పాదాలుబట్టి కన్నీటకడిగినది।స్వామి దయాంత రంగుడై ఆమెను లేవనెత్తి తల్లీనీవు మహాపతివ్రతవు, ఆత్మజ్ఞానంగల నీయందు శిష్యవాత్సల్యమున చెప్పుచున్నాను. నేటి సూర్యాస్తమయసమయమున నీభర్తకు జ్వరదేవత సోకును. అదిమొదలు ఆతడు ప్రపంచ జ్ఞానములేక బాధలొందు చుండను. దీనినతిక్రమించుటకు, యిదిగో ఈమంత్రరాజమని గౌరీ ఉపాసనా క్రమముతెల్పిరి. హైమవతి అతిశ్రద్ధగా





స్వామివారిఉపదేశమును పాటించు చుండెను. స్వామివారూ గృహమందలి ఒకగదిలో పద్మాసనాసీనులై కూర్చొనియుండిరి. స్వామివారన్నట్లుగా సర్వేశ్వరరెడ్డికి సూర్యాస్తమయా నంతరము జ్వరంవచ్చి శరీర స్పృహలేకుండా మంచమునపడియుండెను. హైమవతి తదేక దీక్షతో గౌరీమంత్రాన్ని జపించుచుండెను. అర్ధరాత్రియగు సరికి మృత్యుదేవత రెడ్డిగారి మంచందగ్గర విలయతాండవం చేయుచుండెను. అపుడు హైమవతి గౌరీమాతను స్మరింపగా, పార్వతీదేవి ప్రత్యక్షమై సాధ్వీ! ఏల నీకీ భయము స్వామివారి అండనుంటివి. నేను సైతము, నీపతిరక్షణకై యిటనుంటినని తెల్పి అదృశ్యమాయెను. అమ్మవారి దర్శనంతో మృత్యుదేవత పారిపోయినది. వెంటనే సర్వేశ్వరరెడ్డి కావహించిన జ్వరదేవత తొలగినది. ఆతడు నిద్రమేల్కొన్నవానివలేలేచి, భార్యను దాహముఅడిగెను. మంచినీటిని భర్తకిచ్చి జరిగిన వృత్తాంత మంతయూతెల్పి, మీ ప్రాణదాత నాకు పతిభిక్షపెట్టిన పరమేశ్వరుని దర్శింతమని స్వామివారిగదియొద్దకు బోయిచూడగా। స్వామివారదృశ్యులైరి. హైమవతి గురుదేవా । సాక్షాత్ పరమేశ్వరా । జగద్గురూ । మానిశ్చలభక్తిని పరీక్షించి, మీదివ్యదర్శన భాగ్యము మాకు కలిగించి, మాగృహము పావనమొనర్చి నాకు పతిభిక్షపెట్టి మాకు కైలాసప్రాప్తి కలిగించుటకు మాయింటికి వచ్చితివా తండ్రీయనుచూ, పరిపరి విధముల ప్రార్ధించుచూ అపుడే నిశ్చలభక్తితో స్వామివారి దీక్షను ప్రారంభించి, నిత్యాన్నదానముతో అంగవైకల్యము గలవారిని, అనాధలను, శివభక్తులను, దానధర్మములతో సంతృప్తిపరుస్తూ, తమకు గల స్తిరచరాస్తులను దానమొనర్చి, సనారీ దీక్షాపరులై యిహలొక సౌఖ్యములనొంది అంత్యమున శాశ్వత కైలాసవాసఫలము నొందిరి.

### 66.స్వామివారితో చంద్రగిరి మహారాజు మాటాడుట :

నెల్లూరునుండి స్వామిచంద్రగిరిచేరి కొలనులో కాళ్ళు కడుగుచుండగా, “పరమేశ్వరా ప్రణామము” అని కొలను నుండి మాటలు వినబడినవి. కానీ ఎవ్వరూ కన్పించలేదు. గురుదేవులు దివ్యదృష్టితో వీక్షింపగా, కుమార్తెశాపగ్రస్తుడై పాషాణమై యున్న చంద్రగిరి మహారాజని గ్రహించి, రాజా నీదుస్తితికి కారణము తెల్పి, కొంత ఉపశమనము పొందుమని స్వామివారనగా । భగవాన్‌నా భార్యగర్భవతి యైయుండగా నేను వ్యాపారనిమిత్తము ద్వీపాంతరములకేగి, 16 ఏండ్లకు తిరిగివచ్చితిని, కోటగుమ్మమందు నిలిచి నా కోరకై ఎదురుచూచు బాలామణిని కుమార్తెయని తెలియక, నాభార్యగా భావించి కామదృష్టితో చూడగా నన్నిట పాషాణమైపడియుండమని శపించినది. నేను తెలిసి చేసిన నేరము కానందుల, కామె పశ్చాత్తాపమున । తండ్రీ పరమేశ్వరావతారి యగు సనారీ విశ్వనాధుని పాద స్పర్శచే మాట్లాడుశక్తియు, శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు వీరభోగవసంతరాయావతారమున మునిగణముతో వచ్చునపుడు, శాపవిముక్తియగునని తెల్పినది. యిపుడుమీపాదస్పర్శచే మాట్లాడగల్గితిని యిదినాకు శుభదినమనగా స్వామివారు “భక్తిరత్నమా నీకు శుభమగుగాక” యని ఆశీర్వదించి అచట నుండి మద్రాసు బయలుదేరిరి.

### (67) మద్రాసులో కుమ్మరిఆతిధ్యం :

గురుదేవులు చెన్నపురిచేరి సముద్రతీరాన సంధ్యావందనము గావించుచుండగా, శివభక్తుడగు కుమ్మరి, అపరశంకరునివలే కాన్పించు స్వామినిగాంచి ప్రణమిల్లి గురుదేవా । ఈ పేదవాని ఆతిధ్యం స్వీకరించిధన్యునిచేయుడని ప్రార్ధింపగా, స్వామి సంతోషముగా ఆతని కోర్కెనుమన్నించి, ఆతనిగృహమునకేగిరి. ఆకుమ్మరి దంపతులు అర్ఘ్యపాద్యాదులొసంగి పాదపూజ గావించి, ఉచితాసనముపై కూర్చుండ జేసి, పండ్లు గోక్షీరమునొసంగి స్వామిని విశ్రమింపజేసి పాద సేవ జేయుచూ వేదాంతరహస్యముల నెరుంగుచూ, తమ సందేహములు తీర్చుకొనుచూ, స్వామి కార్యమునెరింగి. గంధముద్రణ కొరకు మొదలియార్ ముద్రణాలయమే తగినదిగా భావించి, ఒకనాడు ముద్రణాలయము వద్దకు స్వామివారిని తీసుకువెళ్ళి చూపించెను.

## (68) మొదలియార్‌కు స్వామిగ్రంధముద్రణా బాధ్యతనిచ్చుట :

స్వామివారు మొదలియార్ అస్వస్తతచే ముద్రణాలయమునకు రాకపోవుట అచటి పనివారివల్ల తెలుసుకొనియింటికివెళ్ళిరి. మొదలియార్ ఒకగదిలో దిగాలుగా పడియుండెను. స్వామివారిరాక నెరింగిన మొదలియార్ స్వామివార్నిఉన్నతాసనముపై కూర్చుండజేసి మంచంపై కూర్చుని నమస్కరించుతూ, స్వామి తమరెవరో మహనీయులవలేనున్నారు. ఈ దీనునితో మీకేమి కార్యమని అతివినయగా అడిగెను. నాయనా నేను "సనారీ విశ్వేశ్వర సంవాద " మను గ్రంధమును రచించితిని. దాని ముద్రణకై బహుదూరప్రాంతము నుండి నీ వద్దకు వచ్చితిననిరి. స్వామి! నా ఆరోగ్య పరిస్థితిని చూచి తిరిగదా! ఈభయంకర కుష్టువ్యాధితో, సకలైశ్వర్యములు కలిగియు. ఏమియూ అనుభవించలేని హీన స్థితియందుంటిని, స్వజనులు కూడా సరిగా మాట్లాడ లేకున్నారు, నేను నూ మంచంనుండి లేవలేనిసిత్తిలో ఉన్నాను, యిట్టినేను గ్రంధముద్రణ మెట్లు చేయించగలను. పనివారును నా మాటను లెక్కచేయుట లేదు. ఈ ముద్రణాలయాన్ని మూసివేయుస్థితిలో యున్నాననిపలపించెను. స్వామిచిరునగవుతో నీవే ఈ గ్రంధముద్రణ చేయగలవు. నీకీ భయంకర వ్యాధియునయమగును. నేనందులకే నీవద్దకువచ్చి తిననిరి. స్వామివారి మాటలకు మొదలియార్‌కు నమ్మకంకుదిరినది. ఈ మహనీయుని వాక్కుచే వ్యాధి నయమగునేమోయని తలంచి, స్వామి మీకృపయున్న గ్రంధమతి త్వరలో ముద్రణ చేయించగలననెను. దానికి స్వామివారు ఈ గ్రంధము యంత్ర మంత్ర తంత్రములతో గల మహాప్రబంధము. యిది అంతయూ బీజసహితమైనది. యిందలి ప్రతీ అక్షరమూ, పొల్లులతోసహా స్పష్టంగా ఉండాలి. ఖచ్చితంగాపల్కాలి. అక్షరమందలి పొల్లుబేధమున్ననూ భావముమారిపోవును. అనర్ధములకు కారణమగును. కావున ప్రతీ అక్షరము జాగ్రత్తగా కూర్చి ముద్రించాలి. ఈ గ్రంధ ముద్రణతో నీ వ్యాధినిర్మూలన ముడివడియున్నది. కావున నిపుణులగు పనివారలతో చాలా జాగ్రత్తగా ముద్రణ గావింపుమని తాను రచియించిన తాళపత్ర గ్రంధమును మొదిలియార్ చేతికందించిరి. ఆగ్రంధాన్ని మొదలియార్ తీసుకుని కనులకద్దుకుని, స్వామివారికి నమస్కరించెను. స్వామి మొదలియార్ మస్తకమున హస్తమిడి "శీఘ్రమేవ ఆరోగ్యమస్తు" అని ఆశీర్వదించిరి. మొదలియార్ స్వామీ నిపుణులగు పనివారలచే ఒక వారంలో నమూనా తయారుచేయింతును. తమరు ఒకవారం తర్వాతరండిని మొదలియార్ స్వామివార్కి నమస్కరించి పంపి, పనివారలను పిలిపించి, అతి జాగ్రత్తగా తప్పులు రాకుండా త్వరలో పనిపూర్తిగావింపుడనిరి. పనివారు ముద్రణాకార్యము చేపట్టి చేయుచుండిరి.

### సనారీ వారు మద్రాసులో అఖండ వర్షం కురిపించుట :

సనారీ వారు మద్రాసులో సంచరించుకాలంలో వర్షాలు లేక జనం త్రాగునీటికి కటకటపడు రోజుల్లో స్వామివారు మధ్యాహ్నం సమయంలో దారిన వెళుతూ కొబ్బరి చెట్టునుండి బొండాలుదించువానితో దాహంగా ఉంది. కొబ్బరిబొండాలు కొట్టియివ్వమన్నారు. దానికాతడు స్వామి తమరెవరో మహానుభావునిలా ఉన్నారు. ప్రస్తుతం ఈ పట్టణ ప్రజలకు త్రాగటానికి నీరు అందక చాలా బాధలు పడుతున్నారు. పొలాలు సాగుచేయు అదనుకూడా తప్పిపోవుచున్నది. మీలాంటి మహనీయులే యిట్టి సమయంలో మమ్ము ఆదుకోవాలని అర్ధించి, మీరు దాహంతీర్చుకొండని బొండాలు కొట్టిఅందిస్తూ అన్నాడు. స్వామివారు ప్రశాంతంగా బొండాలు త్రాగి దీనికి ప్రతిఫలంగా నీ కొర్కె తీరుస్తానని తన చుట్టూ గిరిగీసుకుని కూర్చుని నాయానా మరికాసేపట్లో వర్షంవస్తుంది. వర్షం యికచాలునని అనుకొన్నప్పుడు నా చెవిదగ్గరకు వచ్చి యింక "చాలు స్వామి" అని చెప్పు నేనంతవరకూ ధ్యానంలో కూర్చుని ఉంటానని చెప్పి స్వామివారు భ్రుకుటిలోకి వరుణదేవతనావాహన చేశారు. కాస్సేపట్లో ఆకాశం మేఘావృతమై వర్షమారంభమై





కుండపోతగా వర్షంకురుస్తూ మద్రాసు నగరాన్ని మోకాళ్ళవరకూ ముంచింది. యింత వర్షము స్వామివారి గిరిని దాటకుండాపొంగుచున్నది. యిదంతయూ స్వామికి దాహం తీర్చిన వ్యక్తిచూస్తూ గురుదేవులు శక్తికి భయకంపితుడై వారిదరిచేరి యింక "చాలుస్వామి" యని చెప్పలేక పురప్రముఖులకు జరిగిన వృత్తాంతం చెప్పగా వారు యింకజాగుచేసిన పట్టణ వాసులకే ప్రమాదమని తలంచి కొందరు స్వామి దరిచేరి మోకాలుదాటి ప్రవహిస్తున్న నీటిలో నడచుకుంటూ వెళ్ళి స్వామి గిరిదాటి ఒక్క నీటిచుక్క కూడా లోనికి పోకుండా స్వామివారపై ఒక్కనీటి బొట్టు కూడా లేకుండుట చూచి ఆశ్చర్యంతో కూడిన భయంతో అతివినయంగా స్వామిదరిచేరి "స్వామి యింకచాలు వర్షం ఆపండి" అని చెవివద్ద గట్టిగా చెప్పగా కొద్దిసేపటికి వర్షం ఆగిపోవుట స్వామి చిరునవ్వుతో కనులు తెరచి చూచుట ఏకకాలమందు జరిగినవి. అచ్చటకు చేరిన వారందరూ స్వామివార్కి పాదాభివందనములు గావించి స్వామి నామధేయము తెలుసుకుని జయజయ ధ్వానములతో మిన్నుముట్టునట్లు కీర్తించిరి. స్వామి మందహాసముతో వారి నాశీర్వదించి అటునుండి వెడలిపోయిరి.

దీనిని బట్టి స్వామివారు తనదాహం తీర్చుకొనుటకు కొబ్బరిబొండాలు అడిగినట్లా? మద్రాసు నగరప్రజల దాహంతీర్చుటకు బొండాలు త్రాగినట్లా? భక్తులు వారి చరిత్ర తెలుసుకొని ఆ మహనీయుని కరుణా స్వభావమును గ్రహించి, భువిపై మానవునిగా జన్మించినట్టి ఆ పురాణపురుషుని శరణాగతి పొందివారి జన్మలను తరింప చేసుకొనగలరు. బావితరములవారు ఈ విషయములను తెలుసుకొని సనారీ వారి యందు భక్తిశ్రద్ధలు గలిగి సదా పూజించి, పూజలకు సహకరించి చరితార్ధులగుదురుగాక!

పద్యం : దేవ పూజలందు దేవాలయములందు దేవుడనుచు మ్రొక్కి తెలియలేరు!
తెలియ విశ్వకర్మ దేవాది దేవుడు విశ్వదాభిరామ వినురవేమా॥

### మదరాసులో స్వామివారికి అన్నాభిషేకముచేయుట :

స్వామివారు మదరాసు పట్టణములో అనావృష్టి సమయంలో వర్షం కురిపించిన పరమ శివుడని జనులు కీర్తించుట విన్ననాస్తికులుకొందరు స్వామి వారిని పరీక్షింప గోరి అతివినయాన్ని ప్రదర్శించుచూ స్వామి దగ్గరకు వెళ్ళి నమస్కరించుతూ, మహనీయా! మీరు మా నగరంలోని ప్రజల దాహార్తిని తీర్చిన దైవస్వరూపులు సాక్షాత్ పరమ శివులు, మీరు మాకుచేసిన మహోపకారమునకు కృతజ్ఞతగా మిము పూజించుట మా ధర్మము. శివస్వరూపులగు మిమ్ము అన్నాభిషేకముతో తృప్తి పరచి, ఆదిశంకరుని కృపను పొంద సంకల్పించితిమి. మాకోర్కెను మన్నించి మీరు అంగీకరించవలయునని అతి కపట వినయ విధేయతలతో ప్రార్ధించిరి.

స్వామివారు వీరి మనోభావమునెరింగి, సరేనాయనలారా! మీ కోర్కెతీర్చుకొండనిరి, వారందరూ స్వామీ! మీ యాజ్ఞయయిన మేముపోయి మా ప్రయత్నములలో నుందుమని సమస్కరిస్తూ అటనుండి వెడలిపోయిరి. వారు ఒకనాడు సమావేశమై పుట్టెడు బియ్యమును వండించి నేడు ఈ స్వామి సంగతితేలునని సంతోషించుతూ గురుదేవుల వద్దకు పోయి అతివినయంగా నమస్కరిస్తూ ఆహ్వానించి వారిని వంటప్రదేశమునకు తోడ్కొనివెళ్ళి ఆసీనుల గావించి, తాము వండించిన అన్నంగంజెవార్చి, పెద్ద పెద్ద బుట్టలతో తెచ్చి శివలింగమునకభిషేకించినట్లుగా స్వామివారిపై వేడి అన్నమును పోయుచుండిరి. స్వామివారు యోగముద్రలో కూర్చుండిరి. ఆ దుష్ట స్వభావులు వరుసగా అన్నపుబుట్టలు తెచ్చి "ఓం నమఃశివాయ" యనుచూ పోయుచుండిరి. అలాస్వామి వారిపై అన్నపురాసులు పెద్దగుట్టగా తయారైనది. వారు వార్చినగంజి పెద్దకాల్వగా ప్రవహించుచూ. ఆప్రాంతమంతయూ అధికవేడి సెగలతో ఆదగ్గరలో జనులు నిలబడలేక దూరముగా తొలగుచుండిరి. యిది గాంచిన సద్భక్తులు అయ్యోయింత వేడిలో స్వామి వారెట్లున్నారోయని ఆవేదన చెందుచుండగా,

ఈ కార్యక్రమ నిర్వాహకులు యింకెక్కడి స్వామి నేటితో వీరి చరిత్ర ముగిసినదని లోన సంతసించుచూ పైకి అతిభక్తితో పరమ శివావతారుని దర్శనం చేసుకుని మనందరి జన్మలను పావనం చేసుకుందామని అన్నపురాశిని అతికష్టంగా తొలగించి చూడగా యోగముద్రలో "స్వామివారు" శరీరాన్ని ఒక్క అన్నపుమెతుకు కూడా అంటకుండా అచేతనులై శాంతవదనంతోనుండిరి. ఈ దృశ్యాన్నిగాంచిన సద్భక్తులు "జై విశ్వనాథ జై" యనుచూ దిక్కులు పిక్కటిల్లునటుల జయజయధ్వానములు చేసిరి. ఈ కార్యక్రమ నిర్వాహకులకు, సిగ్గు, భయం, భక్తి ఏకకాలమునకల్గి శిరస్సువంచి సాష్టాంగదండ ప్రణామములతో శరణుకోరిరి. కొందరిది మాయగానున్నదని మిన్నకుండిరి. యింకొందరిదంతయూ గారడీవలే నున్నదనుకొనిరి. యివన్నియూ స్వామి వారికి ఆనందముగానేయున్నది. స్వామి వారు మెల్లగా కనులు తెరచి చల్లని చూపులతో అందరినీ ఆశీర్వదించిరి. పిదపు అన్నపురాశిని పట్టణ ప్రజలందరూ మహా ప్రసాదముగా కనులు కద్దుకొని స్వీకరించిరి. త్రికరణశుద్ధిగా స్వామికి నమస్కరించినవారు చరితార్థులైరి. అందరితో బాటుగా నమస్కరించినవారు అలానే యుండిరి. విమర్శించిన వారి జీవితములు సమస్యలతో ముగిసినవి. యిట్టిమహిమలతో స్వామివారు తన నిజరూపమును మరుగుపరచి జనులందరిలో తానొకనివలె తటస్తంగా సంచరించు చుండిరి. స్వామి ఆ జనసమూహమును గాంచి నాయనలారా ! జీవి అనేక గత జన్మంబులనుండి తాను చేసిన కర్మఫలమను భవించుటకు అనేక కోటిజన్మలెత్తుటయే ఆగామియందురు. అదిజీవిని వీడక కూడియున్నదే సంచితంబగును.

తాను చేసిన కర్మఫలముననుభవించుటయే ప్రారబ్ధమందురు. ఈ మూడింటినే అగామి, సంచిత, ప్రారబ్ధకర్మలందురు. యివి ఎలానశించునంటేను తామరాకుపై నీటి చందంబున ఈమిధ్యా ప్రపంచమునందుండి, ఉండనట్లుగా జీవించు మహనీయులగు పరమహంస, ఉదాసీ అవధూత, సంయమయోగీశ్వరులకు సేవలు జేయుచూ, అన్న వస్త్రములొసంగి రక్షించువారికి, ఆమహానుభావులు సేయు పుణ్యములు వీరలకు ప్రాప్తించి వీరలపాపములు తొలగి కర్మవిముక్తులగుదురు. ఆమహాత్ములను దూషించి తిరస్కరించిన వారికి, ఆమహనీయులకు గల దోషములు వీరలకు సంక్రమించి ముందున్నపాపములకన్నా కోటిరెట్లుఅధికమై మహానరకములను భవించుచుందురు. మరియు ఆత్మను పరమాత్మ సంధానముగావించిన హంసావధూత సంయమయోగీశ్వరులకు ఎట్టి పుణ్యపాపంబులు చెందక నిర్మలులై పరమాత్మయందు ఐక్యమై అనేకమన్వంతరములు సుఖభోగానందములు పొందుదురు. సమస్త శాస్త్రములు చదివి సారముగ్రహించలేనివారిని, గంధపుచెక్కలు మోయుచూదాని సుగంధము నాఘ్రాణించలేనిగార్ధభముతో పోల్చవచ్చు.

సీ॥ **వేదాదిశాస్త్రముల్ వివరింపనేర్చిన - విద్యవాడని ఆత్మచోద్యపడదు**
**షట్కర్మలన్నియు సాధింపగలిగిన - కర్మఠుండని ఆత్మకానరాదు**
**మంత్రముల్జదివి జపమాలికల్ ద్రిప్పిన - యిహ పూజ్యుడని యాత్మయెదురుపడదు**
**యింద్రజాల విద్యలెన్ని నేర్చినగాని - తందరొందుచుయాత్మ తగులుకొనదు**

గీ॥ **మాయవేషంబులన్నీయేమాత్రమైన -కాయమందున్నదుర్గుణోపాయములను**
**దొలగ దోయంగజాలు నావలకు చూడు - బ్రహ్మ విద్యలుగావు విభ్రాంతి సుమ్మా॥**

అమిత శాస్త్రజ్ఞానము కన్నా సదాచరణమిన్న అనంత శాస్త్రవిజ్ఞానము కన్నా అణుమాత్రమగు మానసారాధనమిన్న, ధనార్జనవిద్యకన్నా, దైవాన్ని పొందు విద్యమిన్న. అనుచూ వేదాంతో పన్యాసములు చెప్పివారిని సాగనంపిరి.





**(69) స్వామివారి దివ్యమహిమచే మొదలియార్ కుష్టు వ్యాధి పొగొట్టుట :**

మొదలియార్ చెప్పినట్లు పనివారువారంలో గ్రంధనమూనా తయారుచేసిరి. నాటిరాత్రి గురుదేవులు మొదలియార్ స్వప్నమున సాక్షాత్కరించి. విభూతిని మంత్రించి జలమున కలిపి నీయిష్ట దైవమును ప్రార్థించి త్రాగమనిరి. అంత మొదలియార్ గురుదేవానేనన్ని దైవములను ప్రార్థించితిని, నాకే దైవము దయజూపలేదు "అన్యధాశరణంనాస్తి త్వమేవశరణంమమ 'జగద్గురుదేవా"! నా యీ పరిస్థితికి దయదాల్చినన్నారోగ్యవంతునిజేయ భువికేతెంచిన పరమేశా, మీ కన్న నాకు యిష్టమగు దైవమెవ్వరు. మిమ్ములనే త్రికరణశుద్ధిగా నమ్మి ప్రార్థించు చుంటినని, స్వామివారి పాద పద్మములకు ప్రణమిల్లి, ఆమంత్రజలమును కన్నుల కద్దుకొని అమృతమువలే సేవించి గురుధ్యానము చేయుచూ స్వప్నమందుగాఢముగా నిద్రించెను. ప్రతిదినము మంచముపైనుండి లేవ శక్తి లేనివాడు, నాటిప్రాతః కాలమున మేల్కాంచి, ఎన్నడూలేని నూతనోత్సాహముతో శరీరము తేలిక యైనట్లుండి, మంచముపైనుండి దిగ్గునలేచి, అమితాశ్చర్యంతో తన చేతులను చూచుకొని, సంపూర్ణ ఆరోగ్యముతో నున్నప్పటి వానివలే కన్పించగా, అమితానందముతో నిలువుటద్దముదగ్గరకు పరుగెత్తి నఖశిఖ పర్యంతం చూచుకొని, అవయవములన్నీ సహజస్థితియందుండుట గ్రహించి. ఏమిటీ వింతరాత్రి పరుండు నపుడుగల వ్యాధియింతలో ఎట్లుపోయెనని యోచించుతూ, రాత్రిగురుదేవులు తనకిచ్చిన మంత్రజలం స్వప్నమందామెలకువుగాయున్నప్పుడా ? అని యోచించు స్వప్నమేయని నిశ్చయించి, యింతకీ నేనిప్పుడు కలగనుచున్నానా? లేక యిది నిజమాయని ఒక్కసారి కనులునులుముకొని ప్రక్కనగల పాత్రయందలి మంచినీరు త్రాగి, యిదినిజమేయని నిశ్చయించుకొని, స్వామివారి దివ్యవాక్కుచే వజ్రకాయుడ నైతినని పరమానందముతో, యింటిలోని వారందరినీ పిలిచెను. భార్యాపిల్లలు మొదలియార్‌ను చూచి సంపూర్ణ ఆరోగ్యవంతుడై, నూతన తేజస్సుతో వెలుగొందు, రూపురేఖావిలాసములకు, యింటి వారందరూ బ్రహ్మానందభరితులై, చేష్టలుడిగి యుండిపోయిరి. మొదలియార్ ఆనందమును పట్టలేక తక్షణమే గురుదేవులను దర్శించవలెనని, పరుగుపరుగున గురుదేవుల వద్దకు బోయి పాదములపైబడి, విశ్వనాధావధూత స్వామీ। సాక్షాత్ పరమశివావతారా। ఆపద్బాంధవా । అనాధరక్షకా । ఆర్తత్రాణపరాయణా ఆదిమధ్యాంతరహితా । కేవలం నావ్యాధినిర్మూలించి । నన్నుద్ధరింపవచ్చిన । పరమ శివా ।పురుషోత్తమా । ఎన్నోజన్మలతపః ఫలమునగానీ లభించని, నీకరుణాకటాక్ష వీక్షణలు నాకు కల్గుట ఏజన్మపుణ్యమో । పరంధామా యనుచు అనేక విధముల ప్రార్థించుతూ। మీ అమోఘ మహిమచే దీర్ఘవ్యాధినుండి విముక్తునిగావించితిరి, శరీరము వజ్రకాయమైనది. నాకీపునర్జన్మ ప్రసాదించిన మీ నామస్మరణ జీవితాంతము చేయుదును స్వామీ అనుచూ, ఆనందభాష్పములతో పాదాలు కడిగెను. స్వామివారు "నేటినుండి నీ జీవితము సుఖసంతోషములతో నిండుగాకయని "ఆశీర్వదించిరి. మొదలియార్ లేచినిలువబడి శరీరమంతయూ పరిశీలనగా చూచుకొనగా దేహముపైయింకనూ మూడుమచ్చలుండుట చూచి । విచారవదనుడై స్వామీ యిదేమి కర్మయింకనూ శరీరమున 3 మచ్చలున్నవని దుఃఖించుచుండగా। స్వామివారు విచారింపవలదు. నేను నీకుముందే చెప్పితినిగదా ఈ గ్రంధమంతయూ బీజాక్షరసంపుటితో కూడినది. యిందు తప్పులుండరాదు. అట్లు పల్కిన అనర్థములు కల్గును. కావున ముద్రణలోప దోషము చేత, నీకు సంపూర్ణ ఆరోగ్యము చేకూరలేదు. ఆతప్పులుసవరించిన నీకు సంపూర్ణ ఆరోగ్యముచేకూరుననిరి. వెంటనే మొదలియార్ గురుదేవా! నేనిపుడే పోయిగ్రంధమందలి తప్పులు సవరింతునని, ముద్రణాలయమునకు బోయి బాగుగా పరిశీలించి, 3 తప్పులు గమనించి సవరించగా. తన శరీరమందలి మచ్చలు మాయమైనవి. యిదివిన్న చెన్నపురివాసులందరూ తండోప తండములుగా వచ్చి, గురుదేవులను దర్శించి వారి

దివ్య సందేశములువినుచూ, వారికి గల సందేహములు తీర్చుకొనుచూ, తన్మయులగుచుండిరి. గురుదేవులు విడిది చేసిన ధర్మసత్రం గొప్ప తీర్ధముగా జనం వచ్చి పోవుచుండిరి. ఒకనాడు మొదలియార్ స్వామిపాదములచెంత కూర్చుండి, పాదసేవ జేయుచూ, స్వామీ నేను పుట్టిననాటి నుండి ఏపాపమూ చేసి యుండలేదు గదా? దైవాన్ని భక్తిశ్రద్ధలతో పూజింపుచూ ధర్మసత్రములు కట్టించితిని। చెరువులు త్రవ్వించితిని। అన్నదానము చేయించితిని। ఆపన్నులనెందరినో ఆదుకొంటిని। నిరుపేదలకు తగు సహాయముచేసితిని. నావద్దపని చేయువారి కష్ట సుఖాలలో పాలు పంచుకొంటిని. యిన్నిసత్కార్యములు చేసినా ఈపెద్దవ్యాధి నాకేల దాపురించినది గురుదేవాయనగా? స్వామి వారు నాయనా నీకిదిపూర్వజన్మ కర్మఫలం నీపూర్వ జన్మలో మహమ్మదీయులయింట బుట్టి, చదువు సంధ్యలేక చెడు సహవాసములతో ధనమంతయూ వెచ్చింపగా। మందలించిన తల్లిదండ్రులను హతమార్చిన ఫలితముగా, ఈ జన్మలో ఈ వ్యాధి సంక్రమించినది. అవధూత, వుదాశీ, పరమహంసలన్ జూసి ఈ ఏడు ఏడు పద్నాలుగు లోకములలోని బ్రహ్మాదులు మొదలుకొని మానవులవరకు ఎవ్వరైనా వారికి నమస్కరించి, ఉపచారములు చేయనివారు భరింపరాని మహానరకములననుభవింతురు. అదిగాక వారు ఎదురైనపుడు చూడనట్లుగా ప్రక్కకు తొలగిపోవు, రాజులు, అధికారులు, పరిపాలకులు, యజ్ఞయాగములనాచరించువారు, వ్యాపారులు, చేతివృత్తులచే జీవించువారు, ధనికులు, ఉద్యోగస్తులు, దేవతార్చకులు, మొదలు సమస్త మానవులువారలకు పచారంబులుచేసి, వారుచేయు లోకకళ్యాణ కార్యములకు సహకరించని వారలకుగల సకలైశ్వర్యసంపత్తు పుణ్యఫలము క్రమముగా హరించి ఘోరనరకముల బడుదురు. యిట్టి మహనీయులను సత్కరించి సాష్టాంగ దండప్రణామముల నాచరించి, వారు చేయులోకకళ్యాణ కార్యక్రమములకు యథాశక్తిగా సహకరించిన ఆ మహానుబావులు చేయు యజ్ఞయాగాదుల పుణ్యఫలము వీరలకు సంక్రమించి వారి దుష్కర్మలు నశించి క్రమముగా సకలైశ్వర్యములు పొందగలరు. నీ పూర్వజన్మ కర్మలేయిప్పటి వరకూ నీవునుభవించినది. ఈ జన్మలో నీవుగావించిన సత్కర్మఫలములేనన్నిటకు రప్పించినవి. నీ వ్యాధినిర్మూలనకు కారణములైనవి అని తెల్పి అచటగల వారందరికీ సుగుణబోధ చేసిరి.

**(70) స్వామివారి సుగుణబోధ :**

నాయనలారా ! "జన్మానాంనర జన్మదుర్లభమను" ఆరోక్తి ప్రకారం 84 లక్షల జీవరాసులలో నరజన్మ దుర్లభం, సృష్టిలో జీవరాసులన్నిటికంటే నరులకు పరమాత్మ అధిక మేదస్సు నొసంగెను.దానిచే సద్గురుని బోధలచే యోగసాధనలు చేయుచూ నరుడేనారాయణుడు. కాగలడు. నేటినరులు కలిమాయకు లోనై, ఐహికమగు సుఖమే సత్యమని భావించి, శాశ్వతమగు ఆనందాన్ని గుర్తించలేక, మానవులు దానవులుగా మారుతున్నారు. నరజన్మమెత్తి కనీసం నరునిగా జీవించలేకున్నారు. **1.నరుడు** సర్వకాల సర్వావస్తలందు తన స్వార్ధమే జీవితలక్ష్యముగా జీవించువాడు. **2. మానవుడు** ధర్మాధర్మ విచక్షణను సదామనస్సున తర్కించుకొంటూ స్వవిషయములకు ప్రాధాన్యతనిచ్చుచూ, తనశక్తిమేరకు తోటివారికి సహకరించు వారు. **3.మహాత్ముడు** సర్వమానవ సమానత్వము, సర్వజీవులందు భూతదయగల్గి, స్వవిషయములందు ప్రాధాన్యతచూపక, లోకకళ్యాణమే పరమార్ధముగా తలంచుచూ, "తూ.చా" తప్పకుండా ఆచరించువారు. **4.నారాయణుడు** సత్యం, శీలం, సత్రప్రవర్తన, నిస్వార్ధం, నిరాడంబరత, సర్వజీవులందు సమదృష్టితో జీవించువాడు. దైవసమానుడగును యిలా నాల్గురకాల నరులుగలరు. సముద్రంనుండి నీరు ఆవిరై, మేఘమై, వర్షించి, గుట్టపైనా, చెట్టుపైనా, మట్టిపైనా, గుంటలోన, పంటకాల్వలొన, నదిలోనపడి చివరకు సముద్రానికే చేరుతుంది. అలానే పరమాత్మనుండి వచ్చినప్రతి జీవుడు జన్మకర్మలనను భవించుతూ, తుదకు పరమాత్మలో కలసి పోతాడు. ఈనాడు నరుడు





కనీసం నరునిగా జీవించిలేక తన స్వార్ధమే పరమార్ధమని దుష్కృత్యములాచరించి దానవుడగుచున్నాడు. దానవునివలే జీవించుచున్నాడు.

సద్గురువులందరూ। కర్మజీవులనుద్ధరించుటకై అవతరించిన కారణజన్ములు. ఈ ఉపకారాన్ని ఒక్కొక్కరూ ఒక్కొక్కవిధంగా చేస్తారు. కొంత మందిది **మీనప్రవృత్తి** చేపలు నీటినుండి బయటకురానట్లే ఆ మహాత్ములు ఏకాంతంలో తపస్సుచేస్తూ, లోకకల్యాణ కారకులగుదురు.

కొందరిది **మృగవృత్తి** వీరు నీటిలోనికి పోకుండా, బయలులో తిరుగుచూ ప్రబోధన ప్రచారముల ద్వారా, అనుష్టానం, వేదాంతం ప్రజలలో ప్రచారం చేసి జనాన్ని దర్మవర్తనుల గావించి లోకకళ్యాణ కారకులౌతారు.

కొందరిది **కూర్మవృత్తి** అట్టి మహానుభావులు కొంతకాలం అజ్ఞాతంగా తపస్సు చేస్తూ, కొంతకాలంగాసంచారం చేస్తూ బ్రహ్మవిద్య, ఆధ్యాత్మిక ప్రభోధన ప్రచారములతో, లోకకల్యాణాన్ని సాధించిన పుణ్యపురుషులు.ధర్మానికి హానికల్గునపుడు ఎందరో మహనీయులు ఈ భువిపై అవతరించి, ధర్మసంరక్షణ గావించి లోకకల్యాణానికి కారకులైనారు. కావున నాయనలారా! సద్గురుని బోధనలుగొని, యోగమార్గమున పరమాత్మను చేరవలయునని. దైవధ్యానంతో ముక్తి పొందవలెనని, స్వామివారు బోధించిరి. స్వామివారి దివ్యబోధనలువిని అచటి వారందరూ మాజన్మలు ధన్యమైనవని, వేనోళ్ళకొనియాడిరి. మొదలియార్‌గురుదేవా! మానవ జీవితంలోగల వారందరూ ఒకేరకముగా జీవించలేకపోవుచున్నారు. కొందరు దుర్మార్గులు, కొందరు సన్మార్గులు, కొందరు సత్య వంతులు, కొందరు అసత్యవంతులు, కొందరు నీతీనిజాయితీగా జీవించాలంటే కొందరు అవినీతి గా ధనాన్ని సంపాదించుటే ప్రధానమంటారు. కొందరు దైవాంశసంభూతులయితే, కొందరురాక్షస ప్రవృత్తితో జీవిస్తారు. దీనికి కారణమేమి స్వామీయనగా। నాయనా పూర్వజన్మ కర్మలచే మానవమనః ప్రవృత్తు లేర్పడుచుండును.

1. కొందరు ఏవేదశాస్త్రాలు చదవకుండా, ఏసాధనలు చేయకుండానే, పూర్వజన్మ కర్మలఫలంగా భగవత్ ప్రీతికి పాత్రులౌతారు. త్రికరణశుద్ధిగా దైవానికి అంకితమై "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతిగా" జీవిస్తారు. మానవాకారంలో ఉన్న దివ్యులువారు. దైవమే యిట్టివారిని ప్రేమిస్తుంది. "వీరే పుష్టిజీవులు" "వీరిసంఖ్యచాలాతక్కువ ...యిక రెండవ తెగవారు--
2. కొందరు వేదశాస్త్రాలు వల్లిస్తూ, మంత్రజపానుష్ఠానాలు చేస్తూకాలం గడుపుతారు. యితరులకు భోధించేవి తాము ఆచరింపరు. అన్నివిషయాలు తెలుసుకుంటారే గానీ ఆచరింపరు. ఆచరణకంటే ఆడంబరమెక్కువ. యిట్టివారిలో వేయికొక్కరు సాధన చేయగా చేయగా చాలాకాలం తర్వాతగానీ కృతకృత్యులుకాలేరు. "వీరేమర్యాదజీవులు" యిక 3వ తెగవారు
3. కేవలంలౌకిక జీవితంగడిపేవారు. వీరు యింద్రియ సుఖాలకోసమే ప్రాకులాడుతారు. భగవంతుడున్నాడని **ఒకదండం**పెట్టుకుంటే సరిపోతుందని, పూజలు పండుగలకు చేస్తాంగదాయని భావిస్తుంటారు. వీరిలో కోటికొక్కరు, అవసానదశలో భగవంతుని ధ్యానిస్తూంటారు. నిత్యకృత్యాలకే వీరికి సమయం చాలదు, ఈ ప్రపంచంలో "ఈ ప్రవాహజీవుల" సంఖ్యచాలా ఎక్కువ. యింకా మానవులలో 1.కర్మజీవులని, 2.కారణజీవులని రెండురకాలు.

1. యోగులు, అవధూతలు, ఋషులు, సిద్ధులు, భక్తులు **"కారణజన్ములు"** వీరికి జననమరణాలు జీవిత విశేషాలు వారి చేతుల్లోనేఉంటాయి.
2. ఈ కోవకుచెందని వారు **కర్మజీవులు,** కర్మవశంలో ఉంటారు **"వీరే కర్మజీవులు".** వీరి జీవిత విశేషాలు ప్రారబ్ధకర్మ వశంలో ఉంటాయి. గురుదేవా ఏమంత్రానుష్ఠానం। ఏఏసాధనలచే, భగవత్ ప్రీతికిపాత్రులగుదుమో సెలవియ్యండని మొదలియార్ నమస్కరిస్తూ కోరగా.

స్వామివారు మడిమైలెంచక, కులాచారములుంచక, బయలుగురూపదేశ ప్రకారం తదేక నిష్ఠాగరిష్టులై యుండుటయేముఖ్యము గురువుగారు చెప్పినదే మంత్రము గురునివాక్కు పై విశ్వాసముంచి, అన్యఆలోచనలు, అనుమానము లేకుండా, తదేకనిష్ఠాగరిష్ఠులై యుండుటయే ముఖ్యము. గురువుగారిపై నమ్మికయే వేదమంత్రము నమ్మికలేనిది ఏదైనను నిష్ప్రయోజనము. సత్యమే దైవము, సత్యవ్రతాచరణులకు దైవము వారితోనే యుండును. ఎన్నివ్రతములు, పూజలుయాగములు చేసిననూ, అసత్యమాడు వారికి దైవమత్యంత దూరముగానుండును. కావున బయలు గురూపదేశ ప్రకారము అనుక్షణం ఆచరించుట ఆవశ్యకము. మొదలియార్ గురుదేవా మీజ్ఞానబోధలచే మాజన్మలు ధన్యమైనవి. సాక్షాత్ పరమశివస్వరూపులు మీ దివ్య వాక్కుచే నా దీర్ఘవ్యాధి నిర్మూలించిన పురాణ పురుషులు, యిట్టిమిమ్మెట్లు సత్కరింపగలను. స్వామీ! తమ అనుజ్ఞయయిన ఈపురవీధులందు బ్రహ్మరథంపట్టి మిమ్మూరేగించిన గానీ నాకు తృప్తిలేదు. దయయుంచి మీఅనుజ్ఞను ప్రసాదింపుడని అతివినయముగా అర్ధించెను. స్వామివారు నగుచూ సర్వసంగపరిత్యాగుల మగుమాకు ఈ ఆడంబరములు మర్యాదలేల. దీనివలన నీవునూ కొన్ని సమస్యల నెదుర్కొనవలసి యుండుననిరి. గురుదేవా! మీ అనుజ్ఞయయిన ఎట్టి సమస్యలనైననూ ఆనందముగా ఎదుర్కొందును. ఈ దీనునియందు దయతో అంగీకరించుడని పదేపదే ప్రాధేయపడగా సరే నీయిష్టంవచ్చినట్లు చేయుమనిరి. అంత మొదలియార్ అమితానంద భరితుడై, తన కుటుంబసభ్యులు, బంధుమిత్రాదులను, అచటికి వచ్చువారందరికి స్వామివారి బ్రహ్మరధోత్సవమునాటికి కుంటుంబసమేతంగా ఆహ్వానించి, మేళతాళాలతో అత్యంత వైభవంగా ఊరేగింపు ఏర్పాట్లు చేసి, ఒకనాటి సుముహూర్తమున చెన్నపురి రాజవీధులలో మహాజన సమూహముతో అతికోలాహలంగా బయలుదేరిరి.

**చతుర్ధాధ్యాయము సమాప్తి**



గర్భగుడిలోని మూల విరాట్





## (పంచమాధ్యాయము)

## (71) స్వామివార్కి చెన్నపురి రాజవీధులలో బ్రహ్మరధం ఊరేగింపు శృంగేరీ పీఠాధిపతులతో వివాదం

1878 సం॥లో తిరువేంగడ మొదలియార్ చెన్నపురి రాజవీధులలో స్వామివార్కి అత్యంతవైభవంగా బ్రహ్మరధంపట్టి బంధుమిత్రసపరివార సమేతంగా భక్త బృందంతోడురాగా స్వామివారు రచియించిన **"అష్టోత్తరశతకేత నామావళిని"** చెప్పుతూ, పల్లకీలో ఊరేగించుతూ "హైకోర్టు" సమీపము చేరుసరికి, ఎదురుగా శృంగేరీ పీఠాధిపతులు శిష్యబృందముతో మేళతాళాలతో కోలాహలంగా, వస్తూ హైకోర్టు ఎదుట యిరుపక్షములు తారసిల్లినవి. యిరు పక్షములవారునూ మాఎడమచేతివైపు మీరుపొండని వాదనకుదిగిరి. మా గురువు జగద్గురువని శృంగేరీ పీఠాధిపతి శిష్యులు, మాగురువు జగద్గురువని స్వామివారి భక్తబృందం వారి వాదనలు. ఈవాద ప్రతివాదనలు రానురాను పెద్దదయినది. పండితసభ ఏర్పాటుచేయుదము ఎవరుగొప్పో యిచటేతేల్చుకుందుమని యిరుపక్షములు ఊరేగింపునిలిపి, అచటే వేదిక నేర్పాటు చేసిరి. పీఠాధిపతులు గురుదేవులు ముఖాముఖీవాదనకు తలపడిరి. **శృంగేరీ పీఠాధిపతులు** స్వామివార్ని గాంచి మీదేయూరనిరి? **స్వామివారు:** సర్వసంగపరిత్యాగిని ఒక ఊరననేమి అన్ని ఊరులునావేయనిరి.! **పీఠాధిపతి:** తమ జన్మస్థలమేదనిరి ?**స్వామివారు:** ప్రస్తుతము పాలకొండ ! **పీఠాధిపతి:** అంతకుముందే యూరో తెలుపగలరా? **స్వామివారు:** మంచు కొండయను కైలాసగిరి **పీఠాధిపతి** తమనాదేయము? **స్వామివారు** నన్ను అనేకులనేక నామములతో పిలుతురు ముఖ్యముగా విశ్వనాధుడని. **పీఠాధిపతి** నగుచూ కైలాసపతియగు పరమేశ్వరులా? ఓహోభువికేతెంచితిరేల ? **స్వామివారు** భువిని ధర్మంబంటి కాలిపైనిలిచి అధర్మంవిలయ తాండవం చేస్తున్నందున భూదేవత ఆక్రందన విని యిచట ధర్మసంస్థాపన గావించి భూదేవతనూరడించుటకై ఉద్భవించితిని.

గీ ॥ నేనే విశ్వబ్రహ్మము ఆననమునముణ్నుబుట్టినా ।మయవంశంబేనని తలపుడి దయపంచానన ।కులముద్ధరింప జననంబైతిన్॥ **పీఠాధిపతి** మీరు వచ్చిన కార్యముఎంతవరకూ నెరవేర్చితిరి? **స్వామివారు** కలిభారమును తగ్గించి జనలోకమున ధర్మము నెలకొల్పుట కైజనులుముక్తి మార్గమును. చేరుటకు "సనారీవిశ్వేశ్వర సంవాదం"బను యంత్ర, మంత్ర, తంత్ర, యోగయుక్తంబగు మహాప్రబంధమును రచియించితిని, దానినిట ముద్రణగావించి భక్తుల కందించుచుంటిని,

**దానియందలి**

గీ ॥ వేయినేనూరుపై పద్యవృత్తిసమితి । తెనుగు గీర్వాణములతోను తేటగాను । అద్దమునుబోలుచేతి కందించియున్న। గ్రంధమును జూచిజ్ఞానసంగ్రాహ్యులగుదురు । భావితరముల వారు అందలి విషయములు గ్రహించి, యోగాభ్యాసపరులై. సత్య, దయా, ధర్మముల నాచరించుతూ, పవిత్రులై జీవాత్మను, పరమాత్మయందైక్యముజేసి జీవన్ముక్తులగుదురు। అందలి పూజావిధులనాచరించువారు ఏలోకమందున్ననూ నేనేకాపాడు చుందును. యిదిసత్యము, సత్యము, సత్యమనిరి. **పీఠాధిపతి** ఏలోకమందున్ననూ కాపాడగల శక్తిమంతులామీరు? **స్వామివారు**

గీ॥ శ్రీశైలగుహవాసిని కాశీవిశ్వేశ్వరుణ్ని! కైలాసపతిన్ కేశవమూర్తిని। బ్రహ్మని జేసులపై ఆదిబ్రహ్మశక్తియునేనే ॥ యనిరి **పీఠాధిపతి** ఓయీస్వర్ణఘాతుక కులశ్రేష్టా శాస్త్రజ్ఞానములేని పామరజనులను కల్లబొల్లి మాటలతో, శుష్కవేదాంత ఊపన్యాసములచే మోసగించి, జగద్గురువునని బ్రహ్మరధం పట్టించు కొనుచుంటివా. జగద్గురువను పదముశంకరాచార్య పీఠాధిపతులకే గానీ, యితరులకు చెల్లదు. కావున నేటినుండి జగద్గురు బిరుదునువిసర్జించి తప్పిదమునొప్పుకొనిన,

నీకేమేలులేకున్న నీవు చాలాయిక్కట్లు పడవలసియుండును. **స్వామివారు! వివేకము లేని విప్రోత్తమా** సృష్ట్యాదిలో విశ్వకర్మ కులజులు భూమినుండి సమస్త ధాతువులను వెలికి తీసి మానవుని నిత్య జీవనమునకుపకరించు సమస్త వస్తువులను తయారుజేసి జన జీవన విధానమునకు మార్గదర్శకులైరి "ఎట్లనిన"

**1. మనువంశజులు :** యినుముతో వ్యవసాయమునకుపకరించు నాగలికర్రు, పలుగు, పార, కొడవలి, కత్తి, సుత్తి, ఘంటము, సూదిమొదలగు సమస్త నిత్యోపయోగ పరికరములు తయారుజేసి వ్యవసాయం, విద్య వైద్యం, వైద్యరంగములకు, ప్రయాణమునకుపకరించునవి, మానవుడు జన్మించినపుడు తల్లీ బిడ్డను వేరుచేయుకత్తి మొదలు అంత్యమున సమాధి జేయుటకు కావలసిన పలుగు, పారను, నిత్యజీవమునకు వలయు ఆహారపదార్థములను పండించుటకు కావలసిన సమస్త వస్తువులను తయారుజేసి మానవమనుగడకు ఆధారులైరి.

**2. మయవంశజులు :** కర్రతో మానవుడు నివసించుగృహము, ధరించువస్త్రమును నేయు మగ్గములను, భూమిపై ప్రయాణవాహనములను నీటిపై పయనించు నౌకలను, శయనించు పడకలను నిత్యోపయోగ గృహపరికరములను బాల్యమున ఊగు ఊయ్యాల మొదలు జీవితాంతం వరకు కాలసిన సమస్త కలప వస్తువులను తయారుజేసి, కుమ్మరి సారె తయారుజేసి నిత్య జీవమునకు కావలసిన సమస్త మట్టి పాత్రలతయారీకి కారకులైరి.

**3. త్వష్ట సంతతివారు :** నిత్యగృహోపయోగమునకు కావలసిన లోహ పాత్రలు గృహమున దైవారాధనకు దేవతామూర్తులను సకల అలంకార వస్తువులను, ధ్వజస్తంభము, పూజా సామాగ్రిని ఆహారమును తయారుజేసి భుజించుటకు కావలసిన వంటసామాగ్రిని తయారుజేసి మానవ మనుగడకు ఆధారులైరి.

**4. శిల్ప సంతతివారు :** నగరములు, కోటలు, రాజప్రసాదములు, భవంతులు శాశ్వతముగా నుండు శిలాగృహములు, సామాన్యులకు పూరిపాకలు నిర్మించి, నిత్యజీవనమునకు కావలసిన రోలు, రోకలి, తిరగలి, ఆహార పదార్థములు నిల్వజేయు రాతి పాత్రలను, అనారోగ్యులకు ఔషధములు తయారు చేయుటకు కావలసిన కల్వమును నిల్వయుంచు పాత్రలను తయారుజేసి, మానవులు ముక్తినొందుటకు దేవాలయములు నిర్మించి అందుసకల దేవతా విగ్రహములు తయారుజేసి, షోడశ కళలతో ప్రతిష్టించుట, ధనజనాకర్షణలకు యంత్రమును నిర్మించి జపించి, జపధారతో ఆ దేవాలయములు నిత్యకళ్యాణము, పచ్చతోరణమన్నట్లు రాణించుటకు కారకులైరి.

**5. విశ్వజ్ఞ సంతతివారు :** భూమినుండి బంగారము రత్నములను వెలికితీసి జ్యోతిషశాస్త్రమును రచియించి గణితశాస్త్ర ప్రకారము మానవులు దోష నివృత్తి గలిగి సకల శుభములు పొందుటకు, సకల దోషములు నివృత్తి యగుటకు కావలసిన రత్నాభరణములను, కుటుంబ జీవనమునకాధారమయిన వివాహమునకు ముఖ్యమగు మాంగల్యమును, మట్టెలను తయారుజేసి స్త్రీ, పురుషులను ఒక యింటి వారిని జేసి కుటుంబవ్యవస్థకు ఆధారులైరి.

యిటుల పంచాననులు ప్రపంచమందలి సమస్త మానవాళి జన్మించినది మొదలు ప్రతీదశయందును. బాల్యయవ్వన కౌమార వృద్ధాప్యములందు జన జీవన విధానమునకు కావలసిన సమస్త వస్తువులను నిర్మించి, మానవ మనుగడకు ఆధారులైన జాతిని స్వర్ణ ఘాతుకులను అహంభావులను, అవివేకులను అజ్ఞానులనేమనవలయును. యిట్టి ఈర్ష్యా పరులకు వేమనయోగీంద్రుడు చక్కని గుణపాఠము చెప్పినాడు.

ఆ॥ కల్లలాడుదురిలకంసాలి దొంగని, యతనిసొమ్ము కెట్టులతడు దొంగ ।
మన్ను బంగారముగా మరిజేసి పెట్టడా, విశ్వధాభిరామ వినురవేమ.॥





విశ్వకర్మ లేని విశ్వంబు మరిలేదు కుడువ కూడులేదు గుడ్డలేదు।
విశ్వమయుడైన విభునేల తెలియరో - విశ్వదాభిరామ వినురవేమ॥

అదిగాక వ్యాసుని నుండి మొదలైన మన జాతి ద్వేషమున చేయుమీ వ్యాఖ్యానములకు కందుకూరు రుద్రకవి అన్నది

**సీ॥ పరదానయాచక విప్రులు మీరలు - పరతత్వమున బరబ్రహ్మనేను**
**భూమిలో సత్పాత్రభూషణాత్ములు మీరు -కనకకుండల పరిష్కారినేను**
**తరిచెట్టుకున్నట్టి బిరుదువారలు మీరు -పేషిణీ హనుమంతబిరుదువాడ**
**వరశంఖచక్రాంక గురువులు మీరలు - గురిమీరగాజగద్గురుడనేను**

**గీ॥ మీకు మాకును సాటియే, లోకసృష్టి -కర్తలౌటయు దెలియదా కలియుగమున**
**దారతమ్యంబులేదుగా తాతయార్యా-రూఢికెక్కిన కందుకూరు రుద్రకవిని।**

ఆపిదప పుష్పగిరి అగ్రహారమున వీర బ్రహ్మేంద్రుని మందలింపు వాక్కులు మరచితిరా

విప్రోత్తమా మీ పీఠమునకు మూలపురుషుడైన శంకరాచార్యులెవరో మీకు తెలియదా? తెలిసి మభ్యపరుచు చుంటిరా? వారు రచించియించిన శంకర విజయమందలి విషయమును జ్ఞప్తిచేయుచుంటిని.

శ్లో॥ ఆచార్య శంకరోనామ। త్వష్టపుత్రో నసంశయః
విప్రకులగురోర్ధీక్ష । విశ్వకర్మంతు బ్రాహ్మణః

పంచాననులలో మూడవవాడుగు త్వష్ట బ్రహ్మవంశీయునకు బాలవిప్రవిధవకు శంకరాచార్యులు వారు జన్మించుటచే, **విశ్వకర్మ కులజులాతని నిరసించుటవలన విప్రులకు దీక్ష నిచ్చి పూజాధి పత్యములను అప్పగించి గురువైనాడు.** మీ సంతతి మూలపురుషుల జననము లెట్లున్నవో గుర్తుకు తెచ్చుకొనుడు.

ఋష్యశృంగుడు - లేడికి      జంబుకుడు - నక్కకి,
వాల్మీకుడు - వేటదానికి      వ్యాసుడు - చంబడదానికి
నారదుడు - చాకలిదానికి      మతంగుడు - చండాలస్త్రీకి
సాంఖ్యుడు - మాలదానికి      శౌనకుడు - కుక్కకి
కౌశికుడు - గాధిరాజుకు      గౌతముడు - ఆవుకి
అగస్త్యుడు - భాండమందును      వసిష్టుడు - వేశ్యకు
కౌండిన్యుడు - విధవ స్త్రీకి      మాండవ్యుడు - కప్పకి
గార్గేయుడు - గాడిదకు జన్మించుటలోక విదితమే గదా!

వీరలేగదా మీ గోత్ర ఋషులు దానికి వేమన యిట్లనెనుగదా।

క॥ యిట్టి ఋషికులంబున, బటుతరమున బుట్టినట్టి బాపనవారల్।
కుటిలంబుగానలేకను,యటుబ్రహ్మకులంబనంగ నమరునేవేమా ॥

ఆ॥ ఋషికులంబునదాము రూఢిగా జన్మించి। కులముగోత్రములను గోప్యముగను
బ్రహ్మకులముగాక బ్రాహ్మణులెట్లైరి - విశ్వదాభిరామ వినురవేమా ।

**పీఠాధిపతి** యివియన్నీ దేవరహస్యంబులు జగద్గురువులము మేమే

**స్వామివారు** ఓయీ నామమాత్రపు శంకరాచార్యా నీవు ఆదిశంకరాచారి పీఠాధిపతి వగుటచే నీకు జగద్గురుపదవి సంక్రమించినది. నాకు పుట్టుకతో నేకలదు ఎట్లందువా?

శ్లో॥ శ్రుతిస్మృత్యర్ధజాతేషు విశ్మకర్మ గద్యతే ।
విశ్వం చకారయత్తుస్మా ద్విశ్వకర్మా జగద్గురు॥

భూమి, నీరు, అగ్ని, వాయువు, పుట్టకముందు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు పుట్టక ముందు, నక్షత్రములు, సూర్య, చంద్రాదులు పుట్టకముందు. ఈ సృష్టియందు ఏమియూ లేక సర్వశూన్యముగా,యున్న సమయాన అకార, ఉకార, మకారనాదములచే ప్రణవనాదమేర్పడి, అందుండి సృష్టియంతటనూ ఆవరించిన మహాజ్యోతి ఉద్భవించెను. ఆమహాప్రకాశమునుండి విరాట్ విశ్వకర్మభగవానుడు స్వయంభూయై అవతరించి ఈసకలచరాచర జగత్తును సృష్టించి జగద్గురువాయెను. అట్టిమహాపురుషుని పంచముఖముల నుండి ఉద్భవించిన, మను,మయ త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞసంతతి వారమగు మాకుగాకజగద్గురు పదవి నీకెట్లుచెల్లుననిరి. **పీఠాధిపతి** ఓహో । అట్లయిన ఏజగమునకు నీవుగురువనిరి? **స్వామివారు** విప్రోత్తమా। ఒకజగమునకేమి సృష్టియందలి సర్వజగములకు నేనే గురువును **పీఠాధిపతి** ఈలోకములన్నియూ నీవు ఎచటచూచితివోయనిరి ? **స్వామివారు** (నగుచూ) మిత్రమా వేరే ఎచటో చూడనేల యివిగాక సప్తద్వీపములు, సముద్రములు, నవగ్రహములు, 27 నక్షత్రాలు, త్రేతాగ్నులు, అంతయేల సృష్టి సర్వాన్ని అనుదినమూ నాలో నేనుచూచుచునే యుందును. **పీఠాధిపతి** ఓహో! అట్లయిన మానవశరీరములెన్నియో వివరింపుము? **స్వామివారు** శృంగేరి పీఠాధిపతీ 1. స్థూలశరీరం, 2.సూక్ష్మశరీరము, 3.కారణశరీరము 4. మహాకారణ శరీరము. **పీఠాధిపతి** ఓయీ విశ్వనాధం! బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, గణేశ్వర, రుద్రుడు, గురుదేవుడు "ఏఏ" లోకమునందు గలరు? **స్వామివారు** ఓయీపండితోత్తమా ! వేరేలోకములకు పోనేల? మనశరీరమందలి ఆధారమున విఘ్నేశ్వరుడు, స్వాధిష్ఠానమున బ్రహ్మదేవుడు, మణిపూరకమున విష్ణువు, అనాహతమున రుద్రుడు, విశుద్ధ చక్రమున జీవుడు, అగ్నేయచక్రమున నీవర్ఛించు గురుదేవుడు, సహస్రారమున సకలచరాచర సృష్టికర్త విరాట్ విశ్వ కర్మభగవానుడు ఉందురు. **పీఠాధిపతి** (వ్యంగంగానగుచూ) నీవెప్పుడైనా వీరందరినీ చూచితివా ? **స్వామివారు** ఎప్పుడైననేమి ! నిత్యము వీరందరినీ ఆరాధింతును. అంతియేకాదు.

గీ॥ దేహ బయలెంతో దేహంబులో నుండునంత।చూడగలిగితె గురుబోధ సూత్రమెరిగి । వెలుగు చీకటిలో చూడువెల్లడగును। అంతయేల। బ్రహ్మండమందలి సమస్తమును సృష్టికర్తయగు శ్రీ విరాట్‌విశ్వకర్మ భగవాన్, ఈ పిండాండమందు ప్రతిష్టించెను. సద్గురుని కృపగలవారెల్లరూ వీటన్నింటిని సదావీక్షింతురు ! ఈ వాదప్రతివాదముల నాలకించుచున్ననాటి హైకోర్టు చీఫ్‌జస్టిస్ రాజమన్నార్, స్వామివారికి నమస్కరించి "సనారీ విశ్వేశ్వర సాక్షాత్కారము గావించి మమ్ము చరితార్థులను జేయుడని ప్రార్థింపగా ! ఈవాద ప్రతివాదములు తిలకించుటకై అచటకు చేరిన, తెలుగు,తమిళ, మళయాళ,కన్నడ, మహాప్రజా సమూహమును స్వామివారు కలయ చూచి ! "పార్వతీనీదివ్య సందర్శనార్థమై భక్తులు వేచియున్నారుయిటురా" అనిపిలువగా। కర్నాటివాసియగు రత్న వ్యాపారి నాటుకోటుశెట్టియార్ కుమార్తెయగు,8 సంవత్సరముల బాలిక తండ్రిచెంతనుండి పరుగునవచ్చుచూ। స్వామీ మీ యాజ్ఞకై ఎదురు చూచుచున్నాననుచూ వామాంకమున ఆశీనురాలయ్యెను. **పీఠాధిపతి** బాలికానీ వెవరవు ? మీదేయూరు అని ప్రశ్నించిరి? **అన్నపూర్ణ** నేను ఆదిదేవుని అర్ధాంగిని, నాయనలారా, కంచికామాక్షిని, మధురమీనాక్షిని, కాశీవిశాలాక్షిని, అంతయేల పిపీలికాది బ్రహ్మపర్యంతము శక్తి నొసగు ఆదిశక్తిని పరమేశ్వరుని అర్ధశరీరాన్ని అర్ధాంగిని నేనే ! భక్తిభావమున జ్ఞానదృష్టితో చూచువారికి నానిజస్వరూపము కన్పించును. అహంకార అజ్ఞానముతో చూచువారికి నేనొక సామాన్యబాలికను. **పీఠాధిపతి** ఓహో అటులనాయని హాస్యముగా మాట్లాడిరి. **అన్నపూర్ణ** కనులు మూసుకొని ధ్యానించుసరికి, అంబరమార్గము నుండి నవరత్నఖచిత



శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానము-మహిమలు

సువర్ణ కిరీటము, రత్నాభరణములు కంఠమును, కర్ణములను, హస్తములనలంకరించినవి. గగనమునుండి పుష్పవాన వారిపై వర్షించినది. దివ్యనాదములు వినిపించినవి. సాక్షాత్ అర్ధనారీశ్వరునివోలే విశ్వనాధుడగుపించెను. **అపుడమ్మవారు** పీఠాధిపతి బృందమును జూచి । అజ్ఞానులారా । నాపతిదేవునితో సల్పు వేదాంత చర్చలువిని మమ్ము గుర్తించు ప్రయత్నము చేయుడని, స్వామితో అమ్మవారు "సనారీ విశ్వేశ్వర సంవాద" మందలి వేదాంతచర్చలకు మొదలిడిరి. స్వామివారేనాడోరచియించిన గ్రంధ మందలి విషయములను యిరువురూ చర్చించుకొనుట వింటున్న పీఠాధిపతులకు సైతమూ విభ్రాంతి కలిగినది. అంతలోసముదాయించుకొని **పీఠాధిపతి** యిట్టితాంత్రిక విద్యలు మేమెరుగుదుమనిరి. **భక్తులు** ఆనందపారవశ్యమున "జైవిశ్వనాధజై అన్నపూర్ణమాతాజై" అనుచుమిన్నుముట్టునట్లు జయ జయధ్వానములు జేసిరి. ఆ సనారీ విశ్వేశ్వరసాక్షాత్కారాన్ని భావితరమున భక్తులు ఆరాధించుటకై ఛాయా చిత్రమును తీయుటకు ఆనాడు భారతదేశమున ఛాయచిత్రములు తీయుసాధనములు లేవు. జర్మనీ దేశీయులు భారతదేశమును పర్యటించి ప్రధాన స్తలములు చిత్రీకరించుచూ ఈ వాద ప్రదేశమునకు వచ్చి సనారీ ఛాయాచిత్రమును చిత్రీకరించిరి. వారికి స్థానిక ఎ.కె. వేలన్‌గైడ్‌గా నుండిరి. **పీఠాధిపతి** అమ్మవార్ని భువిపై మీ అవతారమునకు కారణమేమనిరి. **అన్నపూర్ణమ్మ** కర్నాటక వాసియగు రత్నాల శ్రేష్ఠియను నారాయణ శ్రేష్ఠిదంపతులు, అనేకమగు కఠిన వ్రతములాచరించి, పూజలుసల్పి సదానామధ్యానము చేయుటచేతనూ, వారి పూర్వజన్మ ఫలమున ఈజన్మలో వారిపుత్రికనై 8 సంవత్సరములు వారికానందముచేకూర్చితిని. యిపుడు ఒక సద్బ్రాహ్మణునియింట జన్మించి వారిపుత్రికనై 10 సంవత్పరములు వారినానందపరచి పర్వతగుహలో మహాతపోనిష్ఠ యందున్న నా నాధుని చేరెదను. యిది దేవరహస్యము. **రత్నాలశ్రేష్ఠి** ఈ పరిస్థితులన్నింటినీ జూచి నిశ్చేష్టుడైయుండెను. తన పుత్రికమాటలకు ఆశ్చర్య ముతో కూడిన ఆనందమునుకల్గి, వేరే యింకొకచోటజన్మింతునని తెల్పుటచేవి చారవదనుడై, తల్లీ మేమునోచిననోముల ఫలితంగా నీవు జన్మించితివని ఆనందించుచుంటిని, బాల్యమున తల్లిపోయిననూ తల్లీతండ్రీనేనైపెంచితిని గదా। యిదంతయూ మూన్నాళ్ళముచ్చటయేనా? అని విలపించుచూ జన్మరాహిత్యమును ప్రసాదించమని ప్రార్థించగా.

## (72) అన్నపూర్ణ : తెల్పిన భవిష్య వాక్యము

నాయనా నీఆవేదన గ్రహించితిని నీవు ఈ జన్మలో చేయవలసిన పుణ్యకార్యములు కొన్నిగలవు వాటిని పూర్తిగావించి మరుజన్మలో "రామబ్రహ్మానంద మహర్షి" వైబెండపూడిలో ఆశ్రమనిర్మాణముగావించుకొని నిరతాన్నదాతగా ప్రసిద్ధికెక్కి, హిందూమతోద్ధారణగావించి సనాతన ధర్మములు ప్రచారంగావించి అహర్నిశలు కుల, మత, జాతి, భేదంలేకుండా "అఖండ" అన్నదానముగావించి, నీజన్మను పునీతము చేసుకొందువు, నీవు అపుడు గానీ నా సాన్నిధ్యముచేరలేవు. హరిహరబ్రహ్మాదులకైనా చేసిన కర్మఫలితములననుభవింపక తప్పదు. నేనునూ, నాపతిని మరుజన్మమున జేరుదును. యిదిదేవ రహస్యము విశ్వనాధస్వామిని జూచి నాధానాకర్తవ్య నిర్వహణకు సమయమాసన్నమైనది. యింక శెలవు అనుచూ స్వామికి ముమ్మారు నమస్కార పూర్వక ప్రదక్షణలు జేసి, అన్నపూర్ణాదేవి అంతర్ధానమయ్యెను. యిదంతయూచూచు ప్రజలు "అన్నపూర్ణమాతకుజై, విశ్వనాద స్వామికిజై,"యనుచు జయజయధ్వానములు చేసిరి. భక్తులందరు కైలాసమున ఆదిదంపతులను గాంచిన అనుభూతిని పొంది. పరమానందపర వశులయిరి. అజ్ఞానాంధకారముతోనున్నవారిది, తాంత్రికవిద్యయని అవహేళనచేసిరి. **పీఠాధిపతి** నీవు పరమేష్ఠివయిన త్రినేత్రమేదియనిరి . ? **స్వామివారు** నాత్రినేత్రమిచట ప్రదర్శించిన, మీరందరూ భస్మమగుదురుగదా మీకట్టి కోర్కెయున్న రేపుకడలితీరానపచ్చగడ్డిమేటలువేయుడనిరి.

అమర్నాడుదయమున సముద్ర తీరాన పచ్చగడ్డి మేట వేయించిరి. స్వామివారు వస్తుండగా, భక్తబృందము ఏకకంఠముతో గురుదేవులను చూచి

సీ।। శ్రీభూతిరుద్రాక్షశిరజటామకుట। దండకమండలధారనిరత। అరుణ ప్రభాలీలలాడు కౌపీనాంగ। కటిసూత్రబంధంబు కఠిన । మెసగబ్రహ్మాసనా దిగంబర పుండరీకమా। చర్మాంబరా బ్రహ్మకర్మపాలి। గిరి గహ్వరోపాసక్రూర పాపవినాశ సర్వరక్షణ మహాసాధుమూర్తి।।

గీ।। పరమపాంచాలపావన భక్త రక్ష। బ్రహ్మ తేజో ప్రభావసంపాద్య విభవ। పార్వతీనాథ మౌనిసంభావ్యనిరత । పాహి సర్వేశవిశ్వేశబ్రహ్మమూర్తి। యనుచూ స్తుతించిరి.

**(73) స్వామి వారు త్రినేత్రమును జూపుట :**

స్వామివారు వేదికపైకివచ్చి కడలితీరాన గల పచ్చగడ్డి మేటలను చూచుసరికి, త్రినేత్రము నుండి అగ్నికణములు పచ్చిగడ్డిపై బడి భగ్గున మండి, భస్మమైపోయినవి. అపుడు స్వామి వారు శక్తికి శరీరార్ధాన్నిచ్చిన "సనారీయై" శిరస్సున గంగపొంగ శక్తినికూడిన శివునిగా ప్రకృతి పురుషుడు ఏకమై సృష్టిపులకించినట్లు, సాక్షాత్కరింపగా, వాదులాడిన పీఠాధిపతులు సైతము అంజలిఘటించి, బ్రహ్మరథాన్నిమోసి, గురుదేవులను కొనియాడి ధన్యులైరి, అచటి భక్తబృందము స్వామీ మా జన్మలు ధన్యముగావించు కొనుమార్గము తెల్పుడని ప్రార్ధించిరి, **గురుదేవులు** నాయనలారా। నాచే రచింపబడిన " సనారీ విశ్వేశ్వర సంవాదము" నందలి రహస్యములను బయలుగురువు ద్వారా గుర్తెరిగి, పూర్తిగా అర్థం చేసుకొని, మాంసపిండాన్ని, మంత్రపిండంగా, మంత్రపిండాన్ని మహత్ పిండంగా, మహత్ పిండాన్ని, దైవపిండంగామార్చి దేహమును స్వర్ణముగా జేసుకొని తుచ్ఛమగు శరీర సుఖమున కాశపడక, శాశ్వతానందకరమగు పరబ్రహ్మమును సహస్రారకమలమునజూచి, జీవాత్మను పరమాత్మలో ఐక్యము చేయుటకై ప్రయత్నింపుడు, నేను సదామీలోనే ఉందును. కలిమాయలో బడి అష్టబంధముల చిక్కువద్దు. ఎట్లన్న మానవుడు బ్రహ్మచర్యమున ఏచింతయూ లేక యుండును, యుక్తవయస్సున వివాహంతో మొదటి బంధమారంభమగును. దీనితో మిగిలిన బంధములు ఏర్పడును. భార్యతో కాపురమునకు యిల్లు కావలయును ఆమెను మెప్పించుటకు ధన, కనక, వస్తు, వాహన, చీన చీనాంబరములు సంపాదనకై తపన బడును. తర్వాత సంతానము కలుగుటచే వారిని పెంచి విద్యాబుద్ధులు చెప్పించి వివాహము చేయుట, ఈ కార్యములకై అనేక శ్రమలు పడుటయే సంసారసాగర మీదుటయని తెలియుడు. అష్టబంధము లేవియనిన, 1. నీటిలో చేపకైజాలరి వలవిసురును, జలచరములు వలలో చిక్కుటయేగాని బయల్పడుట తెలియదు. 2. అట్లే జంతువుల వేటకు వేటగాడు మాటు వేయును. అదివేటగాని మోసమని తెలియక జంతువులు మాటులో చిక్కుకొనును, కానీ బయల్పడుట వాటికి తెలియదు. 3. అటులనే యవ్వనులగు స్త్రీపురుషులు దేహవ్యామోహముచే వివాహమనువలలో చిక్కిన, మానవులు సంసార సాగరమున బడిదరిజేరు దారిగాన లేక। నానావ్యయప్రయాసలతో సంసారమను సాగరము నీదుచు, అందేసమసి పోవుచున్నారు. 4. కీటకము దీపకాంతిని జూచిదానిని మ్రింగబోయి అదియే ఆహుతియగుచున్నది. 5. అట్లే మానవులు పరస్పర వ్యామోహములతో సంసార సుఖములనను భవించవలెనని, ఆశించి తుదకు తామందే ఐక్యమగుచున్నారు. 6. వరాహము బురదలో గల చల్లదనముకాశించి, దానిలో జొరబడి శరీరమంతా మలినము గావించుకొను విధమున, 7. మానవులు సంసారజీవితమున ప్రవేశించి తన శరీర సుఖమునకు స్వజనమెప్పుకి 8. సమాజములో హోదాలకై పాపకృత్యములనాచరించి ధనార్జనగావించి, పాపియై సత్యపథమునకు దూరమగుచున్నారు. గావున నాయనలారా! ఈ భవబంధముల నుండి వేరుపడి, తామరాకుపై నీటి చందమున సంసారము నుండియూ సంసారాన్ని మిద్యజేసి సద్గురు బోధనలుస్వీకరించి, సచ్చిదానంద స్వరూపుడగు





భగవంతుని ధ్యానించుచూ, శాశ్వతానందాను భూతిని పొందుటకు ప్రయత్నింపుడని, స్వామివారు బ్రహ్మరథం పట్టినవారికి, వాదోపవాదములు వినుటకై అటకుజేరిన భక్తకోటికి, దివ్యసందేశములనిచ్చిరి, నాయనలారా! యోగములన్నింటి కన్నారాజయోగము ప్రశస్తమైనది. యిది సద్గురు నుపదేశంబున సులభంగా సిద్ధించును. కావున బహుప్రదేశములవిచారించి, సరియగు బోధగురువుచేత ఉపదేశం పొంది, సాధనా బింకము కొలది రెండుయాములు మొదలు 12 సంవత్సరములలో నిది సిద్ధించును. ఉత్తమ గురులక్షణములెట్లుండుననిన, మార్జాలకిశోరన్యాయంబున పిల్లిపిల్లలను పెట్టి ప్రేమతో పాలిచ్చిపెంచుచూ, పిల్లలకు అనువగుచోటువెదకి, నోట కరచుకొనిపోయి భద్రముగా అచటుంచి, దూరముగా నుండిచూచుచూ, తనంతగువరకూ రక్షణగాయుండి పెంచి, తన విద్యలన్నియూ నేర్పితనంతజేసి, పిల్లలను వీడిపోవును, అట్లే బోధగరువు శిష్యుని తనంతజేసి, అప్పుతీరిన వారివలే శిష్యుని స్వేచ్ఛగా విడిచివేయును, ఉత్తమ గురులక్షణమిది, ఇంక బాధగురువులు తమకన్నియూ తెలిసినట్లునటించుచూ, శిష్యుని మభ్యపెట్టి తన అవసరములు తీర్చుకొనుచూ, కాలంగడుపుకొనును, ఈ శిష్యుడు అటు సంసారానికి, యిటు యోగానికిచెడి, ఉభయభ్రష్టుడగును, కావున కారణగురువు ఉపదేశంపొంది, మీ జన్మలు ధన్యంచేసుకొనుడు, మానవులుచేసిన పుణ్యపాప ఫలితములు నీయ సర్వేశ్వరుడు సర్వాధికారి, ఆయనకు ఆశ్రితపక్షపాతంగానీ, తనపరభేదం గానీ, సుజనులు, దుర్జనులు, అనుభేధంలేక, తెలిసిగానీ, తెలియకగానీ, ఎవరెవరు చేసుకున్న పాపపుణ్యములు లెక్కలుకట్టి నిష్పక్షపాతియై ఫలితములనీయును, కావున నాచే రచింపబడిన కాలజ్ఞానం వినిసత్ప్రవర్తనులై మెలగుడు .

**(74) స్వామివారు తెల్పిన కాలజ్ఞానము :**

భక్తులారా! కాలజ్ఞాన విశేషములు శ్రద్ధతో ఆలకింపుడు, భూమినిస్సారమై పైరులు పెరిగిననూ, పంటలుపండకుండును. ఎచటనైనాపండినా చేతికందకుండేను. మహావృక్షములు సైతము పూతపూసికాపులేకుండును, పశు, పక్షిమృగ, జల చరములు నానా విధములగు జీవులునశించును. తల్లీ బిడ్డలకు, తోబుట్టువులకు, భార్యాభర్తలకు, ద్వేషములు పుట్టేను, మానవులకు మితిదప్పిన ఆశలుపుట్టి, ఒకరినొకరు మోసగించుకునేరు. దొంగిలించుట, కలహించుట, నిందించుట, యిట్టి క్రూరకార్యములు ప్రభల మయ్యేను మధ్యపానము, జూదము, వ్యభిచారము, వాజ్యము, అసూయ, మత్సరము, పెంపుచేసుకొని నాశనమయ్యేరు, ముండలు ముత్తైదులగుదురు, సంసారులు వ్యభిచారులగుదురు, స్త్రీల అధికారం ఆయుష్య పెరిగి పురుషులను హీనంగా చూచేరు. అల్పజాతులు అధికులై గొప్ప పదవులందుండి ఉత్తమజాతులపై పెత్తనం చేసేరు. పంచములు, వేదాలు చదివి అర్చకులయ్యేరు. గొప్ప వారు హీనులకు సేవకులై జీవించెదరు. పాడిపంటలు స్వల్పమయ్యేను. వర్షాలులేక ప్రజలు, పశువులు, మృగాలు, ఆకాశం వంక చూచి ఏడ్చేను. సజ్జనులను బాధించు దుర్మార్గులధికమయ్యేరు, దుర్జనులదే రాజ్యమయి వారిని దండించు వారు లేకుందురు వృద్ధ స్త్రీలు సైతం బిడ్డలనుకనేరు. ఒక్కొక్కరు దినమునకొక పురుషుని మార్చు స్త్రీలయ్యేరు. స్త్రీల పెత్తనముచెల్లేను. పురుషులకంటే స్త్రీ సంతతి పెరిగేను. ఆడవారు మృగములతో క్రీడింతురు. 108 దివ్యక్షేత్రాలు నాశనమయ్యేను. భూకంపములు వచ్చి కొండలు సైతము జలమయమయ్యేను భూమి యిపుడున్న దానిలో 9వ వంతు మిగిలేను. పెద్ద పెద్ద పట్టణవాసుల వసతులు చెడి పట్టెడన్నము దొరకక, స్తిమితముగా నుండుతావు దొరకక, తల్లడిల్లేరు. దేవాలయములందలి విగ్రహములు నాట్యము చేసేను. శక్తులు మానవరూపంతో సంచరించి, జనాన్ని నాశనం చేసేను. చిత్ర విచిత్ర వ్యాధులతో ఎక్కడి వారక్కడే చచ్చేరు. వైద్యులకు కందని వ్యాధులు ప్రభలి జనులు అతిగా చచ్చేరు. సముద్ర ఉప్పెనలతో సర్వం నాశనం మయ్యేను. వృక్షజాతి నాశనం మయ్యేను. తల్లిదండ్రులు దూరమై

తిరుగు బాలబాలికలు ఎక్కువయ్యేను. నేను చెప్పు కాలజ్ఞాన వాక్యాలను, దైవాన్ని నిందించువారికి, ఎట్టి రక్షణలేకుండా పొయ్యేను. రానున్న ప్రళయంలో మానవులు ఎందుకు పనికిరాని జీవులై మృగాలకన్న హీనమైపొయ్యేరు. నన్ను నమ్మినా నామస్మరణయే మీకు అండయగును. ఇందులకెట్టి సందేహమూవలదు. నమ్మనివారు ఘోరనరకముల పాలగుదురు. తస్మాత్ జాగ్రత్త! జాగ్రత్త జాగ్రత్త ! నేను భూమిపైకి వచ్చి జనులకు ధర్మ ప్రభోధనలుచేసి దైవమందు భక్తినిపెంచి, ఆత్మను పరమాత్మయందు నిలిపి, విరాట్ స్వరూపమును జేరు మార్గములు తెలిపి, అవన్నియు **"సనారీ విశ్వేశ్వర సంవాదం"** లో పొందుపరచి, ముద్రణగావించి ఈ లోకమునకు ప్రసాదించితిని అందలి విషయములు గ్రహించి మీా మీ కోర్కెలు సిద్ధి పొందుదురుగాక. నేనిటనుండి శ్రీశైలమునకు బోయి శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి భువిపైకి వచ్చువరకు, కదళీవనమందు అఖండ తపోదీక్ష యందుండుదును. మీారును ధర్మము తప్పక దైవమును, త్రికరణశుద్ధిగా నమ్మి పూజించండి. ఎట్టి ఆపదలు మీాదరిజేరవు. నా శరీరము కానలకేగినా, గుహగహ్వరములందున్ననూ, భక్తులహృదయ కమలము లందుండి, యోగక్షేమములునరయుచూ రక్షించుచుందును సద్భక్తులహృదయంవేు నా నివానవు. విరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారు వీరభోగవసంతరాయలైవచ్చు వరకూ

గీ॥ సానగాదులు బహు కష్టసాధనముల। కాలమునుగడుపుదినముయుగంబు గాను। బ్రాహ్మ్యహీనంబునై నీచప్రాణులగుచు। దీనవృత్తిని బడు కష్టదినములాయే।

**బ్రహ్మంగారు వీరబోగవసంతరాయలుగా వచ్చినపిదప కృతయుగ ధర్మములతో**

గీ॥ అటుపై పంచాననులు ।పటుతరుపూర్వప్రకారం। బ్రహ్మజ్ఞానం జెటిలంబునో పదెల్పుడు । రటుమీదట ధర్మప్రధమంతయునడచున్॥

**(75) పంచాననులహీనస్తితి :**

లుబ్ధసంభూతుడగువ్యాసుడు మయబ్రహ్మసంభూతుడగు విశ్వబ్రహ్మవద్ద 12 సంవత్సరములు శిశూప్రజేసి, వేద శాస్త్రపురాణేతిహాసంబులు శృతి స్మృతి, యితి హాసంబులు మొత్తం చక్కగా చదివి ఆ మహనీయునిచే మంత్రోపదేశముపొంది తాను పరిపూర్ణభావమును జెంది "కుచ్చితుడై" పంచవేదంబులు చతుర్వేదంబులుగా, పంచమూర్తులను త్రిమూర్తులుగ, తనవిప్రశబ్ధంబును, సర్వశాస్త్రములందు యిమిడ్చి గురువు గూర్చి తపస్సుచేయు చుండెను. అపుడు గురువు వ్యాసునిదరికేగి బిడ్డానీవు నాకొరకిట్లు ఘోరతపమొనర్చుటకు కారణమేమనగా "గురు దేవా! నాకొకవరం బొసంగుడని" వాగ్దానంగావించుకొని తాను మార్పులు చేసిన యితిహాసంబులు పూజితమగునట్లు వరమిమ్మనెను. అపుడా మహానీయుండాతని దుర్బుద్ధిని గ్రహించి తలయూచియిట్లనెను,

**శ్లో॥ వ్యాసప్రోక్తంమయాదత్తం । విప్రొసర్వత్రపూజితః**
**కలౌపంచసహస్రాణి- జాయతే వర్ణసంకరః॥**

నీవు చేసిన ఈ మార్పు కలియుగం 5వేల సంవత్సరములు నడిచి, ఆ పిదప విప్రులు వర్ణసంకరులగుదురని వరమిచ్చెను.

**(76) భక్తులారా మీకు తెల్పు ముఖ్యవిషయములు :**

మిా బిడ్డలకు 5 సంవత్సరములకు అక్షరాభ్యాసం గావించి సకలశాస్త్రములనభ్యసింప జేసి, వాటిమర్మములు గ్రహింపజేయుచూ, బాలుర కులములను బట్టి నిర్ణయించిన సంవత్సరమున ఉపనయనంచేసి, బ్రతుకుతెరువునకు కులవిద్య నభ్యసించుచుతూ, 20 వ సంవత్సరము వరకు





యిలాగడిపి, ఉపనయనకాలమందు చెప్పిన గాయత్రిని, నిత్యం ఆచరించుచూ యుక్తవయస్సున పెద్దలయాజ్ఞచే వివాహము చేసుకొని, "రాజయోగియై" సత్యజ్ఞానదయా, ధర్మశాంతి, క్షమాగుణ, దేహారోగ్యంబులు గలిగి, అతిధి, అభ్యాగతులను ఉచిత ప్రకారం ఆరాధించుచూ, బ్రహ్మవిద్యను అభ్యసించుతూ, జార, చోరాది, జీవహింసలు చేయక,భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యపానీయములను, మధుర, ఆమ్ల, తిక్త, కటు కషాయం, లవణరసంబులంభక్షింపుచూ, క్షురకర్మవర్జితుండై, పర్వదినంబులందు భార్యాకూటంబుమాని, యింద్రియ నిగ్రహంబుగలిగి, తనకు కావలసినంత మంది సంతానముపొంది, పుత్రులకు యోగంబుతో కూడిన గాయత్రి బ్రహ్మోపదేశమిచ్చి పుత్రికా, పుత్రులకల్యాణములుచేసి, తల్లిదండ్రులు జీవించినంతవరకు వారలకు ప్రశాంతమగు జీవనము కల్పించి, తామరాకుపై నీటి చందంబున తన కుటుంబబాధ్యతలు సక్రమముగా నెరవేర్చుచూ, అప్పటి వరకు తనకు ఉపనయనమందు చెప్పిన గాయత్రిని నిత్యము ఆచరించుతూ, కుటంబబాధ్యతలు ముగిసిన పిదప, భార్యాసమేతముగా యిల్లువీడి, ప్రశాంతవాతావరణముగల కొండ గుహలలో మంచినీరు గల ప్రదేశమున పర్ణశాల నేర్పరుచుకొని, సువాసనగల,ఆకులు, పూలు, పండ్లు, గల మొక్కలను పెంచుకుంటూ,బాల్యము నుండి చేయుచున్న ఉపదేశముతో ఆనందమొందుచూ, సృష్టికర్తయగు విరాట్ విశ్వబ్రహ్మమునందు జీవాత్మను కలుపుయోగము చేయుచూ, సన్యాసియై, పూర్వము చేయు గృహస్తాశ్రముధర్మములన్నీయూ మరచి, యోగ సాధనలుచేయుచూ శరీరధ్యానములేక, పరమహంస, వుదాసీ, అవధూతలుచేయు పూర్ణసమాధి స్థితినిసాధింపుచూ, రెండవ విరాట్‌వలే నుండి, ఐహికామహిమలు, అణిమాది సిద్ధులకాశపడక, సత్యవాక్ సిద్ధులు గలిగి, స్తిరభావంతో యుండవలయును ఇట్టి వానప్రస్తాశ్రమ వాసులకు ఉపాదులు, **వాతాంబు పర్ణాశనంబులును,** కందమూల ఫలక్షీరంబులును, ఉంఛవృత్తిగల బీజాదులను, మధుకరంబులు, భిక్షాన్నములను, ఈశ్వరాధీనంబుగా తీసుకొని, లభ్యపదార్ధంబునన్ సంతుష్టుడై, ఎల్లవేళలహంస నిరోధనంబు జేయుచూ, బ్రహ్మజ్ఞానంబుచే బ్రహ్మవిదుండై బ్రహ్మముగా వలయునని, ఈ చతురాశ్రమవిధితంత్రములు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర చండనామదేవతలుగా గల సర్వ మానవ సమూహంబుల వరకూ తెలియుటకు చెప్పితిని, శ్రీ విరాట్ విశ్వకర్మముఖోద్భవులగు విశ్వబ్రాహ్మణులు కాక తక్కిన సమస్త పర్యాయ వేషధారులగు, విప్రులు, రాజులు, కోమటులు, శూద్రులు, పంచములు, మొదలగు సమస్త జనులు త్వష్టబ్రహ్మకుమార్తెయగుసంజ్ఞాదేవికి, సూర్యునకుపుట్టిని, వైవస్వతమనువు సంతతియని ఎరుంగుడు, వీరలకు మాయాతంత్ర స్వభావంబునుండిన కర్మలు అవశ్యంబుగా నుండును. యిట్టికర్మలు పంచాననులగు దేవ బ్రాహ్మణులకు, మాయా తంత్రస్వభావంబుచే నుండు కర్మల గత్యంబు గావనియూ, పితరుండగు బ్రహ్మమును జ్ఞానచక్షువులచే కనుంగొనుటయే ప్రధానంబని యెరుంగుము దీనికి మానస పూజయే ప్రధానము అది ఎట్లన్న

**(77) మానస పూజావిధి :**

రూపనామక్రియారహితంబై ఆమహద్వస్తువై వెలుంగు చున్న దానికి, నేచేయును పచార పూజాతంత్రంబులు శాశ్వతంబులైదోచుగాక!

1. ఓం మహాదేవి, నదీ, నదాబ్ధి, మహాజలంబులు నీకునభిషేకంబుగా।
2. మృత్తుశిలా, దారు, జంతు, సలిలసహితంబైనచతుర్ధశభువనంబులు నీకు గంధంబుగా। 3. నక్షత్ర గ్రహరాశి మండలావృతపరాగకేసరీయుక్తంబగు మహాకాశము నీకు పుష్పంబుగా ।
4. నింధ్యానింద్యంబు లేక సర్వదిగ్భ్రమణంబగుతుహినకణ భూపరాగ ఆకాశ ధూమంబునుం గల వాయువునీకు ధూపంబుగా। 5. సర్వాశినియగు అగ్ని నీకు దీపంబుగా యిన్ని

యునుగలిసినేనైననేనే నీకు ప్రసాదంబుగా నర్పించితిని గైకొనుమా, భక్తరక్షణోత్సాహివై రక్షించుమా ఓం నమో, నమోనమః శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు॥ అనిమనస్సున, తలంచిఆత్మార్పణగావించి ఈ మానసపూజను చేయవలయును. దీనికి మడిమైలల పట్టింపులు లేక, కులమతభేదములెంచక స్త్రీపురుష లెవరైనను, ఏ వయసువారైనను చేయవచ్చును. ఈ పూజ చేసేవారు, ఎలాంటి విగ్రహారాధన, వ్రతములు యజ్ఞయాగాదులుచేయరు, యిట్టివారికి, తనలోను, సకల జీవరాసులందును, ప్రకృతియంతటా సదా ఆవిరాట్ స్వరూపాన్నే దర్శించుచుందురు.

**యిది ఎలాగంటే**

క॥ **నీనేత్రంబులతోగని, మానకపూజింపు, వెలిని మంత్రంబేలా।**
**తానే వెలుగై యుండగ మానకుమాబ్రహ్మపథము, మాయలులేవే॥**

యిలాంటి పూజ చేయు పుణ్యాత్ములకు, నేను ప్రతిపూటా మ్రొక్కుచూ ఏడు, ఏడు, పద్నాలుగు లోకాల్లో ఎక్కడ ఉన్నా రక్షించి కాపాడు తుంటాను. యిదిసత్యము, సత్యము సత్యము,

నాయనలారా, యుగధర్మములెట్లున్నవనిన। కృతయుగయందు ధర్మము నాల్గు పాదములు నడచుటచే, మానవులు దైవాన్ని తలచినంతనే ప్రత్యక్షమయికోర్కెలు తీర్చెడివాడు 2 త్రేతా యుగమున ధర్మము మూడుపాదముల పైన నడచుటచే, మానవులు మంత్రోచ్ఛారణచే భగవంతుని సాక్షాత్కరింపచేసుకొని తమ కొర్కెలు తీర్చుకొనెడివారు 3. ద్వాపరయుగమందు ధర్మము రెండు పాదములనడచుటచే, యజ్ఞయాగాదులచే మానవులకు భగవత్‌దర్శనం లభించెడిది 4. కలియుగమందు ధర్మదేవత ఒంటి పాదం పై నిలబడుటచే, అధర్మం పెచ్చు పెరిగి ధర్మ పూర్తిగా క్షీణించుటచే దైవము మానవరూపములో జన్మించి, కలిప్రభావముతో తాను జీవించుచూ, సర్వమానవకోటికి ఆదర్శప్రాయులై జనాన్ని ధర్మమార్గవర్తనులను జేయుటకు, కొన్ని మహిమలు ప్రదర్శించుచూ ఈ యుగమందు ఎల్లప్పుడూ ఏదో ఒక ప్రాంతంలో జన్మించవలసిన పరిస్థితి ఏర్పడినది. మూడు యుగములందొక్కొక్క అవతారమెత్తిన సరిపోయినది కలియుగమున ప్రతి సమయమున దైవము మానవునిగా జన్మించి, అధర్మవర్తనులకు సదాజ్ఞానోపదేశము చేయుచూ, ధర్మపరాయణులను అనుక్షణం కాపాడుచూ, ఒంటికాలిపైన నడుచుధర్మాన్ని ఎల్లప్పుడు కాపాడవలసివచ్చినది. అందుచేతనే ఈ పుణ్య భూమిపై అనేక మంది మహనీయులు జన్మించి వలసివచ్చింది. ఈ కలియుగమందు దైవదర్శనమునకు, 1. భగవత్ ధ్యానమ్, 2. వారి మహిమలను పదే పదేవిని మననము చేసుకొనుట 3. భగవంతుని సదా భజనలతో కీర్తించుట, ఈ మూడు విధములలో ఏదో ఒకదానితో, మనసా, వాచా, కర్మలతో, శరణాగతులై సేవించినగానీ, భగవత్ దర్శనంపొంది తరింపజాలరు. ప్రస్తుత సమాజమున అన్యమతముల విజృంభణచే, హిందూమతము సన్నిగిల్లుచున్నది. నాస్తికవాదం పెచ్చు పెరిగి దేవుడు లేడని కొందరు, బ్రిటిషువారి పరిపాలనచే వారివేషబాషలకులోనై, సనాతనధర్మాలకు అవరోధమేర్పడి, మానవజాతి వెర్రితలలతో విజృంభించుచున్నది. గతయుగములందు యుగమునకొక రాక్షసుడు పుట్టుటచే వారి వధకై యుగాంతమున ఒకసారి భగవంతుడు జన్మించి, వారిని వధించి ధర్మ సంస్థాపన జేసిరి. కలియుగమందు ప్రతి ప్రాంతమందు ప్రతీ కాలమందు రాక్షసప్రవృత్తిగల నరులుండుటచే, అన్ని కాలములందు భగవంతుడు ఏదో ఒక రూపములో జన్మించి, ధర్మ సంస్థాపన జేయవలసివచ్చుచున్నది. "వినాశకాలే విపరీత బుద్ధి" అన్నట్లుగా మానవుడు తన మేధస్సుతో ప్రకృతి సమతుల్యానికి హానికల్గించి, యుగప్రణయములకు కారకులగుదురు. యుగ ధర్మములననుసరించి కృతయుగము 4వ పాదమందు, త్రేతాయుగ 3వ పాదమందు ద్వాపర యుగ 2వ పాదమందు, కలియుగ 1వ పాదమందు ప్రళయము సంభవించిపూర్తిపాప ప్రక్షాళనజరిగి,





మరలకృతయుగారంభమై ధర్మము నాలుగు పాదములనడిచి నెలకు మూడు వానలు కురిచి సృష్టియంతయూ సస్యశ్యామలముగా, సర్వజనులు వర్ణాశ్రమ ధర్మాలకు కట్టుబడి సుఖసంతోషములతో జీవించి సుఖించెదరు. ఆ యుగమున ప్రతీ మానవుడు మనస్సు తలచినంతనే దైవ సాక్షాత్కారము పొందుదురు. ప్రతీ మానవుడు మహనీయునివలే జీవింతురు. ఈ రాబోవు యుగారంభమున శ్రీశ్రీశ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాముల వారు వీరభోగవంసతరాయులుగా, దేశాన్ని సుఖశాంతులతో పాలించెదరు. ఆ సమయాన ఏ నరులు, దైవధ్యానతత్పరులై యుందురో, వారు కృతయుగసౌఖ్యములనను భవింతురు. మిగిలిన వారందరు. యమలోకమునబడి, వారి వారి దుష్కృత్యములకు తగిన శిక్షలనను భవింతురు. నేనీ భువికి వచ్చిన కార్యము పూర్తిఅయినది. నేనిపుడే వీరబ్రహ్మేంద్రుని జీవసమాధిని దర్శించి, శ్రీ శైలగుహాలో మహాతపోనిష్టయందుండెదను. అటనుండి నా భక్తులను సదా వెన్నుకాచి రక్షించుందుననుచూ. నడుచుచుండగా భక్తులందరు ఏకకంఠముతో జై విశ్వనాథాజై" "అన్నపూర్ణమాంబజైయనుచూ" నామసంకీర్తనలు చేయుచుండగా గురుదేవులు వీధిమలుపు తిరిగి అంతర్ధానులైరి స్వామివారు కలి 5108లో మహాసిద్ధమునిగణములతో కలసి వీరభోగ వసంత రాయులునికలిసెదరు.

## (78) సనారీ వారు బ్రహ్మంగారి జీవసమాధి ని దర్శించుట :

స్వామివారు చెన్నపట్నంలో సనారీ సాక్షాత్కారము గావించిన పిదప అటనుండి బయలుదేరి, రేణిగుంట, సూళ్ళూరుపేట, కడప, మైదుకూరుల మీదుగా, పర్యటిస్తూ ప్రతీ చోట వేదాంత ప్రబోధనలు, హిందూమత ప్రచారములు చేయుచూ, క్రమముగా కందిమల్లయపురమందలి వీరబ్రహ్మేంద్రస్వామి జీవనసమాధిని దర్శింపగా, నాటి మఠాధిపతులైన శ్రీ వెంకటేశ్వర స్వాముల వారు, స్వామివార్ని, పూర్ణకుంభముతో స్వాగతముపలికి, సకలోపచారములతో గౌరవించిరి. తర్వాత సనారీ విశ్వేశ్వర సంవాద "మందలి యోగవిషయములను, వెంకటేశ్వర స్వాములవారికి అచటగల భక్తబృందమునకు స్వామి వివరించిరి. అనంతరము స్వామివారి హస్తములతో అచట గల వారందరికి తీర్థప్రసాదములిచ్చిరి. అటు పిమ్మట వీరబ్రహ్మేంద్రుని జీవసమాధికి నమస్కరించి, స్వామివారి దండక మండలములనచట గుర్తుగా ఉంచి, అచటనుండి శ్రీశైలమందలి కదళీవనమున గల గుహాంతర్భాగమున చేరి, ఆగమవేదమునూహ చేయుచూ మహాతపోనిష్ఠ యందుండిరి.

## (79) అన్నపూర్ణమాత కర్ణాటక రాష్ట్రమందలి, ఒక అగ్రహారమున బ్రాహ్మణనియింట సర్వ మంగళగా జన్మించుట :

మైసూరు సమీపగ్రామ మందుగల అగ్రహారమున సద్బ్రాహ్మణ కుటుంబము నందుజన్మించి, నిత్యాగ్నిహోత్రముతో, వేదాధ్యయనము సల్పుచూ, సత్యధర్మ, వర్తనులగు దీక్షితశర్మ, సుశీలాంబయను పుణ్యదంపతులుకలరు. వారికి ధనకనక, వస్తువాహనాదుల యందు ఏ కొరతయూ లేక సుఖజీవనము చేయుచూ, సంతానలేమిచే తీవ్రమనోవ్యధకు గురియగుచూ, అనేక వ్రతములాచరించుచూ, పుణ్యక్షేత్రముల సందర్శించుచూ, అనుక్షణము దైవధ్యానతత్పరులై జీవనయాత్ర సాగించుచుండిరి. వారొకనాడు కఠోరదీక్షనాచరించి, ఉపవాసవ్రతములు సల్పుచూ 11 రోజులకు దైవసాన్నిధ్యమున స్పృహకోల్పోయిరి. ఆ దంపతుల భక్తికి సంతసించిన జగన్మాతకలయో, నిజమో ఎరుంగని శరీర స్మారక స్థితియందు ప్రత్యక్షమై "పుణ్యదంపతులారా" మీ నిర్మలభక్తికి సంతసించితని, మీ చరిత్ర ఆచంద్రతారార్కము నిలుచునటుల మీకు పుత్రికగా జన్మించి, దశవత్సరములు మిమ్మానందిపజేసి నా పతినిగూడి అదృశ్యురాలనగుదును. యింతటితో దీక్షవిరమింపుడని అంబ అదృశ్యమాయెను. అంతనా పుణ్యదంపతులు జాగ్రతావస్తకువచ్చి

యిరువురకు ఒకే విధంగా పొందిన అనుభూతిని ఒకరికొకరు చెప్పుకుని జగదంబకరుణించెనని ఆనందపడుచూ, అంతలోనే ఈ ఆనందము 10 సంవత్సరము లేయని దిగులొందుచు, యిది జగన్మాత అనుగ్రహమని మరల ఆనందించుచూ, దీక్ష విరమించి ఆనందముగా జీవనయాత్ర సాగించుచుండిరి. అంతకొన్నాళ్ళకు సుశీలగర్భవతియై, నవమాసముల పిదప దివ్యతేజో విరాజితయగు బాలికారత్నమును కనియెను. 21వ దినము బారసాల మహోత్సవమతి ఘనంగాజరిపి బిడ్డకు "సర్వమంగళ" యని నామకరణము గావించి, అల్లారుముద్దుగా పెంచు చుండిరి. ఆ బాలిక శుక్లపక్షచంద్రుని వోలే దిన దినాభివృద్ధిచెందగా 5వ సంవత్సర వయస్సున అక్షరాభ్యాసము గావించిరి. బాలిక ఏకసంథగ్రాహియై సకల శాస్త్రములు నభ్యసించుచూ 8వ సంవత్సర ప్రాయురాలయ్యెను. తోటిబ్రాహ్మణులు దీక్షితశర్మనుగాంచి, శర్మగారు మీ కన్యకు వివాహకాలము సమిపించిననూ తమరుపేక్షించుట శోచనీయముగాయున్నది. మరియు "అష్ట వర్షాద్భవేత్‌కన్యా" యను ఆరోక్తి మీరెరుగనిదికాదు. మనకులాచారప్రకారం త్వరలో వివాహం జరిపించుడనిరి. శర్మగారు వారి మాటలు వినీ విననట్లూరకుండిరి. యిటుల సంఘీయులు పాడిన పాటయే పాడజొచ్చిరి, కానీ దీక్షితులనోట ఏ పలుకూ లేకుండట చే, సంఘపెద్దలు రోషముతో ఔరా దీక్షితా, యిప్పటికి సంవత్సరము నుండి మే మెన్నిసార్లు హితవు పల్కిననూ బదులు పలుకవు ఏమి నీ అహంకారము. ధనవంతుడవని అహంకారమా? మేము నీకుమార్తెకు వరుని చూచితిమి ఈ సంబంధమంగీ కరింపుము యిటుల మరికొన్నాళ్ళుపేక్షించిననిను, సంఘ బహిష్కరణ చేయవలసివచ్చునని హెచ్చరించిరి, దేవి అంశయగు కుమార్తెను సామాన్యులకు కట్టబెట్టుటకు యిష్టపడక, సంఘపెద్దలకు సమాధానము చెప్పలేక ఆదంపతులు మనోవేదన పడుచుండిరి. యిది గ్రహించిన సర్వమంగళ తల్లిదండ్రులకు చింతింపవలదని ధైర్యంచెప్పి నా భర్తలోకనాధుడు. నాధుని చేరుటకు నాకు కాలపరిమితి గలదు. నా పదవ సంవత్సరమునగానీ నాధుని చేరలేను. యిది దేవరహస్యము, కావున ఈ పామరుల మాటలకు భీతి చెందకుడు, ఈ తష్కరుల ఘాతకములు సామన్యమానవులకే గానీ, దైవాంశ సంభూతనగు నాకేమి. నాభర్త జగద్రక్షకుడు కావున, ఎవరివలననూ మనకెట్టి భయమూ లేదు. మనదరికిరాదు. మీరు నిశ్చింతగా యుండుడని పలుకు, కుమార్తె మాటలకు ఆజననీ జనకులు అమితానందముతో "తల్లీ నీకోర్కెనెరవేరుగాక" యని ఆ దంపతులు సాక్షాత్ పరమేశ్వరీ అంశమగు కుమార్తె నిర్ణయం సరియైనదని, కుల సంఘీయుల మాటలు లెక్కింపనవసరం లేదని మిన్నకుండిరి. అయిననూ అజ్ఞానుల ప్రవర్తనలకు అద్దు ఆపులేకుండునుగదా. కులపెద్దలనేక సమావేశము లేర్పరచి, చివరకు దీక్షితశర్మకుటుంబమును కులమునుండి బహిష్కరించిరి. అందులకు శర్మదంపతులు భయపడక అమాయక పెద్దల తీర్పునిదలంచి ఆత్మస్థైర్యమునకు మించినది లేదని, భావించి కాలము గడుపుచుండిరి. యిట్లు కొన్నాళ్ళు గడిచిన పిదప సంఘపెద్దలు ఈ విషయము నింతటితో వదిలిన పెద్దల గౌరవమేమి సంఘ కట్టుబాట్లు మట్టిలో కలిసినట్లని, కోపోద్రేకులై ఒకనాడు సంఘ సమావేశముపెట్టి దీక్షిత కుటుంబమును పిలిపించి గ్రామ బహిష్కరణ తీర్మానము చేసి, తీర్మానములు చదువనారంభించిరి. 1. దీక్షితశర్మగారు సంఘధర్మములకు విరుద్ధముగా ప్రవర్తించి నందులకు వారిని సంఘము నుండి బహిష్కరించితిమి 2. ఆ పిదప వారు సంఘాధ్యక్షుల వారికి ఎలాంటి సమాచారము గానీ, తప్పిదము నొప్పుకొని విజ్ఞానముగానీ తెలుపనందులకు, వారి కుటుంబమును గ్రామమునుండి బహిష్కరించుటకు సంఘమువారకి హక్కు కలదని, యిందుమూలముగా దీక్షితకుటుంబమునకు తెలియజేయడమైనదని తెలిపిరి. ఆ మాటలకు కోపోద్రిక్తురాలైన సర్వమంగళ అచట సంఘనాయకులను గాంచి ప్రణయకాలమందలి భద్రకాళివోలే, రౌద్రస్వరూపిణియై యిట్లనెను.





కులసంఘ నాయకత్వముచే కులశ్రేష్టులమను గర్వమా? వేదాధ్యయన సంపన్నులమను అహంకారమా? మీ ఆజ్ఞను శిరసావహించలేదని కోపమా? బ్రహ్మజ్ఞానంలేని మీరు బ్రాహ్మణులా? మాయాంధకారములలో బడి మీరు చెప్పినతీర్పు పాటించలేదని సుజ్ఞానుల బాధించుటే మీ లక్ష్యమా? అరిషడ్వర్గములలో జిక్కి అజ్ఞానాంధకారములలో బడిన మీరు మమ్ము కులమునుండి వెలివేసిరి. అంతటితో ఆగక మిమ్ములను ప్రాధేయపడలేదని గ్రామ బహిష్కరణ చేతురా? మీ ఆజ్ఞలు అమాయకులవద్ద చెల్లును. మీ బెదిరింపులకు బెదురు వారిచ్చటలేరు. అంటూ సుజ్ఞానబోధ చేయసాగెను. మీరు నిర్ణయించినవాని వివాహము చేసుకోలేదను కోపమున యింతచేసితిరి. నాకు మీరు పతి నన్వేషింపబనిలేదు. నా పతి జగద్రక్షకుడగు సర్వేశ్వరుడు, నేను ఈ పుణ్యదంపతుల అనన్యభక్తికి సంతసించివారికి పుత్రికనైన ఆదిశక్తిని, నాపతి చేరుసమయమునకై నిరీక్షించుచుంటిని మేమెవరిమోచూచి మీ జన్మలు ధన్యత గావించుకొనుడు. బ్రాహ్మణయింట పుట్టినందులకు మీలో కొందరికైననూ జన్మరాహిత్యమును, పొందు మార్గమును జూపింతును మనమందరము జగద్గురువులగు శ్రీ'శ్రీశ్రీ సనారీ విశ్వనాధుని దర్శించి తరించి మీ జన్మలు ధన్యము చేసుకొండని పలుకగా, సంఘ ప్రముఖులు ఆమె మాటలలోని గాంభీర్యము ముఖమందలి బ్రహ్మతేజస్సు సూక్ష్మ గ్రాహ్యులు గమనించిన కొందరు ఈ సంగతి ఏదో తెల్చుకుందామని, మరికొందరు చిన్న పిల్లమాటలకు, ఎక్కడికో పోయి ఏమి శ్రమలు పడతామని తర్జన భర్జనలు జరిపి, కొందరు ప్రయాణసిద్ధమవగా, తల్లిదండ్రులతో సర్వమంగళ బయలు దేరగా మంత్రముగ్ధులై కొందరు ఆమెవెంట నడచుచూ మహారణ్యమున ప్రయాణించి ఒక కొండగుహ వద్ద సర్వమంగళ ఆగి, నా స్వామి యిచట తపోనిష్టయందుండెను. భక్తిభావమునముకుళితహస్తములతో వచ్చిన, ఆదివ్య మంగళ విగ్రహమును చూడగలరని, గుహలోనికి ప్రవేశించెను. తల్లిదండ్రులు సంఘీయులు వరుసగా దైవనామస్మరణతో ఆమెవెంట వెళ్ళిరి. కొంతదూరము వెళ్ళి సరోవరము దాటగా, కొంత దవ్వునగల శిలావేదికపైదివ్య తేజస్సుతో వెలుగొందుచూ, తపోనిష్టయందున్న దివ్య పురుషుని గాంచి, దిగ్భ్రమచెంది, ఆమహాకాంతిని నేత్రములతో చూడజాలక, కన్నులార్చుచూ, భక్తిభావముతో చూచుండిరి. అంత సర్వమంగళస్వామి చెంతజేరి, మమ్మూరు ప్రదక్షణలు గావించి, స్వామి వారి పాదములకు నమస్కరించి స్తుతించగా, స్వామి చంద్రోదయమైనట్లు , చల్లని చూపులతో మందహాసంతో, అచటివారందరినీ వీక్షించిరి. అంత సర్వమంగళ బ్రహ్మానందభరితురాలై "స్వామి తమఅర్ధాంగిని మీ ఆజ్ఞకు బద్ధురాలనై వచ్చితినన" స్వామి వారు వామభాగముచూపగా సర్వమంగళ ఆసీనురాలయ్యెను. దీక్షిత సుశీలాంబా, విప్రబృందము మహాభక్తిశ్రద్ధలతో ప్రార్థింపగా, సనారీ విశ్వనాధుడు వారికి జ్ఞానబిక్షనొసంగి ఆశీర్వదించిరి. వారందరూ ఏకకంఠముతో ఆది దంపతులను ధ్యానించుచూ అర్ధరాత్రి వరకూ మేల్కాంచి, సమ్మోహనాస్త్రం ప్రయోగము పగిది, సుషుమ్నావస్థయందు నిమగ్నులైరి. వారు తెల తెలవారుతుండగా జాగ్రదావస్తకువచ్చి చూడగా ఆది దంపతులు అదృశ్యులైరి. పరిసరములన్నియు గాంచి, సనారీ సాక్షాత్కారమునకు సంతసించుచూ, భక్తిభావమున అనేక విధములుగా కీర్తింపుచూ, ఎవరియిండ్లకు వారు బోయిరి. దీక్షితసుశీలాంబలు ఆదిదంపతులనారాధించుచూ, జగన్మాత పుత్రికయై 10 సంవత్సరములు తమ యింట తిరిగి నందులకు అమితానందము నొందుచూ, అంత్యమునకు పరమాత్మ యందులీనమయిరి.

**ఇది శ్రీమద్గాయత్రీ విశ్వకర్మ పరమేశ్వరులచేనుత్పన్నమైన సానగాది పంచబ్రహ్మఋషి గోత్రములలోని ద్వితీయ మగుసనాతన బ్రహ్మఋషి గోత్రమందలి పర్ణబ్రహ్మఋషి గోత్రోద్భవులైన బ్రII సుగంధం ఆదినారాయణ, అన్నపూర్ణాంబల పౌత్రుడు, వెంకటేశ్వరరావు పాపాయమ్మలకు**

సమర్ధ సద్గురు శిరిడి సాయివరప్రసాదలబ్ధ "సుపుత్రుడును" విమలాదేవి మనోహరుండు, యింద్రకీలాద్రిపై వెలసిన శ్రీశ్రీశ్రీ కనకదుర్గామాతా కరుణాకటాక్ష వీక్షణలతో విలసిల్లు విజయవాడ నగరవాసుడును "జగజ్యోతి" శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి లోకమున కెఱుక పరిచిన భవిష్యకాలజ్ఞాన వాక్యప్రకారముదయించిన పరమ శివావతారులగు "జగద్గురు" శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధుల పాదసేవకుడును। తణుకు సాంబశివానంద రాజయోగి ప్రియశిష్యుడు 1. సనారీ నిత్య పూజా విధానము, 2. సనారీశ్వరవ్రత సంకల్పనము, 3. సనారీ యోగజ్ఞానామృతము, 4. సనారీ మాలాధారణ కర్త 5. సనారీ పూజాప్రచారకులు, సనారీ పీఠాధిపతి, శ్రీశ్రీశ్రీత్రిశక్తీ, సహస్రలింగ సహిత విశ్వనాధాలయ నిర్మాణాధ్యక్షులు, 6. పూర్వాశ్రమమున నవరత్న స్వర్ణాభరణ నిర్మాణ శిల్పి, వాస్తుజ్యోతిష సిద్ధాన్తి , పౌరాణిక నటకుండగు బ్రహ్మశ్రీ సుగంధంసాయి బాబాచార్య స్వామిజీ (విశ్వకర్మ) విరచిత శ్రీ సనారీ విశ్వనాథ విజ్ఞానం మహిమలు శ్రీశ్రీశ్రీ సనారి సంవాద గ్రంధార్థముల గ్రంధ రచయిత

పంచమాధ్యాయము సమాప్తి

❀ ❀ ❀

**(80) బ్రహ్మసంతతి వారునిత్యం ఆచరింపవలసినది :**

ప్రాజ్ఞుడైనవాడు బ్రహ్మముహూర్తమునందు నిద్రలేచి ధర్మార్ధములను చింతింప వలయును. వాటివలన వచ్చిన శరీరకష్టమును, వేదతత్త్వార్ధమును గూడవిచారించ వలయును. పిదప యధావిధిగ శౌచమునాచరించి పరిశుద్ధమయిన నదులయందు, గానీ, కాలువయందు గానీ, భావినీటియందు స్నానమాచరించి శరీరశుద్ధి గావించుకోవలయును. నరులు నిద్రించునపుడు శరీర మందలి సూక్ష రంధ్రములద్వారా మలినములు బయల్పడును. కావున శరీరశుద్ధి అత్యావశ్యకము. స్నానము చేయనివారు గావించు పంచయజ్ఞములందు ప్రాశస్త్యములభించదు. అనారోగ్యులు శిరస్సువదిలి స్నానమాచరించవలయును.

జలాధిష్ఠాను దేవతామంత్రముల చేతను, ప్రణవముతో కూడిన మార్జనమును, సూర్యోపాసనను, గాయత్రి జపమును ప్రతిదినము 3 కాలములందును చేయవలయును.

**పంచయజ్ఞములు :**

1. **బ్రహ్మ యజ్ఞము:** వేదములు విశ్వకర్మోపనిషత్ బ్రహ్మంగారికాలజ్ఞానము, సనారీ సంవాదము ఉపనిషత్తులు, విశ్వకర్మ పురాణాది సద్గ్రంధములు చదువుట, ప్రణావాది మంత్రములు జపించుట.
2. **పితృయజ్ఞము:** మాతాపితృలనుచక్కగా నిత్యమూ సంరక్షించుటసేవించుట, జల తర్పణాదులచే పితృదేవతలను తృప్తిపరుచుట, మొదలగునవి.
3. **దేవయజ్ఞము :** దేవతలను ఆరాధించుట , వారని గూర్చి అగ్నియందు హోమము చేయుట.
4. **భూతయజ్ఞము:** గోవులకు , కుక్కలకు కాకులకు మొ॥వాటిని ఆహారమిచ్చుట.
5. **అతిథియజ్ఞము :** అతిధులకు, అన్నార్తులకు, యతులకు, రోగులకు దరిద్రులకు అన్నము పెట్టుట. "మానుషయజ్ఞ"మని అందురు.





సనారీ ఉవాచః సనారీ సంవాదము, చరిత్ర, మహిమలు

గీ॥ వినిన చదివిన వ్రాసిన వేడుకొన్న వారలకు గల్గుయిహ పరవశ్యశుభము।
పూజ చేయువారికి భుక్తిముక్తియు బ్రహ్మపదమంత వారలపాలుగదా॥

గీ॥ యిరువేళలనీ గ్రంధము తరచుగ పఠించు వారు తత్వజ్ఞులగున్।
పరసాధనవారిదే గదా హరి హర బ్రహ్మాదులైన వారి సరౌనా॥

**(81) పట్టాభిషేకం**

గీ॥ చదివి పట్టాభిషేకంబు జరుపువారి పుణ్యమేమని చెప్పుదు పూర్ణమైనభుక్తి।
ముక్తియు జ్ఞాన సంపూర్ణయశము కలిగి నాయందు నైఖ్యంబుగలుగబడును।

ఈ సనారీ విశ్వనాధ విజ్ఞానం, మహిమలు

**(82) ఫలశృతి :**

ఈ సనారీ విశ్వనాధ విజ్ఞానం, మహిమలు చదివిన వారికి, వినినవారికి, ప్రచారం చేసినవారికి శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధుని, యంత్రమును, గ్రంథమును నిత్యమూ పూజించువారికి, శ్రీవారి మూలమంత్రము నిత్యము 108 సార్లు జపించు వారికి, జగద్గురు, సద్గురువులు, మద్ గురుదేవులునగు సనారీ విశ్వనాధుడు "సనారీ సంవాదమందు తెల్పినట్లుగా, సకల కోర్కెలు తీర్చి యిహపరసౌఖ్యములనిచ్చి, కంటికిరెప్పవలే కాపాడుచూ, అంత్యమున ఆదేవదేవుని యందు ఐక్యము చేసుకొందురు. యిది ఆ సనారీ ఆజ్ఞగాగైకొని, భక్తి ప్రాధాన్యముగా,ముక్తియే పరమాశయంబుగా రచియించిన, ఈ కధయావత్తు పూర్ణముగా సంపూర్ణము

ఓం, శ్రీ సనారీ విశ్వనాధాయై నమః

శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

సేకరణ -రచన: సుగంధంసాయిబాబాచార్య స్వామీజీ (విశ్వకర్మ)

శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాధాలయ నిర్మాణాధ్యక్షులు

దేవాలయం అడ్రసు

మహానాడురోడ్ నెం - 7,
తాడేపల్లిపోస్టు& మండలం, గుంటూరుజిల్లా - 522 501, నవ్యాంధ్ర
సెల్ : 9290582110, 9032253205, 8099203873

## సనారీవార్ని సేవించినవారి చరిత్రలు - మనసులోని మాట

కర్మభూమియగు మన భారతావనిలో ఎందరో దైవాంశ సంభూతులు, మహాపురుషులు, మహాతపఃశ్శక్తి సంపన్నులు, ఎందరో మహానీయులుద్భవించిరి. అందరికీ వందనములు. విను వీధిలో లెక్కకు మించిన తారకలున్ననూ, సూర్య చంద్రులే సమస్త జీవరాసులకు ప్రాణాధారులైనట్లుగా, "విష్ణ్వాంశగా" పోతులూరి వీరబ్రహ్మంగారు, "శివాంశగా" సనారీ విశ్వనాథావధూత గారూ, విశ్వబ్రాహ్మణ వంశమున జన్మించి కులోద్ధారకులై పంచాననులకు పూర్వ ఔన్నత్యమును ప్రసాదించిన పురాణ పురుషులు వీరు హిందూమత సనాతన సాంప్రదాయములకు జీవం పోసి ఆధ్యాత్మిక వినువీధిలో సూర్యచంద్రులై ఆధ్యాత్మిక పరులకు తమ దివ్య సందేశములనిచ్చి, యోగాభ్యాసపరులకు, ముముక్షువులకు, మంత్రసాధకులకూ ఆశాజ్యోతులై చిరస్థాయిగా నిల్చిరి. వీరు భూగోళమునకు గల ఉత్తర, దక్షిణ ధృవముల వలే ఒకరు తూర్పు ప్రాంతమున, ఒకరు పడమర ప్రాంతమున జన్మించిన "శివకేశవులు" సాక్షాత్ మహావిష్ణువు మను(శివ) వంశమున వీరబ్రహ్మేంద్రునిగా, సాక్షాత్ పరమశివుడు మయ (విష్ణు) వంశమున విశ్వనాధునిగా జన్మించి జగతికి శివకేశవబేధములేదని "శివాయ విష్ణు రూపాయ" "విష్ణు రూపాయ శివయే " అను వేదవాక్యమును ఋజువు పరచిరి వీరినిస్తుతించుట సహస్ర శీర్షుడైన ఆదిశేషునికే సాధ్యం కాదేమో. అట్టి వీరి అద్భుతలీలలు వర్ణింప మానవులకు ఎంతవరకు సాధ్యపడును. నా పూర్వజన్మ సుకృతమేమో గానీ హరనామస్మరణయన్నా భక్తిగీతములు విన్నాపరమేశ్వరుని పురాణగాధలు వినుచున్నా హృదయమానందపరవశమై, నేత్రములానంద భాష్పములతో గొంతుగద్గధమై నోట పలుకురాని స్తితితో ఆనందసాగరమున ఓలలాడుచుందును. ఎంత ప్రయత్నించిననూ ఈ భావోద్రేకము నుండి త్వరగా బయల్పడ లేకున్నాను. యిది మానసిక దౌర్భల్యమో విధాత ప్రసాదించిన వరమో తెలియరాకున్నది. నా ఈ పరిస్థితికి శివపక్షపాతినని చెప్పకయే తెలియుచున్నది. అట్లని విష్ణుద్వేషినిగాను ఈ పరిస్థితిలో సదా హరనామస్మరణ యోచన, ధ్యానము వేయేల సమస్తము శివభావనలతో సదాహృదయంనిండియున్నది. సర్వమానవులను ఉద్ధరించుటకు జన్మించిన ఈ హరిహరుల దివ్య ప్రభోదనలచే, దర్శన, స్పర్శన, సంభాషణలచే ఆనాడు ఎందరినో తరింపజేసిరి. భవిష్యత్తులో యింకెందరో తరించనున్నారు.

ప్రముఖ చరిత్రపరిశోధకులగు శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ చౌదరిగారు రచియించిన "విశ్వబ్రాహ్మణుడు తెనాలి రామలింగడు" చరిత్ర ఆధారంగా శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో గల భువన విజయం లోని "అష్టదిగ్గజములలో" వికటకవిగా" ప్రసిద్ధి నొందిన రామలింగడు "ధీరజనమనో విరాజితమను" కావ్యగ్రంధమును రచియించి బ్రహ్మసంతతి వారగు విశ్వబ్రాహ్మణులకు ఋషి సంతతివారగు విప్రులకు గల ద్వేషభావముచే అమరుడు విశ్వబ్రాహ్మణులను కించపరుస్తూ అమరకోశమును రచించిన పిమ్మట అతడు ఆహారమును భుజింప బోవునపుడాహారము క్రిమిమయంగా కన్పించుటచే ఏ ఆహారమును భుజింపలేక శుష్కించి పోవునపుడాతని తల్లి మాలినీదేవి నాయనా నీవు బ్రహ్మసంతతి వారిని హీనపరచి గ్రంధము రచియించుటచే నీకీ దుస్థితి కల్గినది. నీవు మరల వారి యధార్ధ విషయములతో పూర్వ వైభవమును రచియించిన నీకీ దోషము తొలుగునని చెప్పగా అమరుడు పశ్చాత్తాప హృదయుడై మరల పంచాననుల ఔన్నత్య ప్రతిభలతో "మూలస్తంభ" గ్రంధరచన జేసి దోష విముక్తుడాయెనని గ్రంధ రచనచేసినట్టి రామలింగకవికి దేవరాయలు వారు అరిణెముగానిచ్చినట్టి మాన్యములలో గల తెనాలి గ్రామమందలి విశ్వబ్రాహ్మణులు సదాచార సంపన్నులు శివభక్తాగ్రగణ్యులు పంచవృత్తులచే జీవించెడి





పంచాననులుకలరు. వీరు సాక్షాత్ శివాంశయగు సనారీ విశ్వనాధుని త్రికరణశుద్ధిగా నమ్మి సేవించుతూ నిర్మలముగా జీవించెడి పౌరుషేయ కుటుంబములలో సువర్ణ సూర్యాకాంతం దంపతులు కలరు. వారు సనారీవారు తెల్పిన ఆధ్యాత్మిక బాటలో పయనిస్తూ....

### 1.శ్రీశ్రీశ్రీసువర్ణసూర్యాకాంతస్వామి, మాతాలక్ష్మీనర్సమాంబపుణ్యదంపతుల చరితము



**గీ॥ మోక్షంబుగల్గు కర్మలమూలమెరిగి।**
**పాపకార్యములన్నియుపారజిమ్మి।**
**దేవునికి ప్రీతిజేయును ధీరవరుడు।**
**అటులగలనరు తపమునాలాగనుండు।**

ఈ పద్యము సనారీవారి స్వహస్తములతో "సనారీసంవాదము" నందు లిఖించిరి. సువర్ణ సూర్యాకాంతం గారు ఈ పద్ధతిగా సనారీవారు తెల్పిన యోగమార్గములు బాల్యము నుండి ఆచరించుతూ ఐహిక విషయములందు అనాసక్తులై, వైరాగ్యభావనలు గల్గి యోగసాధనలు చేయుచూ, యింటినివదలి మహా పుణ్యక్షేత్రము, సాక్షాత్ పార్వతీ పరమేశ్వరుల నివాసమూ, సనారీవారున్నటువంటి శ్రీ శైలంలో యోగనిష్ఠులై యుండిరి. వీరి అన్నగార్కి సంతానలేమిచే తీవ్రమగు కలత చెందుచూ, తమ్మునికి కల్యాణం జరిపించిన, వారసులుందురని ఊహించి, శ్రీశైలం వెళ్ళి సోదరుని గుర్తులు సాధువులకు చెబుతూ, మఠములు, గుహలు, నిర్జన ప్రదేశములందు తిరుగాడి ఎట్టకేలకు అనుజుని ఆచూకీ తెలుసుకొని, యోగనిష్టయందున్న తమ్మునిగాంచి, పాదముల చెంతకూర్చుండి యోగనిష్ట నుండి లేచు సమయంలో, ఆతని కాళ్ళు పట్టుకుని, నా కోర్కె తీర్చుదునని మాటయిచ్చువరకు పాదములు విడువనని పట్టుబట్టిరి. అన్నగారి మనసెరింగిన సూర్యాకాంతంగారు "నీ కోర్కె తప్పక తీర్చెదనని" మాటయిచ్చిరి. అన్నగారు వెంటనే నేను నీకు సత్ సాంప్రదాయ కుటుంబమందలి కన్యను వివాహము చేయ నిశ్చయించితిని. యిపుడు నీవు నాతో వచ్చి వివాహం చేసుకోవలయుననిరి. అన్నా! నా మనసెరింగియూ నన్నిట్లు బలవంతపెట్టుచున్నావు. సరే! నాకయిష్టమయిననూ, నీకిచ్చిన మాటకు బద్ధుడననిరి. ఆ మాటలకు అన్నగారు ఆనందించుచూ, వివాహమయిన ఈ వైరాగ్యముపోవునని, తమ్ముని తోడ్కొని తెనాలిపట్టణం చేరి, అంతకుముందే నిర్ణయించిన దూరపుబంధువుల కన్యయగు లక్ష్మీనర్సమాంబతో, అతివైభవంగా వివాహం జరిపించిరి. పెండ్లికుమారునిగా పెద్దల ఆశీర్వాదములు పొందవలసిన సూర్యాకాంతంగారు పసుపుబట్టలతోనే వేదాంత బోధనలు చేయుచూ, వినువారిచే పాదనమస్కారములు చేయించు కొనుటగాంచిన అన్నగారు, తీవ్రమనస్తాపము చెంది, ఔరా! నేనెంతో వ్యయప్రయాసలకోర్చి నీ కల్యాణం జరిపించితే, యిపుడే నీ వైరాగ్యము వేదాంత ప్రభోదనలా? మా మనస్సులు క్షోభపెట్టి నీవు సాధించునదేమి? జగజ్యోతి వీరబ్రహ్మేంద్ర స్వామి రాజయోగియై సంతాన వంతుడై జగద్గురువనిపించుకొనలేదా? నీవు ఆరాధించు "సనారీ" వారు పెద్దలయాజ్ఞచే కల్యాణం చేసుకొని కాపురముండలేదా? అంతకన్నా నీవు గొప్పవాడవా? కల్యాణ వేదికను వేదాంతవేదిక చేయుచున్నావు, నీ చేష్టలు బ్రతికి బాగుపడువారివలే గాక, అల్పాయుష్కుని ప్రవర్తనవలే యున్నవని, వెంటనే తన ఆవేశమునకు పశ్చాత్తాపం చెందుచూ, ఆశీర్వదించవలసిన సమయంతో,

ఈ అనర్ధపు మాటలేమిటని తన్ను తాను నిందించుకొనుచూ మౌనము వహించి ఎట్లో వివాహ వేడుకలు పూర్తిచేయించి, తమ్ముని మరదలిని తీసుకుని యిల్లుజేరి, తమ్ముని వైరాగ్య ప్రవర్తనలు చూడలేక, తోడబుట్టినవానికి ఆస్తిని పంచి వేరే యింట కాపురము పెట్టించిరి. సూర్యాకాంతంగార్కి సంసార జీవితముపై మక్కువలేని కారణమున, ఒకనాడు భార్యతో, శారీరక సౌఖ్యమందు నాకు మక్కువలేదు. అన్నగారి కోర్కెపై వివాహం జేసుకొంటిని. సంసారిక జీవితము నాకు వలదు. నిన్ను వివాహమాడినందున, నీ జీవిత పోషణకు కావలసిన ధనమిచ్చెద. నీ పుట్టింటికేగి నీ మనస్సుకు నచ్చినట్లు నీ జీవితమును గడుపుకొమ్మనిరి. అందులకా మహాపతివ్రత నాకే ధనము వలదు. నే నెచటకు పోను. నా జీవితము మీ సన్నిధిలోనే ముగియవలెను. మీ పాదసన్నిధియే నాకు మహాభాగ్యము, స్వర్గతుల్యమనిరి. ఆ మాటలకు సూర్యాకాంతంగారు అటులయిన సంసారసంబంధములేక, నీ విచటనే ఉండవచ్చును. నా ఆధ్యాత్మిక జీవనముకెట్టి అవరోధములు కల్పించక, నా ఎదురు పడక యుండుమనిరి. ఆ మహాపతివ్రతామతల్లి అట్లే జీవనము చేయుచూ, పతి దేవున కేసమయమునకేది కావలయునో శిష్యుల ద్వారా అందించుచూ, శిష్యులకు ఉపదేశించు యోగ సాధనా పద్ధతులను తెరచాటుగా వింటూ ఆచరించుచూ, మంచి యోగవిద్యా ప్రవీణురాలయ్యెను. 1895లో సూర్యాకాంతంగారు 101 మందికి ఉపదేశం చేయుటకు నిశ్చయించుకొని ఉపదేశము లిచ్చుచుండిరి. 100 మందికి దీక్షనిచ్చి యింకొక వ్యక్తి తగ్గుటచే, మనోదృష్టితో చూచి శిష్యుని పిలిచి ఈ రోడ్డు చివరలో పల్లెవాసియగు బాలుడు కౌపీనధారియై వస్తున్నాడు. ఆతనిని తీసుకురమ్మన్నారు. ఆలపాడు గ్రామవాసియగు విశ్వబ్రాహ్మణబాలుడు "దుద్దుపూడి సూర్యకాంతాచారి" తండ్రికి బొగ్గులు తీసుకువెళ్తుండగా శిష్యులు అతనిని గురువుగారి వద్దకు తీసుకువెళ్ళారు. ఆ బాలునితో సహా ఆనాడు 101 మందికి ఉపదేశం చేసారు. నాటినుండి ఈ బాలుడు గురువుగారింట్లో ఉండేవాడు. గురుపత్ని ఈ కుర్రవానిని బిడ్డాయని పిలిచి గురువుగార్కి కావలసినవి వానితో పంపుతుండేవారు. యిలా కొన్ని సంవత్సరములు గడిచినవి. సనారీవారు రాజమండ్రిలో నవ పాషాణములు తిని లోహపాత్రపై మూత్రించి అపరంజిగావించిన క్రమంలో తాను కూడా అట్లు చేయవలెనను తలంపుతో, సూర్యాకాంతంగారు ఒక్కొక్క పాషాణము తిని జీర్ణించుకొనుట అభ్యసించుచుండిరి. కొన్నాళ్ళకు 6 పాషాణములు తిని జీర్ణించుకోగలిగిరి. అప్పటికి వారు విసర్జించిన మలంలో రజిత భస్మము వెలువడెదట. ఈ క్రమంలో 7వ పాషాణము బేధించుటచే, అచట గల తన శిష్యబృందంతో నేను కైలాసంలో గురుసన్నిధికి పోతున్నానని చెప్పి ఫాల్గుణ శుద్ధ సప్తమినాడు శివైక్యముచెందిరి. అది చూచిన నర్సమాంబమాత పతి దేవునితో సహగమనము చేతునని తెల్పిరి. అచట గల భక్తులా విషయాన్ని ఆనాటి బ్రిటీష్ అధికారులకు తెల్పిరి. సూర్యాకాంతంగారు సాయం సంధ్యా సమయమున అస్తమించిరి. ఆనాటి రాత్రి శిష్యులలో ఒకరగు పొరుగు గ్రామవాసి స్వప్నమందు కన్పించి, నేను మారీసుపేటలో గల నీ స్థలమందు శాశ్వతముగా నుండదలచితిని. నా సమాధికి స్థలం యిమ్మనికోరారట. శిష్యుడు నిద్రమేల్కాంచి యిలాంటి కలగంటినేమిటి, దీని భావం గురువుగార్ని అడిగి తెలుసుకుందామని తెల్లవారుజాము కావడంతో, చీకటితో బయలుదేరి తెనాలి గురువు గారింటికి వెళ్ళి అచటి పరిస్థితిని గాంచి, యిదేమిదైవలీల? నిన్న ఉదయం గురువుగారితో మాట్లాడి తన సందేహములు తీర్చుకొంటిని. కలలో కూడా ఊహించని అఘాయిత్యం జరిగినదని చింతించుచూ, యింక తమకు యోగరహస్యములు తెల్పువారెవ్వరు? భవసాగరము దాటింపమాకు దిక్కెవరని తోటి శిష్యులతో ఏడ్చుచూ, గురుదేవులు తన స్వప్నమందు చెప్పినది ఆజ్ఞగా శిరసావహింతునని, ఆ విషయాన్ని అచట గల వారందరకూ తెలియపరచి,





ప్రస్తుతం మఠం గల ప్రదేశంలో సమాధి చేయుటకు ఏర్పాట్లు చేయుచుండిరి. ఈ ప్రదేశం తెనాలి పట్టణానికి చివరన గల పంటభూములు. వీరిశిష్యుడగు దుద్దుపూడి సూర్యకాంతాచారిగార్కి సత్యవతితో వివాహమయి, ఆమెకు యిద్దరు అమ్మాయిలు, ఒక అబ్బాయి జన్మించారు. ఆమె సంపూర్ణ ఆరోగ్యవంతురాలు కాని కారణంగా బంగారమ్మ అనే కన్యను ద్వితీయ వివాహమాడి ఆమెతో కాపురం చేస్తూ ఆమెకు ముగ్గురు ఆడపిల్లలు. ఒక అబ్బాయిని పొందిరి. దుద్దుపూడివారు గురువుగారి ఆజ్ఞతో శ్రీశైలం వెళ్ళారు. గురువుగారు అస్తమించునపుడు వీరు శ్రీశైలంలో ఉండి ఆనాటి రాత్రి దుస్వప్నములతో మనసు కలతచెంది రాత్రంతా నిద్రపట్టకపోవడంతో వెంటనే తెనాలి వెళ్ళిపోవాలని తెల్లవారుఝామున తెనాలికి ప్రయాణమైరి. తెనాలిలో మరునాడుదయము మహాపతివ్రతా శిరోమణియగు లక్ష్మీనర్సమాంబ పతిదేహంతో తాను అభ్యంగ స్నానాదులాచరించి పసుపుకుంకుమ పారాణీలతో చేతినిండా గాజులు వేసుకుని, కొప్పునిండా పూలమాలలు ధరించి, నూతన వస్త్రములతో తానలంకరించుకొని, పతిదేవునకు అలంకరింపజేసి, శ్రీ గంధకుంకుమ విభూతి రేఖలు తీర్చిదిద్ది, అంపశయ్యపై పతితో తానునూ కూర్చుండి, పతి శిరస్సు వాలకుండా చేతపట్టుకుని పతి దేవుని వామహస్తంతన భుజముపై వేసుకుని తెనాలి పట్టణ పురవీధుల నుండి విశ్వబ్రాహ్మణ బృందములు, బంధుమిత్ర శిష్య పరివారములు వెంటరాగా, మేళ తాళములతో పెద్ద కోలాహలంగా ఊరేగింపు బయలుదేరినది. పట్టణమందలి జనులు, కులమత భేదం లేకుండా స్త్రీ పురుషాదులు ఆ పుణ్యదంపతులకు పసుపు, కుంకుమ, కర్పూర నీరాజనములతో హారతులిచ్చి, సమాధిచేయు గ్రామ శివారు వరకూ పట్టణ ప్రజలంతా తరలివచ్చి అమ్మవారి సహగమనాన్ని అత్యంత ఉత్కంఠతో తిలకించుచుండిరి. సమాధిస్థలంజేరిన పిదప అమ్మవారు పతిదేవునకు ముమ్మారు ప్రదక్షిణ నమస్కారములాచరించి, పతిదేవుని సమాధి యందు యోగముద్రలో కూర్చుండబెట్టించి, తాను సమాధిలోనికి దిగి వామభాగమందు పద్మాసనాసీనయై కూర్చుండి, యోగముద్రలోనికి ప్రవేశించినది. కొంతసేపటికి తనబిడ్డడైన సూర్యకాంతాచారి వచ్చి గోడుగోడున విలపించుతుండగా, ఆసాధ్వి కనులు తెరచి బిడ్డా వచ్చావా? నీ కొరకే యింతసేపు ప్రాణము నిలిపితినని, యివిగో నీకు చెందవలసిన సమస్త వస్తువులు అని కొన్ని సువర్ణాభరణములు అతనికిచ్చి, అశేష ప్రజానీకము, ప్రభుత్వాధికారుల సమక్షమున కుండలినీ శక్తిని మేల్కొల్పి, మూలాధారము నుండి సహస్రారమును దాటించి, కపాలభేదనముచే ఆత్మను పరమాత్మయందైక్యముజేసి, పతిదేవునితో సహా కైలాసప్రాప్తి పొందినది. యిది గాంచిన వారందరూ మరల ఆ పుణ్యదంపతులకు కర్పూర నీరాజనము లొసంగుటకు తెనాలి చుట్టు ప్రక్కల గ్రామములందు కర్పూరము కరువయ్యెను. కర్పూరం దొరకని జనులు కైమోడ్పులతో నమస్కరించి ధన్యులైరి. యిదంతయూ తిలకించిన బ్రిటీషు ప్రభుత్వాధికారులు సమాధి చేయుట కంగీకరించిరి. ఈ సంఘటన తేనాలి రేపల్లె రైల్వే లైను వేస్తున్న రోజులలో జరిగింది. ఆ పుణ్యదంపతులచే బిడ్డాయని పిలిపించుకున్న దుద్దుపూడి సూర్యకాంతాచారి నాటినుండి ఆ సమాధి ప్రాంతమందు కాపురముంటూ, ప్రతీ శుక్ర, సోమవారములందు భజనలు చేయుచూ ప్రతీ ఫాల్గుణ శుద్ధ సప్తమి అయ్యవారికి, అష్టమినాడు అమ్మవారికి ఆరాధనలు చేయుచూ, అన్నసమారాధనలు, సాధుసంతర్పణలు చేయుచూ, వారి 95వ సంవత్సరంలో (1977లో) శివైక్యము చెందిరి. వారి కుమారుడు విశ్వనాథాచారి 60 సంవత్సరాలు జీవించి, తండ్రి చేయు ఆరాధనలు తానూ చేయుచూ (2004) లో పరమపదించినారు. ఈ కుటుంబంవారు నాటినుండి 2006 వరకూ ఆ మఠస్థలాన్ని చాలావరకూ కాపాడి తెనాలి విశ్వబ్రాహ్మణ సంఘంవారికి అప్పగించగా, 18 మాసాల వ్యవధిలో 20 లక్షల ఖర్చుతో సనారీవారి

మఠాన్ని బ్ర॥పూడి సత్యన్నారాయణగారి అధ్యక్షతన బ్ర॥ మండా సాయిబాబాగారు కార్యదర్శిగా; బ్ర॥ సింహాద్రి కృష్ణవరప్రసాద్ కోశాధికారిగా వుండి దాతలసహాయ సహకారములతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది, దుద్దుపూడి వార్కి అందులో ఒక గదిని కాపురానికి యిచ్చి, దుద్దుపూడి సూర్యకాంతాచారిగారి మనుమడైన లక్ష్మీకాంతాచారిని ఆ మఠానికి ప్రధాన అర్చకునిగా ఉంచినారు. సువర్ణ సూర్యాకాంతం దంపతులు శివైక్యము చెందిన పాల్గుణ శుద్ధ సప్తమినాడు 2007లో సనారీవారి విగ్రహ ప్రతిష్ఠ, ఆ పుణ్యదంపతుల సమాధులపై శివలింగ ప్రతిష్ఠ, నైరుతిలో వల్మీకము వద్ద నాగప్రతిష్ఠలు, 3 రోజులు అత్యంత వైభవంగా జరిపి షుమారు 6వేల మందికి కుల మత భేదం లేకుండా అన్నదానం చేసిరి. తెనాలి బ్రహ్మశ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రిగారి వేద పాఠశాల ప్రధానోపాధ్యాయులు బ్ర॥ఇడమకంటి జనార్ధనాచార్యులుగారి ఆధ్యర్యంలో వారి శిష్యబృందంతో వేద ఘనాపాఠీల సహకారంతో 3 రోజులు హోమాలు, సహస్రనామ కుంకుమార్చనలు, తర్పణలు అభిషేకములు "సనారీ వారు స్వహస్తములతో రచించి ప్రసాదించినట్టి విధానంతో, ఆగమ శాస్త్రబద్ధంగా నిర్వహించారు. దీనికి అనేక దూరప్రాంతమందలి భక్తులు, పండిత పామర, కవి గాయక ప్రముఖులు, సనారీ ఉపాసకులు, పీఠాధిపతులు విచ్చేసి శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాథుని అనుగ్రహమునకు, పుణ్యదంపతులు, సిద్ధులునగు సువర్ణ సూర్యాకాంతం దంపతుల కృపకు పాత్రులైరి. ఈ మఠంనకు సనారీ దేవాలయమునకూ వాస్తు సమకూర్చి శంఖుస్థాపన విగ్రహ ప్రతిష్ఠాది ముహూర్తములు నిర్ణయించినది. తెనాలి వాస్తు సిద్ధాంతులు అనకాపల్లి వాస్తవ్యులు బ్రహ్మశ్రీ పూడిరామకృష్ణ సిద్ధాన్తి గారు ఆత్రోట వాస్తవ్యులు వెలగలేటి నాగభూషణాచార్య సిద్ధాన్తి గారు, కలసి యిట్టి మహిమాన్విత క్షేత్రనిర్మాణమును రూపకల్పన చేసినారు. ఈ మఠ నిర్మాణమునకు ఆర్థిక సహాయమందించినవారు, ఈ నిర్మాణమునకు అహర్నిశలు శ్రమించిన తెనాలి పట్టణ విశ్వబ్రాహ్మణుల జీవితములు చరితార్థములైనవి.

**సనారీ ఉవాచ** : నా భక్తులు అవనికాలాగ్నిరుద్రులైచరించి, ఆ చంద్రతారార్కమూ। కీర్తింపబడుదు రన్నది అక్షర సత్యములైనవి గదా ॥

**సూచన** : సువర్ణ సూర్యాకాంతంగారు సనారీవారు తెల్పిన విషహరమంత్రమును అర్వణను లెక్కించకుండా అనుష్టించుటచే వారికది పూర్తిగా సిద్ధింపక వికటించుటచే ప్రాణహానియై 6 పాషాణములను మాత్రమే జీర్ణించుకోగలిగిరి. కావున ప్రతీ సాధకుడు అర్వణమగు మంత్రాన్ని అక్షరలక్షలు జపించిన మంత్రసిద్ధిని పూర్తిగా పొందగలరని నా భావన.

**మంత్రానుష్ఠానపరులు దీనిని గ్రహించి యోగ సిద్ధిని పొందగలరు**

## 2. మహాభక్త బ్ర॥ కొమ్మోజుకూర్మన్న గార్ని గురించి :-

**గీ॥ మగువా తెగువను విశ్వబ్రహ్మను, ధ్యానించువాడు దీనుడుగాకన్।**
**భగవంతుండౌను భగవంతుండు తనలోకలిసుండు బ్రహ్మంబతనే॥**

సనారీ వారు రచియించిన ఈ సూక్తి నాధారంగా జేసుకుని జన్మను ధన్యము గావించుకొన్న మహాభక్తుడు కొమ్మోజు కూర్మన్నగారు. వీరిది విద్యల నగరమని ప్రఖ్యాతిగాంచినట్టి విజయనగర సంస్థానములో విజయనగరం జిల్లా సాలూరు తాలూకాలో గల "మోసూరు" అనే పల్లెటూరు. వీరు భామాకలాప ప్రదర్శనల్లో భామా వేషం ధరించి మంచి కీర్తిని, బహుమతులను, ధనాన్నీ ఆర్జించినారు. వీరికి అష్టైశ్వర్యములున్ననూ సంతానము లేక ఆ దంపతులు ఎన్నో వ్రతములు,





తీర్థయాత్రలు, దానధర్మములు సల్పిరి. చాలాకాలం వరకూ సంతానములేమిచే స్వకులస్తుడగు రామలింగాచారి అనే విశ్వబ్రాహ్మణ బాలుని దత్తత తీసుకుని, అల్లారుముద్దుగా సాకుచుండిరి. వీరు సనారీ వారి శిష్య పరంపరలోనివారు. ఒకనాటి భామాకలాపములో ఆయన పాత్రకూ, గాత్రమునకూ, ముగ్ధురాలైన ఒక యిల్లాలు ఆయనను మోహించి, తన సంసారమును త్యజించి, కూర్మన్నగారితో ఉండిపోవుటకు నిశ్చయించుకొని, కార్యక్రమం అయిపోయి ప్రేక్షకులందరూ యిళ్ళకు వెళ్ళిపోయినా, తాను యింటికిపోక వేదికవద్దనే ఉండిపోయినది. కూర్మన్నగారు వేషం తీసి యింటికి పోవ సంసిద్ధులైనపుడు, ఆ గృహిణి దరిజేరి తనకోర్కెను తెలిపింది. కూర్మన్నగారు ఆమెకు పురాణములందలి పతివ్రతా గాథలను అనేకము చెప్పి, భారతదేశ సాంప్రదాయములు, ఉత్తమ స్త్రీ ధర్మములనుపదేశించిరి. ఎంతసేపు ఎన్ని నీతులు చెప్పినా, ఆమె తన కోర్కెకాదన్న ఆత్మహత్య గావించుకొందుననగా, కూర్మన్నగారు ఆమెను తన యింటికి తీసుకువెళ్ళి తన భార్యను, యుక్తవయస్కుడగు కుమారుని చూపి, హితోపదేశములు చేసి, ఎట్టకేలకు ఆ గృహిణిని ఆమె యింటికి పంపిరి. ఈ సంఘటనతో మానసికముగా విరక్తులైన కూర్మన్నగారు భామావేషములు వేయరాదని నిశ్చయించుకొని, ఏమి ఈ మాయామోహజగతియని పూర్తి వైరాగ్యమును బొంది, భార్యను పిలిచి కుమారునికి వివాహం జరిపించి ఆస్తిని, కుటుంబ బాధ్యతలనప్పగించి, నిర్జల ప్రదేశమునకుబోయి సనారీ వారు రచించిన గ్రంథమందలి యోగసాధనలతో, ఈ ప్రకృతి బంధాల నుండి తప్పుకొని బ్రహ్మైక్యం పొందుదునని తెలిపిరి. అప్పుడా సాధ్వి మీరు లేని ఈ ఆస్తులు, అంతస్థులు నాకూ వలదు. నేనూ మీతో ఉండి మీ సేవలు చేసుకుంటూ నా జీవితాన్ని ధన్యత గావించుకొందుననగా, దంపతులిరువురు కుమారుని చేరబిలిచి, నాయనా! నీకు వివాహం చేయ సంకల్పించితిమి. మన దూరపుబంధువుల పిల్లను మాట్లెడెదము. నీయభిప్రాయమేమనిరి. తల్లిదండ్రులారా! నా వివాహమునకిపుడేమి తొందరయనగా, అట్లుగాదు నాయనా! ఏ వయసున జరుగవలసిన ముచ్చట్లు అప్పుడు జరగాలి. అదిగాక నిన్నొక యింటివానినిజేసి మేము ప్రశాంతమగు ప్రదేశమునకుబోయి, యోగనిష్ఠయందు శేషజీవితమును గడుప నిశ్చయించుకొంటిమనగా, "ఆ దత్తపుత్రుడు" జననీజనకులారా! మీ వార్ధక్యమందు తోడుగానుందుననిగదా నన్ను దత్తత తీసుకుంటిరి. ఈ వయసున మిమ్ములను యింటినుండి బయటకు పంపి నేను సంసార సౌఖ్యములనుభవించుట ధర్మమా? మీరు లేని ఈ సిరిసంపదలు సంసార సౌఖ్యములు నాకు వలదు. నేను మిమ్ముకాచుకొనియుందుననగా, కుమారా! మేము మా సర్వస్వమూ నీ కొసంగి పోయెదము. ఈ పిన్నవయసున వైరాగ్యము నీకేల? రాజయోగివై నీవును వృద్ధాప్యమున మా బాటకురావచ్చుననిరి. రామలింగాచారి తండ్రీ! మీరు లేని యిచట ఒక్కక్షణమైననూ ఉండజాలను. మీరున్న ప్రదేశమే నాకు స్వర్గతుల్యము. మీ పాదసేవయే నాకు పరమావధియనెను. కుమారా! మా నిర్ణయము చాలా కష్టములతో కూడినది. పిన్నవయసున నీకేల ఈ బాధలు అని నచ్చజెప్పిరి. తండ్రీ! వేయి మాటలేల మీ పాదసేవయే నాకు పరమావధియనెను. అంతనొక దినమున ముప్వురూ యింటినుండి బయటకు వచ్చి తమకు గల ధన, ధాన్య, వస్త్ర, వాహనాదులను, చీనిచీనాంబరములను, రజిత, సువర్ణాభరణములను, తుదకు గృహమును కూడా దానమొసంగి, కట్టుబట్టలతో గ్రామం వీడి విజయనగరం రైల్వేస్టేషన్ చేరి అచట కూర్చుని నాలుగు కీర్తనలను ఆలపించగా, కొందరు వేసిన ధనముతో, విజయవాడ చేరి, ఆంజనేయవాగులో కొన్నాళ్ళు కాపురముండిరి. అచటగల "నగరాలు" వీరి చరిత్రను తెలుసుకొని, వారినుండి ఆధ్యాత్మిక విషయములు తెలుసుకొనుచూ, వారికి నిత్యజీవనమునకు కావలసిన స్వయంపాకములు

సమకూర్చుచూ, నిత్యం వేదాంత గోష్టులతో సత్సంగములు జరిపెడివారు. ఈ పరిస్థితులలో ఒక భక్తుడు "ఆవును" కూర్మన్న గారికి దానమిచ్చెను. ఆ గోమాతయు కూర్మన్నగారింటికి వేదాంత రహస్యముల నెరుంగుటకు ఏ సమయములో ఎందరు వెళ్ళినా, వారి "టీ" కి కావలసిన పాలు రోజుకు ఎన్నిసార్లు కావలిస్తే అన్నిసార్లు యిచ్చెడిది. యిలా కొంతకాలం విజయవాడలో గడిపి, ఒకనాడు సతీసుత సమేతముగా కూర్మన్న గారు శ్రీశైలం వెళ్ళి మల్లిఖార్జునస్వామికి అభిషేకాదులు గావించి రాత్రి అచటనే విశ్రమించిరి. నాటి తెల్లవారుజామున తమ ఆరాధ్యదైవమగు సనారీ వారు వచ్చి కూర్మన్నగార్ని తట్టి నిద్రలేపారట. నిద్రమేల్కొన్న కూర్మన్నగారు సాక్షాత్ గురుదేవులను గాంచి అమితానంద పరవశుడై సాష్టాంగ దండ ప్రణామంబుల నాచరించి పాదములను పట్టి గురుదేవా! ఈ భక్తునిపై కరుణతో వచ్చావా తండ్రీ యనుచూ, పరిపరి విధములుగా స్తుతించి, గురుదేవా! మీ సన్నిధికి తోడ్కొనిపొందని కోరారట. అపుడు స్వామివారు ప్రక్కనున్నవార్ని చూపి "ఈ సంత ఏమిటనగా" కూర్మన్నగారు మౌనం వహించగా సరే నీవు యిక్కడే ఉండు. నేను మళ్ళీవస్తానని వెనుదిరిగారట. వెంటనే కూర్మన్నగారు మంత్రముగ్ధునివోలె మగతలోకి వెళ్ళిపోయారు. మెలుకువ వచ్చేసరికి ఆ ముగ్గురూ యిపుడు విజయవాడ కృష్ణానదీ తీరమందలి గల సనారీ విజ్ఞానమందిర ప్రదేశమున ఉండిరట. ఈ పరిస్థితులను ఆలోచించిన కూర్మన్నగారు గురువుగారు వచ్చేవరకూ తానుండవలసిన ప్రదేశము యిదేయని నిశ్చయించుకొని, కొన్నాళ్ళు సతీసుతసమేతంగా పర్ణశాలనేర్పరచుకొని కాపురముండి, సత్సంగములు వేదాంత బోధనలు చేయుచూ "గురుతత్వమును" ప్రచారం చేయుచూ "కార్మికరత్న" సయ్యదు అప్పలస్వామి వంటివార్ని శిష్యులను గావించుకొని విజయ నామ సం॥ర పుష్య శుద్ధ చవితి శుక్రవారం (08-01-1954) తేదీన సమాధినిష్ఠను పొందుచున్నానని, అచటగల కుటుంబీకులకు, శిష్యగణమునకు, భక్తులకు, సాధువులకు తెలియపరచి, అశేష భక్తగణ సమక్షమున సమాధిని ప్రవేశించుతూ, భార్యకు నేను జీవసమాధిలోనుందును నీవు జీవించునంతవరకూ పసుపు, కుంకుమ, గాజులతో సమంగళిగాయుండి, అంత్యమున నా వామభాగమున సమాధికమ్మని అంతిమ సందేశమునిచ్చి, పద్మాసనాసీనుడై యోగముద్రలో కుంభకస్థితిలోనుండిరి. భక్తులు సమాధిపై బండరాయి పరచి పూజలుగావించి గృహోన్ముఖులైరి. ఆ పిదప ఆ మహాసాధ్వి నిత్య సుమంగిళియై నేటి కొత్త బస్‌స్టాండ్ ఎదురునగల భ్రమరాంబపురంలోగల విశ్వబ్రాహ్మణ యిండ్లకు వస్తూ, తమ చరిత్రను వేదాంత విషయములను తెల్పుచూ, గృహస్తులొసంగు స్వయంపాకంతో జీవనయాత్ర సాగించి, పతిదేవుని వామభాగమందు తాను, దక్షిణభాగమందు కుమారుడును, సమాధులైరి. అదియే నేటి కూర్మన్న గారి మఠం "శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాథ విజ్ఞానమండపము. 1970లో దీనికి బ్ర॥ ఎస్.ఎస్ శేఖర్ గారి ఆధ్వర్యంలో నిర్మాణ కమిటీగా ఏర్పడి బ్ర॥ అండలూరి శరభాచారి బ్ర॥ టేకి గంగాచారి బ్ర॥ కణితి విశ్వనాథం బ్ర॥ గొల్లపల్లి సర్వేశ్వరరావు బ్ర॥ ముక్కామల నారాయణమూర్తిగార్లతో కలసి విరాళములు వసూలుచేసి నిర్మాణము ప్రారంభించగా బ్ర॥ తమిరి మల్లిఖార్జునరావు శ్రీమతి చంద్రమతిగార్ల స్లాపు వేయించిరి. దానిని 1972లో నందిపాటి వీరాచారిగారితో ప్రారంభోత్సవముగావించిరి. తదుపరి 1991లో పునఃనిర్మాణంబు గావించవలెననే సంకల్పముతో విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘు అద్యక్షులు ఎమ్.ఎస్ ప్రకాష్, ప్రధానకార్యదర్శిగా, గొల్లపల్లి(శివ) అమరలింగేశ్వరరావు (కోశాధికారి) మారేపూడి దుర్గాప్రసాద్ గార్ల ఆధ్వర్యంలో విరాళములు వసూలు చేసి మరల పటిష్టంగా నిర్మించగా... 1991 నుండి విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘం కార్యాలయముగా నుంటూ స్థానిక విశ్వబ్రాహ్మణుల అంత్యేష్టి కార్యక్రమములకు





వినియోగపడుచున్నది. అనంతరం విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘంవారు శ్రీశ్రీశ్రీసనారీ విశ్వనాథ విజ్ఞానమండపమునకు సబ్‌కమిటీ వేసిరి. ఆ కమిటీకి అధ్యక్షులు బ్రహ్మశ్రీ గొల్లపల్లి అమరలింగేశ్వరరావు (శివ) ప్రధాన కార్యదర్శి బ్రహ్మశ్రీ అండలూరి ఏకాంబరరావు, కోశాధికారిగా, బ్రహ్మశ్రీ లక్కోజు బ్రహ్మంగార్లు నిర్వహణలో బ్రహ్మశ్రీ కొమ్మోజు కూర్మన్నగారి మఠం నిర్మాణం శ్రీ సనారీవిజ్ఞాన మండపముపై విజయవాడ విశ్వబ్రాహ్మణసంఘ కార్యాలయం నిమిత్తం ఒకగది నిర్మాణము ఆపైన వాటరుట్యాంకు నిర్మాణముగావించిరి. అప్పటినుండి బ్రహ్మశ్రీ కొమ్మోజు కూర్మన్నగారి మఠం నిత్య ధూపదీప నైవేద్యములతో విలసిల్లుతున్నది. మేము1955లో విజయవాడ భ్రమరాంబపురంలో కాపురముంటున్నప్పుడు నా 13 సం॥ వయసులో కొమ్మోజు కూర్మన్నగారి సతీమణియగు ఆ మహాతల్లిని చూచు భాగ్యము కల్గినది. గురుదేవులు తమను సేవించినవారు ఆ చంద్రతారార్కము కీర్తింపబడుదురని తెల్పిరి. అందుకు కొమ్మోజుకూర్మన్నగారి చరిత్రయే సాక్షియని ఋజువైనదిగదా!

విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘంవారు శ్రీ సనారీ విశ్వనాథ విజ్ఞానమండపము నైరుతి భాగమున కూర్మన్నగారి కుటుంబ సభ్యుల సమాధులకు మండపం కట్టించి నాటినుండి నేటివరకు ధూపదీపనైవేదులతో వారిని నిత్యం పూజింపుచున్నారు.

**సనారీ ఉవాచ :**

**అటులైయున్న నన్ను గ్రంథమును నాయర్ధాంగినాశక్తినిన్**
**పటువిజ్ఞానసుభక్త మానసవశుల్ ప్రార్థించి పూజించినన్**
**అటులోపాసకులైన మాంత్రికులకున్ అజ్ఞానముం తీసి, యే**
**కుటిలంబుంచక గోర్కెలిచ్చెదను సంకోచంబులేకుండగన్॥**

## 3. సనారీమహిమ

1940 సం॥లో పాలకొండలో పంటపొలాలకు నీటి కాలువలను వదిలే పనిచేయు "కంబకాయ" అనునతడు ఒకరోజు పొలాలకు నీళ్ళు వదులుటకు ఊరి చివరివరకూ వెళ్ళగా, అతనికి అకస్మాత్తుగా కంటిచూపు పోయినది. అప్పుడు అతను ఆర్తనాదములు చేయుచుండగా, కొంతమంది బాటసారులు అతని పరిస్థితి గ్రహించి యింటికి చేర్చిరి. ఆదర్శగృహిణియగు అతని భార్య వైద్యులకు చూపించి, దృష్టిపోవుటకు కారణము గ్రహించలేక, అనేక వైద్యములు చేయించి, ఫలితములేక, సనారీ వారి మహిమ లెరింగినదగుటచే శ్రీశైలవాసుని కరుణచేతనైన భర్తకు దృష్టివచ్చునని, ఆత్మవిశ్వాసంతో పతిని తీసుకుని శ్రీశైలం బయలుదేరి, మార్గమందలి పుణ్యక్షేత్రములు దర్శించుతూ, నదీనదములందు స్నానములాచరించుతూ, బ్రహ్మంగారు కలికావతారముతో వచ్చువరకూ సనారీ వారు శ్రీశైలగుహ యందు తపమాచరించుచూ ఉందునని గ్రంథమందు తెల్పియందుటెరింగినదగుటచే, అచటగల చెంచువారికి సనారీ వారిరూపురేఖాదులు తెల్పుచూ, ఈ ప్రాంత మందు అట్టివారినెపుడైనా చూచితిరాయని విచారించుతూ, చెంచుగూడెములన్నియూ తిరుగుతూ ఎట్టకేలకు వారి వలన ఆజానుబాహుడు, కౌపీన ధారియగు యోగి ఈ ప్రాంతం కొండగుహనుండి వచ్చి వెళుతుంటారని తెలుసుకుని, భర్తతో సాయంసమయానికి కొండగుహవద్దకు చేరి, స్వామివారి రాకకై ఎదురుచూస్తూ రాత్రంతా ఆనిర్జన భయంకర క్రూర జంతు సంచారము చేయు అడవియందు ప్రాణాలకు తెగించి స్వామిని ధ్యానిస్తూ ఉండిపోయారు. బ్రహ్మముహూర్తములో ఆ గుహనుండి ఆజానుబాహుడు

కౌపీనధారియై దండ కమండలములు కఠారిచేబూని బయటకు వస్తుండగా ఆ పతివ్రత స్వామివారి రెండు పాదాలు గట్టిగా పట్టుకొని , "స్వామీ! కాపాడుడనుచూ" ఆర్తనాదాలు చేయుట మొదలుపెట్టింది. స్వామివారిదేమీ పట్టించుకోకుండా ఆమెను కాళ్ళతో ఈడ్చుకుపోతున్నారు. ఆమెకు కొండరాళ్ళు ముళ్ళు గుచ్చుకొని శరీరం రక్తసిక్తమయినా లెక్క చేయక పాదాలను విడువలేదు. ఆమె దీక్షకు ముగ్ధులయిన గురుదేవులు ఆమెను చూచి సాధ్వీ! ఎవరు నీవు? ఏమి కావాలి? ఈ నిర్జనఘోరారణ్యమున ఎందుకింత సాహసానికి పాల్పడితివని ప్రశ్నింపగా ఆమె స్వామీ! నా భర్తకు అకస్మాత్తుగా కంటిచూపు పోయి అంధుడైనాడు. మాకు సంతతిలేదు. మాకు వెనుక ముందు నా యను వారెవ్వరూ లేరు. యిట్టి మేము జీవించి ఈ అంధత్వముతో సాధించునదేమి తండ్రీ? మీవంటి మహనీయుల దయతో మా బాధలు పోవాలి. లేదా ఈ ఘోరారణ్యమున ఏదైనా జంతువుకు ఆహారం కావాలి. అంతేగానీ ఈ పనికిమాలిన జీవితమెందుకు స్వామీ? ఆర్తత్రాణపరాయణా! అనాధరక్షకా! క్షీరాద్రివాసా! దయామయా! "సనారీశా" యిచటి గిరిజనులు మాకు ఈ దారి చూపించిరి. రక్షించినా, శిక్షించినా నీవే మాకు దిక్కు అనుచూ పరిపరి విధములు ప్రార్థింపగా, కరుణాంతరంగుడగు స్వామి ఆమెనూరడించి కమండలమందలి జలాన్ని మంత్రించి చల్లి శరీర శుద్ధిగావించి, అమ్మా నీ భర్తకు పోయిన దృష్టిని, ఉద్యోగాన్ని ప్రసాదించుచున్నాను. నీవు పుత్రవతివై సకల శుభములతో సుఖింపుమని ఆశీర్వదించి, భార్యభర్తల నిరువురను కనులుమూసుకొండని మంత్రజలం వారిపై జల్లగా, కొంతసేపటికి వారిరువురూ కనులు తెరచి చూచుసరికి, పాలకొండలో ఉండిరట. భర్తకు చూపుతోపాటు ఉద్యోగం కూడా వచ్చినది. ఆమెకు పుత్రుడు కలగడంతో పాలకొండలో గల స్వామివారి గుడివద్ద బాలునకు తలనీలాలర్పించి, అచటగల వారందరికి స్వామివారి ప్రసాదం పంచుతూ, ఈ విషయాలు అందరికి చెప్పుకున్నది. అపుడు సనారీ మఠం ఎదుట గల స్కూల్లో ప్రస్తుత ఆలయం ప్రెసిడెంటు టేకి నరసింగరావు (తవుడు) చదువుకుంటున్నారట. ఆయనకు సుమారు 12 సం॥ వయస్సులోని ఈ విషయాలను గుర్తుచేసుకొని నాకు 4-3-2008 తేదీన పాలకొండలోఈ విషయాలు చెప్పారు. (1928లో టేకితవుడు జన్మించారు.)

## 4. సి.ఐ.చెప్పిన సనారీ మహిమ

1948లో సనారీ దేవాలయం అసంపూర్తిగా ఉన్నపుడు టేకి నరసింగరావు,(తవుడు) అయ్యనబాలాజీ, మొగలిమాధవరావు, మురమళ్ళబ్రహ్మం (సైకిల్ బ్రహ్మం) వీరందరూ కలిసి, సోమ, శుక్ర వారాల్లో, దేవాలయ ప్రాంగణంలో సనారీ వారి భజనలు చేస్తుండేవారట. అప్పట్లో దేవాలయం ఎదురింట్లోకి కొత్తగా వచ్చిన పోలీసు ఉద్యోగి సి.ఐ.గారు వీరందరూ భజన చేస్తుండగా జవానుని పంపి వీరిని పిలిపించారట. వీరంతా వెళ్ళి ఏమిటండీయని అడుగగా, ఏమిటి మీరు చేస్తున్నదని సి.ఐ అడిగారట. సనారీ వారి భజనలు చేస్తున్నామని వీరు చెప్పారట. దానికి ఆ పోలీసు ఉద్యోగియిలాగా చేసేది ఎంతో భక్తిశ్రద్ధలతో భజనలు చేయాలి. సనారీ వారి గురించి నేను చెబుతాను. వినండని సి.ఐ. గారు యిలా చెప్పారు. మాది రాజమండ్రి మెరకవీధి సనారీ వారు మా వీధి నుండి పావుకోళ్ళతో వెళ్ళేవారట. మా వీధి పెద్దలు అది సహించలేక పావుకోళ్ళను చేత్తోపట్టుకుని వెళ్ళమని హెచ్చరించారట. దానికి స్వామివారు అంగీకరింపక యథాప్రకారం వెళ్ళేవారు. దానికి ఆ వీధివారు ఆగ్రహించి ఒకరోజున దారికాచి కర్రలతో కొట్టబోయారు. స్వామివారు ఆగ్రహంతో వారిని చూచేసరికి ఎక్కడివారక్కడ కర్రపట్టి ఎత్తినచేతులతోఅలా విగ్రహాల్లాగా ఉండిపోయారు. స్వామివారు వెళ్ళిపోయారు. యిది గమనించిన ఆడవారు కొందరుకలసి స్వామివారి బసవద్దకు వెళ్ళి పాదాలపైబడి క్షమాపణ కోరగా, కరుణాసముద్రుడగు స్వామివారు వారి





పశ్చాత్తాపమునకు దయదలచి, మంత్రాక్షతలనిచ్చి వారిపై జల్లిన యథాస్థితికిరాగలరని చెప్పి, మీరు చేసిన అహంకారానికి ప్రాయశ్చిత్తంగా యికనుండి, మీ కుటుంబాలకు ఒక్క వారసుడే యుండుగాకయని శపించిరట. అందులో ఒక కుటుంబ సంతానాన్నే నేను అని సి.ఐ. చెప్పి, నేనిచట ఉన్నంతవరకూ స్వామివారి కార్యక్రమాలకు సహకరిస్తానని చెప్పి దేవాలయ గోడలు పూర్తిచేయించారు. ఆ తర్వాత లుంబూరు రౌతు అనే రైతు శ్లాబు వేయించాడని 80 సం॥ల వయసుగల టేకి నరసింగరావు (తవుడు) నాతో 6-3-2008 పాలకొండలో చెప్పారు. 6-3-2008 తేది శివరాత్రి సందర్భంగా పండూరి అమృతలింగంగారి కుమారుడైన నరసింగరావు తన కుమారుని తలనీలాలు ఆలయం ముందు తీయించునపుడు, ముఖమండపమందలి సనారీ విగ్రహానికి మారుగా సనారీ వారు కన్పించారట. ప్రక్కన గల భార్యకు సనారీ వార్ని చూడమని చెబితే, ఆమెకు అక్కడ విగ్రహమే కన్పించిందట. మళ్ళీ సరిగా చూడమని భార్యకు చెబితే ఆవిడకు విగ్రహం, ఆయనకు సనారీ వారు దర్శనమిచ్చారు. ఈ విషయాలు ఆ రోజుపాలకొండలో దేవాలయం వద్ద మాకు చెప్పారు.

## 5. పాలకొండలోని గృహిణి స్వానుభవము

పాలకొండలో గల ఒక గృహిణి మహాశివరాత్రి రోజున దేవాలయంకు వచ్చి దర్శనం చేసుకుని, అక్కడ జరుగుతున్న అన్నదానంలో కూర్చుని భోజనం చేద్దామని మధ్యాహ్నం 3-00 గం॥ వరకు వేచిచూచి, జనం ఎక్కువగా ఉండుటచే భోజనం చేయకుండా యింటికి వెళ్ళిపోయిందట. యింటిలో అడుగుపెట్టగానే తొడనుండి పాలుకారడం మొదలయింది. ఏమిటీ వింతయని ఏమీ తోచక ప్రక్కవాళ్ళు డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళారు. పాలు ఏకధారగా కారుతూనే ఉన్నాయి. ఈ వింత వార్త ఊరంతా పాకింది యిరుగు పొరుగు వారు పరామర్శకు వచ్చి, దైవ ప్రసాదం తినకుండా రావడంచే అపరాధం జరిగిందనగా, అది గ్రహించి వెంటనే కొందరు దేవాలయం వద్దకు వెళ్ళి అపరాధం చెప్పి అమ్మవార్ని పూజించిన పసుపు తీసుకువచ్చి తొడపై పెట్టగా పాలుకారడం ఆగిపోయాయట. అపుడామె దైవప్రసాదం తినకుండా రావడం దైవాపరాధమని గ్రహించి, దేవాలయమునకు వెళ్ళి అమ్మవారి జీవసమాధిముందు సాష్టాంగపడి, తప్పు మన్నింపమని స్తుతించి శాంతి పొందినదట.

## 6. శ్రీ అన్నపూర్ణ మఠం పూజారి దుర్గాప్రసాద్ పాఢీ చెప్పినవి

1982 సం॥నకు పూర్వం నుండి ఈ కుటుంబీకులు పాలకొండ ప్రాంతంలో "పట్నాయక్" లకు పౌరోహిత్యం చేస్తూ జీవించెడి వారు, వీరు ముత్తాతలు అల్లెన గ్రామం నుండి పాలకొండకు కాపురం వచ్చారు. వీరు పాలకొండ గ్రామపెద్దల కోర్కెపై కృష్ణచంద్రపాఢీ పాలకొండలో స్థిరపడ్డారు. వీరి అబ్బాయి అనంత పాఢీ వారి అబ్బాయి సత్యనారాయణ పాఢీ ఈయన 1982వ సంవత్సరం వరకూ నిత్యజీవనోపాధికే యిబ్బందిపడుతూ కాలం గడిపేవారు. అట్టి పరిస్థితుల్లో ఆయన భార్య సావిత్రీపాఢీ గార్కి కేన్సరువ్యాధి రావడంతో, ఆమెను విశాఖపట్నం కె.జి.హెచ్ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళగా, అన్ని పరీక్షలు చేసి ఈమె 3 రోజులలో చనిపోతుంది యింటికి తీసుకుపొమ్మన్నారట. యింటికి తీసుకువచ్చి ఏమిచేయడమని ఆలోచిస్తుండగా, ఈ పరిస్థితిని గమనించిన కొందరు, రాయగడ దగ్గరలో గల "బిసమ్‌కటక్" లో కేన్సర్ హాస్పిటల్ ఉంది అక్కడకు తీసుకువెళ్ళమని సలహాయిచ్చారట. వెంటనే "బిసమ్‌కటక్‌లో" గల కేన్సరు హాస్పిటల్‌కు తీసుకువెళ్ళగా, అచట అన్ని పరీక్షలు జరిపి, వ్యాధి బాగా ముదిరిపోయింది ఆఖరు స్టేజీలో తీసుకువచ్చారు. మా వల్లకాదు

యింటికి తీసుకుపొమ్మన్నారట. ఈ పరిస్థితులు తెలుసుకున్న పాలకొండ విశ్వబ్రాహ్మణులు టేకి నరసింగరావు, బొండాడ కృష్ణమూర్తి, పండూరు దుర్గారావు, కందుల సత్యన్నారాయణ, మరికొందరు సనారీమఠంలో ఎవర్ని అర్చకునిగా ఉంచాలని చర్చించుకుంటూ పొరుగూరి వార్ని పెట్టి చాలా యిబ్బందులు పడ్డాము. స్థానికులైతే బావుంటుందని గ్రామంలో ఎవర్ని అడిగినా అర్చకతత్వానికి అంగీకరించకపోవడంతో, ఆఖరికి సత్యన్నారాయణపాఢీ వద్దకు వచ్చి నెలకు 60 రూపాయల జీతం యిస్తాము, భక్తులనుండి వచ్చే దక్షిణలు నీవే తీసుకుని అర్చకత్వం వహించమని కోరారు. అమ్మవారిని సేవిస్తే నీ భార్య ఆరోగ్యం కుదుటపడుతుంది, ఆలోచించుకోమన్నారు. అప్పుడు ఆయన కుమారుడు ప్రస్తుత మఠం పూజారి అయిన దుర్గాప్రసాద్ పాఢీను తండ్రి అడుగగా "16 సంవత్సరముల" వయసుగల నాకేమి తెలుసు మీరే నిర్ణయించుకొండని తండ్రితో అన్నాడట. దిక్కుతోచని స్థితిలో సత్యన్నారాయణపాఢీ ఆలోచిస్తుండగా, విశ్వబ్రాహ్మణ పెద్దలు టేకి నరసింగరావు బృందం పాఢీ గారితో, ఈరోజు రాత్రి అమ్మవారి సన్నిధిలో నిద్రచెయ్యి, అమ్మవారు ఏంచెబితే అది చేద్దువుగాని అని సలహాయిచ్చారట. అలాగేనని పాఢీ ఆనాటిరాత్రి అమ్మవారి సన్నిధిలో నిద్రించగా, అమ్మవారు స్వప్నమందు సాక్షాత్కరించి, నాసేవలు నీవు చేస్తూవుండు. నీ భార్య ఆరోగ్యం నేను చూచుకుంటానని అభయమిచ్చిందట. ఆ మరుసటి ఉదయం పాఢీగారు నా భార్య ఆరోగ్యం కుదుటపడితే జీతంతో సంబంధం లేకుండా నా జీవితాంతం అమ్మవారి సేవ చేస్తానని నిర్ణయించుకున్నారట. అక్కడ హాస్పిటల్‌లో సావిత్రిపాఢీ గార్కి పెద్దముత్తయిదువుగా అమ్మవారు కలలో కన్పించి నీకేం భయంలేదు. నీ ఆరోగ్యం నేను చూచుకుంటానని అభయమిచ్చిందట. ఈ పరిస్థితులలో డాక్టర్లు ఆఖరి ప్రయత్నంగా ఆపరేషన్ చేస్తాము కాని నమ్మకం చెప్పలేమన్నారట. వెంటనున్నవారు "మీ ప్రయత్నం మీరు చేయండని" పేషెంటుని డాక్టర్లకు అప్పగించారు. ఆ మరుసటి రోజు సత్యన్నారాయణపాఢీ గార్కి ఆపరేషన్ సక్సస్, పేషెంట్‌కి పూర్తి ఆరోగ్యం వస్తుందని డాక్టర్లు చెప్పారని హాస్పిటల్ నుండి టెలిగ్రాం వచ్చింది. పాఢీగారు 1982 నుండి 21.05.2003 వరకూ అమ్మవారి సేవజేస్తూనే పరమపదించారు. 1982 నుండి ఆ కుటుంబము దినదినాభివృద్ధి చెంది భూగృహవసతుల నేర్పరుచుకుని నిశ్చింతగా జీవిస్తున్నారు. వారి కుమారుడు దుర్గాప్రసాద్‌పాఢీ ధనసంపాదనకు తనకు వచ్చిన అవకాశాలు వదులుకుని, అమ్మవారి నిత్యసేవయే పరమావధిగా ప్రశాంతముగా జీవిస్తున్నారు. వీరికి దేవాలయ కమిటీవారు సరైన జీతభత్యాలు యివ్వలేక అమ్మవార్ని మీరు సేవించండి. ఆ తల్లి మీకు ఏలోటూ రానీయదని మొత్తం మఠం బాధ్యతను పాఢీ కుటుంబానికి వదిలివేసారు. వీరి తల్లి సావిత్రి పాఢీ 1982 నుండి ఈనాటికీ సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నారు. ఈ దేవాలయంలో పెళ్ళికాని అమ్మాయిలు 9 వారాలు కుంకుమార్చనలు చేస్తే వివాహమవుతున్నది. గృహచ్ఛిద్రములు గలవారు 101 రోజులు కుంభాబిషేకము చేయించగావారి పరిస్థితులు చక్కబడుతున్నాయి. ఆరోగ్యహీనులు, దాంపత్య సమస్యలుగల వారు అమ్మవారి జీవసమాధి వద్ద పూజలు చేస్తూ వారి వారి కోర్కెలు తీర్చుకుంటున్నారు. దీనితో భక్తులసంఖ్యబాగా పెరిగి అర్చకులకు నిత్యఆదాయం బాగాపెరిగి, సుఖజీవనము చేయుచున్నారు. ఈ విషయాలు నాతో "మా సనారీదీక్షావిరమణ" సమయంలో 25-2-2009న అమ్మవారి మఠపూజారి దుర్గాప్రసాద్‌పాఢీ చెప్పారు. పాలకొండనివాసి దుర్గ అనే అమ్మాయిగుండెనొప్పితో బాధపడేది. ఆమెకు నిత్యదీపారాధన, అభిషేకంచేస్తే బాగుంటుదని చెప్పి అలాచేయించగా సంపూర్ణ ఆరోగ్యవంతురాలైనది. యిలా అమ్మవార్ని సేవించి అనేక శుభఫలితములు అనేకులు పొందుచున్నారు. ప్రతీ శుక్రవారం సనారీ వారు ఏదో రూపంలో అన్నపూర్ణమ్మ మఠం వద్దకు వస్తారని ఆ ప్రాంతీయులంటారు.





## 7. సనారీవారి ఆలయనిర్మాణంగురించి

అన్నపూర్ణమాత జీవసమాధియైన పిదప సనారీవారు సన్యాసంస్వీకరించి, అమ్మవారి మఠపోషణ బాధ్యతలను శిష్యులకప్పగించి, స్వామివారు పాలకొండను వీడి మార్గమందలి ప్రతీపల్లె పట్టణములు, అగ్రహారములు హరిజన గిరిజన వాడలు ఆటవికులగూడెములందు, మజిలీలు చేయుచూ వేదాంత యోగ ప్రబోధనలు చేయుచూ, "సనారీసంవాదము"ను రచించుచూ, మదరాసు మహానగరము చేరి, అచట గ్రంధముద్రణ చేయించిన పిదప మొదలియార్ సనారీ వార్కి బ్రహ్మరధం పట్టుట, శృంగేరీపీఠాధిపతులతో జరిగిన వాగ్వివాదములో, బాలాత్రిపురసుందరి అమ్మవారిని, త్రినేత్రమును జూపిసాక్షాత్ పరమశివునిగా ఋజువుపరచుకొని, అటనుండి శ్రీశైలగుహలో మహాతపోనిష్ఠకై వెడలినకొన్నేండ్లకు పాలకొండ లోని సనారీవారిగృహము శిధిలమై పోయినది. ఆకాళీస్తలమును కొందరు స్వామివారి దూరపు బంధువులమని అటచేరి, ఆస్థలాన్ని విడివిడిగా ఐదు భాగాలుగా విక్రయించగా, ప్రస్తుతమున్న దేవాలయప్రదేశాన్ని అల్లెనసూర్యప్రకాశరావు గారు (శిష్టికరణాలు) ఆయుర్వేదవైద్యుడుకొని, 1948లో మందులు తయారు చేయుటకు గదిని కట్టుటకు, పశ్చిమాన్ని త్రవ్వగా ప్రస్తుత అమ్మవారి జీవసమాధిప్రాంత భూమిలో పసుపు, కుంకుమ, తాంబూలము ఆనాడుపెట్టినట్లు కనబడుటచే, ఆశ్చర్యంతో యిది ఏమిటని స్థానికులను ప్రశ్నింపగా సనారీవారు అమ్మవార్ని సమాధిచేసిన స్తలమని, ఆనాడుస్వామివారు పెట్టినవస్తువులని అవిదాదాపు వంద సంవత్సరాలుదాటినవని, అవినేటికీ చెక్కు చెదరకుండుటచే వాటి మహాత్మ్యముగ్రహించిన వారై త్రవ్వకాన్ని ఆపి యధాప్రకారంమట్టితో కప్పించినారట, ఆ ఉదయాన్నే సూర్యప్రకాశరావు, పండూరి చక్రధరుడు గార్ని పిలిచి సనారీ వారు కలలో తెల్పిన విషయాలు చెప్పి, ఈ స్థలంలో అమ్మవారి జీవసమాధిఉన్నది గాన యిచట దేవాలయం కట్టమని కొంతధనాన్నీ, ఆ స్తలాన్ని కూడా యిచ్చారట. చక్రధరుడుగారుపని ప్రారంభించిపలువుర ఆర్థిక సహాయంతో మఠంపనులు చేయిస్తుండగా, సరిది నాగేశ్వరరావు అనే కళ్ళజోళ్ళ వ్యాపారి, చక్రధరుడు గార్ని చిన్నబుచ్చుతూ కరపత్రంవేయడం, ఆసమయంలో చక్రధరునికుమార్తె చనిపోవడంతో, మానసికవ్యధతోపని ఆపివేశారట, అప్పటికి గుడి 4అ॥ ఎత్తువరకు గోడలు లేచాయట. ఆ సమయంలో విశాఖపట్నం దగ్గరగల కొట్టియాడ గ్రామస్తులైన బ్ర॥ గోరసనారాయణబాబు గారు, సనారీ వార్ని సేవించుతూ తెనాలిలోగల వారి బంధువులయింటికి వెళ్ళి తెనాలి వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ దేవులక్ష్మీనారాయణ, గోడినరసింహారావు గోడిపాపాచారి తుమపాల సూర్యనారాయణ, టేకికుమారస్వామి మొదలగువారికి, సనారీవారి మహిమలు, సనారీ సంవాద మందలి శ్లోకాలకు వేదాంత అర్థాలు వివరించి చెబుతూ, స్వామివారి జన్మస్తలమగుపాలకొండలో గల అమ్మవారి జీవసమాధిని దర్శింప నాసక్తులను జేసిరి. వారునూ ఈ విషయములెరింగిన వారగుటచే, గోరసవారితో పాలకొండక్షేత్రమునకు పయనమయిరి. వీరందరూ అమ్మవారి జీవసమాధి వద్ద బహిరంగ ప్రదేశమున పరుండిరి. ఆకాలమున ఆ ప్రాంతమందు అల్లర్లు మిక్కుటముగా జరుగుచున్నందున, రక్షకభటులు రాత్రులు గ్రామమంతా గస్తీ తిరుగుచుండిరి. అలా కావలి కాస్తున్న పోలీసుఅధికారి ఆరుబయటపరుండిన యాత్రికులను చూచి, రాత్రులందు యిచటపరుండరాదు. ఎవరి యిండ్లకైనా పొండని హెచ్చరించెను. కానీ భక్తులచటనుండి కదలలేదు. మరల అర్ధరాత్రి పర్యటిస్తున్న అధికారి వీరివద్దకు వచ్చి ఈ ప్రాంతంలో అల్లర్లు బాగా జరుగుచున్నవి. వాటినరికట్టుటకు మేమిట్లు కావలికాయుచుంటిమి. మీరిట్లు వీధిలో పరుండిరి, మీకేదైనా జరిగితే పై ఆఫీసర్లతో మాకు చాలా సమస్యలు వచ్చును, లేచి ఎచటికైనా

పొందనిరి, దానికి గోరసవారు అయ్యా ఈ సమాధియందున్న అన్నపూర్ణమాత చాలా మహిమగల దేవత. యిచట నిద్రించుటకే మేము గుంటూరు జిల్లా తెనాలి నుండి 4 జిల్లాలు దాటి వచ్చితిమి. అమ్మవారి సన్నిధిలో మా కెట్టి ఆపదారాదు. ఆమె దివ్య సందేశమునకేమేమిటచ నిద్రించుచుంటిమనిరి. రక్షణాధికారికి ఆశ్చర్యంకలిగి ఏమిటి? ఈ తల్లియందింతటి మహోత్యమున్నదా? యని ప్రశ్నించగా గోరసవారు ఉన్నది తెలుసుకోవలెనన్న మీరిచటనిద్రించి చూడుడు కానీ ఆ అనుభూతులు ఎవరికీ చెప్పరాదనగా అపుడా అధికారి వారి ప్రక్కనే పరుపువేయించుకొని నిద్రించిరి. తెల్లవారినది. నిద్రమేల్కొన్న అధికారి అమ్మవారి జీవసమాధికి నమస్కరించి, కాలకృత్యములు తీర్చుకొని, పనివారలను పిలిపించి ఆలయ నిర్మాణము ప్రారంభించి స్లాపు ఎత్తు వరకూ గోడలు కట్టించిరి. వేరే ఊరికి వారికి బదిలీయగుటచే పాలకొండనుండి వెళ్ళిపోయిరి. ఈవిషయాలు పండూరి దుర్గారావుగారు వారి తాతగారగు చక్రధరుని కాలంలో జరిగివని గంధకర్తనగు నాకు అనకాపల్లిలో దుర్గారావు గారు 15-3-2008న చెప్పారు.

## 8. ఆలయ కార్యదర్శిగారి మాటలు

1948 నుండి 1982 వరకూ సనారీ వారి ఆలయనిర్మాణం పూర్తికాలేదు, పూజారులు కూడా స్తిరంగా ఎవరూలేరు, చాలామంది మారారు. ఆఖరునసత్యనారాయణ పాఢీ పూజారిగావచ్చి దేవాలయం కొద్ది కొద్దిగా అభివృద్ధి చేసినా దేవాలయమనే స్తితిలో లేదు 1983లో కరెంటు తెచ్చారు. ఎందరో వచ్చి మేము అది చేస్తాం, యిది చేస్తామన్న వారే గానీ, ఎవ్వరూ ఏమీ చేయలేకపోయారు. యిలా ఉండగా సత్యనారాయణ పాఢీ గారు ప్రస్తుత దేవాలయ సెక్రటరీ బ్రి॥ కొక్కెరగడ్డ బ్రహ్మాజీరావుగార్ని దేవాలయం అభివృద్ధి చేయమని కోరారు.దానికి వారు నేను ప్రస్తుతం రామలింగేశ్వర ఆలయానికి సెక్రటరీగా ఉన్నాను. ఆ దేవాలయ అభివృద్ధి కార్యక్రమాలు చేస్తున్నాను. అమ్మవారి ఆదేశమయితే నావంతు కృషినేను చేస్తాను అన్నారు. అమర్నాడే వారు అద్దెకు ఉన్నయిల్లు కాళీ చేయవలసిన పరిస్తితి, అద్దె యింటి అన్వేషణలో 1988 లో అమ్మవారి దేవాలయం దగ్గరలో యిల్లు దొరకడంతో, యిదంతా అమ్మవారి మహిమయేయని, దేవాలయానికి కార్యదర్శిగా ఉంటూ, కొత్తగా కమిటీని వేసి అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభించి, 1991 నుండి దేవాలయం పునః నిర్మాణం మొదలు పెట్టారు. పాలకొండ దగ్గరలోగల లుంబూరు గ్రామంలోని రౌతు శోంబాబు గర్భాలయానికి స్లాబువేయించారు. నాటినుండినేటి వరకూ టేకినరసింగరావు (తవుడు) దేవాలయ అధ్యక్షులుగా, కొక్కెరగడ్డ బ్రహ్మాజీరావుగారు ప్రధాన కార్యదర్శిగా, అభివృద్ధి కార్యక్రమాలు చేయిస్తున్నారు. 1982 ప్రాంతంలో బ్రి॥ నౌపడసుదర్శనరావుగారు సనారీవారి విగ్రహాన్ని విజయవాడలో బ్రి॥ పిల్లేడ అప్పలాచారి శిల్పితోచేయించి, మాగురువుగారైన బ్రహ్మశ్రీ తణుకు సాంబశివానంద రాజయోగిగారి ఆధ్వర్యంలో, విజయవాడ నుండి పాలకొండకు ట్రాక్టరుపై ఊరూరూ ఊరేగిస్తూ తీసుకువెళ్ళి, పాలకొండ దేవాలయ ముఖమండపమందు పెట్టి నౌపడ సుదర్శనరావుగారు మంచి ముహూర్తంలో గర్భాలయంలో ప్రతిష్టిస్తారని చెప్పి, బ్రహ్మశ్రీ సాంబశివానందరాజయోగి తిరిగి వచ్చేశారు. బ్రహ్మశ్రీ సుదర్శనరావుగారు 2005 సం॥ వరకూ సనారీ విగ్రహాన్ని ప్రతిష్టించలేకపోయారు. ఆ విగ్రహం నాటినుండి నేటివరకు ముఖమండపమందుండి పూజలందుకొనుచున్నది. 2005 బ్రి॥ చింతాడ విశ్వనాధశాస్త్రిగారు మండపంచుట్టూ యినుపడిజైన్లు పెట్టించి, రక్షణ కల్పించి 2005 వేరొక సనారీ విగ్రహాన్ని చేయించి గర్భగుడిలో ప్రతిష్ఠించి అంతకు ముందున్న విగ్రహాన్ని పడమర ముఖద్వారంపై పెట్టాలని విశ్వప్రయత్నంచేసి విఫలులై, ముఖమండపమందు యధాస్తానంలో ఉంచేచారు. ఆ విగ్రహంనాటినుండి నేటివరకూ





ముఖమండపమందుండి భక్తుల ప్రధమదృష్టికి పాత్రమై పూజలందుకొనుచున్నది. బ్రహ్మశ్రీ నౌపడసుదర్శనరావు గారుసనారీ విగ్రహాన్ని చేయించియూ ప్రతిష్టించు అర్హతలేకయే గర్భాలయమున ప్రతిష్టించలేక పోయిరన్నది నగ్న సత్యంగదా! స్వామి వారి సేవ చేయుటకునూ వారి అనుగ్రహామునకు పాత్రులు కావలసియున్నదని ఋజువగుచున్నది.

## 9. అమ్మవారి మహిమ

నేను 1998 లో పాలకొండ సనారీ వారి జయంతి కార్తీకశుద్ధ పంచమికి వెళ్ళాను. అప్పుడు ఆలయప్రెసిడెంటు టేకి నరసింగరావు (తవుడు) నన్ను పరిచయం చేసుకొని, వారియింటికి ఆహ్వానించారు. ఆజయంతి ఉత్సవంలో పాలకొండలో కీర్తి ప్రతిష్టలు కలిగిన యింజనీర్, మురళీకృష్ణ పట్నాయక్‌గారు నన్ను పరిచయంచేసుకుని, వారియింటికి ఆహ్వానించి, సాయంత్రంవారి స్కూటరుపైత్రిప్పి నాకుపాలకొండయందలి అన్ని దేవాలయములు చూపించి, సరిహద్దుగ్రామమగు అన్నవరంలో సనారీవారి స్వహస్తములతో ప్రతిష్టించిన రామలింగేశ్వర ఆలయం కూడా చూపించి. ఆ గ్రామ విషయాలన్నీ తెలిపినారు. ఆనాటిరాత్రి దేవాలయంలో నిద్రించాలనుకున్నాను. కానీ ఆ రాత్రి అయ్యప్పల "ఏకాహం"సనారీ వారి దేవాలయంలో పెట్టుటచే, పడుకోవడానికి అవకాశం ఉండదని, తవుడుగారు వారియింట్లో భోజన, బస వసతులు ఏర్పాటుచేసారు. ఆ మర్నాటి ఉదయం పట్నాయక్ గారు నేనువస్తాను. ఆలయంలో మీరు పూజా అభిషేకాలు చేయించమన్నారు. నేను సరేనన్నాను. ఏకారణంచేతనో పట్నాయక్‌గారు ఉదయం 11 గంటల వరకూ రాలేకపోయారు. నేను వారికోసం ఎదురుచూస్తూ నా నిత్య అనుష్ఠానాన్ని చేసుకోలేక పోయాను. యింక లాభంలేదు ఉదయం 11గంటలు దాటి పోతుంది. ఎవరికోసం ఎదురుచూడగూడదు, మన నిత్యకృత్యములు ఆగరాదని నేను పూజచేసుకుందామని ఆలయానికి వెళ్ళాను. దేవాలయ అర్చకులు రాత్రంతా అయ్యప్పలతో జాగరణ భజనలు చేసి గర్భాలయతాళాలు వేసి, యింటికి వెళ్ళిపోయారు. చేయునదిలేక నేను దేవాలయగేటు తీసుకుని లోపలకి వెళ్ళి గర్భాలయం ఎదుట కూర్చుని జపం చేసుకుంటున్నాను. అప్పుడు దాదాపు పగలు 12గంటలు కావస్తుంది. మధ్యవయస్కురాలగు ఆ ప్రాంతపు మహిళ (ముత్తైదువు) గేటు తీసుకుని లోపలకు వచ్చి మండపమందలి గంటవాయించగా నేను చూచుసరికి ఆ స్త్రీమూర్తికనబడింది. ఆవిడనన్ను చూచి ఏవూరు? ఎందుకు వచ్చావన్నది. మాది విజయవాడమ్మా. సనారీ వారి జయంతిని, దేవాలయాన్ని చూడడానికి వచ్చానన్నాను. అపుడు నేనేదో తన్మయత్వంలో ఉన్నాను. ఆమెను ఏమి అడగాలో తోచడంలేదు. ఎలానో మాటలు కూడగట్టుకుని నీవెవరివమ్మా? మీవారు ఏంచేస్తారు? అన్నాను. ఆయమ్మ ఆయన ఏదో చేస్తాడులే, నన్ను పట్టించుకోడులే, "అని" ఆకలేస్తుంది టిఫిన్ చేస్తాను. డబ్బులివ్వమని అడిగింది. యిప్పుడు 12 గం॥ అవుతుందిగదా టిఫిన్ఏమిటమ్మా భోజనం చేయవచ్చుగదా అన్నాను. నాకు టిఫిన్ చాలు. భోజనం వద్దు అన్నది. సరేనమ్మా అని జేబులోనుంచి 5 రూపాయలు తీసి మంత్రముగ్ధునివలే యిచ్చాను. ఐదు రూపాయలు తీసుకుని ఆమె వెళ్ళిపోయింది. నేను మళ్ళీ జపానికి కూర్చుందామనుకుని, ఈ వచ్చినామెఎవరు? ఏమిటిది చిత్రంగా ఉన్నదని బయటకు వచ్చి నాల్గు వైపులా ప్రక్కవీధులు చూచాను. ఏవరూ కన్పించలేదు. ఆవచ్చినది ఆమ్మవారేనని నిశ్చయించుకొని ఎక్కువ డబ్బులు ఇవ్వలేకపోయాననే బాధ, బోజనంచేయమంటే వద్దన్నదేమిటి? ఈ ఆలోచనలతో, రాత్రి అచట నిద్ర చేయవలసిన అవసరంలేదని, వెంటనే విజయవాడ వచ్చి ఈ విషయాలు నా శ్రీమతికి చెప్పి భోజన సమయంలో భోజనం వద్దన్నదేమిటని నా సందేహం వ్యక్తం చేసాను. దానికి నా శ్రీమతి మనం నిత్యంపూజలో "పాలు, పండ్లే" గాని మహానైవేద్యం

పెట్టుటలేదుగదా? అందుచే ఆరోజుకూడా టిఫిన్ చాలు అని చెప్పిందని, నాటి నుండి మేము ఉదయం పూజలో పాలు బెల్లం నివేదన జేసి మధ్యాహ్నాం మహానైవేద్యం నిత్యం పెట్టుచున్నాము. ఆనాటినుండి పూజచేయు మాబంధువులకు, పరిచయస్తులకు పూజలో నైవేద్యం ప్రత్యేకించి చేయలేదని ఆలోచింపక, మీరు తినుటకు వండుకున్న ఆహారాన్నే నివేదించి మహాప్రసాదంగా భావించి, దానినే భుజించమని చెబుతున్నాను. సనారీ భక్తులందరికీ యివి నిత్యానుభవములే. యిట్టి అనుభవములను యితరులకు తెలుపవద్దని కొందరు భక్తులు చెబుతుంటారు. కానీ నాకుమాత్రం యిలాంటి విషయాలు చెప్పుకుంటేనే, యితరులకు దైవమహిమలు తెలుస్తాయి, నాస్తికులను కూడా ఆలోచింపజేసి దైవమార్గానికి రావడానికి ప్రోత్సహిస్తాయని నా భావన.

**మానవుని తహతహ!**

జలమందు నివసించు చేపకు దాహమై తహతహలాడుచూ తట్టుకోలేక నీటినుండి పైకి గెంతుచూ నీటిలో పడుచూ, పైకెగసినపుడు తన రెండు చెవులనుండి రెండునీటి బిందువులు పైకెగసి క్రిందకు పడునపుడు చేప నోరు తెరచి ఆకాశమునుండి నీటి చుక్కలు పడుతున్నవనే భ్రాంతితో ఆ నీటిబిందువులను త్రాగి దాహము తీర్చుకున్నట్లుగా, మానవులు తమ పూర్వకర్మలచే సంప్రాప్తమగు పరిస్తితులననుభవింపజాలక ఆర్తులై వేషధారులగు దొంగ స్వాములకు శరణాగతులై, తమ సమస్యలనుండి ఫలితమును పొందక పోగా, క్రొత్త సమస్యలననుభవించి, ఊర గురువులందు విరక్తులై, అనేకమార్గములనాశ్రయించి తుదకు నీవే తప్ప "యితఃపరంబులెరుంగననుచూ" తమ ఆరాధ్యదైవాన్ని శరణాగతి బొంది శాంతి నొందుచుందురు. అనగా అజ్ఞానమనే అంధకారముతో దైవాన్ని గ్రహించలేక కొట్టుమిట్టాడుచూ, ఆఖరున యిష్టదైవ శరణాగతిని బొందు, మానవజన్మకు ఉదాహరణగా మత్యవిషయాన్ని చెప్పవచ్చును.

## 10. అమ్మవారి మహిమలు

మాదంపతులము 6-3-2008 న శివరాత్రి సందర్భముగా పాలకొండవెళ్ళి 8-3-2008 న దేవాలయమండపమందు పడుకున్నాము. నా శ్రీమతికి రాత్రి 12 గంటల నుండి తెల్లవారుజాము 4 గంటలవరకు గజ్జెల సవ్వడితో ఎవరో దగ్గరకు వస్తున్నట్లుగా వినిపించిందట. ఆమె భయపడి అలామెలకువతోనే ఉందట. నేను తెల్లవారుజాము 4 గంటలకు లేచి మూత్రవిసర్జనకు వెళ్ళివచ్చాను. అపుడు నా శ్రీమతి మా బంధువులగు కోమటివీధిలో గల సింహాద్రి ప్రకాశరావుగారింటికి వెళ్ళి పోదామన్నది. నేను ఈ సమయంలో వెళ్ళివాళ్ళను నిద్రలేపితే ఏంబావుంటుంది. యింకారెండుగంటలలో తెల్లవారిపోతుందిగదా అప్పుడు వెళదాంలే అని మత్తుగా మళ్ళీపడుకుండిపోయాను. సహజంగా నేను ఆసమయంలో జపంలోకూర్చుంటాను. కానీ అపుడేదో మగతగాపడుకుండిపోయాను. నా భార్యకు నిద్రరాక భయంతో అమ్మా నన్ను భయపెట్టవద్దని ప్రార్థించిందట. ఆ తర్వాత అమ్మవారు బాలరూపంలో కలయో మెలకువయో తెలియని స్తితిలో కన్పించిందట. ఈ విషయాలు మేము ఉదయం ప్రకాశరావుగారింటికి వెళుతుండగా దారిలో నా శ్రీమతి చెప్పింది. అయ్యో నాకేమీ వినిపించలేదు. మత్తుగా నిద్రపట్టింది. నీవు అదృష్టవంతురాలివన్నాను. ఈ మహద్భాగ్యం కోసమే దేవాలయప్రాంగణంలో చాలామంది నిద్రిస్తారు. ఒక్కొక్కరికి ఒక్కోరకమయిన అనుభవాలు కల్గుతాయి. నేను గతంలో ఒక మిత్రునితో అచటనిద్రించి యిలాంటి అనుభూతులు పొందినవాడినే. సనారీ భక్తులందరికి యివి నిత్యానుభవములే.





## 11. దేవాలయం వద్ద నిద్రించే వారి అనుభవాలు

పాలకొండదగ్గరలో తంపటాపల్లి గ్రామవాసియగు, సత్యంగారు సనారీభక్తులు. ఆయుర్వేద వైద్యులు. ఆయన అప్పుడప్పుడు దేవాలయప్రాంగణంలో నిద్రించేవారట. ఒకనాటి తెల్లవారు జామున పూలుకోయడానికి వస్తుండగా, పూల చెట్టువద్ద ఒక పుణ్యస్త్రీ కన్పించిందట. చెట్టుదగ్గరకు వెళ్ళేసరికి ఆమెలేదు. ఎటుచూచినా కన్పించలేదట, యింకొకనాడు నిద్రపోతున్న సత్యంగార్ని లేపి, ఆపూలచెట్టుపై బట్టలు ఆరవేయవద్దని చెప్పిందట. ఆయన నిద్రమత్తునుండి తేరుకుని కళ్ళు నులుముకొని, ఎవరాయని చూస్తే ఎవరూ కన్పించలేదట. ఈ విషయాలు గుడిపూజారి దుర్గాపాఢీకు చెప్పగా, ఆయన యిలాంటి విషయాలు చాలా జరిగాయని, ఆమ్మవారచట సంచరిస్తున్నదని, ఒక్కొక్కరికి ఒక్కోవిధంగా కన్పించుచున్నదని చెప్తుతున్నారని చెప్పారు. 1850లో సనారీ వారు అన్నవరం గ్రామంలో గల రామలింగేశ్వరాలయంలో శివలింగాన్ని ప్రతిష్టించినట్లు నిర్వహణకు మూడున్నర ఎకరముల పొలమును దానంగాయిచ్చినట్లు దేవాలయ నిర్వాహకులు చెబుతున్నారు,1878 లో సనారీ సాక్షాత్కారం మద్రాసు హైకోర్టు ఛీఫ్‌జస్టిస్ రాజమన్నార్ ఎదుట అశేష ప్రజాసమక్షమున జరిగినట్లు దానిని ఎ.కె. వేలన్ ఛాయాచిత్రము తీసినట్లు భీమవరం సనారీ పీఠాధిపతులు బ్రః తాతోలు వీరరాఘవాచారి గారు, వారి ధర్మపత్ని చంద్రావతిగార్లు 15-10-1985 లో రామలింగేశ్వరాలయంలో వారుయిచ్చిన సనారీ వారి ఫోటోక్రింద ఈ విషయాలను వ్రాసారు. నేను నాశ్రీమతి 7-3-2008 న రామలింగేశ్వరాలయమునకు వెళ్ళి అభిషేకం చేయించి క్షేత్రపూర్వ విషయములకై నిర్వహణాధికారి ఆఫీసుకు వెళ్ళినపుడు, భీమవరం సనారీ పీఠాధిపతులుయిచ్చిన సనారీవారి ఫోటోక్రింద పడవేసియున్నది. అదిచూచి నేను ఈ ఫోటోయిక్కడ పడవేశారేమిటని అడుగగా, ఈ ఫోటోనిచ్చిన రాఘవాచారిగారి కుమారుడు దేవాలయానికి వచ్చి, ఈ ఫోటో శిథిలావస్తలో యున్నది. నేను కొత్త ఫోటోతెచ్చి యిస్తానని, గుళ్ళోఫోటోని తీసి ఆఫీసులో పెట్టాడని చెప్పారు. నేను వారిఅడ్రసు అడుగగా ఆఫీసులో తెలియదన్నారు. వారితోవాదమెందుకని నాకు ఆఫోటోయిస్తే దాన్నేబాగుచేయించుతానని చెప్పి ఆపాత ఫోటోతీసుకువస్తూ, మార్గమందలి శ్రీకాకుళంలో సింహాద్రిగణేశ్ యింటిలో సనారీవారి పూజలు చేయించి, వారికోర్కెపై ఆ ఫోటో వారికిచ్చి బాగుచేయించి పూజ చేసుకోమన్నాము. కృష్ణాజిల్లా హనుమాన్ జంక్షన్ దగ్గరలో గల పెయ్యేరు గ్రామవాసి ప్రక్కి చిరంజీవిగారు గురుదేవులుచేసిన ఆబుళాకీని! పూజామందిరంలో భద్రపరచి కార్తీకపూర్ణిమనాడు బయటకుతీసి పూజలు నిర్వహించుతారట.ఆనాడే దాన్ని యితరులకు చూపుతారట.గురుదేవుల కృపచే ఆబుళాకీని విడిరోజుల్లో నాకు 2005 సంవత్సరంలో చూచేభాగ్యము కల్గినది. యిప్పటికి ఆంధ్రప్రదేశ్ లోని చాలా ప్రాంతాలు, ఒరిస్సాలోని ప్రాంతాల్లో స్వామివారు చేసిన స్వర్ణాభరణములు పూజలందుకొనుచున్నవి.

## 12. బోధగురువు

### బ్రహ్మశ్రీ తణుకు సాంబశివానంద రాజయోగి గార్ని గురించి

నేను 1995 లో మా పెద్దబ్బాయి శ్రీనివాసు సంబంధంగురించి నులకపేటలోనున్న చేవూరి సనారీతల్లిగారితో మాట్లాడటానికి వెళ్ళాను. అపుడామె విజయవాడ వెళ్ళిందని రావడానికి గంటపైగాపట్టచ్చునని ఆమెకోడలు సనారీ భార్య చెప్పింది. ఈ లోగా విజయవాడవెళ్ళి ఏం

వస్తామని ఆ పేటలోనే ఉంటున్న బ్రహ్మశ్రీ తణుకు సాంబశివనంద రాజయోగిగార్ని కలుద్దామని, వారియిల్లు తెలుసుకుని అక్కడకు వెళితే, వారు విజయవాడ వెళ్ళారు. వచ్చేస్తారు కూర్చోమని వారి అర్ధాంగి శ్రీమతి గురవమ్మ గారు చెప్పారు. నాకు స్వకులమందలి పెద్దలను, గొప్ప కీర్తిగడించినవార్ని, సిద్ధాంతులను, గురువులను కలవాలని, వారితో మాట్లాడి విషయాలు తెలుసుకోవాలని చిన్నప్పటినుండి కోరిక, అలా సాధ్యమైనంతవరకూ పరిచయాలు చేసుకునే వాడిని, ఆసంకల్పంతోనే యిక్కడకువస్తే వీరు లేరు, ఆలోచిస్తూ అలాకూర్చున్నాను యింతలో రాజయోగి గారు వచ్చారు. కుశలప్రశ్నల తర్వాత, నాకుగల ఆశయాలు చెప్పి, మీరు నాకు ఏదైనా చెప్పండని కోరాను. అలాగే మంచిరోజు చూచి చెబుతానన్నారు. నేను వారిని మాయింటికి భోజనానికి ఆహ్వానించాను, బోజనానంతరం కుశలపశ్నల తర్వాత. మీకు ఒక్కరికేకాదు, మీదంపతులకు ఉపదేశం చేస్తానని నాకుగల వాస్తు జ్యోతిషపరిచయాలు తెలుసుకుని మీరే ముహూర్తం నిర్ణయించండన్నారు. సరేనని నేనొక ముహూర్తం చెప్పాను. ఆ నాటికి ఉపదేశం పొందటానికి కావలసినసామాగ్రి చెప్పి అవి తీసుకుని ఉదయాన్నే రమ్మన్నారు. ఆ రోజు మాతోపాటుగా చాలామందికి ఉపదేశం చేసారు. అప్పుడు మాదంపతులకు సనారీవారి పాదం పట్టించి, "సనారీ సంవాదమందు" కొన్నిచోట్ల గుర్తులు పెట్టి యివికంఠస్తం చేయమన్నారు. ఆ రోజు మధ్యాహ్నం భోజనానంతరం ప్రశాంతంగా కూర్చుని మాట్లాడుతూ, గురువుగారూ మాకు ఎదైనా చెప్పమంటే సనారీవారి పాదం పట్టించారేమిటి? ఆయనను పూజించినవారు చాలాకష్టాలు పడతారని కొందరనగా విన్నానని నాసందేహాన్ని వెలిబుచ్చాను. దానికి వారు చాలా తప్పు నాయనా అలాఅనకూడదు. ఆయనను పూజిస్తే బాధలు పడరు. సకల శుభములు పొందుతారు. కొందరు స్వార్ధంతో వారి గ్రంధాన్ని సరిగా అర్ధంచేసుకోకుండా ధనాశతో బంగారంచేయుటకు ప్రయత్నించి, సర్వభ్రష్టులై అనేక బాధలు పడతారు. మనదారి అదికాదు. ప్రతిఫలాపేక్ష లేకుండా స్వామివార్ని సేవించుటే ప్రధానము.స్వామివారు మనసేవలకు ఏమియివ్వాలో అది యిస్తారు. కంటికి రెప్పవలే వెన్నంటి కాపాడుతారు. వారు సాక్షాత్ పరమ శివుడు, బోళాశంకరుడు, భక్తసులభుడు, ఈ రసవాదులు పూర్తిగా గ్రంధాన్ని అర్ధంచేసుకోకుండా, బంగారమందు భ్రాంతితో, ఆకులు మూలికల కోసం, సాధువుల సాంగత్యంచేస్తూ కొండ, కోనలు అడవుల బడి తిరిగి, తమసర్వస్వాన్నీ కోల్పోతారు. సనారీ గ్రంధంలో యిది సిద్ధులకు బద్ధమని, వారికి ఉపాధిమూలిక మాత్రమేనని స్పష్టంగా చెప్పారు. ఈ రసవాదులు ఒక్కసారైనా పూర్తిగా గ్రంధాన్ని చదవకుండా, ఎవరో సన్నాసుల మాట నమ్మి దురాశతో, రసవాదముగల కొన్నిపేజీలు మాత్రమేపదేపదే చదువుతూ, విపరీత వ్యాఖ్యానాలు చేసుకుంటూ, శివవీర్యమగు పాదరసాన్ని నిర్వీర్యం చేస్తూ, ధనం, కుటుంబాలు నాశనమయ్యి, స్వామి వారికి అప్రతిష్ట తెస్తున్నారు. కాబట్టి నీవులోకుల మాటలకు చెవియొగ్గి సందేహాలకు తావివ్వక, నేను చెప్పినవి కంఠస్తంచేయమన్నారు. నేను సరేఅన్నాను కాని మనసునగల సందేహాలతో గ్రంధాన్ని పారాయణ చేయలేకపోయాను. ఈలోగా ఆషాడ పూర్ణిమ వచ్చింది, గురువుగారు నాతోపాటు ఉపదేశమిచ్చిన వార్ని అంతకుముందు ఉపదేశ మిచ్చినవార్ని గురుపూర్ణిమకు ఆహ్వానించారు. చాలామంది వచ్చారు, ఒక్కొక్కర్ని పీఠంవద్ద కూర్చుని పూజావిధానాన్ని చదవమన్నారు. అంతమందిలో ఏ ఒక్కరూచదవలేకపోయాము. దానికి వారు మమ్మల్ని చాలా నిష్ఠూరంగా మాట్లాడారు.దాంతో నాకు చాలా బాధకలిగింది. ఆరోజు యింటికి వచ్చిన దగ్గర నుండి ప్రతిరోజు గ్రంధాన్ని చాలాశ్రద్ధగా చదవడం మొదలు పెట్టాను. మరో 2 నెలల 15 రోజులలో దేవీనవరాత్రులు వచ్చాయి. ఆకార్యక్రమానికి గురువుగారు అందరినీ ఆహ్వానించారు.





నేను దంపతీయుక్తంగా కలశస్తాపనకు ముందు రాత్రే నులకపేటలో 10 రోజులు ఉండేటట్లుగా వెళ్ళాము. దేవీనవరాత్రుల ఆరంభంరోజున పీఠందగ్గర గురువుగారు నా ప్రక్కనే కూర్చుని పూజావిధానాన్ని చదివించారు. నాటిరాత్రి సహస్రనామకుంకుమార్చన నాతో చదివించి. పూర్ణాహుతి వరకూ10 రోజులు గురువుగారు నాప్రక్కనే కూర్చుని పూజలు చేయించారు. అది వారికి 26వ శరన్నవరాత్రులు. పూర్ణాహుతి అనంతరం భోజనాలయిన తర్వాత మాదంపతులము యింటికి బయలు దేరాము.అప్పుడు గురువుగారు.మమ్మల్ని కూర్చోపెట్టి నాయనా నీవిక్కడ యింకా 4 సంవత్సరాలు ఈ శరన్నవరాత్రులు పూజచెయ్యి, అప్పటికి నేను 30 దేవీ నవరాత్రులు చేసినట్లు నాకు 30 సం॥రాలు పూజ పూర్తిఅయ్యాక పీఠాన్ని మాఅబ్బాయికో, నీకో యిచ్చేసి ఆపిదప ఈ నవరాత్రులలో మీవద్దే ఉంటాను, నాకుపూజకు శక్తి చాలడంలేదని కోరారు. నేను సరేనని వారి కోర్కె తీర్చుగా 30 శరన్నవరాత్రులు శ్రీసనారీ వారు ప్రసాదించిన పూజావిధానములతో, పూజ పూర్తిగావించినారు. మా గురువుగారు వారి అంతిమయాత్రను మాకు చాలాసార్లు చెప్పారు. వారు అనారోగ్యంతో వంటిమీద సరిగావస్త్రాలు లేక కటిక నేలపైకూర్చునుండగా పెద్దగా కడుపులోనొప్పి వచ్చి అమ్మో అని కడుపు పట్టుకొని బాధపడుతుండగా కొడుకుఎక్కడనుండో పరుగెత్తుకుంటూ వచ్చి తనఒళ్ళోకి తీసుకోవడం ప్రాణంపోవడం జరిగిందని చెప్పేవారు. సరిగ్గా అలాంటి స్తితిలోనే. వారికి అనారోగ్యంగా ఉందని ఒంగోలు నుండి వారి కుమారుడు కుమార్ వచ్చి తండ్రివద్ద ఉండి అప్పుడే బయటకు వెళ్ళడం, ఆయనకు బాధరావడం కుమార్‌కు ఫోనుచేయమని చెప్పగా సెల్‌ఫోన్‌లో సీరియస్‌గా ఉందని చెప్పడం అతను పరుగెత్తుకుంటూ రావడం. గురువుగారు అంతిమయాత్ర చెప్పినట్లే జరిగిపోయింది. "(యిది ఉపాసనాక్రమంలో తెలిసేవనే)" నిదర్శన మాత్రమే. ది 29-6-2006 వ తేదీన గురువుగారు శివసాయుజ్యం పొందినారు. "సనారీవారు" నాశిష్యులు అవనికాలాగ్ని రుద్రులై చరింతురన్నట్లుగా వారి నుపాశించినవారికి వాక్సిద్ధినిత్తురు. భవిష్యత్తు తెలియజేతురన్నది సత్యమేగదా!

**సనారీ ఉవాచ**

> **ఈ పూజచేయువారికి, నేపూటను మ్రొక్కుచుందు నిజముగనేనే**
> **యాపుణ్యాత్మాల రూపము, కాపాడుదు సర్వలోకకాపైనేనే ॥**

## 13. శ్రీ సనారీవారిసేవాఫలితము

శ్రీ సనారీ వారి పూజాకార్యములకు సహకరించిన వారికి, "సనారీ" వారికోర్కెలను తీర్చి సదావార్ని రక్షంచికాపాడి దేహము చాలించినపిదప ఉత్తమలోకప్రాప్తిని కలుగజేస్తున్నారు. దానికి తార్కాణంగా; మా బోధగురుని పత్ని గురువుగారు చేయు శరన్నవరాత్రి మహోత్సవములకు విచ్చేయు భక్తులకు 10 రోజులు భోజనము, అల్పహారములు, దైవానికి మహానైవేద్యములు, సమయం మించకుండా సమకూర్చెడివారు. ఆమెకు దైవమందు విశ్వాసంతో గాక, పతికి సహకరించే ఉద్దేశ్యముతో చేసెడివారు. ఆమె అనేక సందర్భాలలో నాభార్యతో, అమ్మాయి మీగురువుగారు ఎప్పుడూ దేవుడు దేవుడని పూజలుచేస్తుంటారు. జరుగుబాటు సంగతేమిటని నేనుఅడిగితే, సనారీవారు అన్నిచూచుకుంటారు, ఏలోటూచేయరు అంటారు. అని చెప్పుకునేవారు, యిలాంటి పరిస్తితులలో నులకపేటలో యిద్దరు గురవమ్మలనే పేరుగల వారుండేవారు. ఒకరు గురుపత్ని, వేరే యింకొక ఆమె ఉండేది. వేరే గురవమ్మ అక్కడికి 3 కిలోమీటర్ల దూరంలో గల మంగళగిరిలో ఉంటున్నది మంగళగిరిలోని గురవమ్మ ఉన్నట్లుంది అకస్మాత్తుగా కోమాలోకి వెళ్ళిపోయింది.

1-8-1998 న ఆమెను అక్కడ హాస్పటల్‌లో చేర్పించారు. ఆమె 3 రోజులు తర్వాత స్పృహలోకి రాగా బంధువులు ఆమెను యిపుడెలా ఉందని అడిగితే, ఆమె ఎవరో యిద్దరుదూతలు పట్టుకుని, మహాకాంతివంతమగు లోకానికి తీసుకువెళ్ళారు. అక్కడ సింహాసనముపై మహాకాంతితో వెలుగొందు మహనీయుడు, ఆదూతలను జూచి, ఈ గురవమ్మను తెచ్చారేమిటి? ఈమెకాదు, ఆమెను తీసుకురమ్మన్నారట. వెంటనే ఆ దూతలు ఈమెను తీసుకువచ్చి వదిలి వెళ్ళిపోయారని చెప్పిందట. యివన్నీవిన్న ఆమెబంధువులకు నులకపేటలోని గురవమ్మ గుర్తువచ్చి ఆమెఎలాఉందో చూచివద్దామని, నులకపేటలోని గురువుగారింటికి వచ్చేసరికి, ఈగురవమ్మ గారు స్వల్ప అనారోగ్యంతో అకస్మాత్తుగా అప్పుడే మరణించారు. యిదిచూచి మంగళగిరినుండి వచ్చినవారు, అక్కడ గురవమ్మగార్కి జరిగిన విషయాలు చెప్పి ఆశ్చర్యపోయారు. యిదంతా దేనికిజరిగిందని ఆలోచిస్తే, సనారీవార్ని ఏ భావంతో సేవించినా, కార్యక్రమాలకు ఎంత సహకరించినా ఉత్తమలోకప్రాప్తి కలుగుతుందని, లో కానికి ఋజువుపర్చుటకు జరిగిన దైవలీలగా అర్ధమౌతుంది. సనారీ భక్తులందరి జీవితములలో యిలాంటి అనుభూతులు కోకొల్లలు, మనము సనారీ సంవాదాన్ని పట్టుకుంటె. స్వామివారు మనవెన్నంటి. అన్నివిషయాలు ఎరుకపరుస్తూ, కంటికిరెప్పవలే కాపాడి అంత్యమున శివసాయుజ్యప్రాప్తికలుగజేస్తుంటారు. కనుక సాక్షాత్ పరమశివుడు పంచాననం వారినుద్ధరించుటకై పాలకొండలో సింహాద్రివారి యింట విశ్వనాధునిగా జన్మించి, మానవుడే మాధవుడుకాగల యోగసాధనాపద్ధతులను, భావితరములవారికి ప్రసాదించిన మహాపురుషుడు. తనను అర్చించినవారికి మోక్షసామ్రాజ్యము ప్రసాదించు పరమాత్మ, యిట్టిపురాణపురుషుని సేవించి, పూజించి, పూజకు సహకరించి, మీా, మా జన్మలను ధన్యముగావించుకొనుటయే మన కర్తవ్యము.

## 15. సనారీ వారి మహిమలు

ప్రకాశంజిల్లా ఒంగోలు దగ్గరలో గల సంతనూతలపాడు మండలంలోని వేములపాడు గ్రామం నుండి ది.3-2-2008 న బ్రII గోనుగుంట సుబ్బారావుగారు దంపతీయుక్తముగా శివరాత్రి సందర్భముగా పాలకొండ వచ్చారు. మాదంపతులకు ఆనాడు వారి అనుభవాలు పాలకొండలో యిలా చెప్పారు. 1988 నుండి ఆయన మోకాళ్ళ నొప్పులతో తిరుగలేక పోయేవారు. అప్పట్లో వారు వడ్రంగిపనిచేసేవారట. యింటిలో జరుగుబాటు అంతంతమాత్రంగా ఉండేదట ఆ పరిస్థితులలో 12 సంవత్సరాల కుమారుడు మరణించుటతో, శారీరకంగా, మానసికంగా, ఆర్ధికంగా చాలాబాధలుపడుతున్న తరుణంలో ఆయుర్వేద వైద్యులైన బ్రIIకావూరి వీరభద్రరావుగారు వీరికి వైద్యం చేస్తూ ఎన్ని మందులు వాడినా ఫలితం లేకపోవుటచే "సనారీ సంవాదము" గ్రంధాన్ని సుబ్బారావుగారి చేతికిచ్చి 3 నెలలు విడువకుండా చదువు సనారీ వారి దర్శనం జరుగుతుంది. నీ వ్యాధి పోతుందని చెప్పారట, ఆ ప్రకారం సుబ్బారావు గారు 3 నెలలు విడువకుండా గ్రంధాన్ని చదువగా ఒకనాడు స్వామివారు స్వప్నంలో వైద్యునివలే కన్పించి కాలి నొప్పి గల ప్రాంతంలో నొక్కి నీ వ్యాధి పోయిందని, చెప్పి పంచాక్షరిని ఉపదేశించారట. నాటి నుండి నేటి వరకూ కాలిబాధ తొలగి ఆనందమగు జీవితాన్ని గడుపుచూ వాక్శుద్ధి గలిగి వాస్తు విద్యలో రాణించుతూ అమ్మవారి జీవసమాధి దర్శనార్ధం శివరాత్రినాడు పత్నీయుక్తంగా పాలకొండవచ్చారు. వీరిని సింహాద్రి ప్రకాశరావు అనే భక్తుడు వారి యింటికి ఆహ్వానించగా, మా దంపతులము కూడా వారి ఆతిధ్యంలో నుండుటచే ఉభయులకు పరిచయమైన పిదప సుబ్బారావు గారు ఈ విషయములు నాతో 4-3-2008 తేదీన చెప్పారు.





## 16. శ్రీశ్రీశ్రీ సనారీ కాలనిర్ణయం

శ్రీ సింహాద్రి విశ్వనాధావదూత గారి జననం 1794వ సంవత్సరకార్తీకశుద్ధ పంచమిగా పూర్వరచయితలందరూ వ్రాసారు. పూజ్య శ్రీ సనారీ వారు పాలకొండ సరిహద్దు గ్రామమగు అన్నవరంలో 1850 సంIIలో వారికి 56వ సంవత్సర ప్రాయమున రామలింగేశ్వర స్వామి ప్రతిష్ఠ చేసి ఆలయ నిర్వహణకు 3 1/2 ఎకరముల భూములనిచ్చినట్లు దేవాలయ నిర్వహకులు చెప్పుచున్నారు. స్వామి వారు రచించిన సంవాదము 1885 లో ముద్రింపబడి బాగా శిధిలావస్తలో యున్నది. నేను 2008 లో తెనాలి, వాII బ్రII తుమపాల సత్యన్నారాయణ గారివద్ద చూచాను. అది ఎన్నోముద్రణో తెలియదు. ప్రథమ ముద్రణ దానికి అంతకుముందే అయిఉండాలి. 1865 -1875 ప్రాంతంలో ప్రథమ ముద్రణ అయిఉండాలి. అప్పటికి స్వామి వారి వయస్సు షుమారుగా 70 సంవత్సరాలు యుండవచ్చు. గ్రంధ ముద్రణ జరిగి స్వామి వారికి బ్రహ్మరథం పట్టిన తర్వాత, తన శివ అవతారమును రుజువుపరచి, మద్రాసు నుండి శ్రీశైలగుహలోకి వెళ్ళినట్లు చరిత్రలు చెబుతున్నాయి. (సనారీ వారు చేసిన స్వర్ణ బుళాకీ)

కృష్ణాజిల్లా , హనుమాన్ జంక్షన్ దగ్గరలోగల "యేలేరు" గ్రామములో ప్రక్కిమోహన్‌యను ఆర్.యమ్.పి. వైద్యులు కలరు. వారియింట సనారీ వారి స్వహస్తములతో వారి నాయనమ్మ అత్తగార్కి వివాహసమయమున చేసి యిచ్చిన ముక్కు బుళాకీ కలదు. అది ఆ యింట ప్రథమ సంతానానికి వార్షికంగా చెందుచున్నది. ప్రస్తుతం మోహన్ గారు ఆబూళాకీని పూజామందిరంలో ఉంచి. ప్రతీ సంవత్సరం కార్తీక పౌర్ణమినాడు బయటకు తీసి కుటుంబ సభ్యులందరు కలసి కేదారేశ్వరస్వామి వ్రతం చేసి వచ్చిన వారందరకూ ఆ బుళాకీని చూపిస్తున్నారు. నేను సనారీ వారి జయంతిని కార్తీకశుద్ధ పంచమినాడు. 2004 లో విశ్వబ్రాహ్మణ కల్యాణమండపంలో చేస్తుండగా ప్రక్కి మోహన్ గారు వచ్చి తమయింట దైవప్రసాదంగా లభించిన బుళాకీ గురించి చెప్పి ఎప్పుడు వచ్చినా నాకు చూపుతానన్నారు. ఒకనాడు నేను పెయ్యేరు మోహన్ గారింటికి వెళ్ళి గురుదేవుల స్వహస్తాలతో తయారు చేసిన బుళాకీని చూచి గురుదేవులను చూచినంత ఆనందాన్ని పొంది, ప్రక్కి వారి అదృష్టానికి ఆనందిస్తూ వివరాలు అడిగితెలుసుకున్నాను. మోహన్ నాయనమ్మ అత్తగారి పెండ్లికి సనారీవారు బుళాకీ చేసి యిచ్చారు. ఆ తర్వాత ఆమె పెళ్ళయి 15 ఏళ్ళయినా సంతానం కలుగలేదని వేడుకోగా స్వామివారు. రెండు అరటిపళ్ళు మంత్రించి యివ్వగా మోహన్ తాతగారు జన్మించారు. వారు 58 సంవత్సరాలు జీవించి 1948 లో మరణించారు. అనగా 1890 లో జన్మించారు. అప్పటికి 18సంత్సరాలు ముందు బుళాకీచేసియిచ్చారు. అంటే 1872లో బుళాకీ యిచ్చారు. అప్పటికి సనారీ వారి వయసు 75 సంవత్సరాలయితే సనారీ వారి జననం షుమారుగా 1797 ఈ లెక్కల ప్రకారం వచ్చినది. చరిత్రకారుల లెక్కలకు యిది 3 సంవత్సరాలముల తేడా తో సరిపోతుంది. (పాలకొండలో సనారీ వారి 75 సంIIరాలుపై బడి ఉన్నారని ఆ ప్రాంతీయులు చెప్పుచున్నారు.

## 17. శ్రీ సనారీ వారి ద్వాదశసూక్తులు

1. సనారీ భక్తులకు యే ఆపదలుండవు ఎల్లప్పుడు వారే రక్షించుచుందురు.
2. సనారీ వారి మూలమంత్రాన్ని సదాజపిస్తూ సర్వులూ ఆనందాన ఉండేరు.
3. సనారీ వారి భక్తులు అవనిరుద్రాంశులై చరియించి ఆచంద్రతారార్కము కీర్తింపబడుదురు

4. సనారీవారు వార్ని దూషించినా సహింతురు, వారి భక్తులను దూషించిన సహింపరు.
5. సనారీ వార్ని, అన్నపూర్ణాంబను, వారి శక్తిని,సంవాదమును పూజించు వారి సకల దోషములు బాపి గురుదేవులు సర్వకోర్కెలు తీర్తురు.
6. సనారీ వారు సద్భక్తులు, ఉదారమనుష్యులు, సంయమాదుల హృదయములందుందురు.
7. పుణ్య పురుషులకు, పతివ్రతామతల్లులకు,యోగసాధకులకు భుక్తిముక్తులొసంగుదురు.
8. ధర్మముచేయువారు, ఎవ్వరినీ దూషించిన వారు, వేరొకరిసొత్తుకు ఆశపడని వారు సనారీ వారికి అత్యంత ప్రీతి పాత్రులు.
9. తోడేకొలది బావిలో నీరు, ధానధర్మాలు చేయుకొలది, చేయువారి సంపదలు వృద్ధి చెందుతాయి.
10. పూర్వ జన్మకర్మ ప్రస్తుతము నీవనుభవించునది, సనారీ వార్ని ఆశ్రయిస్తే క్రమంగా నీ బాధలు తొలుగుతాయి.
11. నీ మనసు సనారీ వారియందు లగ్నంచేస్తే నీకు బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. లేకుంటే అజ్ఞానం లోనే ఉంటావు.
12. సనారీ వార్ని పూజించు వారిని గురుదేవులే సదా వెన్నంటి కాపాడుచుందురు.

**ప్రతివారు పాలకొండ సనారీ మఠమందు నిద్రించిన అన్నపూర్ణాదేవి అనుగ్రహం పొందగలరు.**

## 18. ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః వీటి అర్థము

**మానవుని సంసారము మందు మూడు విధములగు దుఃఖములున్నవి.**

1. ఆధ్యాత్మికము : ఆత్మయందును, శరీరమందును, అవిద్య, రాగము (అసూయ) ద్వేషము మూర్ఖత్వము, అనారోగ్యము, వీటిచే కలుగు దుఃఖము.
2. ఆదిబౌతికము : శత్రువులు, క్రూరమృగములు, విషజంతువులుచే కలుగు దుఃఖము.
3. అధిదైవికము : అతివృష్టి, అనావృష్టి భూకంపములు జలప్రళయము, మనస్సుయొక్క యింద్రియములయొక్క అశాంతిచే కలుగు దుఃఖము.

**శ్లో॥ అధ్యాపన మధ్యయనం యజనం యాజనంతథా।**
**దానప్రతిగ్రశ్చైవ బ్రాహ్మణామకల్పయత్ ॥ (మను॥1-88)**

**అర్థము** : ౧వేదములు చదువుట ౨ చదివించుటకు ౩ యజ్ఞము చేయుట ౪ చేయించుట ౫ దానములు యిచ్చుట, ౬ తీసుకొనుట ఈ ఆరు బ్రాహ్మణకర్మలు, యివి ఎవనియందు గలవో వానినే బ్రాహ్మణులందురు.

**యింకా** 1. బ్రహ్మచర్యాది వ్రతరహితులు, ఆచారహీనులు, యోగ విద్యాయోగభ్యాసరహితులు, ధర్మానుష్టానవితరులు, సత్సంగశూన్యులు, పురుషార్థహీనులైన వారు, అజ్ఞానాంధకారమున జిక్కి బ్రహ్మము నెరుంగజాలకున్నారు. జీవులకుభిన్నుడు సర్వాంతర్యామి, సర్వనియంత,





సర్వవ్యాపకుడునగు బ్రహ్మమునెరుగుటకు, పవిత్రాత్మలే అర్హులు, యితరులు అర్హులు కాజాలరు.

2. స్త్రీ పురుషులందరూ గృహస్తాశ్రమమున ప్రవేశించి పరమాత్మయందు శ్రద్ధకలిగి తమకర్తవ్యమును చక్కగా నెరవేర్చి ఎల్లపుడూ సుఖములను అనుభవింతురు గాక। ఏ మనుష్యులు పరిపూర్ణజ్ఞానము గలిగి యోగసాధనచే పరబ్రహ్మను అన్వేషించుతూ పరులకు ఉపకారము చేయుదురో వారు అజరులై (ముసలితనములేనివారై) అమరులై ఆపరమాత్మలో ఐక్యమయి బ్రహ్మానందము ననుభవించెదరు.

3. ఏ మహాత్ములు తమ మానసిక శక్తితో, అజ్ఞానమునబడి దుఃఖించు వారిని ఉద్ధరించు చున్నారో, అతను సర్వశక్తియుతుడు, అన్నిటికి కర్త యయిన పరమేశ్వరుడు. పరోపకార మొనర్చు మహనీయులకు ఎల్లప్పుడు సహాయమందించుచూ సంతోషము నిచ్చువాడై యున్నాడు..

4. ఏ మానవుడు సృష్టికర్తయగు విశ్వకర్మ ఆజ్ఞపాలించుటలో ఆత్మార్పణ గావించునో వాడు ఆపరమాత్మ రక్షణలో హాయిగా నుండును. ఎట్లనగా? వీరులైన వారిని మహారాజు తన కోటలో ప్రత్యేకముగా నుంచుకొనునో (అటులనే)

## 19. శ్రీశ్రీ శ్రీ సనారీ ఛాలీసా

1. జయజయ విశ్వనాధ । జయసద్గురు శేఖర। అన్నపూర్ణమనోనాయకా।
2. జయవీరాచార్యపుత్రా । జయజయ సజ్జనస్తుతిపాత్రా। సింహాద్రి వంశపావనా।
3. విశ్వకర్మ కులోద్ధారక। విశ్వనాధావదూత, విశ్వవిఖ్యాతా। వీరాధివీరా।
4. కామితఫలదాయక। కరుణాసాగర । కైవల్యప్రధాతాక్షీరాద్రివాసా
5. దుష్టశిక్షకా ।శిష్టరక్షకా । ఆర్తత్రాణ పరాయణా। ఆదిమధ్యాంతరహితా।
6. బ్రహ్మవిష్ణు యింద్ర, సూర్యతేజమూ శక్తివీ సృష్టికర్తయూ నీవే।
7. సృష్టిస్తితి లయ కారకుడవు సర్వజీవరాసులందలి జీవమూనీవే।
8. బ్రహ్మ విద్యారహస్యము ।వేదాంత సారము విడమరచిన గురుడవునీవే।
9. కురూపికన్యను సౌందర్యవతిని జేసిన। కరుణామూర్తివి నీవే। గురుదేవా।
10. మృతులను సజీవులును జేసిన।మృత్యుంజయుండవు నీవే।అర్ధనారీశా।
11. రోషావేశమున చరించిన ఫణిరాజుకు । శిక్షవేసిన సర్వేశ్వరుడవునీవే।గురుదేవా।
12. రాజమహేంద్రరాజవీధిని । అహంకారి గర్వమడుప శిలను జేసిన సద్గురు దేవా।
13. భూతప్రేతపిశాచాదుల ఫీచమునణచి। ఆర్తులగాచిన ఆపద్బాంధవా।
14. నవపాషాణములను నమిలి మ్రింగి। లోహముపై మూత్రించి। పసిడిని జేసిన పరంధామ।
15. ద్రాక్షారామగ్రామదేవతను బంధించి । ప్రాణులగాచిన పరమపురుషా।
16. షన్మతముల వారితో చర్చలుజరిపి । సమానమనిపించిన సమతావాదీ।
17. పాలకొండ నివాసా । పాపవినాశా। పరమదయాకరా। పాహి ।పాహి ।పరమపురుషా
18. సద్భక్తులకు సులువుగా । యోగరహస్యము లెరింగించిన సద్గురువర్యా।
19. రాజయోగీ। రసవాద ప్రసిద్ధా। త్రిగుణాతీత । తామసహరుడా। తత్వబోధకా।
20. కుల, మత జాతిభేదములు లేవని। అష్టాదివర్ణములనాదరించిన ఆదర్శమూర్తీ।

21. షట్ చక్రములందలి, సర్వశాస్త్రములందలి। రహస్యములు దెల్పిన సనారీశా।
22. అష్టసిద్ధులను బొంది। అణిమాదులకు ఆశపడని। అరిషడ్వర్గవిధ్వంసీ।అమరుడా।
23. వేదాంత సారమును భక్తులకందించిన ।వేద విద్యా ప్రవీణా। వేదాంతాగ్రణీ
24. కందుకూరులో స్వకులస్తుని మ్రొక్కులు తీర్చగ। శివలింగాన్ని చెంతకు రప్పించిన దైవరాయ।
25. దివ్యవాక్కుతో దీర్ఘవ్యాధిని బాపిన। దీన జనబాంధవా దేవాదిదేవా। దివ్యపురుషా।
26. చెన్నపురిలో బ్రహ్మరథోత్సవం జరిపిన। మొదలియార్ కుటుంబమునకు ముఖ్యదైవమునీవే।
27. శృంగేరి పీఠాధ్యక్షులను యోగ వాదమునందోడించి। మహిమలు జూపిన మహనీయా।
28. వామాంకమందు దాక్షాయినిన్ వడిన్ జూపి । "సనారీ" యైన చరిత్ర పురుషా।
29. ముక్కంటితో గడ్డిమేటల్ భస్మంబుగావించిన । మహిమాన్వితపురుషా । మహాదేవా ।
30. శ్రీశైలగుహలో । ఆగమవేదమునూహింపుచూ । ఆర్తులబ్రోచెడి అన్నపూర్ణహృదయేశా।
31. పరమపావనా, పాపనాశకా । పార్వతీరమణా । పంచాననకులప్రసూతా, పాహిపాహి। పరమేశా
32. ఘోరమైన భవసాగరముదాటన్ । సాయమునీవే । సన్నుతిచరణా । సర్వేశ్వరా।
33. తల్లియు, తండ్రియు, గురుడవు, పరమాప్తుడవు ప్రాణసఖుడవు, పరమాత్మవూనీవే।
34. నిరతమునినుకొలిచెడివారికి । యిష్టకామ్యములుతీర్చి మోక్షమునిత్తువునిక్కముగాను।
35. నీమహిమలు కీర్తింపనేనెంతవాడను । దయతోమముకావుము సద్గురుదేవా।
36. సాయిబాబాచార్య శిష్యుని । సద్భక్తుల హృదయనివాసా । సనారీశా । జగద్గురుదేవా।
37. శరణు శరణు సింహాద్రివంశపావనా । సనారీ విశ్వనాధా "శరణు శరణు శరణు"।
38. శతసహస్ర పాదాభివందనములు । భక్తమందార । గైకొను మాహృదయాభివందనములు।
39. జై జై జై సనారీ విశ్వనాధా । జగద్గురు, సద్గురు, మద్‌గురుదేవా జై జై జై।
40. మంగళం, జయమంగళం, నిత్యశుభమంగళం, పరమపావనా, మీకు జయమంగళం।
సద్గురుదేవాశుభమంగళం । జగద్గురుదేవా జయమంగళం । మద్ గురుదేవానిత్యశుభమంగళం
। జైవిశ్వనాధజై । జైఅన్నపూర్ణమాంబజై । జై విశ్వనాధజై అన్నపూర్ణమాంబజై॥

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః

## ౨౦. శ్రీశ్రీశ్రీ క్షీరాద్రిఅన్నపూర్ణాంబాష్టకమ్

1. నమోదేవ్యై అన్నపూర్ణాయై । సువాసిన్యైనమోనమః
   శుభంకురు మహాదేవీ । గౌరీదేవ్యైనమోనమః ।
2. శాంతాయై చంద్రరూపాయై । చండికాయైనమోనమః।
   జయాయై శుభప్రధాయై । పార్వతీదేవ్యైనమోనమః।
3. నందాయైతేనమస్తేస్తు । విశ్వనాధాంకవాసిన్యైనమోనమః।
   పాహిసఃపుత్రధారాంశ్చ । మంగళాయైనమోనమః।
4. అపర్ణాయైనమస్తేస్తు । భక్తాభీష్టప్రధాయిన్యైనమోనమః।
   అభయప్రధాతాయై । సర్వమానవసంపూజ్యాయై నమోనమః।





5. సుముఖాయైనమస్తేస్తు సకల । శుభప్రధాయైనమోనమః।
   కమల నేత్రాయైనమస్తేస్తు । పరమానందాయై నమోనమః
6. భోగప్రధాయైనమస్తేస్తు । భక్తవత్సలాయైనమోనమః।
   సర్వమంగళాయైనమస్తేస్తు । సౌభాగ్యనిలయాయైనమోనమః।
7. శ్రియంనోదేహిమాతస్త్వం । శివవల్లభాయైనమోనమః।
   నమఃశ్శీతలపాదాయై । పరమేశ్వర్యైనమోనమః।
8. త్వత్పాదపద్మవిన్యాసం । చంద్రమండలశీతలమ్ ।
   గృహేషుసర్వదాస్మాకం ॥ దేహిశ్రీ క్షీరాద్రి అన్నపూర్ణేశ్వరీ ।
9. అన్నపూర్ణాష్టకం స్తోత్రంయః పఠేద్భక్తిమాన్నరః।
   సర్వసిద్ధిమవాప్నోతి రాజ్యం ప్రాప్నోతిసర్వదా।
10. ఏకకాలపఠేన్నిత్యం మహా పాపవినాశనం । ద్వికాలయఃఫఠేన్నిత్యం
    ధనధాన్యసమన్వితం । త్రికాలయః పఠేన్నిత్యం మహాశత్రువినాశనం ।
    క్షీరాద్రి అన్నపూర్ణార్భవేన్నిత్యం ప్రసన్నావరదాశుభాః॥

## 21 ఎ .శ్రీశ్రీశ్రీక్షీరాద్రిఅన్నపూర్ణాంబాష్టకమ్

1. శ్రీకరంబుగక్షీరగిరిలో శాశ్వతంబుగనున్న, "ఓ"
   మాతాన్నపూర్ణామమ్మ బ్రోచెడి భక్తజన చింతామణీ
   భూలోకవాసుల కొంగుబంగారైన దైవశిఖామణీ
   సింహాద్రివిశ్వనాధుని సతీ సుగుణఖనివీ అన్నపూర్ణ॥ 1
2. కలియుగంబున మానవులకు యిలవేల్పువైవెలసీ
   క్షీరాద్రిలో జీవసమాధిని స్తిరముగానీవుంటివీ
   ఆలసింపక భక్తవరులకు అష్టసంపదలీయవా
   వెలుగు కుంకుమకాంతి రేఖలసింహాద్రీ అన్నపూర్ణా॥ 2
3. తెలుగు తమిళ కర్నాట మళయాళ దేశమందలి
   సుస్తిరంబుగసాధు జనులను, కాచి బ్రోచెడితల్లివై
   అక్షయంబుగ పాలకొండలో అన్నదాత వైయుండీ
   కోర్కెతీర్చిమోక్ష మిచ్చెడి ఆదిశక్తివి అన్నపూర్ణా॥ 3
4. సుమంగళీపురజననివీ సుప్రసిద్ధవు అమ్మరో
   సత్‌శిష్యులగన్న తల్లివి సద్గుణాన్విత శుభకరీ
   శిక్షజేతువుఘోరభవముల శాశ్వతంబుగశాంకరీ
   శ్రీశైలభ్రమరాంబవూ, కాశీవిశాలాక్షీవీ అన్నపూర్ణా॥ 4
5. విశ్వేశ్వరుని అర్ధాంగీవిమలచరితా విశ్వేశ్వరీ
   "కోమలాంగీ" కరుణానిధీ కుటిలకుంతలయోగినీ

నామనంబున వీడకుండుము నిన్నునమ్మితినమ్మరో
విశ్వంబున ప్రసిద్ధికెక్కిన విశ్వనాధుని అన్నపూర్ణా॥ 5

6. శాంతమూర్తివి సద్గుణావతి, సత్యధర్మవ్రతాచరణీ
విగ్రహంబులకెల్లఘనమై వెలయు సుందరమూర్తివీ
జీవసమాధియందునున్న జీవపోషణకారిణీ
శీఘ్రముగను కోర్కె తీర్చిశుభములిచ్చెడి అన్నపూర్ణా॥ 6

7. విశ్వనాధుని వామభాగము పొందుగానీవుంటివా
ఖ్యాతిగనుపాలకొండలో ప్రీతిగానెలకొంటివా
ఆర్తులకునూ అభయమిచ్చుచు భక్తులను చేకొంటివా
పాలకొండమఠమందలి పాపనాశినిఅన్నపూర్ణా॥ 7

8. ప్రచారమయ్యె నీప్రభావము భూలోకమందునా
పల్లవించెను నీదుతత్వము స్త్రీపురుషులందునా
తెల్లముగ భూలోకమందలి ఎల్లదేశములందునా
చెల్లునమ్మా నీదుమహిమలు శీఘ్రముగనూ అన్నపూర్ణా॥ 8

9. పాలకొండలో విశ్వనాధుని దైవరాయలభామినీ
శీఘ్రముగ మమ్మేలుమమ్మాకామితములు తీర్చుచూ।
క్రమముగా నీయష్ఠకంబును వ్రాసి చదివినవారికిన్।
కోర్కెతీర్తువు ఎల్లకాలము కరుణతో మముఅన్నపూర్ణా॥ 9

10. సుగంధాన్వయ వంశజుండు సాయిబాబను పుత్రుడు
భక్తితో నీయష్టకంబును అతిశ్రద్ధతో సమకూర్చెను
పాదపద్మములు పట్టివేడెద, పూజచేసెద నమ్మరో
పాహిమాం, పాహిపాహి పరమపావని అన్నపూర్ణా॥ 10

## 22. శ్రీశ్రీశ్రీ సనారీవారిఅష్టకము

1 అక్షయంబుగపాలకొండను । వెలపిన "ఓ" విశ్వనాధా
సురక్షితంబుగమమ్ముబ్రోవుము ।శాంతమూర్తీసద్గురూ
వేదసారమువిప్పి చెప్పిన । వేదవేద్య విరాట్ప్రభూ
పాదపద్మముపట్టి వేడితి (మమ్ము) ఫాలనేత్రప్రదర్శకా ॥ 1

2. విశ్వజనులను ద్ధరింపగ । భువికి వచ్చిన ఈశ్వరా
పరశువేదిని ప్రదర్శించిన । పరమ పురుషాపాహిమాం
ఆంధ్రదేశపు పాలకొండను । యధ్భుతంబులుచేసిన
సింహాద్రివంశపావనా । శరణు శరణు సనారీశా 2

3. అష్ఠసిధ్ధులు బొందిన । అమరుడా "ఓ" గురువరా
ఆదిదేవుని అంశతోయిల । తిరిగినట్టి విశ్వనాధా





స్వర్ణయోగముసిద్ధి నొందిన । స్వర్ణశిల్పప్రవీణుడా
శాశ్వతంబుగ ధరణిలో । నిలచినా సద్గురువరా 3

4. శైవవైష్ణవ శాక్తేయ । షన్మతంబులు సరిగజూచిన (సమమన్న)
దేవదానవయక్షకిన్నెర । సంయమాదుల సంస్తుతా
భూతప్రేతపిశాచాది బ్రహ్మరాక్షస (దుష్టగ్రహ) భేదకా
సర్వపాపహరుండవీవే । సాగిలంబడి మ్రొక్కెదన్ 4

5. "సనారీ" యని భక్తులెల్లరు । ఆర్తితోనినుకొలుతురూ
రోగశోకములన్ని బాపుము । రాక్షసాంతకరాజయోగి
చెన్నపట్టణమందునున్న । పెద్దవ్యాధీగ్రస్తునీ ప్రేమతో (వాక్కుతో)
ఆరోగ్యవంతుని జేసినట్టి । ఆర్తత్రాణపరాయణా 5

6. కురూపికన్యకు కరుణతో। సుద్రూపమిచ్చినసద్గురూ
ఘనాపాఠీల గర్వభంజక । బృందగానవినోదమోదా।
రాజమహేంద్రిరాజవీధిని । అహంకారిదర్పమడుపగ
శిలనుజేసిగర్వమడచిన । శింహాద్రివిశ్వనాధా 6

7. సర్వజనులందు దయతో । సంవాదగ్రంధమిస్తివి
కరుణతోమముకాచి బ్రోవుము । కానరాకలినాశకా
కందుకూరునకులస్తుని కోర్కెదీర్ప మహిమజూపిన
దేవదేవమహాదేవదీనబంధూ । దయానిధీ 7

8. అష్టంకంబునునిష్ఠతో । నెవరాత్మయందు పఠించినన్
అష్టకష్టములన్ని దీర్తువు । ఆదరింతువు ఆదిదేవా
యిష్టకామ్యములన్ని గూర్తువు । యిహపరసౌఖ్యములనిత్తువు
నిష్టతోనిను పూజజేతుము । నిశ్చయంబుగ నాదమోదా 8

9. సుగంధపు వంశజుండు । సాయిబాబను శిష్యుడు
భక్తితోనీయష్టంకంబును ।అతిశ్రద్ధతోసమకూర్చెను।
సనారీబాబాయనేకీర్తిగన్న। భక్తుడుసదానిను సేవించును
సద్గురువరాపాహిమాం। పాహి పాహి పరమ పురుషా ॥ 9

## 23. శ్రీశ్రీశ్రీ క్షీరాద్రిఅన్నపూర్ణాంబదండకం

శ్రీమన్‌మహాదేవదేవీ । మహాశక్తిస్వరూపిణీ।భక్తజనచింతామణి। క్షీరాద్రిమఠనిలయే । నియమ నిష్ఠాగరిష్టత్వంబునన్। దీక్షభూని। విశ్వనాధునిన్ అర్ధభాగంబైనట్టి అన్నపూర్ణాంబా। దయాతరంగిణీ । నిత్యకల్యాణీ। నిరతాన్నదాతా। ఉమా। గౌరీ। రుద్రాణి। వాగ్వాణి। ఇంద్రాణియున్। యిందిరాదేవి। కంచికామాక్షి। మధురమీనాక్షి । కాశీవిశాలక్షి । గాయత్రీ । సావిత్రియన్నన్ భవద్రూపుకేజెల్లు। విశ్వకర్మకులోద్ధారిణీ । కాత్యాయనీ । చిదానందవల్లీ । యశఃకామవల్లీ । మమున్‌గన్నతల్లీ । దయాపాలవెల్లీ । భవత్కీర్తిన్ సదానుతింతున్ । జగన్మాతా । విశ్వేశ్వరార్ధాంగి। విమల చరితా। అన్నపూర్ణేశ్వరీ । చిద్రూపిణీ । భవత్ దివ్య క్షేత్రంబున్ దర్శించి।ముదంబునన్ మిమ్మర్చించి। మీా

దివ్యసన్నిధిన్ శయనించువారికిన్। అభయ ప్రధానంబుగావించి । కామితము లీడేర్చి రక్షించి కాపాడుదువీవే । నీరూపమున్। తేజమున్ । శౌర్యమున్ । ప్రజ్ఞయున్। శక్తిసామర్థ్యముల్। నీ మందహాసలీలావినోదంబుల్ । మహాద్భుతంబైనట్టి మీ మహాత్యమున్వర్ణింప। కీర్తింప ఆదిశేషునకైనా సాధ్యంభే? సామాన్యుండనై నట్టినేనెంతవాడన్ దయాసాగరీ। మాపూర్వపుణ్యంబునన్ నీపూజలుంజేసి, నీ మహిమలన్ కీర్తించి । మీ నామంబులన్ బాడుమమున్ సత్రుకృపాలోలవై ।పుత్రవాత్సల్యంబునన్ । సత్యధర్మార్థకామాది మోక్షంబులన్ గూర్చి మాకోర్కెలున్ దీర్చి। మా కష్టముల్ ।నష్టముల్। దుఃఖముల్।బాపి। ఆయురారోగ్య భోగభాగ్యంబుల్ ప్రసాదించుమోజగజ్జననీ। పరంజ్యోతి । ఆదిశక్తి। నీకున్విరులుజాజులున్। కొల్లాలమొల్లలుం। మంచి చామంతులున్। తెల్లగన్నేరులున్ ।ఎర్రదానిమ్మలున్ దెచ్చి టెంకాయలున్ గొట్టి। చిత్రాన్నక్షీరాన్నముల్ బెట్టి। నేరేడు నిమ్మచూత ఫలంబులాదిగానైవేద్యముల్ జేసి । నీరాజనంబిచ్చి । మంగళహారతుల్ సంగీతసాహిత్య నృత్యగానంబులన్। గీతంబులున్ పాడగా ।మానసోల్లాసివై దయంజూడుమమ్మా। కృపాకల్పవల్లీ ।విశ్వకర్మేశ్వరీ నీ కరుణాకటాక్ష వీక్షణంబుల్ ప్రసరింపవే। మమున్ గావవే। కోరికల్ దీర్చవే। మహాదేవీ । మాకాచంద్ర తార్కామౌకీర్తిన్ ప్రసాదింపవే। కృపాకల్పవల్లీ ।జగన్మాతా । నీముదంబార మందారగుచ్ఛంబుల మాలలున్వేసి। పూజింతుమమ్మా । స్మరారాతికొమ్మా। కడన్జూడకమ్మా । దయన్గావు మమ్మా। విశ్వేశ్వరార్ధాంగీ। క్షీరాద్రి అన్నపూర్ణా। తల్లీనీపేర నేనొక్కదండకంబున్ వ్రాసితిన్। తప్పులో। ఒప్పులో। మెప్పులో। దయన్ సైరింపుమమ్మా। నేనాంధ్రగీర్వాణ వ్యాకరణంబుల్। ఛందోబద్ధకావ్యముల్ వల్లింపలేదమ్మా। నీ సుతున్దోసముల్ మన్నించి । కరుణింపుమమ్మా। త్రిలోకైకమాతా । మదానందముప్పొంగ సేవింతునమ్మా। ప్రతీశుక్రవారంబునీ పాదసేవాభాగ్యమ్మునిమ్మా ।రమ్యపాణిద్వయీ। బద్ధదివ్య ప్రభోపేతా । సమచ్ఛాయరోద్భూత। బాలా। నీలాలోల । నీలాలకాకీర్ణఫాలాగ్రభాగే । జగత్స్తుత్య సౌందర్య సారప్రశస్తైకకాయే। మహాచిత్ర విచిత్రమాయే । సదానందరూపే । చందనావాసితే। అవధూతపత్ని। త్రినేత్రీ। లసద్దేహభాస్వన్మహామేరు చక్రస్తితే । దివ్యసౌందర్యసంపూర్ణసర్వాంగలావణ్య సమ్మోహితే । మంగళాకారే । ఆదిమధ్యాంతరహితే। అస్మదానందసిద్ధి ప్రధాతే నీ సుందరాకారమున్ కన్నారగాంచుమా జన్మలన్ సార్థక్యంబుజేయవే ఆర్తత్రాణపరాయణీ సుమంగళీప్రధాతా। కైలాస వాసినీ। శ్రీ శైలభ్రమరాంబ। కాశీఅన్నపూర్ణాంబా। పరమేశ్వరీ । పరమపావనీ। పాపనాశినీ। ఆదిశక్తి, పరాశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియశక్తి, జ్ఞానశక్తి, మూలమౌమహాశక్తివీవే। సర్వసర్వంసహాసృష్ఠి మూలకారిణివీవే ।క్షీరాద్రి జీవసమాధి నందుండి నీ భక్తులన్ గాచు చున్నట్టి అన్నపూర్ణమాతా । నమస్తే। నమస్తే । నమస్తే। నమో నమః।

## 24. భక్తునకు స్వామివారి దర్శనము

విజయవాడ దక్షిణమున కృష్ణానది ప్రవహించుచూ కృష్ణాజిల్లాను పాడిపంటలతో సస్యశ్యామలంగావించు చున్నది. విజయవాడకు దగ్గరలో గల వల్లభాపురానికి కుడి ప్రక్కగా మున్నంగి గ్రామానికి నది ఎడమ ప్రక్కగా ప్రవహించుచూ, తూర్పున సముద్రంలో కలియును. రెండు గ్రామాలకు, మధ్యదూరము రెండు మైళ్ళులోపుగా యుండును. వల్లభాపురంలో లింగబలిజ కులస్తుడగు కోటయ్య యను సనారీ భక్తుడుగలడు. అతను కుటుంబధారియైన నాటినుండి "సనారీ విశ్వేశ్వరసంవాదము" చదువుచూ వారి చిత్రపటమును, నిత్యము పూజించు చుండెడివాడు. ఒకనాడతను మున్నంగి గ్రామమునకు కార్యార్థియై వెళ్ళెను. అచట తన కార్యము రాత్రి 9గంటలకు పూర్తియయ్యెను. అప్పుడతను యింటికి బయలుదేరెను. అవి కార్తీకమాసపు వెన్నెలరోజులు





మార్గమధ్యలో తుమ్మబీడులు దట్టముగా యుండుటచే ఆయనకు కొంచెము కొంచెముగా భయము పెరుగుటచే, తొందరగా నడుచుచున్నాడు. అప్పటి రాత్రి 10 గంటలు దాటినది. అలా కృష్ణ ఏటిగట్టు ఎక్కిచూడగా కట్టమీద జింక చర్మముతో చిన్న చెంబుచేతబట్టుకుని కౌపీనము ధరించిన స్వామి కనుపించిరి. కోటయ్యస్వామిని సమీపించి స్వామీ తమదేవూరు? ఎచ్చటికి పోవుచున్నారని ప్రశ్నించెను. **స్వామివారు** పాలకొల్లు అని చెప్పిరి. **కోటయ్య** భయముతో ఏమీ ఆలోచించలేక యిచట యున్నారేమనిఅడుగగా స్వామి ఈ ప్రశాంత వాతావరణమున విశ్రమించుంటిననిరి **కోటయ్య** స్వామీ మా యింటికి పోవుదమురండు మీకు కావలసిన స్వయంపాకము నిచ్చెదను రాత్రి మాయింట విశ్రమించి ఉదయం మీరెచ్చటికైనా వెళ్ళవచ్చుననగా **స్వామివారు.** నీవు యిచ్చునవి యిచటలేవా? అనిరి. అప్పటికినీ ఆభయస్తునకు ఈ మహనీయుడెవరనే ఆలోచనరాలేదు. మీా యిష్టం స్వామీ అని వారిని నమస్కరించుతూ చాలా పొద్దుపోయింది నేను యింటికి వెళతాను. సెలవియ్యండనెను. "అంతభయంగా ఉంటే వెళ్ళు" నీవు పూజించు వారే నీ తోడుందురు. అని స్వామి వారనగా ఆ భక్తుడు ముందుకు పది అడుగులువేసి ఎవరీస్వామి యని వెనుకకు తిరిగి చూడగా అచటస్వామి వారులేరట. వెంటనే "సనారీ వారుగుర్తుకు వచ్చి అయ్యో ఎంత అభాగ్యుడను ఎంత పొరపాటు పడితిని వారు చెప్పిన మాటలు గ్రహించలేక పోయితిని, నా భయాన్ని తొలగించి నాకు రక్షణ కల్పించుటకు వచ్చితివా గురుదేవాయనుకొనుచూ ! స్వామి వారిని ధ్యానించుచూ యింటికిబోయి భార్యకు ఈ విషయములు తెల్పుచూ. తనమనస్సున

**క॥ ఈ పూజచేయువారికినే పూటకోర్కెదీర్తు నిజముగనే**

**ఆ పుణ్యాత్ముల రూపముకాపాడుదు నెల్లయెడలకాపైనేనే॥**

అని గురుదేవులు అభయ మిచ్చినట్లుగా అర్థంచేసుకొని నాటినుండి యధావిధిగా స్వామి వారి పూజలు చేయుచూ, గురుదేవులు తెల్పిన మానసపూజను అధికముగాజేయుచూ నాకే విధమగులోటు రాకుండా స్వామివారు అన్నీ వేళలయందు కాపాదురను ఆత్మవిశ్వాసంతో జీవనయాత్ర సాగించి జన్మధన్యతగావించుకొన్న భక్తరేణువు.

సనారీ వారు శ్రీశైల గుహలోకి వెళుతూ నాశరీరం కొండగుహలలో ఉన్నా నేను నాభక్తుల హృదయములందునిలిచి కంటికిరెప్పవలే కాపాడుదునన్నది ఋజువైనదిగదా।

## 25. బ్ర॥తమిరి మల్లిఖార్జునరావు గార్నిగురించి

**మాఘకార్తీక వైశాఖ మాసములను- మూలమాదియు శ్రవణాంతమునకు**

**శుక్రవారసోమవారములును వరసనిత్య - ముననుపూజింపువారిని మోక్షమిత్తు॥**

సనారీ వారి స్వహస్తములతో రచియించిన సంవాదమందలి పద్యమిది

అనగా కొన్ని నెలలుగాని కొన్ని రోజులుగానీ ప్రతీరోజూ స్వామివార్ని పూజించే వారికి మోక్షమిస్తానని తెలిపిరి. బ్రహ్మశ్రీ తమిరి మల్లిఖార్జునరావు గారి తండ్రినాటి నుండి సనారీ వారి పూజ వారి సోదర కుటుంబాలలో చేస్తుండగా మల్లిఖార్జునరావుగారి తరంలో ఆ కుటుంబాలకు సనారీవారు మహదైశ్వర్యములను, సమాజమున కీర్తిప్రతిష్టలను సద్గురుడు సమృద్ధిగా నొసంగినాడు. బ్రహ్మశ్రీ మల్లిఖార్జునరావుగారు సనారీ వారియందలి భక్తివిశ్వాసములతో విజయవాడ కృష్ణానదీ తీరమందునగల "సనారీ విశ్వనాథవిజ్ఞాన మందిరానికి "స్లాపు వేయించుట, సనారీ వారు శ్రీ

శైలగుహవాసినన్నందున ఆమహాక్షేత్రమున విశ్వబ్రాహ్మణ అన్న సత్రమున" భోజనశాల నిర్మాణమునకు సహకరించి వారి గురుభక్తిని ప్రదర్శించినారు. "జాతస్యమరణం ధృవం" అన్నట్లుగా పుట్టిన ప్రతీజీవి మరణించక తప్పదు గదా! కనుక ఆ మరణముగూడా "సనారీ విశ్వనాధ విజ్ఞానం మందిరమందే ఉపన్యసిస్తూ సునాయాసంగా వీరు మరణించారు. ఎంతటి కోటీశ్వరునైనా ప్రాణం పోయాక పార్ధివశరీరాన్ని స్మశానమందు ఖననంచేయుదురు. ఈ విజయవాడ మహానగరమున స్మశానమందలి శవాన్ని 3 నెలలలో ఆస్తిపంజరాన్ని తీసివేసి వేరొకరిని సమాధి చేస్తున్నారు. అలాకాకుండా కీ॥శే॥ మల్లిఖార్జునరావు గారి శరీరాన్ని వారి స్వంత స్తలమందు సమాధిచేయుట చాలా విశేషము. ఆ ఆత్మకు గల ఉత్తమ సంస్కారానికి గల ఫలితమిది. పోరంకిలో మల్లిఖార్జునరావు గారి సమాధినికట్టి వారి వారసులు సంవత్సరమునకు ఒక్కరోజైనా పూజించుటకు, తరతరములుగా ఈ సమాజంలో వారిని గురించి తెలుసుకొనుట "మనిషి మరణించియూ" జీవించినట్లగును అలాకాకపోతే ఎంతటివారైనా కాలగర్భంలో కలసిపోదురు. "గురుదేవులనట్లుగా" నా శిష్యులు అవని ఆచంద్రతారార్కము కీర్తింపబడుదురన్నట్లుగా మల్లికార్జునరావు గారి జన్మధన్యమైనది గురుదేవులు తనువు శాశ్వతముగాదు మానవునికీర్తియే శాశ్వతమనియిట్టి సన్నివేశముల ద్వారా భక్తకోటికి ఋజువు పరుచుచున్నారు. కంటికి కనబడునదేదీ శాశ్వతముగాదని కంటికి కానరాని దైవాన్ని మనోదృష్టిచే చూచి మానస పూజ చేయుటయే బ్రహ్మవిద్యయందురు, అట్టి బ్రహ్మ విద్యాపరుడే బ్రాహ్మణుడు అన్యుడుకాజాలడు.

**శ్లో॥ జన్మనాజాయతేశూద్ర : కర్మణాజాయతే ద్విజః**
**వేదపాఠన విప్రశ్యాత్ః బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః ॥**

అన్నట్లుగా మేము ఉత్తమకులంలో జన్మించామని గొప్పలు చెప్పుకుంటే బ్రహ్మజ్ఞానం సిద్ధించదు. ఏకులంలో జన్మించినాయోగసాధనలచే బ్రహ్మజ్ఞానం లభించునని ఆసాధకులకు వివరంగాతెల్పి, యోగరహస్యములను సర్వులుగ్రహించి పరమ పవిత్రమగు మానవ జన్మలను సార్ధకపరుచుకొనుటకు "సనారీ సంవాదమందలి యోగరహస్యములను తెలుసుకొని సాధింతురుగాక! జన్మను చరితార్ధం చేసుకొందురుగాక!

## 26. అగ్గయ్యగారి చరిత్ర

విజయనగర సమీప పల్లెవాసియగు అగ్గయ్యయను విశ్వబ్రాహ్మణుడు గలడు. ఆయన 3 1/2 అ॥ ఎత్తు ఉండేవాడు. ఆయన మహాశివభక్తుడు ప్రతినిత్యం శివలింగాన్ని సేవించ కుండా మంచినీటినికూడా ముట్టేవారుకారు, ఒంటిపూటభోజనంతో సదాదైవ ధ్యానంతో జీవితం గడిపేవారు. ఒకనాడు ఆటకాయపిల్లలు కొందరు వారు అర్చించే శివలింగాన్ని అపహరించుకు పోయారు. అగ్గయ్య గారు శివలింగం కానరాక విచారవదనుడై దుఃఖించుచూ హర హరమహాదేవశంభో మహాదేవా, స్వామి ఎక్కడున్నావనుచూ పరితపించుచుండగా పిల్లలు వారి దరిచేరి "యిదుగో నీ స్వామి" యనుచూ శివలింగాన్ని చూపి పరుగు లిడుచుండిరి. అగ్గయ్య వారి వెంటబడి ఎంత బ్రతిమలాడినా శివలింగాన్నీయక, తిప్పి తిప్పి చెరువు దగ్గరకు రాగానే యిదుగో నీ పరమేశ్వరుడు గంగలోకి వెళుతున్నాడని చెరువులోకి విసిరివేసారు. "శంభో మహాదేవా" చెఱువులోకి పోయావా తండ్రీయని ఘోరంగావిలపించుటచే వారి మొరలాలించి మహాశివుడు కరుణించగా చెఱువు నుండి శివలింగం పైకి లేచివచ్చి అగ్గయ్య గారి చేతిలో పడినది ఈ మహిమను





చారులవల్ల తెలుసుకున్న విజయనగరాధీసులు తమ పరివారాన్ని అగ్గయ్యగారి పూరిగుడిసె వద్దకువెళ్ళి సాదరంగావార్ని తోడ్కొని రండియని పంపిరి. అప్పుడు అగ్గయ్యగారు రసలింగార్చనలోయుండగా రాజపరివారం వేచియుండి వారి పూజానంతరము చారులు అగ్గయ్యగార్ని కలిసి రాజాఆహ్వాన విషయాన్ని తెలుపగా అగ్గయ్యగారు రాజదర్శనం చేసుకొని నాకీ రాజమర్యాదలువలదనిరి. దానికి రాజుగారు పరివిధములుగా ప్రాధేయపడగా సరేయని, అంగీకరించి నిత్యం రాజాస్థానానికి వచ్చి పోతుండేవారు. వీరికి చుట్ట కాల్చు అలవాటుగలదు, దానికోసం నిత్యం భటులను అగ్గి అడిగేవారు. కొన్నాళ్ళకు వారికి విసుగు కలిగి ఒకనాడు పెద్దనిప్పు కణికయిచ్చి నిష్టూరంగా మాట్లాడగా మీరెందుకు బాధపడతారు . నిప్పును దాచుకుంటానులే యనిపైకండువా తీసి నిప్పును అందులో వేసి మూట గట్టుకుని భుజానవేసుకుని అలాగే రాజాస్థానానికి వెళ్ళిరి. రాజావారు పైతుండులో ఉన్న మూటేమిటని అడుగగా రాజా యిదినిప్పుకణిక, నాకు రోజూయిస్తూ సిపాయిలు బాధపడుచున్నారు. అందుకని దీన్ని కండువాలో దాచుకున్నానని. మూటవిప్పి నిప్పు కణికను అచటవేదికపై పెట్టగా అచట గల గుడ్డ భగ్గునమండినది. నాటినుండి వార్ని అగ్గయ్యగారని జనులు పిలిచేవారు. వారి పేరు మరుగున పడిపోయినది. వారికి ఆనాడు వాడుకలో గల వెండిపావలా అంటే మహాప్రీతిగా ఉండేదట. ఒకనాడు వారి బంధువులగు చేపూరి వారు ఆటపట్టించుటకై కొంగరెట్టతెచ్చి యిదుగో పావలాయని యివ్వగా। దానికి కోపించి అగ్గయ్యగారు మీకు ఈ పావలా కూడా లేకుండా పోతుందని అన్నారట. చేవూరి వార్కి ఒక ప్రక్క సనారీవారి ఆశీర్వాదమున్నప్పకీ వీరి వాక్కుచే నాటినుండి, ఉండీలేని జీవితములే గడుపుచున్నారు. అప్పుడు చేవూరి వారు అగ్గయ్య గార్ని అపహాస్యంచేస్తూ పట్టించుకోలేదు. తర్వాత తరములువారు నేటికి ఆ శాప ప్రభావ ఫలితములనను భవించుచుండిరి. ఈ విషయములు మాతృశ్రీ చింతాడలలితాంబ గారు నాకు నులకపేటలో వారి అన్నగారు "మాబోధగురువులు బ్ర॥తణుకు సాంబశివానంద రాజయోగి" ఆరాధన సమయంలో ది. 26-6-2009, చేవూరి సనారీ సమక్షంలో తెలిపిరి.

## 27. అన్నదాత బెండపూడి సాధువు గార్ని గురించి

శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి 82వ గోవిందవాక్యములో "ఎనిమిది ముద్దలు - తొమ్మిదికాకాలుయునికి తోడను దిరుగు సుదర్శనంబుకత్తిపట్టేవాడు వీరవసంతుడు ఖర్మ్మలచండాడవచ్చే నయా" అని బెండపూడి సాధువుగార్ని గురించి వ్రాసిన తత్వమిది. ఎనిమిదికాకాలనగా ఎనమండుగరు భార్యలు, తొమ్మిది ముద్దలనగా తొమ్మండుగురు సంతానం, వీరు అన్నవరానికి 4 కిలో మీటర్ల దూరంలో బెండపూడి లో ఆశ్రమం నిర్మించి 1941 నుండి 1963 వరకు లక్షలాది జనులకు ఏ వేళలో ఎంతమంది వెళ్ళినాలేదనిగాని, కాస్సేపు ఆగమని గాని అనకుండా కులమత ప్రాంత బేధం లేకుండా అన్న సంతర్పణ చేసిన "మహా నిరతాన్నదాత" తుఫాను కరువులు సంభవించినపుడు ఆ చుట్టు ప్రక్కన గల గ్రామస్తులకు ఎంతోకాలం ఆహారమిచ్చి ఆదరించిన మహామనిషి తన్ను చూడవచ్చినవారు "మీరెవరు స్వామీ" అని అడిగితే "బ్రహ్మన్నిరా" అని తెలిపి బ్రహ్మవంశజులకు బ్రహ్మంగారుగా, క్షత్రియులకు సీతారామరాజుగా, సాధువులకు సాధుమూర్తిగా, వేదాంతులకు వేదాంతిగా, ఆర్తులకు అభయమిచ్చు దైవంగా, ఆకలిగొన్న వారికి అన్నదాతగా ప్రసిద్ధిచెంది. ఎవరు వెళితే వారి బంధువువలే ఆప్యాయతను పంచిరి, వారు నిర్మించిన శివాలయములో స్పటికలింగాలు, గాయత్రి మండలములు, దక్షిణావృత శంఖములతో, ద్వారపాలకులుగా యమధర్మరాజుని, శనైశ్వరస్వామిని ఉంచి, చూచువారికి భక్తిభావం కలిగి

మనసుకానందమగు రీతిగా నిర్మించిరి. వీరు పుష్య శుద్ధనవమి 1969 లో సమాధి నిష్టవహించిరి. వీరునిర్మించినట్టి ఆలయమును, ఆశ్రమమును సాధువు గారి సమాధిని భక్తులు దర్శించి తరించెదరు. వీరి ఆరాధన ప్రతి సంవత్సరం పుష్యశుద్ధనవమి నుండి ఏకాదశి వరకూ 3 రోజులు ఆరాధనోత్సవాలు, శ్రీరామనవమి ఉత్సవాలలో వేలసంఖ్యల్లో భక్తులు పాల్గొని శ్రీసాధువుగారి ఆదిధర్మపత్ని శ్రీ సత్యవతీ అమ్మవారి దీవెనలు పొంది. శ్రీమాన్‌పరమహంస చిద్వేంకట రామబ్రహ్మానందమహర్షుల కృపకు పాత్రులగుచున్నారు. ముఖ్యముగా విశ్వబ్రాహ్మణులు వారిని, తునిపట్టణ నివాసియగు ఉప్పరాపల్లి బ్రహ్మంగా, భావించిపూజించెదరు. రాజులు సీతారామరాజుగా ఆరాధించెదరు.

## 28. బ్ర॥ గోరస నారాయణబాబుగార్ని గురించి

**గీ॥ విషయగుణయేంద్రియ విద్యలందు - భ్రాంతియును లేక సద్భావమంది**
**యున్నవాడు ప్రపంచంబుననున్నవాడు - శాశ్వతంబున మానసార్చనము తనదే॥**

ఈ సూక్తితో నారాయణబాబుగారు సనారీ వారు రచియించిన "సనారీ విశ్వేశ్వర సంవాదమును, బ్రహ్మంగారు రచియించిన కాలజ్ఞానమును, చదివి క్షుణ్ణంగా అర్ధంచేసుకున్న మహనీయులు. వీరు సనారీవారు తెల్పిన మానసపూజనుచేసెడి సనారీ భక్తులు. వీరిది విజయనగరం దగ్గరలో గల కొట్టెయాడగ్రామం. వీరు విజయనగరంలో చాలాకాలం కాపురముండి, స్వర్ణవృత్తితో జీవించెడివారు, వీరికి 5 గురు ఆడపిల్లలు 1 కుమారుడు కల్గిరి. వీరందరికి కల్యాణములు చేసి గృహస్థులను గావించి, దంపతీయుక్తముగా యోగ విద్య నాచరించెడి "రాజయోగి" వీరికి గుంటూరు జిల్లా తెనాలి పట్టణంలో శిష్యులు కలరు. వీరెచటికి వెళ్ళినా దంపతీయుక్తముగా వెళ్ళి వేదాంత చర్చలు చేస్తూ సనారీ సంవాదమును గురించి ఎక్కువగా వివరించి చెప్పెడివారు. 1950 ప్రాంతంలో తెనాలి శిష్యులయింటికి వెళ్ళి బ్ర॥ దేవు లక్ష్మీనారాయణ, గోడి నరసింహారావు, గోడిపాపారావు, తుమపాల సూర్యనారాయణ. టేకి కుమారస్వామి మొదలగు వారితో సనారీ గ్రంధ విషయములు చెబుతూ సనారీ జన్మస్థలమగు పాలకొండలో గల అమ్మవారి జీవసమాధిని గురించి చెప్పి అచట నిద్రించిన వారికి అమ్మవారు చూపు మహాత్మ్యములను వివరింపగా, ఆకర్షితులైన ఈ భక్తబృందాన్ని తీసుకుని నారాయణబాబుగారు 1950 ప్రాంతంలో పాలకొండవెళ్ళారు. అచట వీరందరూ అమ్మవారి దివ్యాను భూతులను పొంది మనసున పదిలపరచుకొని, సనారీ వారియందు భక్తి శ్రద్ధలతో మెలగుచుండిరి. నారాయణబాబుగారు తెనాలివచ్చి నపుడల్లా విజయవాడ బ్ర॥ కొమ్మోజు రామచంద్రరావు బావగారి యింటికివచ్చి యిచటగల బ్ర॥ మందరపు సూర్యంగారు, అరటిపళ్ళ వ్యాపారి శ్రీరాములు యిత్యాది భక్తులకు, తెనాలి నుండి తోడుగా వచ్చిన వారికి సంవాదమందలి యోగరహస్యములు తెలిపెడివారు. నా 17వ ఏట ఆ పుణ్యదంపతుల దర్శన, స్పర్శన, సంభాషణల భాగ్యము కలిగినది. మా బావగారు ఆ రోజుల్లో షాపులో బంగారుపని మా కప్పగించి రాత్రులు ఇంటి వద్ద వేదాంత చర్చలు జరిపెడివారు. కావున ఆగ్రంధ విషయములు పూర్తిగా ఆనాడు నాకు తెలియదు. నారాయణబాబుగారి బంధువులు, కుమార్తె, విశాఖపట్నంలో కలరు. వీరి ధర్మపత్ని 1966లో శివైక్యము చెందగా వీరు 1968లో శివైక్యము చెందినారు. వీరు ఆ రోజుల్లో తెలిపిన సనారీ సంవాదములోని విషయములు ఆనోటా ఆనోటా ఈ నాటికి తెనాలి విశ్వబ్రాహ్మణ కుటుంబాలలో చెప్పుకొనుచున్నారు. ఈ విషయాలు మానేపల్లి భాస్కర్ ద్వారా నాకు తెలిసినవి.





## 29. భక్త నరసింహంగారి చరిత్ర

చిలకలపూడి పాండురంగ దేవాలయనిర్మాణ కర్తయైనటేకినరసింహంగారు. విజయనగరం జిల్లా, బొబ్బిలి తాలూకా లోని " ఉత్తరవెల్లి" గ్రామమందు ది. 4-4-1889 తేదీన బ్రహ్మశ్రీ టేకిగంగాధరం రావమ్మ పుణ్యదంపతులకు జన్మించిరి. వీరికి 12 సంవత్సర ప్రాయంలో సూరమ్మయను కన్యతో వివాహమయ్యెను. 18వ సంవత్సరములో వీరు గొప్ప అనారోగ్యమునకు గురియై ఆరోగ్యము చేకూరిన పిదప కీలకనామ సం॥ర కార్తీక శుద్ధ త్రయోదశి నాడు కుటుంబ సమేతంగా బొబ్బిలి నుండి తిరుపతియాత్రకు బయలుదేరి మార్గమధ్యన గల చిలకలపూడిలో నున్న బంధువులను చూడబోయి అచటనొక వ్యాపారం ప్రారంభించి ధనార్జనకై ఆరు సంవత్సరములు రేయింబవళ్ళు శ్రమించిరి. ఈ లోగా వీరికి విరోధికృతనా॥ సం॥ర మార్గశిర శుద్ధవిదియ బుధవారం జ్యేష్ఠానక్షత్రమందు ప్రధమపుత్రుడు రామబ్రహ్మం జన్మించెను. మరల ప్రమాదీచ సం॥ర పాల్గుణబహుళ త్రయోదశి జయవారం శతభిషానక్షత్ర మందు ద్వితీయ పుత్రుడు సత్యన్నారాయణ జన్మించెను. యిలా ఆరు సం॥రములు చిలకలపూడిలో 6 రోజులవలేగడిపి, తిరుపతి మొక్కు తీర్చుకొనుటకు బయలుదేరి మార్గమందలిపుణ్య క్షేత్రములు దర్శించుచూ తిరుమల జేరి మొక్కు చెల్లించి తిరుగు ప్రయాణమున తీర్ధములు దర్శించుచూ కొన్నాళ్ళకు చిలకలపూడి జేరిరి. ఈయాత్ర సమయమునందు మనసుభగవధ్యానమందులగ్నమై విగ్రహారాధనలు, పూజలు,భజనలు, అన్నదానములు చేయుచూ,దైవాధ్యానంతో కాలంగడుపుచుండిరి. వీరు చిలకలపూడి వచ్చినప్పటి నుండి ఆర్ధికంగా దినదినాభివృద్ధి నొందుచుండిరి. వీరికి కాళయుక్తనా॥సం॥ర మార్గశిర బహుళ అష్టమీ బుధవారం మూడవ పుత్రుడు "వెంకటరత్నం" జన్మించెను. నరసింహంగార్కి పాండురంగ స్వామి స్వప్నమందు దర్శనమిచ్చుటచే పాండురంగని యందు భక్తియధికమై పాండురంగదేవాలయ నిర్మాణముచేయసంకల్పం కలిగి పండరీ పురమునగల పాండురంగని దేవాలయం వలే చిలకలపూడిలో 1935 లో ఆలయ నిర్మాణం ప్రారంభించిరి. 1941 వ సం॥రానికి దేవాలయము సర్వాంగ సుందరముగా తయారైనది. ప్రధాన దేవాలయం చుట్టూ 108 మహా భక్తుల మందిరములు నిర్మాణం చేయాలని సంకల్పించుకొనిరి. ప్రధానాలయ ఈశాన్యమందొక అశ్వద్ధ వృక్షము గలదు ఆరావి చెట్టుక్రింద చిన్న సిద్ధేశ్వరస్వామి మందిరం నిర్మాణము చేయించిరి. ఆ వృక్షమూలమున భూమిలో ఒక మహాఋషి 350 సంవత్సరములనుండి తపస్సు చేయుచుండెను. ఆ వృక్షమునకు భక్తిపూర్వకముగా 40 రోజులు ప్రదక్షిణలుగావించినవారి సకలకోర్కెలు నెరవేరి శుభములు కలుగుచుండెడివి. ఈ మహాఋషికి నరసింహంగార్కి పూర్వజన్మసంబంధములు కలవని నరసింహంగారు తమ కుమారునికి తెల్పిరి. నరసింహంగారు కార్తీకశుద్ధ ఏకాదశినాటి పగలు పాండురంగడు "స్వయంభూ"యై అవతరించునని పత్రికలు వేయించి గ్రామ గ్రామాలకూ పంచిరి. దశమి నాటిరాత్రికి లక్షలాది జనులు పండరీ పురదేవాలయము వద్దకుజేరి ఈ వింతను చూడ ఆత్రుతతోనుండిరి. బ్రిటీష్ ప్రభుత్వం వారు కార్తీక శుద్ధ విదియనాడు. గర్భాలయాన్ని పరిశీలించి సీలువేసిరక్షక భటులను కావలియుంచిరి. కా॥శు॥ ఏకాదశినాడు భక్త నరసింహంగారు, భక్తబృందం విఠల్ నామంతీ ప్రస్తాయిలో కీర్తించుచుండగా ఉదయం 10-30లకు గర్భాలయ మందు గొప్ప ధ్వని వచ్చినది. తర్వాతగర్భాలయ సీలుతీసి చూడగా పాండురంగస్వామి ప్రతిష్ఠింపబడియుండెను. భక్తజనులు ఆనందమునకు, ప్రభుత్వాధికారుల ఆశ్చర్యమునకూ అవధులు లేకపోయినవి. ఆ పిదప కొన్నేండ్లకు 1958లో భాద్రపదశుద్ధ నవమినాడు వీరిధర్మపత్ని సూరమ్మగారు పాండురంగని

సాన్నిధ్యమొందెను. ఆపిదప 16-1-1974 తేదీన పుష్యబహుళ అష్టమినాడు రాత్రి 3-30 లకు భక్త నరసింహం, పాండురంగని సాన్నిధ్యము చెందిరి. వీరి పార్ధివ శరీరములను దేవాలయ ముఖమండపములో ముందుగా కట్టించుకున్న సమాధులలో ఉంచిపైన బండపరిపించిరి. ఆ పుణ్యదంపతుల శరీరములు పాండురంగని సన్నిధిలో నున్నవి. ఈ మహాత్ముడు అన్నపూర్ణమాత జన్మించిన టేకి వారియింట జన్మించుటచే కొందరు అన్నపూర్ణమాతయు ఉత్తరావెల్లి గ్రామమందు జన్మించినదనుటచేతను నాగావళీనదీ ప్రవాహమున కళ్యాణపురము జలమయమగుటచేతనూ, ఆ దగ్గర గ్రామమగు ఉత్తరావెల్లి గ్రామము అమ్మవారి జ్ఞాతులు చేరి యుండవచ్చును. నరసింహంగారు అమ్మవారి జ్ఞాతుడైయుండవచ్చును.

## 30. భీమవరం సనారీ పీఠం గురించి

సనారీవారు సంధ్యావందనము గోత్రాధ్యాయమును రచియించి చిలకలపూడి రాజ లింగాచారిగార్కి యివ్వగా వారు 1915లో ప్రధమ ముద్రణగావించి అందుముందుమాటగా 1875 స్వామివారు రాజమండ్రిలో తనకావ్రాతప్రతి తాళపత్రగ్రంధానిచ్చినట్లు వ్రాసారు. ఆ పిదప కొన్ని సంవత్సరాలకు "మద్రాసులో" సనారీ సంవాదం ప్రధమ ముద్రణ జరిగిన తర్వాత 1878లో కంచిపీఠాధిపతులతో జరిగిన వాగ్వివాదంలో "సనారీ సాక్షాత్కారము" గావించి తన నిజస్వరూపాన్ని లోకానికి తెలియపరచి అటనుండి శ్రీ శైలగుహలోకి వెళ్ళి పోయినట్లు భీమవరం రెల్లివీధిలోగల, సనారీ పీఠాధిపతులు బ్ర॥ తాతోలు వీరరాఘువాచార్యులు గారు తెల్పుతూ, వారు 1949లో సనారీ పీఠాన్ని గురుయంత్రంతో స్థాపించి సనారీ వారు ప్రసాదించిన పూజావిధానంతో ప్రతీ సంవత్సరం దేవీనవరాత్రోత్సవములు నిర్వహించి, పూర్ణాహుతిరోజున అన్నదానం చేసెడివారు. వీరికి ఐదుగురు కుమారులు ఒకకుమార్తె కలిగి, 1990 వరకూ పీఠాన్ని నిర్వహించి 1991లో శివైక్యముచెందారు. వీరి రెండవ కుమారుడు కాళీ వరప్రసాద్ నాటి నుండి నేటి వరకూ పీఠాన్ని పరిరక్షిస్తూ ఆ యింటి లోనే ఉన్నారు. నేను వారిని 15-6-2009 లో కలిసి ఈ విషయాలు తెలసుకున్నాను.

## 31. సనారీ వారి కల్యాణ సందర్భంగా చెప్పవలసిన గోత్ర సూత్రప్రవరలు

### (కల్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి)

**సనారీ వారి ప్రవరః** చతుస్సాగరపర్యంతం శ్రీమత్ సానగ, సనాతన, అహభువన, ప్రత్న, సువర్నసాది పంచవింశత్ ఉత్తరశతబ్రహ్మర్షి గోత్రేభ్యో, విశ్వబ్రాహ్మణేభ్యః దేవ బ్రాహ్మణే భ్యః శుభంభవతు.

సనత్కుమార బ్రహ్మర్షి (అలకా) ఉపావన-అధీర-కుగుణజ్ఞ-త్రయార్షేయ ప్రవరాన్విత- యజుశ్శాఖాయాం-ఆపస్తంభసూత్ర-వామదేవప్రవర-ఆపోతత్వం-ఇంద్రో దేవత- చతుష్కోణకుండం-అశ్వత్థదండం-సనత్కుమారబ్రహ్మఋషిగోత్రోద్భవస్య, విశ్వబ్రాహ్మణాచార్యనప్తే, గౌరమాంబ వీరాచార్య గర్భవాస జనితాయ చతుర్ధశభువనాధీశ్వరస్య అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకాయ. తత్వాతీ తాయ, సురా,సుర సంయమ, యోగి యోగీశ్వర ఉదారమానవసమస్కృత, అఖిలలోక జగద్విఖ్యాతాయ "సనారీ విశ్వేశ్వర సంవాదా" దిమహాప్రబంధ విరచితాయ, "మహా రాజయోగ" నిరతాయ సాక్షాత్‌పరమశివస్వరూపాయ, దండ కమండల, కఠారీ రుద్రాక్షమాల భూషితాయ జగద్గురు శ్రీసింహాద్రి విశ్వనాథాచారి అవధూత స్వామి పాలకొండవాసాయ అస్యవరాయ.





**అన్నపూర్ణాంబప్రవరః** చతుస్సాగర పర్యంతం శ్రీమత్ సానగ, సనాతన, అహభువన, ప్రత్న, సువర్నసాది, పంచవింశత్ ఉత్తర శతబ్రహ్మర్షిగోత్రేభ్యో విశ్వబ్రాహ్మణేభ్యః దేవబ్రాహ్మణే భ్యః శుభంభవతు.

అర్వంత బ్రహ్మర్షి (సుధీ) నిరత-అపదర-పణిన-దేవదత్త-రూప్యాయన-పంచార్షేయ ప్రవరాన్విత-ప్రణవ శాఖాయాం-కాత్యాయనసూత్రం- ఈశానప్రవర- ఆకాశతత్వ- ఆర్కోదేవతా-అష్టకోణకుండం-ఖదిరదండం-అర్వంతబ్రహ్మఋషిగోత్రోద్భవస్య విశ్వబ్రాహ్మణాచార్యనప్తే భ్రమరాంబ బ్రహ్మానందాచార్య పుత్రీం చతుర్ధశ, భువనాధీశ్వరీం, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకీం, శాంతస్వరూపిణీం. సురాసుర సంయమ, యోగి యోగిణీ ఉదారమానవ నమస్కృత అఖిల లోకజననీం మాతాన్నపూర్ణేశ్వరీం, ఆదిశక్తి స్వరూపిణీం, నవరత్నఖచిత సువర్ణ దివ్యాభరణ భూషితాం సుమంగీణీ పురజననీం మహారాజయోగిణీం అన్నపూర్ణాంబ నామ్నీం ఇమాంకన్యాః

## 32. సనారీవారు రూపొందించిన బాలాత్రిపుర సుందరి యంత్రమహిమ:

బ్ర॥ చిప్పాడ సత్యన్నారాయణ గారు అత్తిలిలో 1941లో జన్మించి స్వర్ణవృత్తితో జీవిస్తూ ఆర్థిక పరిస్థితి బాగోలేదని సనారీ పీఠాధిపతి వీర రాఘవాచారి గార్ని కలసి చెప్పగా వారు బాలాయంత్రమును చేయించిదానికి మూలమంత్రమును జపించి ధారబోసి ఒక సుముహూర్తమున సత్యన్నారాయణ గారి పూజామందిరమున ప్రతిష్టింపజేయగా, నాటి రాత్రి సత్యన్నారాయణ తల్లిగార్కి స్వప్నమందు ఒక చిన్న పిల్లవంటి నిండా స్వర్ణాభరణములతో వారి యిల్లంతా తిరగినదని ఉదయం కుమారునకు స్వప్నవృంత్తాంతము చెప్పగా యిదంతా సనారీవారి మహిమ అనుకున్నారట నాటి నుండి వారు దినదినాభివృద్ధి చెందినారు. ఈ విషయాలు 15-6-2009న భీమవరంలో సత్యన్నాయరణగారు నాకుచెబుతూ ఈ విషయాలు యింతవరకూ ఎవరికి చెప్పలేదని చెప్పారు.

**యుగధర్మాలు :** కృతయుగమందు సర్వకార్యములు తమ మనో సంకల్పముచే। త్రేతాయుగమందు దృష్టిచేతను। ద్వారపయుగమందు యజ్ఞయాగాదులచేతను। కలియుగమందు కరసాధనలచే సర్వకార్యములు మానవులు చేయుచున్నారు.

## 33. పాలకొండ క్షేత్ర విశేషములు

పాలకొండ సనారీవారీ దేవాలయమునందు ప్రతీ సంవత్సరం మాఘబహుళ త్రయోదశినాడు .మహాశివరాత్రి పర్వదిన సందర్భమున అన్ని శైవక్షేత్రములవలెనే కోమటివీధిలో గల సనారీ విశ్వనాధవదూత స్వామి వారి యింటియందు గల మాతా శ్రీ అన్నపూర్ణాదేవి జీవసమాధిని దర్శించి సమాధిపైన గల శివలింగమునకు అభిషేకాదిపూజలు అర్ధరాత్రి నుండి ప్రారంభించి మరుసటిరోజు మధ్యాహ్నం వరకూ అమ్మవారికి సహస్రనామ కుంకుమార్చనలు సనారీ సంవాదమునందు స్వామి వారు కరుణతో మనకు ప్రసాదించిన పూజా విధానములతో భక్తకోటిపూజలు నిర్వర్తించగా మధ్యాహ్నం తెనాలి నుండి 4, 5 , టూరిష్టు బస్సులలో వచ్చిన సనారీ భక్తబృందం, దేవాలయంవద్ద కులమత బేధం లేకుండా వచ్చిన వారందరికి తెనాలి వారి ధనం, భక్తుల సహాయసహకారములతో అన్న సంతర్పణలు, బ్రహ్మశ్రీ తుమపాల సత్యాన్నారాయణ గారి బృంద పర్యవేక్షణలో జరుగుతున్నది.పాలకొండలో ప్రతీ కార్తీక శుద్ధ పంచమినాడు సనారీ వారి జయంతి మహోత్సములు భక్తుల సహాయ సహకారములతో నిర్వహించెదరు. స్వామి వారి కల్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశినాడు అత్యంత వైభవంగా భక్తులకు సహాయ సహకారములతో నిర్వహించెదరు. యిచట ప్రత్యేకత

ఏమనగా ఏదో దివ్యక్షేత్ర దర్శనం చేసుకు వచ్చినట్లుగాక, భక్తులు ఎవరికి వారు స్వయముగా అభిషేకములు కుంకుమార్చనలు నిత్యపూజాలు చేసుకోవచ్చును. అలా పూజించి ఆలయ ప్రాంగణమున నిద్రించిన వారికి, అమ్మవారు స్వప్నమందు వారి సమస్యాపరిష్కారం తెలుపుటగానీ, కోర్కెలు తీర్చుటగానీ, అభయమిచ్చుటగానీ, తప్పక జరుగును. అంతేగాక ఒక్కొక్కరి కొక్కోవిధంగా స్వానుభూతులు కల్గును. యిది మా దంపతులము అచట నిద్రించి పొందిన దివ్యాను భూతులు మా స్వానుభవములు. అచటి పూర్వపూజారి సత్యన్నారాయణ పాఢీ అమ్మవార్ని జీవితాంతం సేవించుటకు, తర్వాత ఆయన కుమారుడు సేవించుటకు అదియే ముఖ్యకారణము. శ్రీశ్రీశ్రీ అన్నపూర్ణాసమేత విశ్వనాధావధూత స్వామివారిని త్రికరణ శుద్ధిగా ఆరాధించిన వారికి, సమస్త దారిద్రములు , గ్రహపీడలు, శత్రుత్వములు పోయి సఖ్యతగల్గుట, సర్వకార్యములందు జయముకల్గి, సకల సత్ కోర్కెలు తీరి, ఆయురారోగ్య ఐశ్వర్యములతో ప్రశాంతమగు జీవనము గడుపుదురు. సంతానహీనులకు సంతానము, ఆరోగ్యహీనులకు ఆరోగ్యము, దరిద్రులకు ధనప్రాప్తి, అశాంతి పరులకు ప్రశాంతత, దాంపత్య హీనులకు శీఘ్రమే కళ్యాణమై సంసార సౌఖ్యములు పొందుట, ప్రత్యేకముగ మోక్షకాముకులకది స్వాగతద్వారం।

### ఆ మహా క్షేత్రమునకు మార్గములు

విజయవాడ నుండి పలాసపోవు రైలుమార్గమున చీపురుపిల్లి స్టేషన్‌లో గానీ, శ్రీకాకుళం రోడ్డులోగానీ, రైలుదిగి, బస్సులో పాలకొండ చేరుట సుఖప్రయాణము వేరే మార్గములో విజయనగరం రైలుదిగి, అచటనుండు బస్సులో పాలకొండ వెళ్ళవచ్చును. విజయవాడనుండి విశాఖపట్టణము రైలులో వెళ్ళి అచటనుండి పాలకొండ బస్సులో వెళ్ళవచ్చును.

**పాలకొండలో చూడవలసినవి:**

1. గ్రామదేవత కోటదుర్గదేవాలయము।
2. సనారీ వారి జన్మస్థలం(స్వగృహం) అన్నపూర్ణాదేవి జీవసమాధి।
3. పాలకొండ సరిహద్దున గల అన్నవరంలో స్వామివారు స్వహస్తములతో ప్రతిష్టించి నిర్వహణకు మాన్యములిచ్చినట్టి రామలింగేశ్వర ఆలయం
4. స్వామివారు నిత్యస్నానసంధ్యానుష్ఠాములు జరిపిన జంగాల చెఱువు
5. పూరీ లో గల జగన్నాథ స్వామి ఆలయంవంటి జగన్నాధస్వామి వారి ఆలయం
6. బ్రహ్మంగారి దేవాలయం - సాయిబాబా దేవాలయం మొదలగునవి

శుభమ్ సర్వేజనాః సుఖినోభవంతు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతి

## 34. హృదయావేదన

ఈ అనంత విశ్వంలో గల భూగోళమందు దాదాపు నూటయాభైకి పైగా నున్నదేశములలో లెక్కకు మించిన కులాలు, మతాలు, భాషలు ఆచార్య వ్యవహారములతో అనేక దైవరూపములను ఎవరిమనసుకు నచ్చిన రూపాన్ని, ఎవరికి వచ్చిన భాషతో వారికిగల ఆలోచనా పరిధిలో వారికున్న పరిస్తితులను బట్టి దైవాన్ని అనేకరకములుగా అర్చిస్తూ వారి వారికోర్కెలను తెల్పుకొనుచున్నారు. కామితము లీడేరిన వారు ఆనందముతో అంజలి ఘటించుట కోర్కెలు తీరనివారు దైవాన్ని నిష్టురములాడుట. ఈ దేవుడు మాకు మేలు చేయలేదని వేరే దైవాన్నో మతాన్నో ఆశ్రయించుట ఆరాధించుటచేయుచున్నారు. ఏ జాతి, ఏ ప్రాంతం, ఏ దేశంలో నైనా ఏ సంస్కృతితో ఏ దైవరూపాన్ని





అర్చించినా అది అనంత విశ్వ సృష్టికర్తయగు మూలవిరాట్‌కి చెందుచున్నది. ఎవరెవరు చేసుకున్న పుణ్య, పాపకర్మలనుభవించుటకే జన్మలు కలుగుచూ ఎవరు చేసుకున్నదేవారనుభవిస్తూ దైవం మాకు ఈ కర్మకల్పించాడని దూషిస్తూ కొత్తకర్మలకు కారకులగుచున్నారు. దైవమనగావేరే ఎచటోలేక, నీలో అణుస్వరూపముగా యుండి నీ కర్మలకు ప్రత్యక్షసాక్షియైయుండగా దేవుడు వేరేలోకంలో ఉన్నాడనినేను ఎవరికీ తెలియకుండా నాల్గుగోడలమధ్య చేసినవి ఎవరూ చూడలేదనుకొని, నీతులను ఉపన్యసించువారు ఎంత మూర్ఖులో గదా? దైవం ఏరూపంలో ఉన్నా ఏ జాతిలో పుట్టినా, ఏ దేశపువాడైనా ఏ ప్రాంతంలో జన్మించినా, సమస్తమానవాళికీ ఆరాధ్యుడేగదా? కొందరు మాప్రాంతం మామతం మాకులంవాడని, మా వాడని అడ్డుకట్టులు వేయువారినేమనాలో తెలియడంలేదు. నేను సనారీవారి పాదంపట్టినా బోధగురువు చెప్పినదాన్ని, నాఅనుభవంలో తెలిసిన విధంగా సేవించుతూ నా మనసున వారి ప్రచారం చేయాలని సంకల్పం గలిగి, వారి నిత్యపూజా విధానాన్ని, వారి మాలాదీక్షధారణ పుస్తకములు తయారుచేసి, భక్తుల ఆర్థికసహాయ సహకారములతో ముద్రణగావించి నేను ఆచరించుతూ, నా చుట్టుప్రక్కలగల పట్టణములు తిరిగి ప్రచారం చేయుచూ పుస్తకములు పంచుతూ, సనారీ పూజాకార్యక్రమాన్ని నా శక్తిమేర ప్రచారం చేస్తుండగా, కొందరు అవివేకులో అహంభావులో, అజ్ఞానులో వార్ని ఏమనాలోనాకు తెలియడంలేదు. అట్టివారు నీవు సనారీ వారి ప్రచారం చేయునంతటివాడివా?ఆయనకు ఈ ప్రచారాలు గిట్టవు, యిదంతా పుస్తకాలపై నీ ఫోటోలు వేసుకుని నీ ప్రచారం చేసుకుంటున్నావని విమర్శించువారు, కొందరు సుజ్ఞానులు చాలామంచి కార్యక్రమాన్ని చేపట్టారు. మీ జన్మధన్యమైనదనువారలుగలరు. ఈ దూషణభూషణలు మానవనైజమేగదా! వయోధికులు ఆధ్యాత్మిక మార్గమున దైవసేవ జేయువారు సైతం ఈర్ష్యాద్వేషములకు లోనై పరనింద సల్పువారునూ, పిన్న వయస్కులు ఆధ్యాత్మిక మార్గమున లేనివారు వారికి గల జన్మసంస్కారముచే సహకరించువారునూ కలరు. మానవుడే సత్కార్యము తలపెట్టినా, సహకారములకన్నా విమర్శలనే అధికంగా అనుభవించవలసి యుండును. యివన్నియునూ ఆదైవమాతనికి పెట్టే పరీక్షయైయుండునేమో? అయిననూ నేను చేయు కర్మఫలము నేనుఅనుభవించవలెనుగదా? యింకెవ్వరైననూ పంచుకొందురా? అట్లు కాదుగదా? యింకా ఈ యోగసాధకులు తామెరింగిన యోగరహస్యములను, పూజావిధులనుయితరులకు తెలుపక రహస్యముగా నుంచుచున్నారు. సాక్షాత్ పరమశివుడు భువిపై మానవునిగా పాలకొండయందు విశ్వనాధాచారిగా జన్మించి, ఆధర్మవర్తనులను అజ్ఞానులను, శాపగ్రస్తులను ఉద్ధరింపనెంచి ఆయా మార్గములను సంవాద గ్రంధరూపమున రచించి, వారు పాలకొండనుండి మదరాసు మహానగరం వరకూ కాలినడకన పర్యటిస్తూ మార్గమందలి పట్టణములు గ్రామములు, అగ్రహారములు, పల్లెలు, హరిజన, గిరిజన వాడలందు, సనాత ధర్మములు, ఆధ్యాత్మిక విషయములు, యోగసాధనలు ప్రచారంగావించుతూ, ప్రత్యక్ష్యంగా చూపుతూ, అధర్మవర్తనులకు కలుగ ఆపదలు వివరిస్తూ, ధర్మవర్తనులకు కల్గుదైవసహాయము లెరిగించుచూ, జనాన్ని జాగృతిపరచి, ధర్మమార్గమున పయనింపజేయుచూ, తానురచించిన అమ్మూల్య గ్రంధములను మద్రాసు మహానగరమున ముద్రణగావించి తనఅవతారమును ఋజువుపరచుకొని జనారణ్యమును విడిచి, మహారణ్యములకు నడచి గిరిగహ్వరములందు మహాతపోనిష్ఠయందుండుదునని, ఎల్లవేళలా తన భక్తులను వెన్నంటి కాపాడుదునని అభయమిచ్చి అదృశ్యులైరి, అట్టి మహాపురుషుడు రచియించిమానవాళికి ప్రసాదించిన గ్రంధములు కొందరు పూజామందిరము లందు, బీరువాలలోను దాచి ఆసక్తిపరులు ఎంత ప్రాధేయపడినా, పదే పదే త్రిప్పుచూ, యిదుగో అదుగోయని ఆఖరుకు కన్పడలేదనే అవివేకులు పెక్కురు గలరు. ఉన్ననూ పూజా మందిరమందున్నది. మేము బయటకు తీయమని చెదలకు,

పెట్టెలలో పెట్టి ఎలుకలకు పురుగులకు ఆహారంగా ఉంచుతున్నారు. లేక పుస్తకాన్నీ ఎంత జాగ్రత్తగా ఉంచినా సృష్టిలోని ప్రతీ దానికి ఆయుఃప్రమాణమున్నట్లే 100 సంవత్సరముల కంటే మనజాలదుగదా? ఈనాటి శాస్త్రవిజ్ఞాన సహకారంతో పుస్తకాన్ని ఫోటోస్టాట్ తీయించిన మరో 100 సంవత్సరముల ఆయుర్దాయము పెంచవచ్చును. అదియునుచేయరు. వారు దానిని అనుభవించరు. యితరుల కందివ్వరు. సాక్షాత్ పరమశివుడు మానవునిగా జన్మించి మనకు ప్రసాదించినది యిందులకేనా? యిది దైవాపరాధముగాదా? మానవుడు ఈర్ష్యతో ఎదుటవాని ప్రయోజనాన్ని ఓర్వలేక దుర్బుద్ధితో చేయు చర్యలు కాదందురా? వీరికాదైవము ఎలాంటి శిక్షలు విధిస్తాడో ఏమో? అనుభవంలో నీవు గ్రహించిన పూజావిధులను, తత్ఫలితములను లోకమునకెరుక పర్చిన దానినాచరించి కొందరు సుఖింతురుగదా! దానిచే నీవుకొల్పోవునదేమి? యిది పరుల ఉన్నతిని సహించలేని వారి చర్యలు కావా? దైవమే మానవునిగా వచ్చి సృష్టిరహస్యములు, కులమతబేధం లేకుండా సర్వమానవాళికి ప్రసాదించగా, అందు నీవు పొందిన అనుభూతులను, ఫలితములనుతెల్పిన దైవాపరాధమగునా? దైవసేవయగునా? వివేకులు సహృదయులు గ్రహింతురుగాక! సూర్యతేజమును మబ్బులెంత కాలమాపగలవు. కొంత కాలము మార్తాండని ప్రచండ కిరణములనాపి లోకమునంధకారము చేసినట్లుగా, నీవు తెలుపనంత మాత్రమున లోకము గొడ్డుపోయినదా ఏమి? ఎందరో మహానీయులుద్భవించి భారతదేశపు ఆధ్యాత్మిక ప్రగతి ప్రతిభ గతంలో, లోకమున కెరుకపర్చలేదా? భవిష్యత్తును యింకెందరుద్భవించి ఆధ్యాత్మిక సంస్కృతులు వినివీధి నెగురువేయనున్నారో ఎవ్వరెరుగు, అరిషడ్వర్గములను ఈషణత్రయములను వదలినగానీ దైవమార్గమునందుత్తీర్ణులుకాజాలరని వేదికపై ఉపాన్యాసములుదంచుచూ, గురుకులములు, నిర్వహించుచూ, శిష్యగణమునకు ఉపదేశములిచ్చు వారే ఆ ప్రకారం జీవించలేక చెప్పునదొకటి, చేయునదిమరొకటి యిది "చెప్పునది శ్రీరంగనీతులు దూరునవి దొమ్మరిగెడిసె" లన్న సామెతను తలపింపచేయుచున్నది. యిట్టి ఊరగురువులు దేహత్యాగానంతరము ఏలోకమునబడి ఏమి అనుభవించుచున్నారో ఆ గురుదేవులకే ఎరుక.

**శ్లో॥ (వశిష్టోవాచ) పంచాక్షరీసమం మంత్రం - పంచాననసమంకులం**
**పంచానవసమందైవం - నభూతోనభవిష్యతి - యన్నట్లుగా**

ఆదినుండి ఎంతో గొప్పకులంగా కీర్తింపబడిన విశ్వబ్రాహ్మణ జాతిలో ఎందరో మహానీయులుద్భవించి సమస్త మానవాళి మనుగడకు ఆధారులై, జన్మలను తరింపజేసుకొనుటకు దేవాలయములు నిర్మించి భుక్తి, ముక్తులకు ఆధారులైన జాతి, నవఖండభూమండలముల నేలినజాతికి ఏ గ్రహణం పట్టిందో, ఏదైవశాపములతో నిర్వీర్యులునిస్తేజులగుచున్నారో ? యిది దైవరహస్యమేమో? ఈజాతి త్రేతాయుగమునుండి అనైక్యతగాయున్నట్లు కన్పడుచున్నది లేకున్న విభీషణుడు శ్రీరాముని పంచజేరి రావణబ్రహ్మ ప్రాణరహస్యమెరింగించి రాజ్యాన్ని పొందెనుగదా. ఇది రాజ్యకాంక్షకాదనలేముగదా! కాలవైపరీత్యమున ఈ స్వార్ధం రానురాను మానవుని ఎంతటి దారుణమారణ హోమములు చేయించుటకై నా సంసిద్ధుని చేయుచున్నది. ప్రస్తుత కాలమున జాతిచరిత్రను గమనించిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారిని, శ్రీసింహాద్రి విశ్వనాధావధూత గారిని కించపరచిన సంఘటనలు చరిత్రలు చెప్పుచున్నవి. అవివేకులు, అక్షరశూన్యులిట్లు ప్రవర్తించిన అజ్ఞానులులేయని సరిపెట్టుకొందుము. ఆధ్యాత్మిక జీవనము చేయుచూ, గురుకులములు ఆశ్రమములు నిర్వహించుచూ వేదాంతోపన్యాసముల చేయుచూ భోదనలు చేయువారు సైతము దుష్టమార్గమున నుండిన ఏమనవలయును?





హరికథ చక్రవర్తి బ్ర॥ కొమ్మూరి బాలబ్రహ్మానంద భాగవతార్. విప్రులు, కోమట్లు, విశ్వబ్రాహ్మణజాతులు వార్ని కొన్ని పక్షి, పెంపుడు జంతువులతో పోల్చుతూ, పంచాననం వార్ని కుక్క జాతితో పోల్చిదాని ప్రవర్తనలు వివరించి చెబుతూ, శునకము తన యజమాని ధన, మాన, ప్రాణములు కాపాడుటకు తన ప్రాణాన్ని తృణప్రాయంగా నెంచి పోరాడును. కానీ తాను ఏదైనా భుజించునపుడు స్వజాతివేరొకటి ఆసమీపమునకు వచ్చిన. అది యిదీకాట్లాడుకొని ఆహారాన్ని నేలపాలు చేయునని మహాసభలందు ఉపన్యసించి ఔననిపించుకొనిరి ఆట్లే ఈ జాతి వారు, తోటి వారికి జరుగుగౌరవసత్కారములను , కీర్తిప్రతిష్టలను చూచి, సహింపలేక ఏదో వాగ్వివాదములతో ఆకార్యమును సక్రమంగా జరుగనీయక భ్రష్టు పట్టించిన సందర్భాలు గతంలో కోకొల్లలు.కలి 5వేల సం॥రాల పిదప ఈ జాతికి మరల పూర్వ వైభవమురాగలదని భవిష్యకాలజ్ఞాన కర్తయగు వీరగురుడు చెప్పినట్లుగా ప్రస్తుత కాలమున కొంతమార్పు కన్పించుచున్నది. విప్రకులంలో ఎవరికైనా సన్మానసత్కారములు జరుపునపుడు అతనికి ప్రతిభ యున్ననూ లేకున్ననూ, మా శాస్త్రిగారు చాలా గొప్పవారని పాండిత్య ప్రతిభ గలవారిని అందలమెక్కించి ఆ సత్కారము చాలా శోభాయమానంగా నిర్వహింతురు. యిట్టివి చూచుచున్ననూ ఈ జాతికి జ్ఞానోదయము కలుగుటలేదు. తోటి సంఘీయులను ఆదరించలేక పోవుట చాలా విచారకరము. యిట్టి పరిస్తితులు దైవాంశ సంభూతులకే తప్ప లేదు. సగటు మానవుని సంగతి వేరే చెప్పవలయునా, మానవుడు సంఘజీవి గదా! సంఘ ఐక్యత లేని ఏ కులము రాణించలేదన్నది నగ్నసత్యం ప్రస్తుత మన సంఘాల పరిస్థితి అదియే. యిప్పటికైనా సంఘీయులు గ్రహింతురుగాక!

***సమతా భావముతో నుందురుగాక!***

***సర్వేజనాః సుఖినోభవంతు.***

## శ్రీశ్రీశ్రీ సనారీ పీఠమ్- విజయవాడ

మా దంపతులకు 1995 లో బోధగురువు బ్రహ్మశ్రీ తణుకు సాంబశివానంద రాజయోగి గారు గుంటూరుజిల్లా నులకపేట గ్రామంలో, శ్రీ సనారీవారి పాదం పట్టించినారు నాటినుండి విజయవాడ సత్యన్నారాయణపురం లో గల, మాస్వగృహమందు శ్రీ సనారీ వారి నిత్యపూజలు చేసుకుంటూ, నులకపేటలో గల గురువుగారి సనారీ పీఠంలో 5 సంవత్సరములు దేవీనవరాత్రి మహోత్సవములు సనారీవారు ప్రసాదించిన పూజా విధానములతో, మాబోధ గురువుల సమక్షంలో పూజలు నిర్వహించినాము.రాజయోగిగారు 1970 నుండి దేవీశరన్నవరాత్రి మహోత్సవములు నిర్వహిస్తూ 1995 నాటికి 25 సంవత్సరములు పూర్తిచేసి మాతో 5 సంవత్సరములు చేయించి, 2000 నాటికి 30 సంవత్సరములు శ్రీదేవీశరన్నవరాత్రి మహోత్సవములు పూర్తిచేసినారు. మేము మా ఇంట్లో 2001 నుండి శ్రీశ్రీశ్రీ సనారీపీఠాన్ని స్థాపించి నేటికి 10 దేవీనవరాత్రోత్సవములు పూర్తిచేసినాము. యింకా శ్రీ సనారీవారి జయంతోత్సవములు కార్తీకశుద్ధపంచమి నాడు 2005 నుండి బ్రహ్మశ్రీ బంగారునాగేశ్వరరావు (ఉయ్యూరు) గారి ప్రోత్సాహంతో, ప్రారంభించి భక్తుల సహాయసహకారములతో నేటికి 5 సనారీ జయంతి మహోత్సవములు నిర్వహించియున్నాము. బ్ర॥బంగారునాగేశ్వరరావు గారు ప్రతీ సనారీ జయంతికి దాదాపు పదివేల రూపాయలు ఖర్చుచేస్తున్నారు. 2010 సం॥లో విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘం వారి ఆధ్వర్యంలో మా దంపతులచే సనారీ జయంతిని నిర్వహించాము. జగద్గురువు, సద్గురువు, మద్గురు దేవులునగు శ్రీ సనారీ విశ్వేశ్వరుల సంకల్పంతో ఉత్తర వాహినిగాల కృష్ణానదీ తీరప్రాంతమగు, గుంటూరుజిల్లా

తాడేపల్లి మండలం, సీతానగరం చివారునగల మహానాడులో, ది 16-2-2008 తేదీన శ్రీత్రిశక్తి సహస్రలింగసహిత విశ్వనాధాలయనిర్మాణం ప్రారంభించి, నేటికి గర్భాలయం మండపం గోడలు స్లాబు భక్తులు సహాయ సహకారములతో పూర్తిచేసినాము. దేవాలయ అలంకారపనులు విజయవాడ వాస్తవ్యులు చి॥బంగారు మధుగణేష్ దాదాపు లక్ష యాభైవేలు రూపాయల వ్యయంతో పూర్తిచేసారు. యింకనూ ఆశ్రమ నిర్మాణం, దేవాలయగోపురము ప్రహారీ నిర్మాణంపూర్తిగావించవలసియున్నది. కావున భక్తమహాశయులు జాతి, కుల, మత, బేధం లేకుండా ఆలయఅభివృద్ధికి నిర్మాణమునకు, మీవంతు సహాయాన్ని అందించి జగద్గురువులగు శ్రీ సనారీవారి కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాను. 13-03-2011 తేదీన దేవాలయమందు విగ్రహ ప్రతిష్ఠలు జరిపించి నాటినుండి దేవాలయ ప్రాంగణమందే మా దంపతులము వానప్రస్థాశ్రమ జీవనము చేస్తున్నాము.

**యికనుండి ప్రతీ సంవత్సరం ఈ జయంతి కార్యక్రమాన్ని విజయవాడ విశ్వబ్రాహ్మణసంఘం వారే నిర్వహించుతున్నారు. యిలాగే ప్రతి పట్టణంలోనూ శ్రీ సనారీ జయంతి కార్యక్రమాన్ని కులసంఘాలు భక్తులు నిర్వహించి సాక్షాత్ పరమ శివావతారులగు సనారీ వారి కృపకు పాత్రులై సకల భోగభాగ్యములతో వర్ధిలగలరని కోరుచున్నాము.**

**శ్రీ త్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాధాలయం అభివృద్ధిని సంఘీయులు భక్తులు చేపట్టగలరు.**

సనారీ విశ్వేశ్వరం దేవం-విశ్వనాధం మహేశ్వరం
సాక్షాత్ పార్వతీనాధం - పరంజ్యోతిం నమామ్యహం।

శ్రీశ్రీశ్రీ సనారీపీఠమ్
శ్రీసాయి జ్ఞాననిలయం ఓగిరాలవారి వీధి, డోర్ నెం. 23-11-1-6/బి,
సత్యన్నారాయణపురం, విజయవాడ -11.
మీసహాయమందించవలసిన చిరునామా

దేవాలయ వ్యవస్థాపక అధ్యక్షులు : **సుగంధం సాయిబాబా చార్య స్వామీజీ (విశ్వకర్మ)**
సెల్ : 9290582110, 9032253205, 8099203873.
శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాధాలయము
మహానాడు, రోడ్డు నెం-7, తాడేపల్లి పోస్టు& మండలం, గుంటూరుజిల్లా, పిన్ : 522 501, నవ్యాంధ్ర

**శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు**